# రేనాటి సూర్యచంద్రులు

## ఉయ్యాలవాడ నారసింహారెడ్డి యుద్ధ వీరగాధ

(విప్లవ కాలము క్రీ శ 1845-1847)

## బుడ్డా వేంగళరె దాన వీరగాధానిక

( జీవిత కాలము ' శ 1822-1900)

శ్రీకి నిరంతరంబు కడుఁ జెన్నెసలారెడు రాగలీల ను
త్సేకముఁ బొంది యొప్పు తన చిత్తముఁ జూపెడుమాడ్కి నిత్య ర
మ్యాకృతియైన కౌస్తుభము నక్కుపయిం బచరించు నుత్తమ
శ్లోకుఁ డహోబలేశుఁ డతిలోకుఁడు లోకముఁ గాచుఁగావుతన్।

-ఎఱ్ఱాప్రెగ్గడ, నృసింహపురాణము



శ్రీ అహోబల లక్ష్మీనరసింహస్వామి
నారసింహారెడ్డి కులదైవము, గృహదైవము, ఆత్మదైవము



'పచ్చిపూల రంగడు'
శ్రీ పాండురంగ విఠలేశ్వరస్వామి
కోవెలకుంట్ల, కర్నూలుజిల్లా

# రేనాటి సూర్యచంద్రులు

## ఉయ్యాలవాడ నారసింహారెడ్డి యుద్ధ వీరగాథ

( విప్లవ కాలము క్రీ శ 1845-1847)

## బుడ్డా వేంగళరెడ్డి దాన వీరగాధానిక

( జీవిత కాలము క్రీ శ 1822-1900)

1969లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి
డాక్టరేటు పట్టమును పొందిన
**'తెలుగు వీరగాధాకవిత్వము'**
అను సిద్ధాంత వ్యాసము నుండి గ్రహింపబడినది


ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు, ఎం ఏ , పిహెచ్ డి
Professor of Emeritus (U G C )
Department of Studies in Telugu
BANGALORE UNIVERSITY
Jnana Bharathi Bangalore 560 056



శ్రీరస
శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య
బెంగుళూరు
1999

**RENATI SURYA-CHANDRULU** a heroic ballad about **UYYALAWADA NARASIMHA REDDY** (1845 1847 A D ) and a munificent balladling about **BUDDA VENGALA REDDY** (1822 1900 A D ) based on the Doctoral Thesis **Ballad Poetry in Telugu** written by **Prof T V Subba Rao** which was awarded Ph D Degree in Telugu by Sri Venkateswara University in February 1969

| | |
|---|---|
| **Pp** | XXXII+600+60 (Photographs) |
| **First Edition** | 22nd February 1999<br>(152nd Vardhanthi of Uyyalawada Narasimha Reddy) |
| **Copies** | 1000 |
| **Price** | **Rs 450/- or $ 60** |
| **©** | **Prof T V Subba Rao** |
| **Cover Page** | **Grafix Shop,** Bangalore |
| **Letters & Back Cover Art** | **BAPU** , Madras |
| **Published by** | **SRI RASA**<br>Sri Krishna Devaraya Rasajna samakhya<br>No 40/12 7 Saurabha (Upstairs)<br>22nd Cross Govindaraja Nagar<br>Vijayanagar Bangalore 560 040<br>Phone 080 3305902 |
| **Sole Distributors** | **M/s Visalaandhra Publishing House**<br>4 1 435 Bank Street<br>Hyderabad 500 001 A P |
| **For Copies** | **M/s Visalaandhra Book House,**<br>Hyderabad Vijayawada Guntur<br>Anantapur Tirupati Kakinada<br>Hanamkonda & Visakhapatnam |
| **Printed by** | **Sree Laxmi Art Printers**<br>910/A 3rd Main Vijayanagar<br>Bangalore 560 040 Phone 3300093 |

# అంకితం

సరసుడు-సాహిత్య రసికుడు-నిరంతర సంతోషిత స్వాంతుడు
నవ్వుల వెన్నెల రాయడు-నవ్యనవనీత మనస్కుడు
చెప్పినమాట తప్పనివాడు-చేతికి ఎముకలేనివాడు
ఎందరు యాచించినా 'ల'కి ఏత్వము 'ద'కి కొమ్ము పెట్టనివాడు
శిబి దధీచి కర్ణుల కోవలో పుట్టినవాడు
'రాయలసీమ దానకర్ణుడు' గా గణుతికెక్కినవాడు
'అభినవ బుద్ధా వెంగళరెడ్డి'గా ప్రణుతు లందినవాడు
'మహోదాత' బిరుదాంకితుడు-సాంకేతిక విద్యావంతుడు
గూడూరు అంకాళమ్మను నమ్మిన భక్తుడు
శ్రీరామచంద్ర మహోరాజ పథంలో ముక్తుడు
నందిపైపుల అధినేత-ప్రసిద్ధ పారిశ్రామికవేత్త
నంద్యాల నివాసి-నిత్యసత్యవ్రత సహవాసి

## శ్రీ యస్ పి వై. రెడ్డిగారికి .

( శ్రీ సన్నపురెడ్డి పెద్దఎరుకలరెడ్డిగారికి )

రెడ్డికాదు బంగారపుకడ్డి!
రెడ్డికాదు వరాలబుడ్డి!
రెడ్డికాదు నిరుపేదల వేల్పుగిడ్డి!!
ఏతత్ సకలశుభగుణ తారకామణిగణ విరాజితుడైన
శ్రీ రెడ్డిచంద్రునకు
స్వగ్రామదేవత అంకాళమ్మ-మహానంది బసవదేవుడు
కోవెలకుంట్ల 'పచ్చిపూల రంగడు'-అహోబల నృసింహస్వామి
అనునిత్యం ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని
ప్రసాదించాలని ఆశిస్తూ

-తంగిరాల వెంకటసుబ్బారావు

శిబి చెలికాఁడు,

కర్ణునికి చేబదులివ్వగలాఁడు,

పూర్ణిమా శుభములఁ గుల్కులేఁడు,

వర సూనృతవాక్య మరంద మాధురీ విభవపు కూర్మికాఁడు,

నిరుపేదల కొంగుల పైఁడిలేఁడు,

తా ప్రభవము నొందె చూడు - కడపన్

పులివెందులయందు 'ఎస్పి' యై!

—పల్లేటి లక్ష్మీకులశేఖర్



కృతిస్వీకర్త, మహాదాత, నందిపైపుల అధినేత
శ్రీ ఎస్. పి. వై. రెడ్డిగారు
నంద్యాల, కర్నూలు జిల్లా




'రేనాటి సూర్యచంద్రులు' గ్రంథాన్ని అంకితం పుచ్చుకున్న సందర్భంలో
శ్రీ ఎస్. పి. వై. రెడ్డి - ఆచార్య తంగిరాల

## 'మహాదాత'

# శ్రీ యస్ పి వై రెడ్డిగారు

| | |
|---|---|
| పదిమందికీ తెలిసిన పేరు | యస్ పి వై రెడ్డి |
| అందరికీ తెలియని అసలు పేరు | సన్నపురెడ్డి పెద్దఎరుకలరెడ్డి |
| జనాల నోట్లో నానే పేరు | పైపుల వెంకటరెడ్డి |
| తల్లి | శ్రీమతి వీరమ్మ |
| తండ్రి | శ్రీ కొండారెడ్డి |
| జననం | 4-6-1950 |
| జన్మభూమి | కడపజిల్లా పులివెందుల తాలూకా అంకాళమ్మ గూడూరు |
| ప్రాథమిక ఉన్నత పాఠశాలల విద్య | కోరుకుంటపల్లి |
| పి యు సి | లయోలా కాలేజి విజయవాడ |
| సాంకేతిక విద్య | బి ఇ (మెకానికల్) రీజినల్ ఇంజనీరింగ్ కాలేజి వరంగల్ |
| పురుష లక్షణం | నాలుగు సంవత్సరాల పాటు - బాబా అటామిక్ రిసెర్చి సెంటర్ ముంబయ్ |

స్వయంకృషి — 1977లో నంద్యాలలో పదివేల రూపాయల పెట్టుబడితో నంది పైపుల ఫ్యాక్టరీ - ఇటీవలే నంది డెయిరీ కూడా ప్రారంభం

దాతృత్వం — ఎముకలేని చెయ్యి - అడగనివాడిది పాపం!

అందులో మచ్చుకు కొన్ని
* యస్ పి వై రెడ్డి బాలికల జూనియర్ కళాశాల
* యస్ పి వై రెడ్డి మహిళా కళాశాల
* నంద్యాల ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక వార్డు
* సెయింట్ ఆన్స్‌వారు మానసిక రోగుల కోసం నిర్మిస్తున్న శిబిరం కోసం 22 ఎకరాల స్థలం
* లెక్కలేనన్ని దేవాలయాలు చర్చిలు మసీదులు - నిర్మాణం జీర్ణోద్ధరణం
* లెక్కలేనంతమందికి స్వయంఉపాధి కల్పనకు మార్గాలు - అన్నీ వ్రాయాలంటే దానికో పుస్తకం వేయాలి

తెలియనిది — ల కు ఏత్వం- ద కు కొమ్ము

ఇష్టమైన వర్గం — దేశానికి వెన్నెముకలు

మక్కువ — సాహిత్యం లలితకళల పట్ల ఆరాధన

రాణించాలనుకొన్నది — రాజకీయం అది వీరికి అచ్చిరావడంలేదు ఎందుకంటే - The last resort of a scoundrel is politics కాబట్టి

(కూర్పు బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డి)

# విద్వత్కవి
# తంగిరాల

క్రోధములేని సాధువు అకుంఠిత నైతికశీలశాలియున్
ఆధునికాంధ్ర వాఙ్మయ మహార్ణవ నౌక కవిత్వ మాధురీ
శీధు పిపాసి మిత్రజన సింధు శరద్వర పౌర్ణమాసియున్
సౌధము లేని రాజునకు సాంద్ర నమస్సులు తంగిరాలకున్



సాయంకాల శశాంక రేఖ మధుమాసాయాత చూతాంకుర
చ్ఛాయాపాయి కిశోర కోకిలము విశ్వాకాశ కోశాంతర
ప్రేయోవాయు సుపర్ణ బిందువు వచ పీయూష యోషిత్ కృపా
శ్రేయోజన్ముని తంగిరాల సఖునిం గీర్తింతు, శేషేంద్రుడన్

– డా॥ గుంటూరు శేషేంద్రశర్మ



కృతికర్త, ప్రముఖ జానపదవిజ్ఞానవేత్త
ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు
బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు



ముగ్గురు మిత్రులు : బసిరెడ్డి -తంగిరాల-ముక్కామల్ల
నెల్లూరు సాలగ్రామ వామనుడు-వీరగాథల సవరాల జిమ్మడు-కోవెలకుంట్ల పచ్చిపూలరంగడు

# ప్రస్తావన

## 1

నేను పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకా పెదవాడపల్లి గ్రామంలో 1935 మార్చి 30వ తేదీ శనివారం రాత్రి (8 30 గంటలకు కాబోలు) పుట్టాను అది గోదావరీతీరంలో ఉన్న మా మాతామహుల గ్రామం మా స్వగ్రామం అదే జిల్లాలో తణుకు తాలూకాలో ఉన్న కాకుల ఇల్లిందలపఱ్ఱు గ్రామం మా తండ్రి వెంకట సుబ్బావధానులుగారూ మా తాత జగన్నశాస్త్రుగారూ గొప్ప వేదపండితులు మా తాతగారు యజ్ఞం చేశారు చైనం చేశారు వానప్రస్థాశ్రమం స్వీకరించారు చివరికి సన్యసించారు బ్రహ్మీభూత జగన్నాధ మహాగ్నిజిత్ యజ్వేశ్వరులు గా ప్రసిద్ధికెక్కారు నేను మా తాతగారి దగ్గర ఒక్క సంవత్సరం వేదం చదివాను వేదం చదివితే ఈ లోకంలో బ్రతకడం కష్టమని గ్రహించిన మా అమ్మ (సీతామహాలక్ష్మి)గారు నన్ను ఇంగ్లీషు చదువులో పెట్టించారు మా స్వగ్రామంలో ప్రాధమిక విద్య పూర్తి చేశాను రాజమండ్రి తణుకులలో ఉన్నతవిద్య పూర్తిచేశాను 1952లో యస్ యస్ ఎల్ సి లో జిల్లాకి ఫస్టు వచ్చాను భీమవరంలో ఇంటర్ మీడియేట్ తెలుగు బి ఏ లు చదివాను 1957లో బి ఏ డిగ్రీ తీసుకున్న తరువాత నాలుగు సంవత్సరాలపాటు తంతితపాలాశాఖలో గుమాస్తాగా ఉద్యోగం చేశాను 1961లో ఎం ఏ చదవడంకోసం తిరుపతి వచ్చాను అప్పటికి నా వయస్సు 26 సం లు ముగ్గురు ఎల్లల తండ్రిని 1963లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి ఎం ఏ (తెలుగు)లో ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యాను 1963 68 మధ్యకాలంలో తెలుగు వీరగాధాకవిత్వము (Ballad Poetry in Telugu) అనే అంశాన్ని గ్రహించి పరిశోధన చేశాను 1969లో పిహెచ్ డి డిగ్రీని పొందాను ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు ఆచార్య జి యన్ రెడ్డిగారు నా పరిశోధనకు పర్యవేక్షకులు 1969 డిసెంబరు 27వ తేదీని బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్గా చేరాను నా రిసెర్చి విషయంలోనూ నాకు బెంగుళూరులో ఉద్యోగం ఇప్పించడంలోనూ గురువర్యులు ఆచార్య తిమ్మావఝుల కోదండరామయ్యగారు ఎంతో సహాయం చేశారు 1971లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి వి నరసింహారావుగారికి నేను ఒక లేఖ వ్రాశాను వారు దయతో మూడు లక్షల రూపాయల గ్రాంటు ఇచ్చారు దానితో 1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖను స్థాపింపజేశాను దానికి నేను అధ్యక్షుడ (Head)

నయ్యాను 1978లో రీడరు అయ్యాను 1987లో ప్రొఫెసర్ అయ్యాను మధ్యలో మూడు సంవత్సరాలు (1980 83) గుల్బర్గా విశ్వవిద్యాలయంలో పరీక్షా నియంత్రణాధికారి (Controller of Examinations) గా పనిచేశాను తిరిగి బెంగుళూరు వచ్చాను 1996 ఏప్రిల్19వ తేదీని రిటైరయ్యాను ప్రస్తుతం కాటమరాజు కథలను గురించి పరిశోధన చేస్తూ ఎమెరిటస్ ప్రొఫెసర్ గా ఉన్నాను ఇప్పుడు నా వయస్సు 63 సంవత్సరాలు నాకు ముగ్గురు మగపిల్లలు ఇద్దరు ఆడపిల్లలు అందరికీ పెండ్లిండ్లు అయ్యాయి అంతా జీవితాల్లో స్థిరపడ్డారు ఇదీ సంక్షిప్తంగా నా స్వీయ చరిత్ర

## 2

తెలుగు వీరగాథలను గురించి పరిశోధన చేసే ఆ రోజుల్లో నేను తిరుపతిలో 1964 నుండి 1970వరకూ శ్రీ దుంపా శ్రీరాములురెడ్డిగారి ఇంట్లో కాపుర మున్నాను ఈ రెడ్డిగారి అన్నగారు జయరామిరెడ్డిగారు తమ్ముడు రామిరెడ్డి గారు ఈ సోదరత్రయానిది కడపజిల్లా పులివెందుల తాలూకా బొజ్జాయపల్లె గ్రామం వీరు తిరుపతిలో కలప వర్తకం చేసేవారు (వీరి కుటుంబం ఇప్పటికీ ఆ వ్యాపారమే చేస్తున్నారు) శ్రీరాములురెడ్డిగారు చదువుకున్నది తక్కువే అయినా గొప్ప జానపదుడు మాటాడితే చాలు రాయలసీమ పలుకుబళ్ళు జాతీయాలు సామెతలు దొర్లేవి ఎన్నో జానపద గేయాలు పాడేవారు జానపదకథలు చెప్పేవారు ఈయన ఈయన సోదరులు ఈయన కుటుంబమూ నా జానపద సాహిత్య పరిశోధనకు ఎక్కువగా తోడ్పడినారు ఈ దుంపా కుటుంబమంతా నాకు ఆప్తమిత్రులయినారు వీరి సహాయంతో నేను రేనాటిసీమలో అడుగు పెట్టాను రాయలసీమతో విచిత్రమైన అనుబంధం పెంచుకున్నాను (నేను పూర్వజన్మలో కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా రాజుపాళెం దగ్గర ఉన్న అయ్యవారిపల్లె గ్రామంలో శ్రీ గజ్జెల వెంకట్రామయ్యగారి కుటుంబానికి చెందిన ఒక యాదవుణ్ణి అని 15 3 1966నాడు అదే గ్రామంలో నాకు కలిగిన ఒక ఆత్మప్రబోధంవల్ల తెలుసుకున్నాను ఆ జన్మలో నేను ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారినీ బుడ్డా వెంగళరెడ్డిగారినీ చూసి వుంటాను లేకపోతే ఎక్కడో పశ్చిమ గోదావరి జిల్లాలో గోదావరీ తీరంలో పుట్టిననేను ఈ కుందేరు తీరంలోని ఈ ఇద్దరు మహాత్ముల్ని గురించీ మొట్టమొదటిసారిగా ఎలా చెప్పగలిగాను? నేను ఈ జన్మలో కాటమరాజుకథలను గురించి అపూర్వమైన పరిశోధనలు చేయడం కూడా పూర్వజన్మ సంస్కారంవల్లనే అని భావిస్తున్నాను)

## 3

శ్రీ దుంపా జయరామిరెడ్డిగారి వదినగారి కొడుకు డి సి అని పిలువబడే శ్రీ దుంపా చినవెంకటరెడ్డి ఈతని అమ్మమ్మగారి ఊరు కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా లోని పెద్దపసుపుల గ్రామం ఈ డి సి ద్వారా నేను మొట్టమొదటిసారిగా ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారి కోవెలకుంట్ల ముట్టడిని గురించీ బుడ్డా వెంగళరెడ్డిగారి దాతృత్వాన్నీ గురించీ విన్నాను వెంటనే అతనితో బయలుదేరి 1965 డిసెంబరు నెలలో పెద్దపసుపుల గ్రామానికి వెళ్ళాను (మా గురువర్యులు ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డిగారి స్వగ్రామం కూడా ఈ పెద్దపసుపుల దగ్గరలో ఉన్న పర్లపాడు ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ ఎద్దుల ఈశ్వరరెడ్డిగారిది ఈ పెద్ద పసుపుల గ్రామమే) డి సి నన్ను ఆ గ్రామ కరణమైన శ్రీ బంగారువారి వెంకటసుబ్బారావు గారికి పరిచయం చేశాడు ఆయన నాకు రేనాటి వీరుడు అనే నవలను బహూకరించారు దానిని 1925లో జమ్మలమడుగు నివాసియైన శ్రీ కలవటాల జయ రామారావుగారు రచించారు (ఆ నవలను ఈ గ్రంథంలో అనుబంధంగా ఇచ్చాను)

పెద్దపసుపుల కరణంగారు రూపనగుడి మునసబుగారైన శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారికి ఒక లేఖ వ్రాసి ఇచ్చారు నేను ఆ లేఖను తీసికొని శ్రీ కాకరవాడ చిన్న రామిరెడ్డిగారిని తోడుగా తీసికొని రూపనగుడి వెళ్ళి అయ్యపు రెడ్డిగారిని కలిశాను ఆయన నారసింహారెడ్డి వంశీకులు నన్ను చూసి నా పరిశోధన విషయం విని బ్రహ్మానందభరితులైపోయారు వారి యింట్లోనే పది పదిహైదు దినాలు ఉంచేసు కున్నారు అయ్యపురెడ్డిగారు వారి నలుగురు తమ్ముళ్ళు వారి బంధువులు నా పరిశోధనకు ఎంతో సహకరించారు వారి సహాయంతో నేను 1965 డిసెంబరు నెలనుండి 1966 ఏప్రిల్‌నెలవరకూ 5 మాసాల పాటు రేనాటి సీమ అంతా సంచరించి ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారిని గురించీ బుడ్డా వెంగళరెడ్డిగారిని గురించీ అనేక విషయాలు వీరగాథలు పాటలు జానపదకథలు సేకరించాను రూపనగుడి ఉయ్యాలవాడ గుళ్ళదుర్తి కోవెలకుంట్ల నొస్సం నంద్యాల మొదలైన ప్రదేశాలతో పాటు నందికొట్కూరు తాలూకా చెలిమళ్ళ రుద్రవరం లో ఉన్న పిచ్చుగుంట్లను కూడా కలిసి విషయ సేకరణ చేశాను పిహెచ్ డి డిగ్రీ వస్తేనే కాని రేనాటి సూర్యచంద్రులను గురించి నేను చేసిన పరిశోధన బయట పెట్టకూడదు అందువల్ల 1966 నుండి 1969 వరకూ నిశ్శబ్దంగా ఉండిపోయాను

# 4

తెలుగు వీరగాధా కవిత్వాన్ని గురించి నేను చేసిన పరిశోధనకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు 1969 ఫిబ్రవరి నెలలో పిహెచ్ డి డిగ్రీని ప్రసాదించారు వెంటనే నేను ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారిని గురించి 1969 జూన్ నెల భారతి లో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ అనే 17 పుటల పెద్ద వ్యాసాన్ని ప్రకటించాను దానిని తెచ్చి శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారికి చూపించాను ఆయన ఎంతగా ఆనందించారో నేను మాటలలో చెప్పలేను! ఇద్దరం కలిసి ఉయ్యాలవాడ వెళ్లి ప్రముఖకవి శ్రీ పాణ్యం నరసరామయ్యగారిని కలిశాం నా వ్యాసాన్ని ఆధారంగా చేసికొని నారసింహారెడ్డిని ప్రధమ స్వాతంత్ర్య సమర వీరుడుగా చిత్రిస్తూ ఒక కావ్యాన్ని వ్రాయమని కోరాము ఆయన ఆలోచనలో పడ్డారు కధానాయకుడు చివరలో చనిపోతాడు అది అమంగళకరం మంగళాదిగా మంగళమధ్యంగా మంగళాంతంగా కావ్యం ఉండాలి కదా! అని ఆయన సందేహిస్తున్నారు నేను ఆయన్ని ఒప్పించాను వీరులందరూ చనిపోతారు ఆత్మబలిదానం చేస్తారు దానివల్ల సమాజశ్రేయస్సు లభిస్తుంది ఒక రకంగా చూస్తే రామాయణ మహాభారతాలు కూడా విషాదాంత కావ్యాలే ఉత్తర రామాయణంలో రాముడు అతని సోదరులు సరయూనదిలో పడి చనిపోతారు మౌసలపర్వంలో బలరామకృష్ణులు చనిపోతారు మహాప్రస్థానిక పర్వంలో పాండవులందరూ ద్రౌపదితోసహా చనిపోతారు కాబట్టి విషాదాంతకావ్యం వ్రాయవచ్చు నారసింహారెడ్డి చేసిన త్యాగంవల్ల నూరు సంవత్సరాల తరువాత మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది కదా! అన్న నా వాదన విని నరసరామయ్యగారు కావ్యం వ్రాయడానికి అంగీకరించారు 1976లో స్వాతంత్ర్యవీరుడు అనే కావ్యాన్ని మూడు ఘట్టాలుగా విభజించి 260 పద్యాలలో మహాద్భుతంగా వ్రాశారు దానిని అయ్యపురెడ్డిగారు ముద్రించారు ( అయ్యపురెడ్డిగారి ఉత్సాహం ఎటువంటిదంటే నరసరామయ్యగారు 89 పద్యాలలో మొదటి ఘట్టాన్ని పూర్తిచేయగానే దానిని ఒక పుస్తకంగా రెడ్డిగారు ముద్రించి వేశారు కవిగారు మరొక 89 పద్యాలలో రెండవ ఘట్టాన్ని వ్రాయగానే తిరిగి రెడ్డిగారు మొదటి ఘట్టాన్ని రెండవ ఘట్టాన్ని కలిపి ఒక పుస్తకంగా ప్రకటించారు తిరిగి కవిగారు 82 పద్యాలలో మూడవఘట్టాన్ని వ్రాశారు కావ్యాన్ని పూర్తి చేశారు అయ్యపురెడ్డిగారు ఆ మూడు ఘట్టాలనూ కలిపి ఒక సమగ్రకావ్యంగా ముద్రించారు ) నరసరామయ్యగారి కావ్యం గడియారం వారి శివభారతాన్ని జ్ఞప్తికి తెచ్చే ఉన్నతమైన శైలిలో కొనసాగింది శ్రీయుతులు పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు రాళ్ళపల్లి అనంత




ఉయ్యాలవాడ నారసింహారెడ్డి

ఊహాచిత్రం - శ్రీ చివుకుల భరద్వాజశాస్త్రి

గిద్దలూరు, ప్రకాశం జిల్లా



‘విప్లవసింహం ఉయ్యాలవాడ నారసింహారెడ్డి’ పాత్రలో
ప్రముఖ రంగస్థల నటుడు శ్రీ జి. శివనాగిరెడ్డి, నందవరం, కర్నూలు జిల్లా

కృష్ణశర్మగారు దివాకర్ల వేంకటావధానిగారు నిడుదవోలు వేంకటరావుగారు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు మొదలైన ప్రముఖులు ఈ కావ్యానికి ముందుమాటలు వ్రాశారు శ్రీ అవధానం రంగనాధ వాచస్పతిగారు ఈ కావ్యాన్ని చక్కగా విశదంగా విశ్లేషించారు నేను ఈ కావ్యాన్ని బెంగుళూరు విశ్వవిద్యాలయంలో బి ఏ డిగ్రీకి పాఠ్యగ్రంధంగా పెట్టించాను ఈ కావ్యాన్ని ముద్రించినప్పుడు శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారు నాకు వ్రాసిన లేఖను దిగువ పొందుపరుస్తున్నాను

శ్రీరాములు

శ్రీ తంగిరాల వెంకటసుబ్బారావుగారికి
రూపనగుడి కర్నాటి అయ్యపురెడ్డి నమస్కారములు

పుస్తకముల ముద్రణము వారం రోజుల క్రిందటనే పూర్తియైనది ఫోటోలు బ్లాకులు తెప్పించుకొనుట మొదలగు పనులలో కొంత ఆలస్యము జరిగినది ఇపుడు తిరుపతి యూనివర్సిటీలోను బెంగుళూరు మైసూరు యూనివర్సిటీలలోను B A లేకM A లకు పుస్తకమంతయు పాఠ్యముగా జరుగునట్లు చేసిన బాగుండును దానికై మీ సలహా ప్రకారము చేయుదును పుస్తకములో ఏదో కొంత భాగము కాకుండా పూర్తిగా పెట్టించవలెనని మా కోరిక మీకు రెండు ప్రతులు పంపినాను ఇంకా ఎవరికైనా పంపవలసి యున్నచో వారి అడ్రసులు తెలిపినచో పంపుదువు కావ్యము ఆవిష్కరణోత్సవము ఘనముగా చేయవలెనని యున్నాము అప్పట్లో మీరు 2 3 రోజులు ముందు వచ్చి కార్యక్రమము నడుపవలసి యుండును మీ ప్రత్యుత్తరమునకై యెదురు చూచుచుందును

24 9 1976 —కర్నాటి అయ్యపురెడ్డి, VM

నేను 1971 సెప్టెంబరు నెల భారతి లో రాయలసీమ దానకర్ణుడు బుడ్డా వేంగళరెడ్డిపాట అనే పరిశోధన వ్యాసాన్ని ప్రచురించాను దీనిని ఉయ్యాలవాడలో ఉన్న బుడ్డా వేంగళరెడ్డిగారి వంశస్థులైన శ్రీ బుడ్డా శివారెడ్డిగారికీ శ్రీ బుడ్డా దస్తగిరి రెడ్డిగారికీ పంపాను వారు కూడా ఎంతో సంతోషించారు అప్పటికి ఆరు సంవత్సరాలకు ముందుగానే అంటే 1965 డిసెంబరు నెలలోనే బందుమియ్య రచించిన బుడ్డా వెంగళరెడ్డి చరిత్ర అనే ద్విపద కావ్యం యొక్క వ్రాతప్రతి నాకు రూపనగుడిలో లభించింది (దానిని ఈ గ్రంధంలో అనుబంధంగా ముద్రించాను)

## 5

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి క్రీ శ 1846లో కుంఫిణీ ప్రభుత్వం (East India Company Government) పై తిరుగుబాటు చేసిన మహావీరుడు ఈ తిరుగుబాటు ఝాన్సీ లక్ష్మీబాయి తాంతియాతోపే నానాసాహెబ్ మొదలైన మహా వీరులు క్రీ శ 1857లో జరిపిన భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం (సిపాయి పితూరీ) కన్నా 11 సం॥లు ముందుగానే జరిగింది 1857 తరువాత భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం పోయి విక్టోరియా మహారాణి పాలన ప్రారంభ మయింది 1866లో రాయలసీమలో రెండు కఱవులు వచ్చాయి మొదటిది ఎఱ్ఱగాలి కఱవు ఇది బళ్ళారి అనంతపురం జిల్లాల్లో వచ్చింది రెండవది ధాతకఱవు ఇది అనంతపురం జిల్లాలోనూ కర్నూలు జిల్లాలోనూ కూడా వచ్చింది అప్పుడు బుడ్డా వెంగళరెడ్డిగారు 12 పాతర్ల ధాన్యం ఖర్చుచేసి మూడు నెలలపాటు పేద ప్రజలకు అన్నదానం చేశారు ఆయన కీర్తి దేశమంతటా వ్యాపించింది బనగానపల్లె వచ్చిన గవర్నరు రెడ్డిగారి దాతృత్వాన్ని చూచి ప్రభుత్వానికి తెలియజేశాడు విక్టోరియా మహారాణి రెడ్డిగారి సమాజసేవకు మెచ్చి 20తులాల బంగారుపతకాన్ని బహూకరించింది

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారు యుద్ధవీరుడు బుడ్డా వెంగళరెడ్డిగారు దానవీరుడు ఒకరు రేనాటి సూర్యుడు మరొకరు రేనాటి చంద్రుడు ఈ రేనాటి సూర్యచంద్రులను గురించి 1965 66 సంవత్సరాలలో నేను చేసిన పరిశోధనను ఇటీవల నేను సేకరించిన మరికొంత సమాచారాన్ని కలిపి ఇప్పుడు గ్రంధరూపంలో ప్రచురిస్తున్నాను ఆంధ్రులందరూ దీనిని ఆదరిస్తారని ఆశిస్తున్నాను

## 6

నేను 4 2 1999 నాడు ప్రియమిత్రులు శ్రీ ముక్కమళ్ళ నారాయణ రెడ్డిగారితో కలిసి కోవెలకుంట్ల ఎం ఎల్ ఏ గారైన శ్రీ కల్లూ సుబ్బారెడ్డిగారిని కలిశాను రేనాటి సూర్యచంద్రులు గ్రంధాన్ని గురించి వారికి చెప్పాను ఆయన నారసింహారెడ్డి వంశీకులు కావడం వల్ల ఎక్కువగా సంతోషించారు అయితే వారు నాకొక చిక్కుప్రశ్న వేశారు నా మిత్రులు కొందరు ముఖ్యంగా మీ సర్కారు జిల్లాలలోని అభ్యుదయవాదులు ఇలా ప్రశ్నిస్తున్నారు ఉయ్యాలవాడ నారసింహారెడ్డి తన తవర్జీ (భరణం) కోసం అంటే తన స్వార్థం కోసం కుంఫిణీ ప్రభుత్వం పై తిరుగుబాటు

చేశాడు దీనిని ప్రథమ స్వాతంత్ర్య సమరంగా ఎలా చెపుతారు? అని అంటున్నారు దీనికి మీ గ్రంథంలో సరియైన సమాధానం చెప్పాలి అన్నారు సుబ్బారెడ్డిగారు అందువల్ల ఈ ప్రస్తావనలో వారిప్రశ్నకు సమాధానం చెపుతున్నాను

సుబ్బారెడ్డిగారి మిత్రులవంటి సందేహజీవులూ నిత్యశంకితులూ ఇప్పుడే కాదు ఎప్పుడూ ఉన్నారు భారతదేశ స్వాతంత్ర్య పోరాటాన్ని సందేహిస్తూ ఆనాడు బలిదానం చేసిన మహానుభావుల త్యాగశక్తిని శంకిస్తూ ఉంటారు వీళ్ళు ఇటువంటి వాళ్ళకు బంగోరె (బండి గోపాలరెడ్డి) తన వ్యాసంలో చక్కగా సమాధానం చెప్పాడు (చూడుడు అనుబంధం 1) ఎస్ బి చౌధురి 1955లో Civil Disturbances during the British Rule in India (1765 1857) అనే గ్రంథాన్ని ప్రకటించాడు దాని పీఠికలో ప్రముఖ చరిత్రకారుడు ప్రొ॥ యస్ పి సర్కార్ ఒక గొప్ప సూచన చేశాడు ఆ సూచన ఈ సందేహ జీవులకూ నిత్యశంకితులకూ సరియైన సమాధానం అవుతుంది

The risings against British authority have often enough been dismissed as the outcome of the machinations of a number of dispossessed malcontented persons But ofcourse the problem is where the following came from? And why did people respond to the intrigues of the interested parties? It is afterall a superficial view of history to remain satisfied with attributing all disturbances to agitators

బ్రిటిష్ ప్రభుత్వకాలంలో జరిగిన ప్రతి తిరుగుబాటులోనూ స్వాతంత్ర్యేచ్ఛ ఉన్నదన్న సత్యాన్ని మరచిపోకూడదు ప్రతి విప్లవకారునికీ ఆనాడు వేలాది ప్రజల అండదండలున్న విషయాన్ని కూడా మనం విస్మరించకూడదు నారసింహారెడ్డి వెనకాల 9000మంది సైనికులు ప్రాణాలకు తెగించి ఎలా నిలబడినారు?

మన భారతీయులకు భారతీయ చరిత్రకారులు వ్రాసిన చరిత్ర లేదు మన శత్రువుల చరిత్రకారులు వ్రాసిన చరిత్ర మాత్రమే ఉంది మొదట గ్రీకులు భారతదేశంపై దండెత్తి వచ్చారు నిజానికి అలెగ్జాండర్ మన పురుషోత్తముని చేతిలో ఓడిపోయాడు కాని గ్రీకు చరిత్రకారులు సత్యాన్ని మరుగు పరచి అలెగ్జాండర్ పురుషోత్తముని శౌర్యానికి మెచ్చి అతని రాజ్యాన్ని అతనికి తిరిగి ఇచ్చివేశాడు అని వ్రాశారు దానిని మనం నమ్ముతున్నాం ప్రపంచాన్నంతా జయించాలనే దురాశతో వచ్చిన అలెగ్జాండర్

పురుషోత్తముని శౌర్యాన్ని మెచ్చుకోవడం ఏమిటి? తాను జయించిన రాజ్యాన్ని తిరిగి ఇచ్చివేయడమేమిటి? అని మనం ప్రశ్నించుకోలేదు తరువాత మహమ్మదీయులు మనదేశంపై దండెత్తి వచ్చారు వారే మన చరిత్ర వ్రాశారు అక్బర్‌ను ఆకాశానికి ఎత్తివేశారు భారతీయుల స్వాభిమానానికి ప్రతీక అయిన రాణాప్రతాపసింగు చరిత్రను అణచివేశారు ఔరంగజేబు దుర్మార్గాలన్నింటినీ కప్పిపుచ్చారు ఛత్రపతి శివాజీని కొండఎలుక గా చిత్రించారు తరువాత ఆంగ్లేయులు మన దేశాన్ని ఆక్రమించుకొన్నారు ఆంగ్ల చరిత్రకారులు కూడా భారతీయ రాజుల చరిత్రను సంస్థానాధిపతుల చరిత్రను వక్రీకరించి వ్రాశారు ఆ వక్రీకరణలోని భాగమే నారసింహారెడ్డి వంటి విప్లవవీరుణ్ణి స్వార్థపరుడు అనడం మనం ఇంగ్లీషు చదువుకోవడంవల్ల మన ఆలోచనా విధానమే మారిపోయింది పైగా అభ్యుదయవాదులు సమస్త చరిత్రనూ కారల్ మార్క్స్ సిద్ధాంతం కళ్ళద్దాలతోనే చూస్తారు వాళ్ళకి మన ప్రాచీన చక్రవర్తులు రాజులు సంస్థానాధిపతులు అందరూ దోపిడిదారులుగానే బూర్జువాలుగానే కనిపిస్తారు రాజరికవ్యవస్థలో కొంత మంచి ఉన్నా వారు దానిని గమనించరు అది వాళ్ళు ధరించిన కళ్ళద్దాల లోపం!

భారతదేశం మొదట భారతీయ చక్రవర్తుల చేతిలో ఉంది తరువాత రాజులు ఆ తరువాత జమీందారులు పాలించారు మొదట మహమ్మదీయులు పిమ్మట ఆంగ్లేయులు మన చక్రవర్తుల్నీ రాజుల్నీ జమీందారుల్నీ జయించారు ఆంగ్లేయులు దత్తస్వీకారపద్ధతిని రద్దుచేసి ఒక కుటిలపథకం ప్రకారం మన సంస్థానాలను జమీందారీలను కబళిస్తూ వచ్చారు ఆనాటి రాజులు కాని జమీందారులు కాని ఆనాటి మహమ్మదీయులపైనా ఆంగ్లేయులపైనా తిరుగుబాట్లు చేస్తే ఆ తిరుగుబాట్లు భారతీయుల స్వేచ్ఛకోసం చేసిన తిరుగుబాట్లే అవుతాయి వారంతా ఆనాటి ప్రజల ప్రతినిధులే అవుతారు విదేశీ ప్రభుత్వ వ్యవస్థపై తిరుగుబాటు బొబ్బిలి రంగారావు చేసినా నారసింహారెడ్డి చేసినా ఝాన్సీ లక్ష్మీబాయి చేసినా భారతీయుల పరంగా చేసినట్లే లెక్క- ఈనాటి ప్రజాస్వామ్య దృష్టితో ఆనాటి రాచరిక వ్యవస్థను జమీందారీ వ్యవస్థను చూడకూడదు నిజానికి ఈనాటి ప్రజాస్వామ్య వ్యవస్థలో మాత్రం ప్రజలకే సర్వాధికారాలూ ఉన్నాయా? నిరుపేదలకు శ్రమజీవులకు సామాన్యప్రజలకు ఈనాటి ప్రభుత్వాన్ని కైవసం చేసుకొనే హక్కు-కాని పాలించే హక్కు-కాని ఉందా? ఈనాడు కూడా ధనికులైన వారే మన ఎం ఎల్ ఏ లుగాను ఎం పి లుగాను ఎన్నికలలో నెగ్గుతున్నారు వారే మన ప్రజాప్రతినిధులు ( ఒకవేళ ఈ ప్రజాప్రతినిధి ఎన్నికలలో

పోటీ చేసే సమయంలో సామాన్య సంసారిగా ఉన్నా నెగ్గిన సంవత్సరంలోగా కోటీశ్వరుడై పోతున్నాడు) ఆనాడు రాజులు జమీందారులు ప్రజాప్రతినిధులు ఈనాడు కూడా ధనికులే ప్రజాప్రతినిధులు!

నారసింహారెడ్డి విప్లవం యొక్క ముఖ్యోద్దేశం స్వార్థమా? ప్రజా ప్రయోజనమా? అని ప్రశ్నించుకొనేముందు ఆధునికమైన ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థను పరిశీలిద్దాం ఈనాడు మనం ప్రజాస్వామ్య యుగంలో ఉన్నాం ప్రజాసేవ చేస్తామంటూ వివిధరాష్ట్రాల్లో అనేక రాజకీయపక్షాలు అధికారంలో ఉన్నాయి అధికారం కోసం అర్రులు చాస్తూ అనేక ప్రతిపక్షాలు కూడా సమయం కోసం ఎదురు చూస్తున్నాయి ఈ రాజకీయ పక్షాలన్నీ తమ స్వార్థంకోసం కృషి చేస్తున్నాయా? లేక ప్రజాప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని కృషి చేస్తున్నాయా? అని ప్రశ్నించుకుంటే రెండింటికీ అవును అనే సమాధానమే వస్తుంది రెండు సమాధానాలనూ సమన్వయపరచుకుంటే రాజకీయ పక్షాలు తమతమ స్వార్థంకోసం కృషిచేస్తూనే ప్రజాసేవ కూడా చేస్తున్నాయని చెప్పవలసివస్తుంది వారి స్వార్థంలోనే ప్రజాసేవగర్భితమై ఉంది బ్రిటీషు ప్రభుత్వంపై తిరుగుబాటు చేసిన సంస్థానాధిపతులను కూడా ఇదే దృష్టితో అర్థం చేసుకోవాల్సి ఉంది

ఈనాడు ప్రజాస్వామ్యాన్ని విశ్వసించకుండా పేదల్ని శ్రమజీవుల్ని ఉద్ధరించడం కోసం విప్లవ పథంలో పయనించే నక్సలైట్లవంటి ఉగ్రవాద రాజకీయ పక్షాలు ఉన్నాయి ఈ నక్సలైట్లలో అనేకమైన గ్రూపులు ఉన్నాయి ఈ గ్రూపులన్నీ పరస్పరం కలహిస్తూ ఉంటాయి ఈ నక్సలైట్ల గ్రూపులు తమతమ స్వార్థంకోసం ప్రయత్నిస్తున్నాయా? లేక పేదప్రజల శ్రమజీవుల ఉద్ధరణ కోసం ప్రయత్నిస్తున్నాయా? అని ప్రశ్నిస్తే రెండింటినీ సమన్వయం చేస్తూ సమాధానం చెప్పాల్సి వస్తుంది తమతమ స్వార్థం కోసం కలహిస్తూనే పేదప్రజల శ్రమజీవుల సేవ చేస్తున్నాయని చెప్పాల్సివస్తుంది పూర్వం బ్రిటిషు ప్రభుత్వంపై తిరుగుబాటు చేసిన హిందవారాజులు సంస్థానాధిపతులు జమీందారులు ఇదే పనిచేశారు

ఈనాటి నక్సలైట్లను కూడా రెండు రకాలుగా చిత్రించే విమర్శకులున్నారు ఒక వర్గంవారు నక్సలైట్లను సమసమాజాన్ని స్థాపించే గొప్ప ధ్యేయంతో కూడిన విప్లవ కారులుగా భావిస్తారు మరొకవర్గంవారు వీరిని నరరూప రాక్షసులు అని నిందిస్తారు

ఈ శతాబ్ది మొదటి పాదంలో గుంటూరు జిల్లా కోటప్పకొండ దగ్గర జరిగిన చిన్నపరెడ్డి విప్లవాన్ని కూడా కొందరు స్వార్థంతో కూడిన చిన్నసంఘటన అంటారు

మరికొందరు స్వాతంత్ర్యపోరాటం అంటారు కోటప్పకొండలో ప్రభలుకట్టిన ఎద్దులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో అక్కడి ప్రజలు వందేమాతరం అంటూ అరచిన సంఘటన మనం మరచిపోకూడదు!

## 7

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు 1977 డిసెంబరు నెలలో బ్రౌను జాబుల్లో స్థానికచరిత్ర శకలాలు కడపజాబుల సంకలనం అనే గ్రంధాన్ని ప్రకటించారు ఇది గురువర్యులు ఆచార్య జి యన్ రెడ్డిగారి పర్యవేక్షణలో బంగోరె (బండి గోపాలరెడ్డి) చేసిన సంశోధన దీంట్లో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి సాయుధమైన తిరుగుబాటుకు సంబంధించి రెండు లేఖలు ఉన్నాయి ఒక లేఖ సి సుబ్బయ్య అనే వ్యక్తి 1846 సెప్టెంబరు 14వ తేదీనాడు కడపనుండి సి పి బ్రౌను దొరగారికి వ్రాసిన లేఖ దీంట్లో కడప చుట్టుప్రక్కల 5 6 ఆమడల పర్యంతం ధనికులు నారసింహారెడ్డికి భయపడి ఊళ్ళు విడిచిపోతున్నట్టుగాను రెడ్డి తరపు దివిటీదొంగల ఉపద్రవం వల్ల ప్రజలు అత్యంతమైన భీతిని పొందుచున్నట్లుగాను సుబ్బయ్య వ్రాశాడు మరొక లేఖ కొండూరు కరణం రెవిన్యూ బోర్డువారికి పెట్టుకున్న అర్జీ దీనికి తేదీలేదు దీంట్లో చిన్నదొర నీ కరిణీకం పని నీకు యిస్తున్నాము ఇప్పట్లో నారశింహ్వారెడ్డిని పట్టే యెత్నంల్లో వున్నాము అని కొండూరు కరణానికి సమాధానం చెప్పినట్లుగా ఉంది ఇక్కడ నారసింహారెడ్డి మనుషులు (సైన్యం) దోపిడిదొంగలా? అనే ప్రశ్న ఉదయిస్తోంది దీనికి కూడా నేను సమాధానం చెపుతున్నాను ( బంగోరె కూడా తన వ్యాసంలో దీనికి చక్కగా సమాధానం చెప్పాడు సి సుబ్బయ్యకు ఆనాటి రాజకీయ పరిస్థితుల అవగాహన సరిగా లేదని నిరూపించాడు)

18 19 శతాబ్దాలలో సంస్థానాధీశుల పాలనలోను ఆంగ్లేయుల పాలనలోను మనదేశంలో బందిపోటు దొంగలు దారిపోపడులు చేసేవాళ్ళు దివిటీ దొంగలు చాలా ఎక్కువగా ఉండేవారు ఏనుగుల వీరాస్వామయ్య (1780 1836) రచించిన కాశీయాత్ర చరిత్ర అనే గ్రంధం చూస్తే ఈ విషయం తేటతెల్లమవుతుంది కమ్యూనికేషన్స్ ప్రయాణ సదుపాయాలు ఈనాడు ఉన్నట్లుగా ఆనాడు లేకపోవడమే దీనికి కారణం నారసింహారెడ్డి విప్లవ కాలం(1846) లో కూడా దొంగతనాలు జరుగ తున్నాయి వాటిని నారసింహారెడ్డి మనుషులకు అంటగట్టడం అవివేకం

సి పి బ్రౌను దొరగారికి కడపనుండి లేఖ వ్రాసిన సి సుబ్బయ్య మూర్ఖుడు ఆనాటి రాజకీయ పరిస్థితుల పరిజ్ఞానం బొత్తిగా లేనివాడు నారసింహారెడ్డి ఉయ్యాలవాడ సంస్థానానికీ నొస్సం సంస్థానానికీ వారసుడు జమీందారీవంశంలోనివాడు ప్రజలకు అతనిపై విశేషమైనగౌరవాభిమానాలు ఉన్నాయని ప్రభుత్వమే అంగీకరించింది లేకపోతే తొమ్మిదివేలమంది సైనికులు అతనికి ఎలా సమకూడుతారు? తమ ప్రాణాలను పణంగా పెట్టి అతనికోసం ఎందుకు పోరాడుతారు? సమాజంలో వెనుకబడిన వర్గాలు గిరిజనులు అయిన వడ్డెవాళ్ళు యానాదులు బోయవాళ్ళు చెంచువాళ్ళు పట్రకులం వాళ్ళు మాత్రమే కాకుండా గ్రామపోలీసులైన కట్టుబడులు అగ్రవర్ణాలైన బ్రాహ్మణులు కూడా అతని సైన్యంలో చేరారంటే ప్రజలలో అతనికిగల పలుకుబడిని అంచనా వేయవచ్చును ఆనాటి వర్తకులు ధనికులు నారసింహారెడ్డి సైన్యానికి స్వచ్ఛందంగా ఆహారపదార్థాలను సరఫరా చేశారని ధనాన్ని ఇచ్చారని ప్రభుత్వ రికార్డులలో స్పష్టంగా ఉంది దొంగతనాలు దోపిడీలు చేయవలసిన అవసరం నారసింహారెడ్డికి లేదు అలా చేసినవాడైతే ప్రజలలో అతనిపట్ల అంత అభిమానం ఆరాధనాభావం ఎందుకుంటాయి? 1846లో నారసింహారెడ్డి విప్లవంతో దేశమంతా అట్టుడికి పోతోంది ఏ చిన్న దొంగతనం జరిగినా దానిని ఆ విప్లవంలోని భాగంగా సి సుబ్బయ్య వంటి కొందరు అజ్ఞానులు భావించి ఉండవచ్చును అంతే

ఆంగ్ల మానసపుత్రులైన పాతతరం చరిత్రకారులు ఒక్క నారసింహారెడ్డిని మాత్రమే కాదు దక్షిణభారతంలో ఉన్న పాళెగాండ్రందరినీ దోపిడిదొంగలుగానే భావించారు 1947 తరువాత దేశభక్తి పూరితులైన ఆధునిక చరిత్రకారులు ఈ తప్పును గుర్తించారు పాళెగాండ్ర స్వాతంత్ర్యేచ్ఛను వెలుగులోకి తెచ్చారు స్వాతంత్ర్యసమర వీరులైన ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వంటి పాళెగాండ్రకు దక్షిణ భారతదేశ చరిత్రలో చాలా అన్యాయం జరిగిందని ప్రసిద్ధ చరిత్రపరిశోధకురాలు డా॥ జోలెపాళెం మంగమ్మగారు ఎలా వాపోతున్నారో చూడండి Historians have been unkind to the *palegars* in that they were completely ignored or even when noticed were depicted more as plunderers rather than those who fought for freedom of their land It is only recently that scholars have begun to view the problem of *palegars* as political

విప్లవకారులు వేరు దోపిడిదొంగలు వేరు ఈనాడు నిరుపేదల్ని ఉద్ధరించడం కోసం ప్రభుత్వపరమైన దోపిడిని అడ్డుకోవడం కోసం భూస్వాముల దౌర్జన్యాలను

అరికట్టడం కోసం ప్రజాస్వామ్య పద్ధతిని వదలి విప్లవపంథాను ఎన్నుకున్న నక్సలైట్లు ఉన్నారు కేవలం స్వార్థమే పరమార్థంగా ప్రజల్ని దోచుకునే దోపిడిదొంగలు బందిపోటు దొంగలు కూడా ఉన్నారు నక్సలైట్లు వేరు ఈ దొంగలు వేరు ఉన్నతమైన ఆశయసాధనంకోసం విప్లవమార్గాన్ని స్వీకరించినవారు నక్సలైట్లు ధనికుల్ని దోచుకోవడమే ఉద్దేశంగా ఉన్నవారు దోపిడిదొంగలు బందిపోటు దొంగలు వారికీ వీరికీ సంబంధం లేదు ఇప్పుడు భారత ప్రభుత్వంపైన సాయుధమైన తిరుగుబాటు చేస్తున్న నక్సలైట్లు ఉగ్రవాదులు ఉన్నట్లుగానే అప్పుడు కూడా బ్రిటీషుప్రభుత్వంపై సాయుధమైన తిరుగుబాటు చేసిన విప్లవవీరులు ఉన్నారు ఇప్పుడు దోపిడిదొంగలు బందిపోటుదొంగలు ఉన్నట్లుగానే అప్పుడు కూడా దోపిడిదొంగలు బందిపోటు దొంగలు ఉన్నారు బంగోరె చెప్పినట్లుగా ఉయ్యాలవాడ నారసింహారెడ్డి ఆనాటి నక్సలైటు! దోపిడిదొంగ మాత్రం కాడు!

దోపిడిదొంగలు వేరు నక్సలైట్లు వేరు అని చెప్పడానికి ఒక జీవవంతమైన ఉదాహరణ (living example) ఇస్తున్నాను మొన్న పేపర్లో ( అంటే 11 2 1999 నాటి Deccan Herald లో) ఒక వార్త పడింది కానూసన్యాల్ భారతదేశంలో గొప్ప నక్సలైట్ లీడరు అసలు నక్సల్‌బరీ ఉద్యమాన్ని భారతదేశంలో ప్రప్రథమంగా పశ్చిమ బెంగాల్‌లో ప్రారంభించిన చారుముజుందార్ శిష్యుడు ఈ కానూసన్యాల్ ఈయన మొన్న రైల్లో ప్రయాణం చేస్తుంటే 30 మంది దోపిడిదొంగలు రైలును ఆపి దోచుకోవడం మొదలు పెట్టారు ఈ కానూసన్యాల్ తన ఎస్తోలుతో ఆ దొంగల్ని ఎదిరించాడు ఆ పోట్లాటలో అతడు బాగా గాయపడ్డాడు కలకత్తాలో ఆసుపత్రిలో చేరాడు ప్రభుత్వం ఆయన వైద్యానికి సహాయం చేస్తానంటే నిరాకరించాడు నక్సలైట్లు ప్రభుత్వానికి వ్యతిరేకులు దోపిడిదొంగలకూ వ్యతిరేకులే! ఆనాటి నారసింహారెడ్డి ఈనాటి కానూసన్యాల్ వంటివాడే కాని దోపిడిదొంగ మాత్రం కాడు!

నారసింహారెడ్డికి సంబంధించిన జానపదగేయాల్లో కూడా కోయిలకుంట్లా కొట్టినాడు గిద్దలూరు దోచినాడు అనే మాటలు వస్తాయి జానపదులకు రాజకీయ పరిజ్ఞానం అసలు ఉండదు నారసింహారెడ్డి బ్రిటిషు వారిపై చేసిన విప్లవాన్ని కొట్టుట దోచుట అనే తమకు తెలిసిన శబ్దాలతోనే సూచిస్తున్నారు జానపదులు

క్రీ శ 1846లో జరిగిన నారసింహారెడ్డి విప్లవం ఆనాటి రాయలసీమ రైతుల విప్లవంగా దేశవిదేశాల్లో జరిగిన అనేక పరిశోధనల వల్ల ఈనాడు నిరూపింపబడింది

కట్టుబడి పోలీసులకు జమేదారులకు వంశపారంపర్య హక్కులు రద్దుచేయడం కూడా ఈ రైతుల తిరుగుబాటుకు మరింత దోహదం చేసింది

## 8

కుంఫిణీ ప్రభుత్వం జాగ్రత్త చేసిన రికార్డులే కాకుండా రేనాటి జనపదాల్లో పెద్దలు చెప్పుకునే విషయాలు పిచ్చుగుంట్లు జంగాలు గుడ్డిదాసరులు పాడుకునే పాటలు వీరగాథలు మొదలైనవన్నీ పరిగణనలోనికి తీసుకున్నప్పుడే ఉయ్యాలవాడ నారసింహారెడ్డి విప్లవం పూర్తిగా అర్థమవుతుంది ఆయన విప్లవ నికిగల కారణాలను గురించి ప్రభుత్వ పరిపాలనలోని లోపాలను గురించి రైతులలోను గ్రామపోలీసులైన కట్టుబడులలోను ప్రజలలోను వ్యాపించిన అసంతృప్తిని గురించి కడపలో ఆనాడు Special Commissioner గా ఉన్న W A D Inglis దొర మద్రాసు సెయింట్ జార్జికోటలో ఉన్న సెక్రటరీ Sir H C Montgomery కి వ్రాసిన లేఖలో స్పష్టంగా చెప్పాడు (చూ అనుబంధాలలో ఉన్న అతని లేఖ)

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వీరుడు! ఝాన్సీ లక్ష్మీబాయి కన్నా 11 సంవత్సరాలు ముందుగానే కుంఫిణీ ప్రభుత్వంపై రేనాటి సీమలో తిరుగుబాటు జెండా ఎత్తిన మహావీరుడు! ఆయన కేవలం రేనాటి సీమకు రాయలసీమకు ఆంధ్రదేశానికి పరిమితమైన వీరుడు కాడు మొత్తం భారతదేశానికి సంబంధించిన స్వాతంత్ర్య సమరయోధుడు! 1847లో ఆయన చేసిన బలిదానం వృథా కాలేదు పది సంవత్సరాల తరువాత 1857లో ఝాన్సీలక్ష్మీబాయి తాంతియా తోపే నానాసాహెబ్ మొదలైన మహావీరులు రేనాటి సీమలో నారసింహారెడ్డి కావించిన విప్లవాన్ని భారతదేశమంతటికీ వ్యాపింప జేశారు సరిగ్గా నారసింహారెడ్డి బలిదానం చేసిన నూరు సంవత్సరాలకు భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది!

మ అమితోద్దండ దురంత పీడనకు లోనై, భారతీయ ప్రజా
సముదాయం బొనరించినట్టి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ రం
గము కన్నం బదియేండ్లకున్మునుపె, యాంగ్ల ప్రాజ్య సామ్రాజ్య సై
న్యముపై గత్తిని దూసినట్టి నరసింహారెడ్డి సామాన్యుడే!

సీ కలికి తురాయిఁ గీల్కొలుపు పట్టురుమాలు
గట్టిన యుత్తమాంగంబు తోడ

వైష్ణవభక్తి భావము చాటు నూర్ధ్వ పుం
ద్రము నీటుగొలుపు ఫాలంబు తోడ
క్రేవల కెంజాయరేక లింపారు నా
తత దీర్ఘ ధవళ నేత్రముల తోడ
చిఱు నిమ్మకాయల నిరువైపు నిల్పుకో
జాలిన గుబురు మీసముల తోడ

గీ వైరి హంవీర విదళన ప్రళయకాల
దండనిభ ఖడ్గకలిత హస్తంబు తోడ
ప్రజకు భయభక్తి సంభ్రమ భావములను
గొలుపు వర్చస్సు తోడ నబ్బులియుఁడలరు

( పాణ్యం నరసరామయ్యగారి స్వాతంత్ర్యవీరుడు కావ్యం నుండి)

## 9

ఇక రేనాటి చంద్రుడు రాయలసీమ దానకర్ణుడు అయిన బుడ్డా వెంగళరెడ్డిగారి దాతృత్వాన్ని గురించి రెండు మాటలు

శతేషు జాయతే శూర సహస్రేషుచ పండిత ।
వక్తా శత సహస్రేషు, దాతా భవతి వా నవా ॥

కొన్ని వందల మందిలో ఒక శూరుడు ఉంటాడు కొన్ని వేల మందిలో ఒక పండితుడు ఉంటాడు కొన్ని లక్షలమందిలో ఒక వక్త (చక్కగా ఉపన్యసించగలిగినవాడు) ఉంటాడు కాని ఆ కొన్ని లక్షల మందిలో ఒక దాత ఉంటాడో ఉండడో చెప్పలేము బుడ్డా వెంగళరెడ్డిగారు కొన్ని లక్షమందిలో అపురూపంగా కనబడే మహాదాత!

వేధాద్వేధా భ్రమం చక్రే, కాంతాసు కనకేషుచ ।
తాషు తేష్వనాసక్త , ససాక్షాత్ భర్గోనరాకృతి ॥

బ్రహ్మదేవుడు ఈ ప్రపంచాన్నంతా కాంతా కనకాలు అనే రెండు చక్రాలపైన త్రిప్పుతున్నాడు ఈ రెండింటిపైనా ఆశలేనివాడు ఉండడు ఒకవేళ ఎవడైనా ఉంటే వాడు సాక్షాత్తు మానవరూపంలో ఉన్న ఈశ్వరుడే! అన్నారు పెద్దలు ఈ ప్రపంచాన్నంతటినీ త్రిప్పే రెండు చక్రాలలో ఒకటి అయిన ధనాన్ని ఏ మాత్రమూ

లెక్క పెట్టకుండా పేదవారికి దానం చేసిన వ్యక్తి సాక్షాత్తు ఈశ్వరాంశతో పుట్టినవాడు తప్ప వేరుకాడు బుడ్డా వెంగళరెడ్డిగారు అటువంటి భగవదంశతో పుట్టిన విశిష్ట వ్యక్తి!

మాటలు ఎన్నైనా చెపుతాం మనం దానం దగ్గరకు వచ్చేసరికి చేయి వెనక్కి లాగేస్తుంది ఒక క్షణంలో జాలి కలిగి పేదలకు దానం చేయాలని మనస్సులో అనిపించినా మరుక్షణంలో మన మనస్సు మారిపోతుంది ఒకసారి కర్ణుడు తలంటు పోసుకుంటున్నాడట ఆయన అంగరాజు మహావీరుడు దాసీజనం బంగారు పాత్రలో సున్నిపిండి కలిపి ఆ వీరుని శరీరానికి నలుగు పెడుతున్నారట ఇంతలో ఒక పేద బ్రాహ్మణుడు వచ్చి ఆశీర్వదించాడు ఆ సమయంలో సున్నిపిండి ఉన్న బంగారు పాత్ర కర్ణుని ఎడమచేతికి దగ్గరగా ఉంది వెంటనే కర్ణుడు తన ఎడమచేతితో ఆ బంగారు పాత్రను తీసికొని ఆ బ్రాహ్మణుని చేతిలో పెట్టాడట ఆతని వితరణ గుణానికి దాసీజనం ఆశ్చర్యపోయారు అయితే వారికి ఒక సందేహం వచ్చింది అందువల్ల కర్ణునికి ఇలా మనవి చేసుకున్నారట రాజా! ఎడమచేతితో దానం చేశారేమిటి? దానం కుడి చేతితో చేయాలికదా! అని సందేహించారు కర్ణుడు చిరునవ్వు నవ్వి తన పరిజనంతో ఇలా అన్నాడట దానవిషయంలో మానవుని మనస్సు అతి చంచలమైనది అది క్షణక్షణం మారిపోతూ ఉంటుంది నేను దానం చేయాలని నిశ్చయించుకున్న ఆ బంగారు పాత్ర నా ఎడమ చేతిలో నుండి కుడిచేతిలోకి వచ్చేసరికి నా మనస్సు మారిపోవచ్చును అందువల్ల ఆ ప్రమాదాన్ని పసిగట్టిన నేను ఎడమ చేతితోనే దానం చేసవేశాను అటువంటి దానకర్ణుని వంటి మహాత్ముడు బుడ్డా వెంగళరెడ్డిగారు బ్రాహ్మణుడు దాహం కోసం మజ్జిగ అడిగితే ఆవునే దానంచేసిన మహానుభావుడు! మరొక బ్రాహ్మణుడు తన కుమారునికి ఉపనయనం చేసుకుంటానంటే తన శరీరం మీద ఉన్న బంగారు మొలత్రాడును దానంచేసిన మహాదాత! 1866లో ఎల్లుగాలి కఱవు ధాతకఱవు అని రెండు కఱవులు వస్తే బళ్ళారి జిల్లానుండి అనంతపురం జిల్లానుండి నిరుపేదలు తండోపతండాలుగా ఉయ్యాలవాడకు వస్తే 12 పాతర్ల ధాన్యం (అంటే 12x120 1440 బస్తాల ధాన్యం) ఖర్చుపెట్టి ఆ కఱవు పీడితులందరికీ మూడు నెలలపాటు కడుపు నిండుగా భోజనాలు పెట్టిన అపర దానకర్ణుడు ఆ బుడ్డా వెంగళరెడ్డిగారు! తన దగ్గరున్న ధాన్యం అయిపోతే మిత్రుల దగ్గర అప్పుచేసి పేదలకు భోజనాలు పెట్టారట రెడ్డిగారు అటువంటి మహావ్యక్తిని ఈనాడు మనం కలలోనైనా ఊహించడానికి ఆస్కారం ఉందా? ఆ మహానుభావుడి దాతృత్వాన్ని గురించిన అనేక కథల్ని నేను సేకరించాను ఈ గ్రంథంలో పొందు పరిచాను కవి శేఖరులు శ్రీ పాణ్యం

నరసరామయ్యగారు భావించినట్లుగా ద్వాపర యుగంలోని ఆ దానకర్ణుడే కలియుగంలో రాయలసీమలో బుడ్డా వెంగళరెడ్డిగా పుట్టి ఉండాలి

సీ ప్రభవించె నెవ్వాఁడు భాస్కర తేజంబు
ప్రసరింప కుంతి గర్భంబు నందు
తనరారె నెవ్వాఁడు ద్వాపరయుగమందు
దానశీలమున నిస్తంద్రుఁడగుచు
అలరించె నెవ్వాఁడు యాచక శ్రేణుల
తనివి తీరగ మహార్థంబు లొసఁగి
వెలయించె నెవ్వాఁడు విశద వర్తనముతో
విమలకీర్తిని దిగంతముల వఱకు

గీ అమ్మహాదానకర్ణుఁడే యవతరించె
కలియుగంబున నిప్పుడిక్కాలజన్మ
పేర వే ' యక్షరం బాది వెలసెనేని
శ్రీపదముకాన వేంగళరెడ్డియనుఁడు [1]

అటువంటి దానకర్ణునితో సమానమైన భవ్యజీవితం కలవాడు బుడ్డా వెంగళరెడ్డిగారు ఆయన కీర్తి దేశమంతటా వ్యాపించింది ఆయన సచ్చరిత్ర ప్రజలందరికీ ఎల్లవేళలా ఆదర్శప్రాయమైనదని నరసరామయ్యగారు వర్ణిస్తున్నారు

సీ పిన్నప్రాయమునుండి పేదల దరిఁజేర్చి
నెనరుఁ జూపిన దయాన్విత మనస్వి
యాచక శ్రేణుల కవసరంబగు వాని
తడబడ కిచ్చిన త్యాగశీలి
క్షామార్తులై వచ్చు జనులకు చిరకాల
మన్నదానము చేసినట్టి సుకృతి
విక్టోరియా సమర్పిత హేమపతకంబు
దాల్చి రాజిలిన విస్తార కీర్తి

గీ అతఁడు వేంగళరెడ్డి ఉయ్యాలవాడ
గ్రామనామంబు రాష్ట్రాంతరముల వఱకు

పరిఢవిల్లగఁ జేసిన భవ్యమూర్తి
తచ్చరిత్రంబు ప్రజల కాదర్శమెపుడు![2]

## 10

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గురించి (స్వార్థం కోసం విప్లవాన్ని జరిపాడు ఊళ్ళను దోచివేశాడు అని) రెండు రకాల విమర్శలు ఉన్నట్లుగానే ఇంతటి అఖండమైన కీర్తిని గడించిన బుడ్డా వెంగళరెడ్డిగారిని గురించి కూడా రెండు రకాల విమర్శలు ఉన్నాయి ఆయన అప్పులు చేసి తీర్చలేదు ఆయన స్త్రీలోలుడు బుడ్డా వెంగళరెడ్డిగారి జీవితచరిత్రను పరిశీలిస్తే ఆయన తన శక్తికి మించిన దానాలు చేశాడని మనకు స్పష్టమవుతుంది ఆయన దయార్ద్ర హృదయుడు దానగుణం జీవలక్షణం అది తెచ్చిపెట్టుకుంటే వచ్చే గుణం కాదు దానగుణం ఆయనకు జన్మత ఉంది తనకున్నదంతా దానం చేశాడు క్షామ పీడితులైన నిరుపేదల్ని చూసి తట్టుకోలేక పోయాడు మిత్రుల దగ్గర అప్పులు చేసి దానం చేశాడు వేలాది ప్రజల్ని మూడునెలలు పోషించడమంటే మాటలా? అందువల్ల అప్పులు చేసి ఉండవచ్చును తనకున్నదంతా దానం చేయడమే కాకుండా అప్పుచేసి దానం చేయడం ఇంకా గొప్ప లక్షణం! అయితే దాతా దరిద్రో కృపణో ధనాఢ్య (దాత దరిద్రుడవుతాడు ఎంగిలిగొట్టు కోటీశ్వరుడవుతాడు) అని కలియుగ లక్షణాన్ని చెప్పారు మన పెద్దలు అందువల్ల ఆయన ఆర్థికంగా కొంత బాధపడి ఉండవచ్చును వంశపారంపర్యంగా వస్తున్న ఈ దానగుణం వల్లనే ఆయన వంశీకులు కూడా ఈనాడు సామాన్యమైన రైతులుగానే ఉన్నారు కాని గొప్ప ధనికులుగా లేరు

ఇకరెండవ ఆరోపణను గురించి నిన్న మొన్నటి వరకూ మన సమాజంలో వేశ్యలు లేదా దేవదాసీలు ఒక ప్రత్యేక కులంగా దేవాలయాల పూజలలో ముఖ్యమైన భాగంగా లలితకళలలో నిష్ణాతులుగా గౌరవాన్ని పొందుతూ వచ్చారు ధనికులు జమీందారులు పెద్ద పెద్ద ప్రభుత్వోద్యోగులు ఈ వేశ్యలను పోషిస్తూ ఉండేవారు వేశ్యా సంపర్కం ఆనాడు దోషం కాదు గౌరవ చిహ్నమే ఈనాటి దృష్టితో ఆనాటి సమాజాన్ని పరిశీలించకూడదు సమాజంలోని విలువలు కాలాన్ని బట్టి మారుతూ

[1] [2] శ్రీ పాణ్యం నరసరామయ్యగారు ఇటీవల చెప్పిన రెండు పద్యాలు ప్రియమిత్రులు శ్రీ ముక్కమళ్ళ నారాయణరెడ్డిగారి సేకరణ

ఉంటాయి బుడ్డా వెంగళరెడ్డిగారు స్త్రీలోలుడయినా కూడా ఆనాటి సమాజం దృష్టిలో అది దోషం కాదు (ఈనాడు మనం వేశ్యావృత్తిని నిర్మూలించామని పైకి ఎన్ని గొప్పలు చెప్పుకున్నా పట్టణాలలోను మహానగరాలలోను అది నిరాఘాటంగా పెద్ద ఎత్తున కొనసాగుతూనే ఉంది అది ప్రత్యేక కులంగా ఉన్న పూర్వకాలంలో కన్నా ఈనాడు చాలా ఎక్కువగా ఉంది) పోనీ ఈనాటి దృష్టితో చూచి స్త్రీలోలత్వం దోషమే అనుకుందాం అయితే మాత్రం దానిని బిల్‌క్లింటన్ ప్రేమకలాపం లా అల్లరి చేయవలసిన పనిలేదు

తప్పు చేయడం మానవ సహజం వెంగళరెడ్డిగారు కూడా మనలాంటి మానవమాత్రుడే! సర్వసద్గుణ సంపన్నుడైన మానవుడు ఈ భూప్రపంచంలో ఎక్కడా ఉండడు మనిషిలో సద్గుణాలు దుర్గుణాలు కలిసే ఉంటాయి ఏవి ఎక్కువగా ఉంటే దానిని బట్టి ఆ మనిష మంచివాడని కాని చెడ్డవాడని కాని నిర్ణయిస్తాం బుడ్డా వెంగళ రెడ్డిగారిలో నూటికి 99 సద్గుణాలు ఉన్నాయి ఒక్క దోషం ఉంది దానివల్ల ఏమీ నష్టం లేదు కాళిదాసు చెప్పినట్లుగా ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందో కిరణే ష్వివాంక అనేక సుగుణాల్లో ఒక్క దోషం ఉన్నా ఫరవాలేదు ఆ ఒక్క దోషమూ చంద్రుని యొక్క అనేక కిరణాలలో ఆతని చిన్ని మచ్చ మునిగిపోయినట్లుగా మునిగిపోతుంది అందుకే నేను వెంగళరెడ్డిగారిని రేనాటి చంద్రుడు అన్నాను ఆయన అన్వర్థ నామధేయుడు!!

# 11

ఈ గ్రంధ ముద్రణకు భూరి విరాళాన్నిచ్చి సహకరించిన మహాదాత శ్రీ యస్ పి వై రెడ్డిగారికీ తమతమ శక్తి కొలదీ దానం చేసిన ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వంశీకులకూ బుడ్డా వెంగళరెడ్డిగారి వంశీకులకూ నేను మిక్కిలి ఋణపడి ఉన్నాను ఈ విరాళాలు సేకరించడంలో నాతో పాటు ఊరూరా తిరిగి మిక్కిలి శ్రమించిన ప్రియమిత్రులు బుడ్డా వెంగళరెడ్డిగారి వంశస్థులు అయిన శ్రీ ముక్కమళ్ళ నారాయణరెడ్డి (వెలుగోడు)గారికీ సాహిత్యమంటే చెవికోసుకునే చిరకాల ప్రాణమిత్రుడు శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డి (నెల్లూరు) కీ ఎలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియడం లేదు

''సౌరభ'' -ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

బెంగుళూరు 14-2-1999 మహాశివరాత్రి

# కృతజ్ఞతలు

**1965-66** సంవత్సరాలలో ఈ పరిశోధనకు సహకరించిన మహానుభావులు -

1 శ్రీ దుంపా సోదరత్రయం (జయరామిరెడ్డి శ్రీరాములురెడ్డి రామిరెడ్డి) బొజ్జాయపల్లె పులివెందుల తాలూకా కడప జిల్లా

2 శ్రీ దుంపా చినవెంకటరెడ్డి (డి ఎ) పెద్దపసుపుల జమ్మలమడుగు తాలూకా కడప జిల్లా

3 శ్రీ బంగారువారి వెంకటసుబ్బారావు పెద్దపసుపుల గ్రామకరణంగారు

4 శ్రీ ఎస్ ఎ సంజీవరెడ్డి కమ్యూనిస్టు నాయకుడు పెద్దపసుపుల

5 శ్రీ కాకరవాడ చినరామిరెడ్డి పెద్దపసుపుల

6 శ్రీ కర్నాటి అయ్యపురెడ్డి రూపనగుడి మునసబు కోవెలకుంట్ల తాలూకా కర్నూలు జిల్లా అయ్యపురెడ్డి గారి తమ్ముళ్ళు నలుగురు (చలమారెడ్డి వెంగళరెడ్డి పెద్దవెంకటరెడ్డి చిన్నవెంకటరెడ్డి)

7 శ్రీ గజ్జెల వెంకట్రామయ్య (యాదవులు) అయ్యవారిపల్లె ప్రొద్దుటూరు తాలూకా కడపజిల్లా

8 శ్రీ బుడ్డా శివారెడ్డి ఉయ్యాలవాడ కోవెలకుంట్ల తాలూకా కర్నూలు జిల్లా

9 శ్రీ బుడ్డా దస్తగిరి రెడ్డి ఉయ్యాలవాడ

10 శ్రీ బుడ్డా రామిరెడ్డి ఉయ్యాలవాడ

11 శ్రీ బుడ్డా శ్రీరాములురెడ్డి ఉయ్యాలవాడ

12 శ్రీ దస్తగిరి ఉయ్యాలవాడ

13 ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి

14 శ్రీ కసాని సుబ్బారెడ్డి గుళ్ళదుర్తి కోవెలకుంట్ల తాలూకా కర్నూలు జిల్లా

15 శ్రీ కర్నాటి (దేవకమ్మగారి) వెంకటరామిరెడ్డి గుళ్ళదుర్తి

**1999 ఫిబ్రవరి నెలలో ఈ గ్రంథ ముద్రణకు మొట్టమొదట సహాకరించిన ఉదారహృదయులు -**

1 మహాదాత శ్రీ యస్ పి వై రెడ్డి నందిపైప్స్ నంద్యాల కర్నూలుజిల్లా

2 శ్రీ దుంపా శ్రీరాములురెడ్డి కీ శే దుంపా జయరామిరెడ్డిగారి కుమారులు శ్రీ దుంపా పెదరామకృష్ణారెడ్డి సోదరులు కీ శే దుంపా రామిరెడ్డిగారి కుమారులు శ్రీ చినరామకృష్ణారెడ్డి సోదరులు తిరుపతి చిత్తూరు జిల్లా

3 కీ శే దుంపా రామచంద్రారెడ్డిగారి కుమారులు శ్రీయుతులు మోహనరెడ్డి మరియు రామిరెడ్డి బొజ్జాయపల్లె పులివెందుల తాలూకా కడపజిల్లా

4 శ్రీ ముక్కమళ్ళ సోదరులు (వెంకటరెడ్డి నారాయణరెడ్డి రామకృష్ణారెడ్డి విజయ భాస్కరరెడ్డి) వెలుగోడు కర్నూలు జిల్లా

5 శ్రీమతి బుడ్డా సీతాలక్ష్మమ్మ డా॥ చంద్ర శివశంకరరెడ్డి దంపతులు వెలుగోడు కర్నూలు జిల్లా

6 శ్రీ వంగాల నాగిరెడ్డి రాయచూరు కర్ణాటక

7 శ్రీ ఆరికట్ల శివారెడ్డి అల్లూరు ఉయ్యాలవాడ మండలం కర్నూలు జిల్లా

8 శ్రీ ఆరికట్ల రామసుబ్బారెడ్డి అల్లూరు

9 శ్రీ ఆరికట్ల విజయభాస్కరరెడ్డి అల్లూరు

10 డా॥ డి నరసింహారెడ్డి కోవెలకుంట్ల కర్నూలు జిల్లా

11 శ్రీ ఎం మస్తాన్‌రెడ్డి కోవెలకుంట్ల

12 శ్రీ అల్లె వెంకటరామిరెడ్డి వెలుగోడు

ఇంకా ఎందరో సహకరించటానికి సిద్ధంగా ఉన్నారు
అందరికీ నా వందనాలు

–ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

బెంగుళూరు
14-2 1999
(మహాశివరాత్రి)

# కిరణాలు



మహిషాసుర మర్దిని
'నారసింహారెడ్డి గోడలు' దగ్గర ఉన్న దుర్గగుడి
రూపన గుడి, కర్నూలు జిల్లా



శ్రీ సర్వనరసింహస్వామి

నల్లమల అడవులు , గాజులపల్లె సమీపం



'నారసింహారెడ్డి గోడలు'- రూపనగుడి సమీపం



'నారసింహారెడ్డి గోడలు' – దిగుడుబావి

రూపనగుడి సమీపం



నొస్సం కోట

నొస్సం, సంజామల మండలం, కర్నూలు జిల్లా



జయరామపురం కోటబురుజు

చెంచుమల్ల జయరామిరెడ్డిగారు నిర్మించినది, గిద్దలూరు సమీపం



కుందేఱు లేక కుముద్వతీనది
కోవెలకుంట్ల సమీపంలో ప్రవహిస్తున్నది



కోయిలకుంట్లా గుట్టలెంటా - కుందేఱు వొడ్డులెంటా
గుఱ్ఱమెక్కి నీవు వస్తే - కుంఫిణీకి గుండె దిగులు!



నారసింహారెడ్డి కొల్లగొట్టిన కోవెలకుంట్ల ట్రెజరీ ఉండిన ప్రదేశం (1999 లోని దృశ్యం)



కొత్తకోట బురుజుపై నారసింహారెడ్డి ఫిరంగి



‘జగన్నాథుని కొండ’ – రామభద్రునిపల్లె దగ్గర, సంజామల మండలం
1846 అక్టోబరు 6వ తేదీని ఆఖరి యుద్ధంలో నారసింహారెడ్డి పట్టుబడిన ప్రదేశం



జగన్నాథుని కొండపైగల జగన్నాథుని గుడి



కోవెలకుంట్ల ప్రక్కనే ప్రవహిస్తున్న 'జుఱ్ఱేఱు'



జుఱ్ఱేటి ఒడ్డున నారసింహారెడ్డిని ఉరితీసిన చోట ఉన్న
'కుప్పాల బావి'



'కుప్పాల బావి' కి దక్షిణంగా నారసింహారెడ్డిని ఉరితీసిన ప్రదేశం
(1847 ఫిబ్రవరి 22వ తేదీ సోమవారం ఉదయం 7 గంటలకు)

విప్లవసింహా ఉయ్యాలవాడ నరసింహారెడ్డి పాత్రలో



గౌ॥శ్రీ.బుడ్డా వెంగళరెడ్డి యం.ఎల్.ఏ.గారు.

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వేషంలో

శ్రీ బుడ్డా వెంగళరెడ్డి

మాజీమంత్రి, వేల్పనూరు, కర్నూలు జిల్లా

# మొదటి అధ్యాయము

# రేనాటి సూర్యచంద్రులు

ఈనాటి కడప జిల్లాలోని జమ్మలమడుగు తాలూకా కర్నూలు జిల్లాలోని కోవెలకుంట్ల తాలూకా ఈ రెండూ కలిసి పూర్వకాలంలో రేనాడు గా ప్రసిద్ధికెక్కాయి ఈ ప్రాంతమంతా నల్లరేగడి భూమి ప్రత్తి జొన్నలు ప్రధానమైన పంటలు ఈ నల్లరేగడి భూమినే రేగడినాడు అనేవారు ఇదే కాలక్రమాన ఉచ్చారణలో మార్పువచ్చి రేనాడు గా మారి ఉండాలి ( రేడు+నాడు రేనాడు అయిందనీ రేడు శబ్దం రెడ్డి నుండి వచ్చిందనీ కర్ణాటకరైతు సంఘం ఉపాధ్యక్షులైన శ్రీ వి శేషారెడ్డిగారు అభిప్రాయ పడుతున్నారు ఇది ఎంతవరకు సమంజసమో పరిశీలించవలసి ఉంది రెడ్డి+నాడు రేడు+నాడు రేనాడు అని వారి నమ్మకం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతులైన ఆచార్య పాపిరెడ్డి నరసింహారెడ్డిగారు ఎఱ్ఱ+నాడు > ఎఱ్ఱనాడు > ఎఱనాడు > వర్ణవ్యత్యయం వల్ల ఱేనాడు అయిందని చెప్పారు ఇది సమంజసంగానే ఉంది కాని రేనాటి సీమలో ఎఱ్ఱనేల ఎక్కడా కనబడదు అంతా నల్లరేగడి భూమే) దీనినే రేనాటి సీమ అని కూడా పిలిచేవారు ఈ రేనాటి సీమలో 19వ శతాబ్దిలో ఇద్దరు వీరులు పసిద్ధికెక్కారు ఒకరు యుద్ధవీరుడు సూర్యుడు ఇంకొకరు దానవీరుడు చంద్రుడు యుద్ధవీరుడు ఉయ్యాలవాడ నారసింహారెడ్డి సూర్యునివంటివాడు దానవీరుడు బుడ్డా వెంగళరెడ్డి చంద్రునివంటివాడు ఈ ఇద్దరూ కూడా కర్నూలు జిల్లా కోవెలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడ గ్రామానికే చెందినవారు కావడం ఆశ్చర్యకరం! ( కోవెలకుకుంట్ల తాలూకా 19వశతాబ్దిలో కడపజిల్లాలో ఉండేది)

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గురించి ఒక జానపద కథాగేయం (Narrative folk song) లేక వీరగాధ (Ballad) వ్యాప్తిలో ఉంది ఇది కాకుండా పిచ్చుకుంట్లు పాడే ఒక పాట జానపదులు పాడుకునే ఒక కోలాటంపాట కూడా రాయలసీమలో ప్రచారంలో ఉన్నాయి వీటిని లఘువీరగాధలు లేక వీరగాధానికలు (Balladlings) అంటారు అలాగే బుడ్డా వెంగళరెడ్డిగారిని గురించి రేనాటి సీమలోకుంటి గ్రుడ్డి బిచ్చగాళ్ళు పాడుకొనే ఒక ప్రసిద్ధ జానపదగేయం వ్యాప్తిలో ఉంది ఇది కూడా వీరగాధానికయే రెండు మూడు రాత్రులు పాడబడే పెద్ద జానపద కథాగేయాన్ని

వీరగాధ అంటారు ఒక గంటలోపులో పాడబడే చిన్నకధాగేయాన్ని వీరగాధానిక అంటారు

ఇప్పుడు రేనాటి సీమకు చెందిన ఈ సూర్యచంద్రులిద్దర్నీ సంక్షిప్తంగా పరిచయం చేస్తాను వీరిని గురించి వివరంగా తెలిసికోవాలనుకొనేవారు 1969 జూన్ నెల భారతి పత్రికలో నేను వ్రాసిన ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కధ అనే 17 పుటల పెద్ద వ్యాసాన్నీ 1971 సెప్టెంబరు నెల భారతి పత్రికలో నేను వ్రాసిన రాయలసీమ దానకర్ణుడు బుడ్డా వేంగళరెడ్డి పాట అనే 15పుటల సుదీర్ఘ వ్యాసాన్నీ పరిశీలించవచ్చును (ఈ రెండు వ్యాసాలనూ ఈ గ్రంధంలో రెండవ అధ్యాయంగానూ మూడవ అధ్యాయంగాను ఇచ్చినాను)

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి విప్లవానికి సంబంధించిన చారిత్రకాంశాలు ఈ క్రింది ఆకరాలలో లభిస్తాయి

1 Manual of the Administration of the Madras Presidency Vol II & Vol III

2 కడపలో స్పెషల్ కమీషనర్‌గా ఉండిన W A D INGLIS 1847 జనవరి 19వ తేదీని మద్రాసులోని సెయింట్ జార్జికోటలో Judicial Department లో officiating Secretary to Government గా ఉండిన Sir H C Mont Gomery కి వ్రాసిన 12పుటల లేఖ

3 పులివెందులలో ఉండిన Cuddapah District Magistrate s Circuit Office లో Acting Magistrate గా ఉండిన J H Cochrane 1847 ఏప్రిల్ 15వ తేదీని మద్రాసులో Judicial Department లో Secretary to Government గా ఉండిన Sir H C Mont Gomery కి వ్రాసిన 14 పుటల లేఖ

4 A mannual of the Kurnool District Narahari Krishnam Chetty 1886

5 Brief History of Madanapalli F A Coleridge Trichonopally 1911

6 A selection of papers from the old records of the Cuddapah District official report of a revolt by Poligar Narasimha Reddy in Koilkuntla taluk (which formed part of Cuddapah District) in 1846 (5 Volumes) Cuddapah 1914 15 19

7 రేనాటి వీరుడు (నవల) కలవటాల జయరామారావు 1925

8 Civil Disturbances during the British Rule in India (1765 1857) S B CHAUDHURI 1955

9 తెలుగు వీరగాధాకవిత్వము (రెండు సంపుటములు) ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు అముద్రిత సిద్ధాంతవ్యాసము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తిరుపతి 1968

10 Kurnool District Gazeteer 1974

11 బౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు (కడప జాబుల సంకలనం) బంగోరె (బండి గోపాలరెడ్డి) శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రచురణ తిరుపతి డిసెంబరు 1977

12 ఉయ్యాలవాడ నారసింహారెడ్డి తిరుగుబాటు శ్రీ ఎన్ రాఘవేంద్ర ఎం ఫిల్ సిద్ధాంతవ్యాసము (అముద్రితము) హైదరాబాదు విశ్వవిద్యాలయము హైదరాబాదు 1986

## 'రేనాటి సూర్యుడు' ఉయ్యాలవాడ నారసింహారెడ్డి

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థంలో రేనాటి సీమనేలిన మహావీరుడు ఇతడు నొస్సంకోటను పాలించిన చెంచుమల్ల జయరామిరెడ్డికి దౌహిత్రుడనీ దత్తపుత్రుడనీ తెలుస్తోంది కడప కర్నూలు అనంతపురం బళ్ళారి జిల్లాలలో అరవైయారు గ్రామాల కధిపతి నారసింహారెడ్డి రూపనగుడి ఉయ్యాలవాడ ఉప్పులూరు గుళ్ళదుర్తి గిద్దలూరు మొదలైన గ్రామాల్లో ఇతడు నిర్మించిన కోటలు నగరులు ఈనాటికీ వున్నాయి ఉప్పులూరు సంస్థానాధీశులైన పేరావారు నారసింహారెడ్డి మూలపురుషులని రేనాటిసీమలోని పెద్దలవలన తెలుస్తోంది కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలోని చెలిమళ్ళ రుద్రవరం అనే గ్రామంలో నారసింహారెడ్డి వంశీకుల్ని యాచించి బ్రతికే పిచ్చుగుంట్లు అనే జానపద వృత్తి గాయకులు వున్నారు వీరిద్గర నాకు లభించిన ఒక వంశవృక్షంలో కూడా నారసింహారెడ్డి మూలపురుషులు పేరా వారనే ఉంది ఉప్పులూరు సంస్థానాధిపతి అయిన పేరా లక్ష్మిరెడ్డి మూలపురుషుడనీ అతనికి ఎనిమిదవ తరంవాడు నారసింహారెడ్డి అనీ ఇతని తల్లిపేరు సీతమ్మ అనీ భార్యపేరు సిద్ధమ్మ అనీ ఈ వంశవృక్షంలో ఉంది కాబట్టి

ఇతని ఇంటిపేరు పేరావార్రై ఉండాలి. పేరావారిది సగునాలగోత్రం. కాని నారసింహారెడ్డి పై పిచ్చుగుంట్లు పాడుతున్న ఒక వీరగాథానిక (Balladling) లో ఇతని ఇంటిపేరు 'మద్దెల' వారనీ, తండ్రిపేరు 'పెద్దిరెడ్డి' అనీ, తాతపేరు 'జయరామిరెడ్డి' అనీ ఉంది.

**తండ్రి పేరే పెద్దిరెడ్డి– తాతపేర్ జయరామిరెడ్డి**
**ఇంటి పేరే మద్దెలోళ్ళు– తానపేర్ నరసింహారెడ్డి**
**వొహువా! నరసింహారెడ్డి!, నీ పేరంటే – రాజానరసింహారెడ్డీ!!**

ఇతడు 'మద్దెలవారి' యింటినుండి 'పేరావారి' ఇంటికి దత్తు వచ్చి వుండవచ్చును. 'బంగోరె' రచించిన 'బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు' అనే కడపజాబుల సంకలనం లో నారసింహారెడ్డి యింటి పేరు 'మజ్జారి వారు' అని వుంది. ఈ 'మజ్జారి' శబ్దమే జానపదుల నోళ్ళల్లో 'మద్దెల' అయిందో, లేక 'మద్దెల' శబ్దమే 'మజ్జారి' అయిందో చెప్పలేం. (కాని ఈనాటి మోటాటి రాజవంశాలలో 'మద్దెల' అనే యింటిపేరు ఉంది. 'మజ్జారి' అనే యింటి పేరు లేదు. 'మజ్జరి' కూడా లేదు).

నారసింహారెడ్డి 'రూపనగుడి' గ్రామంలో పుట్టాడనీ, 'ఉయ్యాలవాడ'లో పెరిగాడనీ, పాలూ అన్నమూ తినింది గుళ్ళదుర్తి గ్రామంలో అనీ పిచ్చుగుంట్లు పాడే వీరగాథానికలో ఉంది. ఉయ్యాలవాడలో పెరిగి పెద్దవాడవడం చేత కాబోలు ఇతనికి 'ఉయ్యాలవాడ నారసింహారెడ్డి' అనేపేరు వచ్చింది. ఇతడు రెడ్లలో మోటాటి వంశానికి చెందినవాడు. మోటాటి రెడ్లలో కూడా వీరిది రాజవంశం. మామూలు మోటాటి రెడ్లకూ వీరికీ సంబంధం లేదు. రాజవంశం కాబట్టే వీరిని 'దొరవారు' అని పిలిచేవారు. అనంతపురం జిల్లాలో ప్రచారంలో వున్న ఒక కోలాటం పాటలో ఇతడు "దొరవారి నరసింహరెడ్డీ! నీ దొరతనమూ కూలిపోయె, రాజానరసింహరెడ్డి, దొరవారి నరసింహరెడ్డీ" అని సంబోధింప బడ్డాడు. 'నగరి' అంటే కోట. నారసింహారెడ్డి వంశీకులు 'నగరి'లో నివసిస్తారు కాబట్టి వీరిని 'నగరివారు' అని పిలవడం కూడా వుంది. అరవైయారు గ్రామాల కధిపతులైన వీరిని 'జమేదారులు' అని అనేవారు.

నారసింహారెడ్డి తండ్రి పెదమల్లారెడ్డి ఉయ్యాలవాడ జాగీర్దార్. దీనికి ఏటా 30వేల రూపాయల రెవిన్యూ వచ్చేది. ఆంగ్లేయులు ఈ జాగీరును లాక్కొని పెదమల్లారెడ్డికి నెలకు 70రూపాయల 'తవర్జీ'-అంటే భరణం ఏర్పాటు చేశారు. అన్నదమ్ముల పంపకాలలో ఈ భరణం క్రమంగా తగ్గుతూ వచ్చి నారసింహారెడ్డి కాలానికి అది నెలకి 11 రూపాయల 10 అణాల 8 పైసలు అయింది.

నారసింహారెడ్డి మాతామహుడైన జయరామిరెడ్డి నొస్సం జమేదారు దీనికి ఏటా 22వేల రూపాయల రెవిన్యూ వచ్చేది ఈ జమేదారీని కూడా ఆంగ్లేయులు తమకైవసం చేసుకుని ఆయనకు నెలకి వెయ్యిరూపాయల భరణం ఏర్పాటు చేశారు జయరామిరెడ్డి కొడుకు నొస్సం నారసింహారెడ్డి నిస్సంతుగా చనిపోవడంతో ఆయన తన కూతురు కొడుకైన నారసింహారెడ్డిని దత్తు చేసుకున్నాడు కాని ఆంగ్లేయులు నొస్సం జమేదారీకి రావలసిన తవర్జీని నారసింహారెడ్డికి ఇవ్వడానికి అంగీకరించలేదు ఆంగ్లేయులపై నారసింహారెడ్డికి గల కోపకారణాలలో ఇది కూడా ఒకటి

ఉయ్యాలవాడ జాగీర్దార్ వంశంలోని వాడుగా తనకు 1846 మే నెలకు రావలసిన 11రూపాయల 10అణాల 8పైసల తవర్జీ కోసం నారసింహారెడ్డి 1846 జూన్ నెలలో కోవెలకుంట్ల తాసిల్దార్ దగ్గరకు ఒక మనిషిని పంపించాడు (తన కుమారుడైన దొరసుబ్బయ్యను పంపాడని కొందరు చెపుతారు) తాసిల్దార్ తవర్జీ ఇవ్వకపోవడమే కాకుండా నారసింహారెడ్డిని అవహేళన చేశాడు ఆ నరసింహ దాసరి క్రింద ఇంకో దాసరా? ఆ నరసింహదాసరినే రమ్మను పో అన్నాడట ఆ భటుడు ఉయ్యాలవాడకు పోయి నారసింహారెడ్డితో జరిగిన విషయం చెప్పాడు అది విన్న నారసింహారెడ్డికి చాలా కోపం వచ్చింది రేపు మధ్యాహ్నం పన్నెండు గంటలకు నరసింహదాసరే నీదగ్గరకు వస్తాడు కాసుకో అని అదే సేవకుని చేత తాసిల్దారుకు కబురుపెట్టాడు

రెడ్డి మర్నాడు 500 మంది బోయసైన్యాన్ని సమకూర్చుకొని పట్టపగలు కోవెలకుంట్ల పట్టణం మీద దండెత్తాడు తాసిల్దారు తల నరికాడు ట్రెజరీ దగ్గర కాపలావున్న బొందెలవాడు వారసింగును చంపి దానిని దోచుకొని కచేరీ అంతా తగలబెట్టి తాసిల్దారు శిరస్సును వారసింగు శిరస్సును తెచ్చి నొస్సం దగ్గరనున్న నయనాలప్పకొండ మీది శివాలయంలో వున్న ఒక గుహలో దాచిపెట్టాడు నారసింహారెడ్డి జరిపిన ఈ కోవెలకుంట్ల ముట్టడి 1846వ సంవత్సరం జులై 10వ తేదీని జరిగిందనీ ఆనాడు ట్రెజరీలో వున్న 805రూపాయల 10 అణాల నాలుగుపైసల డబ్బును దమ్మిడీలతో సహా రెడ్డి ఊడ్చుకుపోయాడనీ బంగోరె (బండి గోపాలరెడ్డి) పరిశోధనవల్ల తెలుస్తోంది నారసింహారెడ్డి కోవెలకుంట్ల తాసిల్దారును చంపలేదనీ బందీగా మాత్రమే గ్రహించాడనీ ఆ తాసీల్దారు బ్రాహ్మణుడనీ అతని పేరు రాఘవాచార్యులనీ రెడ్డి చంపినది ఒక ఢఫేదారునీ ఐదుగురు పోలీసు బంట్రోతుల్నీ మాత్రమేననీ ప్రభుత్వ రికార్డులు తెలియజేస్తున్నాయి ('బంగోరె పరిశోధన)

మర్నాడు కడప యాక్టింగ్ కలెక్టర్ కాక్రేన్ (Cochrane) కు ఈ హత్యావిషయం తెలిసింది. అన్వేషణ ప్రారంభమయింది. పోలీసులు ఉయ్యాలవాడలో వున్న నారసింహారెడ్డి దగ్గరకు వచ్చి కోవెలకుంట్లలో జరిగిన హత్యను గురించి ఆయన్నే అడిగారు. నారసింహారెడ్డి తనకేమీ తెలియదనీ, బహుశః ఔకురాజులు ఈపని చేసివుంటారనీ చెప్పాడు. అందువల్ల ఆంగ్లేయులు ఔకు రాజైన నంద్యాల నారాయణరాజుగారినీ, ఆయన బంధువూ చిట్వేలి తవర్జీదారుడూ అయిన నంద్యాల వేంకట రామరాజుగారినీ బంధించి కారాగారంలో ఉంచారు.

తరువాత, అపరాధపరిశోధకులు పరిశీలన ప్రారంభించి, నయనాలప్ప కొండలో వున్న శిరస్సుల్ని కనుక్కున్నారు. నారసింహారెడ్డి అనుచరులయిన గోసాయి వెంకన్న, ఒడ్డె జోబన్న అనే వాళ్ళను బంధించి, సత్యాన్ని తెలుసుకున్నారు. నారసింహారెడ్డిని బంధించడానికి కొందరు పోలీసుల్ని ఉయ్యాలవాడకు పంపారు. వాళ్ళు నారసింహారెడ్డిని పట్టుకోడానికి బదులుగా అతనిచేత తన్నులు తిని, శిక్షింపబడి, ప్రాణాలతో బయటపడ్డారు. పోలీసువారు నారసింహారెడ్డిని బంధించడానికి భయపడుతున్నారు. ఆ పరిస్థితిలో కలెక్టర్ కాక్రేన్ పెద్దసైన్యాన్ని పంపమని బళ్ళారిలోవున్న దత్తమండలాల సైనికాధికారి బ్రిగేడియర్ జనరల్‌కి అర్జంటుగా కబురుపంపాడు.

నారసింహారెడ్డి నాయకత్వంలో తిరుగుబాటు సైన్యం తొమ్మిది వేలదాకా ఉంటుందని తెల్లవారు అంచనావేశారు. కట్టుబడి బంట్రోతులు, చెంచువాళ్ళు, వడ్డెవాళ్ళు, బోయవాళ్ళు, యానాదులు, చివరికి కొందరు బ్రాహ్మణులు కూడా నారసింహారెడ్డి సైన్యంలో చేరారట. అనేక జమీందారుల, సంస్థానాధీశుల, నవాబుల అండదండలు కూడా రెడ్డికి లభించాయి.

నారసింహారెడ్డి తిరుగుబాటును అణచివేయడానికి కడపనుంచి, కర్నూలునుంచి, బళ్ళారినుంచి, కంభంనుంచి, చివరికి సికింద్రాబాదునుంచి బ్రిటిషువాళ్ల సైన్యాలు వచ్చి ముసురుకోవడం ప్రారంభించాయి.

1846 జులై 23వ తేదీని కంభం నుంచి వస్తున్న లెఫ్టినెంట్ వాట్సన్ నాయకత్వంలోని మిలిటరీ గిద్దలూరు దగ్గర నారసింహారెడ్డితో తలపడింది. ఈ మిలటరీలో వందమంది సైనికులున్నారు. కంభం తాసిల్దారు, మరికొందరు పోలీసు బంట్రోతులు ఈ మిలిటరీకి తోడుగా వున్నారు. నారసింహారెడ్డి సైన్యంలో

ఐదువేలమంది వీరులున్నారు ఐదు గంటలసేపు హోరాహోరీ పోరాటం జరిగింది ఇరుపక్షాలలోనూ అనేకులు చనిపోయారు చీకటి పడబోతుండగా వాట్సన్ తన సైన్యాన్ని తీసుకొని సెట్టివీడు అనే గ్రామానికి పారిపోయాడు నారసింహారెడ్డికూడా తన సైన్యాన్ని ముండ్లపాడు కు తీసుకుపోయాడు

మర్నాడు కర్నూలు నుంచి వచ్చిన క్యాప్టెన్ నాట్ క్యాప్టెన్ రసెల్ సైన్యాలు కిష్టం సెట్టిపల్లె అనే గ్రామం చేరుకున్నాయి అందరూ కలసి ముండ్లపాడు వచ్చి నారసింహారెడ్డి సైన్యాన్ని ఎదుర్కొన్నారు మళ్ళీ హోరా హోరీ సమరం జరిగింది ఇరుపక్షాలలోనూ అనేకులు చనిపోయారు నారసింహారెడ్డి కంభం తాసల్దారును చంపి తన సైన్యంతో కలిసి కొండల్లో కోనల్లో పడి తప్పించుకుపోయాడు కంభం వైపు గుత్త కనుమ గుండా వెళ్ళి కొత్తకోట చేరుకున్నాడు (నారసింహారెడ్డి చంపిన కంభం తాసల్దారు పేరు జంగం రెడ్డి శ్రీనివాసరావు అని తెలుస్తోంది)

ఆంగ్లేయులు నారసింహారెడ్డి కుటుంబ సభ్యుల్ని కడపకు తీసుకొని వెళ్ళి అక్కడ ఒక బంగళాలో బంధించారు యుద్ధంలోపట్టుబడిన నారసింహారెడ్డి సైనికులద్వారా కూపీలు తీశారు మూడుమాసాలు అవస్థపడి రెడ్డిగుట్టు తెలుసుకున్నారు ఎర్రమల నల్లమల కొండలమధ్య ఉన్న పేరుసోమల కొండల్లో జగన్నాధదేవళంలో నారసింహారెడ్డి ఉన్నాడని పసిగట్టారు నారసింహారెడ్డి దగ్గర ఉన్న జానకమ్మ అనే వంటమనిషికి లంచమిచ్చి ఆంగ్లేయులు అతని ఆనుపానులు తెలుసుకున్నారని జానపదులు చెపుతారు కలెక్టర్ కాక్రేన్ మిలటరీ సహాయంతో అక్కడికి వెళ్ళి కొండచుట్టూ సైనికుల్ని పెట్టి కాల్పులవర్షం కురిపించి బోయసైన్యాన్ని చంపి నారసింహారెడ్డిని పట్టి బంధించాడు ఈసంఘటన 1846 అక్టోబరు 6వ తేదీన జరిగింది (రెడ్డిని పట్టియిచ్చిన జానకమ్మ ఉంపుడుకత్తె అని వీరగాధలో వర్ణింపబడింది ఇది సరికాదని గుళ్ళదుర్తిలోని శ్రీ కసాని సుబ్బారెడ్డిగారు 27-4 1966 నాడు నాకు తెలియజేశారు ఆమె అజ్ఞాతంలో ఉన్న నారసింహారెడ్డికి వంట వండి పెట్టడం కోసం ఉయ్యాలవాడ నుండి వచ్చిన తెలుగు-బెస్త కులానికి చెందిన స్త్రీ అని సుబ్బారెడ్డిగారు చెప్పారు)

నారసింహారెడ్డి మనుషులలో 901 మంది మీద నేరం మోపారు అందులో చాలామందిని వదలివేశారు 112 మందికి మాత్రం కఠిన శిక్షలు విధించారు కొందరికి ద్వీపాంతర వాసశిక్ష కూడా విధించారు విప్లవ నాయకుడైన ఉయ్యాలవాడ నారసింహారెడ్డికి ఉరిశిక్ష విధించారు 1847 ఫిబ్రవరి 22వ తేదీ సోమవారం ఉదయం

7గంటలకు, కోవెలకుంట్లలో రెండువేల మంది ప్రజల సమక్షంలో కలెక్టర్ కాక్రేన్ నారసింహారెడ్డిని ఉరితీయించాడు. జానపదగేయాలను బట్టి ఈఉరితీత కోవెలకుంట్లలో జుర్రేటి ఒడ్డున జరిగింది. అంతేకాదు, విప్లవకారుల్ని భయభ్రాంతుల్ని చేయడంకోసం నారసింహారెడ్డి శిరస్సును 1877దాకా, అంటే 30 సంవత్సరాలపాటు, కోవెలకుంట్ల కోటలో ఉరికొయ్యకు వ్రేలాడదీసి ఉంచారట బ్రిటీషువారు!

1974 లో ప్రచురింపబడిన Kurnool District Gazetteer లో నారసింహారెడ్డిని 1847 జనవరి 9వ తేదీని ఉరితీసినట్టుగా ఉన్నదని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ భట్టు పుల్లయ్యగారు (కోవెలకుంట్ల) 22-2-1988 నాడు నా దృష్టికి తీసికొని వచ్చారు. నేను ఆగెజటీర్ వ్రాతను పరిశీలించాను. "He was tried before the Foujdaru Adalat (Military Court) and sentenced to be hanged on 9th January 1847" అనే వాక్యం ఉంది. ఈ వాక్యంలో ''to be hanged'' తరువాత ఒక కామా పెట్టుకోవాలి. ''He was tried'' అనేది ఈ వాక్యం కర్త. కాబట్టి W.A.D. Inglish అనే Special Commissioner మిలిటరీ కోర్టు విచారణ జరిపి తీర్పు ఇచ్చిన తేదీ జనవరి 9, 1847 అయిఉంటుంది. అది ఉరితీయబడిన తేదీ మాత్రం కాదు. విచారణ జరిగిన వెంటనే ఉరి తీయరు. దానికి గవర్నరు అంగీకారం కావాలి. 9-1-1847నాడు ఈ మిలిటరీ కోర్టు ఇచ్చిన తీర్పునకు, గవర్నరు 1847 ఫిబ్రవరి 6వ తేదీని ఆమోద ముద్ర వేశాడు. 1847 ఫిబ్రవరి 22వ తేదీని నారసింహారెడ్డిని ఉరితీయబోతున్నామని ప్రభుత్వం ఊరూరా చాటింపు వేయించింది. అదే తేదీని కలెక్టర్ కాక్రేన్ పర్యవేక్షణలో, రెండువేలమంది ప్రజల సమక్షంలో, కోవెలకుంట్ల పట్టణం సమీపంలో ఎన్నుకున్న ఒక చోట ("...at a spot selected near the town of Koilcuntla") రెడ్డిని ఉరి తీశారు. (చూ. బ్రౌన్‌జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు, బంగోరె, పుట 22)

ఈవిధంగా ఝాన్సీలక్ష్మీబాయి కన్నా 10 సంవత్సరాలు ముందుగానే, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకోసం ఆంగ్లేయుల్ని ఎదిరించి వీరస్వర్గమలంకరించిన మహావీరుడు ఉయ్యాలవాడ నారసింహారెడ్డి! ఈ శూరుణ్ణి గురించిన వీరగాథలు, నవలలు, కావ్యాలు, నాటకాలు రేనాడులో ప్రచారంలో ఉన్నాయి.

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గురించిన మొట్టమొదటి ప్రసక్తి 1923లో ప్రకటింపబడిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్యమణిమంజరి రెండవ భాగంలో కనపడుతుంది. నారసింహారెడ్డి ఆస్థానకవి ఓబళాచార్యులకూ, ఆ

కాలంలో కర్నూలు జిల్లాలో ప్రసిద్ధికెక్కిన కృష్ణపాటి వేంకటకవికీ నశ్యం విషయమై సంభాషణాత్మకంగా జరిగిన రెండుపద్యాలను ప్రభాకరశాస్త్రిగారు సంపాదించారు

తరువాత 1925లో కలవటాల జయరామారావుగారు రేనాటి వీరుడు అనే నవలను రచించి ప్రకటించారు తూమాటి దోణప్పగారు అనంతపురం జిల్లాలో సేకరించిన దొరవారి నరసింహ్వారెడ్డి! నీ దొరతనమంు కూలిపోయెం రాజానరసింహారెడ్డి! అనేకోలాటం పాట 1960లో ప్రకటింపబడిన త్రివేణి సంకలన గ్రంధంలో ఉంది వాహువా! నరసింహారెడ్డి! నీ పేరంటే రాజానరసింహారెడ్డి ! అనే ఎచ్చుకుంట్ల పాటను నేను 1966లో కర్నూలు జిల్లాలో సేకరించాను ఇది ఒక లఘువీరగాధ (Balladling) ఈ చిన్ని పాటలు కాకుండా బొబ్బిలికధ వరుసలో వున్న పెద్ద వీరగాధ (Ballad) కూడా ఒకటి ఉంది దీనిని నేను 1966 మార్చి 15వ తేదీని కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా అయ్యవారిపల్లెలో ఒక జంగం పాడుతూ ఉండగా సేకరించాను ఈ వీరగాధలో పైన చెప్పిన చారిత్రకములైన పేర్లు లేకపోయినా కధ అంతా ఒకటి రెండు స్వల్పభేదాలతో అలాగే ఉంది నేను సేకరించిన ఈ వీరగాధను ఆధారంగా చేసుకొని ఉయ్యాలవాడలోని సుప్రసిద్ధకవి పాణ్యం నరసరామయ్యగారు 1976లో స్వాతంత్ర్యవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి చరిత్ర అనే పద్యకావ్యాన్ని రచించారు నారసింహారెడ్డి వంశీకులూ రూపనగుడి మునసబూ అయిన కర్నాటి అయ్యపురెడ్డిగారు ఈ కావ్యాన్ని ప్రచురించారు 1984లో అయ్యపురెడ్డిగారి తమ్ముళ్ళు ఈ కావ్యాన్ని తిరిగి ముద్రించారు హైదరాబాదు విశ్వవిద్యాలయంలోని చరిత్ర విభాగంలో ప్రొ॥ వి రామకృష్ణగారి పర్యవేక్షణలో నారసింహారెడ్డి చరిత్రను గూర్చి 1986లో M Phil పరిశోధన కూడా జరిగింది ఆ పరిశోధక విద్యార్థిపేరు శ్రీ ఎన్ రాఘవేంద్ర శ్రీ S D V అజీజ్ అనే యువకుడు నారసింహారెడ్డి చరిత్రను ఇతివృత్తంగా తీసికొని 1989లో పాలెగాడు అనే నవలను రచించాడు శ్రీ పల్లేటి లక్ష్మీకుల శేఖర్ రచించిన నారసింహారెడ్డి నాటకాన్ని కడప సవేరా ఆర్ట్స్ వారు శ్రీ బుడ్డా వెంగళరెడ్డిగారి సహకారంతో రాయలసీమ అంతటా ప్రదర్శిస్తున్నారు ఇది అముద్రితము డా॥ మైరెడ్డి నరసింహులు గారు (పొద్దుటూరు) శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు (మోక్షగుండం) కూడా నారసింహారెడ్డి కధను నాటకాలుగా వ్రాశారు ఇందు మొదటిది ముద్రితము రెండవది అముద్రితము

దోణప్పగారి కోలాటం పాటలో నారసింహారెడ్డి పేరు చెపితే కుంఫణీ ప్రభుత్వం గడగడవణికేదనీ నారసింహారెడ్డిని ఉరితీసి అతని తలను కోట బురుజుకు

వ్రేలాడదీశారనీ కాశీలో ఉన్న అతని తల్లికి కుమారుని మరణవార్త తెలిసి దు ఖించిందనీ ఉన్నది

కొయిల్‌కుంట్లా గుట్టలెంటా- కుందేరు వొడ్డులెంటా
గుఱ్ఱమెక్కీ నీవు వస్తే- కుంఎణీకి గుండె దిగులు ॥దొర॥

కండ్లకూ గంతాలు గట్టీ-నోటినిండా బట్లు పెట్టీ
నిలువునా నీ తలాగొట్టీ - కోట బురుజుకు గట్టిరీ ॥దొర॥

కాశీలోన తల్లికేమో-చావుసుద్దీ దెలిసినాదీ
కన్నకడుపే తల్లటించే-గంగలోనా గంగ గలిసే। ॥దొర॥

తల్లి దు ఖిస్తే ఆమె కన్నీటిని గంగలోనా గంగ కలిసే అని వర్ణించడం జానపదకవి భావనాశక్తికి గొప్ప ఉదాహరణం

నేను సేకరించిన ఎచ్చుగుంట్ల పాటలో నారసింహారెడ్డి దెబ్బకి భూమి గడగడ వణికిందనీ భూమిలోపల ఉండే ఆదిలక్ష్మి తోడు పలికినదనీ జానపద కవి వర్ణిస్తాడు

జంగం కథలో కూడా జానపదకవి నారసింహారెడ్డి శౌర్యాన్ని వీరరసస్ఫోరకంగా వర్ణిస్తాడు

అడిగో వచ్చే ఇడిగో వచ్చె నారసింహారెడ్డి
పళపళ పళపళ కేకలేసెరా నారసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డి
కోబలీ రణబలీ యన్నడే నారసింహారెడ్డి
ఆవుల మందలో పులీ దుమికినా చందము దుమికినదూ
రెడ్డి ఎక్కినా గుఱ్ఱములమిడీ ఏవిధమొచ్చినదీ
కుప్పిటి గంతుల మీద వచ్చెరా బారాహజ్జారీ
వచ్చిన వక్కా సైన్యము అంతా ముందుకు దమికినదీ
వంచినట్టి బలెములపైననూ వాలలాడుతారు
సానజేసినా కత్తులమిందా నవకళించినారు
అర్వైవొక్కా తుపాకులండీ ఫెళఫెళ వాగినవి
విరగ నరుకుతా పోతాడయ్యా నారసింహారెడ్డి
తాటిపుచ్చెలా చందము నేడు తలలేపోతావి

ఆలగోడురా బాలగోడురా కొాయిల్ కుంట్లలోన
ఎక్కడ చూచిన పీనుగు పెంటలు కొాయిల్ కుంట్లలోన

ఈ వీరగాధలో వీరరసమే కాకుండా దానికి అంగరసంగా బీభత్సరసం కూడా చక్కగా పోషింపబడింది నారసింహారెడ్డి శత్రువుల్ని చంపుతూ వుంటే

పొడుస్త వుంటే పడుతున్నావి పొట్టపేగులండీ
నరుకుత వుంటే పడుతున్నావి నల్లగుండులోయీా
చీరుత వుంటే పడుతున్నావీ చిన్నపేగులోయీా
వాళ్ళుతాగినా కల్లూ సారయి వరదలు పోతాది
అప్పుడు తిన్నా పప్పుకూడురా కుప్పలు తెప్పలురా!

వీరగాధలలో తరచుగా వచ్చే సాధారణ ప్రయోగాలు లేక వారానువర్తనాలు (Ballad Commonplaces) యుద్ధనినాదాలు తీవ్రసంకల్పాలు మొదలైనవి ఈ నారసింహారెడ్డి వీరగాధలో కూడా కనబడతాయి నారసింహారెడ్డి వీరత్వాన్ని గురించి చెప్పేటప్పుడు

అదిగో వచ్చే ఇదిగోవచ్చె నారసింహారెడ్డి
రాజారావు రాజబహదరు నారసింహారెడ్డి
రెడ్డికాదు బంగారపు కడ్డి నారసింహారెడ్డి
ములకోల కట్టె చేతులో ఉంటే–మున్నిటికి మొనగాడు

అనే వర్ణన తరచుగా కనబడుతుంది

బొబ్బిలి యుద్ధంలో తరచుగా వినబడే రామ రామ! అనంతకాలము రాజ్యము ఏలేమా? యుగములు జగములు గలంత కాలము భూములు ఏలేమా? అనే దానిని పోలిన యుద్ధనినాదం (Wa cry) నారసింహారెడ్డి కథలో కూడా వినబడుతుంది ఈ జీవితం అశాశ్వతమనీ కీర్తి ఒక్కటే శాశ్వతమనీ పుట్టిన ప్రతి వ్యక్తీ చావక తప్పదనీ ఒక నిశ్చయానికి వచ్చి నారసింహారెడ్డి సైనికులు రణరంగంలోకి దూకుతారు

ఈ పొద్దిదియ రేపుతదియ నరుని ప్రాణమోయి
నీటిమీదను బుగ్గ తోటిదీ నరాశరీరమ్మొ
ఏలబోయి ఈ ప్రాపంచంలో మరల ఏలబోము
పుట్టబోయి మనతల్లి కడుపునా మళ్ళీపుట్టేమా?

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పరాక్రమాన్ని గురించీ బలాన్ని గురించీ ఎన్నో జనశ్రుతులున్నాయి నారసింహారెడ్డి మహాబలవంతుడనీ అతడు చెట్టుక్రింద పండుకొని నోటిలో గువ్వరాళ్ళు పోసుకొని ఉఫ్ మని పైకి ఊదితే చెట్టు మీద ఉన్న గువ్వపిట్టలు చచ్చి క్రిందపడేవట

నారసింహారెడ్డి ప్రజోపయోగకరములైన పనులెన్నో చేశాడు గిద్దలూరు నుండి దొనకొండ వరకూ ఒక పెద్దకాలిరస్తా వేయించాడు దొనకొండ దగ్గరున్న గంగాదేవిపల్లెలో ఇతని వంశీకులుండేవారట గుళ్ళదుర్తి రూపనగుడి ఉయ్యాల వాడలలో ఈతని వంశీకుల్ని ఈనాటికీ చూడవచ్చును

## 'రేనాటి చంద్రుడు' బుడ్డా వెంగళరెడ్డి

వీరగాథలలోను వీరగాథానికలలోను తరచుగా యుద్ధవీరమే ప్రశంసింపబడుతూ ఉంటుంది పేరంటాండ్రకథలలోను కట్టపదాలలోను మాత్రం త్యాగవీరం ఉంది దానవీరాన్ని ప్రశంసించే వీరగాథానికలు కూడా తెలుగులో కొన్ని ఉన్నాయి మానవసేవయే మాధవసేవగా భావించి కరవు కాటకాలు సంభవించినప్పుడు సాటిమానవులకు తమ సర్వస్వాన్నీ ఇచ్చివేసిన దానకర్ణులపైన కూడా జానపదులు భక్తి ప్రపత్తులతో పాటలు పాడుకుంటారు రాయలసీమలో బుడ్డా వెంగళరెడ్డి సుద్దపల్లి లక్ష్మమ్మ సుద్దపల్లి రామచంద్రారెడ్డి యాదాళ్ళ నాగమ్మ చిన్న అండ్లూరి శివమ్మ మోదిన్ పకర్‌దిన్ మొదలైన వారిపైనా నెల్లూరు జిల్లాలో కోడూరి బాలకోటారెడ్డిగారి పైనా గోదావరి జిల్లాలో డొక్కా సీతమ్మగారిపైనా ఇటువంటి పాటలున్నాయని తెలుస్తోంది

ఇటువంటి దానవీరప్రశంసలైన లఘువీరగాథలలో బుడ్డా వెంగళరెడ్డిగారి పాట ప్రశస్తమైనది దీనికున్న వ్యాప్తి రాయలసీమలో మరి ఏయితర గేయానికీ లేదు రాయలసీమలో ముఖ్యంగా రేనాడులో రైళ్ళలోను బస్సులలోను తిరునాళ్ళలోను ఎక్కడ పడితే అక్కడ ఈ పాట వినిఏస్తూ ఉంటుంది దీనిని ఎక్కువగా కుంటివారు గ్రుడ్డివారు పాడుతూ ఉంటారు

బుడ్డా వెంగళరెడ్డిగారు రేనాటి దానకర్ణుడు ఈయన క్రీ శ 1822లో జన్మించి క్రీ శ 1900లో స్వర్గస్థుడయ్యాడు నారసింహారెడ్డి విప్లవకాలంలో వెంగళరెడ్డి యువకుడుగా ఉండి ఉంటాడు క్రీ శ 1866లో విక్టోరియా మహారాణి వెంగళరెడ్డిగారి

దానశీలతకు ఆశ్చర్యపడి ఆయనకు ఒక స్వర్ణపతకాన్ని బహూకరించింది అది ఉయ్యాలవాడలో వేంగళరెడ్డిగారి వంశస్థుల దగ్గర నేటికీ ఉంది (17 4 1966నాడు నేను ఆ గ్రామానికి వెళ్ళి ఆ స్వర్ణపతకాన్ని చూచి ఫొటో తీసుకున్నాను) ఆ పతకం మీద ముందు భాగంలో ఇంగ్లీషులోను వెనుకభాగంలో తెలుగులోను ఈ క్రింది విధంగా వ్రాయబడి ఉంది

Presented to Budda Vengala Reddı as a token of the hıgh appreciatıon of Her Majesty s government of hıs munıficent lıberalıty to hıs destitute countrymen ın the famıne of 1866

1866 సంవత్సరములో సంభవించిన క్షామకాలమందు నిరాధారముగా వుండిన తన స్వదేశస్థులపట్ల జరిగించిన వుత్కృష్టమయిన ఔదార్యముకు గాను హర్‌మెజస్టీ రాణిగారివల్ల చేయబడిన శ్రేష్ఠమయిన గణ్యతకు ఆనవాలుగా బుడ్డా వెంగళరెడ్డిగారికి బహుమానము యివ్వబడ్డది

క్రీ శ 1866లో రాయలసీమలో పెద్ద క్షామం వచ్చింది అది ధాతనామ సంవత్సరం కావడం చేత దానిని ధాతకరవు అని పిలిచేవారు అది ముఖ్యంగా అనంతపురం జిల్లాలో సంభవించింది బుడ్డా వెంగళరెడ్డిగారు క్షామపీడితులైన ప్రజలకు మూడు నెలలపాటు అన్నస్త్రాలిచ్చి కన్నతండ్రిలా కాపాడాడు పన్నెండు పాతర్ల ధాన్యం ఖర్చు చేశాడు తన దగ్గరున్న ధాన్యం అయిపోతే మిత్రుల దగ్గర అప్పుచేసి క్షుధార్తుల్ని పోషించాడు అందుకే ఆయన రామలసీమ దానకర్ణుడుగా ప్రసిద్ధికెక్కాడు!

బుడ్డా వెంగళరెడ్డిగారి తండ్రి నల్లపరెడ్డి తల్లి అక్కమ్మ ఉయ్యాలవాడ గ్రామం వీరి స్వస్థలం నల్లపరెడ్డిగారికి వెంగళరెడ్డిగారు జ్యేష్ఠపుత్రుడు ఈయన తరువాత తిమ్మమ్మ అనే కూతురు ఈశ్వరరెడ్డి అనే మరొక పుత్రుడు ఆయన తరువాత సుబ్బమ్మ అనే వేరొక పుత్రిక కలిగారు వెంగళరెడ్డిగారికి వెంకటమ్మ నాగమ్మ అనే ఇద్దరు భార్యలు ఉండేవారు వారిలో నాగమ్మ చనిపోగా వెంగళరెడ్డిగారు చెన్నమ్మ అనే మరొక యువతిని వివాహం చేసుకున్నారు కాని ఈ ముగ్గురు భార్యలలో ఏ ఒక్కరికీ సంతానం కలగలేదు (ఇప్పుడు ఉయ్యాలవాడలో ఉన్న బుడ్డా వంశస్థులు వెంగళరెడ్డిగారి తమ్ముడైన ఈశ్వరరెడ్డి గారి మనుమలు మునిమనుమలు)

వెంగళరెడ్డిగారి యింటిపేరు పూర్వము మద్దెల వారు వెంగళరెడ్డిగారు గొప్పదానపరుడై కీర్తిగడించిన తరువాత గొప్పవాడు వెంగళరెడ్డి అనే అర్థంలో బడా

వెంగళరెడ్డి అని ప్రజలు పిలిచేవారు ఈ బడా శబ్దమే జానపదుల ఉచ్ఛారణలో బుడ్డా గా మారిందని రేనాటిసీమలో కొందరు పెద్దలు చెపుతున్నారు

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి ఇంటిపేరు కూడా మద్దెల వారే అని నాకు లభించిన ఒక వీరగాథానికను బట్టి తెలుస్తోంది నారసింహారెడ్డి బుడ్డావెంగళరెడ్డి ఇద్దరూ పూర్వకాలంలో ఒకే వంశంవారు జ్ఞాతులు కూడ ఇద్దరూ మోటాటి రాజవంశీకులే కాని నారసింహారెడ్డి పూర్వీకులలో చెంచుమల్ల జయరామిరెడ్డి కాలంలోనో లేక ఆయన కంటే పూర్వమే ఉన్న వీర నారసంహారెడ్డి కాలంలోనో ఈ రాజకుటుంబం రెండుగా చీలిపోయింది అప్పటినుండి వీరికీ వారికీ వైవాహిక సంబంధాలు లేవు ఆచారవ్యవహారాలు కూడా భిన్నములయ్యాయి చిరకాలంగా వస్తున్న మోటాటి రాజవంశం జయరామిరెడ్డిగుంపు లేక నారసింహారెడ్డిగుంపు అనీ కృష్ణారెడ్డిగుంపు లేక బుడ్డావెంగళరెడ్డిగుంపు అనీ రెండుగా విడిపోయింది బుడ్డావెంగళరెడ్డిగారు కృష్ణారెడ్డిగుంపు నకు చెందిన మోటాటి రాచరెడ్డి!

బుడ్డావెంగళరెడ్డిగారు చేసిన దానధర్మాలను గురించి ఎన్నోకథలు జనపదాలలో వ్యాప్తిలో ఉన్నాయి వాటిలో కొన్ని కథలు మాత్రమే పాటలో పేర్కొన్నబడ్డాయి ఈ పాటకు నేను కర్నూలు జిల్లాలో మూడు పారాంతరాలను సేకరించాను నంద్యాలలో ఒకటి కోవెలకుంట్లలో మరొకటి కాకరవాడలో వేరొకటి కొంచెం కొంచెం భేదాలు తప్పిస్తే ఈ మూడు పారాలు ఒకే రకంగా ఉన్నాయని చెప్పవచ్చును వీటి ప్రారంభం ఇలా ఉంటుంది

**ఉత్తరాది ఉయ్యాలవాడలో- ఉన్నది దరమం సూడరయా**
**నేటికి బుడ్డా ఎంగళరెడ్డీ- దొడ్డ ప్రెబువనీ తెలియరయా!**

ఇది ఈ పాటకు పునరావృత్తి (Refrain) వెంగళరెడ్డిగారి మూర్తి చిత్రణమంతా ఈ క్రింది పంక్తుల్లో కనబడుతుంది

**దొడ్డ ప్రెబువనీ దొరలు మెచ్చగా- ఇడుపున గూర్చోనుండునయా**
**ఇడుపున గూర్చో వెంగళరెడ్డీ- యికయిక నగుతా నుండునయా!**

ధాతకరవులో తమ ప్రాణాలు నిలిపిన రాయలసీమ దానకర్ణుణ్ణి ప్రజలు ఇలా దీవిస్తారు

**దానం దరమం గ్యానం తెలిసీ- దరమరాజువలె ఏలెనయా**
**సచ్చిన బ్రతికివ ఎంగళరెడ్డికి- స్వర్గలోకమే ఉన్నదయా! ॥ఉత్తరాది॥**

పున్నెం సేసిన ఎంగళరెడ్డికి-పూల పానుపే ఉండునయా
మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని-మల్లెపూల పాన్పేతురయా! ॥ఉత్తరాది॥

పుణ్యం చేసిన వెంగళరెడ్డికి స్వర్గంలో మల్లెపూల పాన్పు వేస్తారట దేవతలు! ఎంత చల్లని దీవెన!!

దీని తరువాత వెంగళరెడ్డిగారు బ్రాహ్మణునకు ఆవును దానము చేసిన కథ చెప్పబడుతుంది వేసవిలో ఒక బ్రాహ్మణుడు ఉయ్యాలవాడలోని వెంగళరెడ్డిగారి యింటికి వచ్చి మజ్జిగ దాహమిమ్మని అడిగాడు రెడ్డిగారి చిన్నభార్య చెన్నమ్మగారు లేవడానికి బద్ధకించి మజ్జిగ లేదు వెళ్ళండి అంది ఈ మాట అరుగుమీద కూర్చున్న వెంగళరెడ్డిగారికి వినబడింది ఆయన దిగ్గున లేచి తిరిగి వెళ్ళిపోబోతున్న బ్రాహ్మణ్ణి ఆపి యింటిలోకి వెళ్ళి కడవ తీసి చూచాడు కడవ నిండుగా మజ్జిగ ఉంది లేదని చెప్పిన మజ్జిగను మళ్ళీయిస్తే పాపమని భావించి ఆ బ్రాహ్మడికి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టించాడు మజ్జిగ లేకపోతే మనకీ ఆవుతో ఏంపని? అని భార్యతో చెప్పి పాడిఆవును దూడను ఆ బ్రాహ్మడికి దానం చేసివేశాడు ఎవ్వరైనా ఆ బ్రాహ్మణ్ణి ఈ ఆవు ఎక్కడిది? అని ప్రశ్నిస్తే వెంగళరెడ్డిదని చెప్పవద్దనీ అలా చెపితే తాను ఋణపడి ఉంటాననీ అందువల్ల ఆ ఆవు దేవుడిదని చెప్పవలసిందనీ వెంగళరెడ్డిగారు ఆ బ్రాహ్మణ్ణి కోరారట! దాహం తీర్చుకోడానికి కొంచెం మజ్జిగ ఇమ్మని అడిగితే ఆవునే తోలియిచ్చిన మహాదాత బుడ్డా వెంగళరెడ్డి!

దీని తరువాత వెంగళరెడ్డిగారి దాతృత్వాన్ని ప్రశంసించే మరికొన్ని కథలు వరుసగా ఈ పాటలో వస్తాయి

ఒకనాడు ఒక ఫకీరు స్త్రీ వెంగళరెడ్డిగారింటికి బిచ్చంకోసం వచ్చింది ఆమెకు వెంగళరెడ్డి ఒక పట్టుచీరను దానం చేశారు ఆ పట్టుచీర రెడ్డిగారి చిన్నభార్యయైన చెన్నమ్మగారికి ఆమె పుట్టింటివారు పెట్టిన చీర ఆ చీరను తన భర్త దానం చేసివేశాడని తెలియగానే చెన్నమ్మగారు పెరటి మార్గాన వచ్చి ఆ బిచ్చుగత్తె దగ్గరున్న పట్టుచీర లాగుకొని వేరొక నూలుచీర నిచ్చింది అది వెంగళరెడ్డిగారికి తెలిసి బాధపడి పట్టుదలతో సరిగా అటువంటి పట్టుచీరనే నేయించి ఆ ఫకీరు వనితకు దానమివ్వడమే కాకుండా ఆమెకు తోబుట్టువు కన్నా మిన్నగా చీరసారెలు పెట్టి సాగనంపారట!

వెంగళరెడ్డిగారు గుర్రమెక్కి- చెన్నపట్టణంలో ఉన్న విక్టోరియారాణి దగ్గరకు వెళ్ళారు ఆ రాణి రెడ్డినిచూచి ఏడువేల రూపాయలిచ్చి దానం చేయమని కోరింది

ఆ సభాప్రాంగణం దాటేసరికే ఆ ధనమంతా వెంగళరెడ్డి దానం చేసివేశాడు. అతని వితరణ శక్తికి విక్టోరియారాణి ఆశ్చర్యచకిత అయ్యిందట!

కురిసీమిందా రాణెమ్మ తల్లీ– గుండెలావటిల నిలిపెనయా
వీడు ఎక్కడీ నరుడూ కాదూ– సెక్రవర్తి యనుకున్నదయా! ॥ఉత్తరాది॥

కిలకిల కిలకిల రాణి నగీ – ఎండి బంగరూ అచ్చు ఫారమూ
ఆగదంటనే పలికెనయా! – కిలకిల కిలకిల రాణినగీ
..................... రత్నాలదండ మెడకేసెనయా!। ।ఉత్తరాది॥

అంతేకాదు, ఆ రాణి పన్నెండు పుట్ల ధాన్యం పండే వెంగళరెడ్డిగారి పొలానికి పన్ను లేకుండా చేసింది! కాని వెంగళరెడ్డిగారు రాబోయే కాలం ఎట్లా ఉంటుందో అని సగం పన్ను కడతానని చెప్పారట. అప్పటినుండి యకరానికి మూడు కాసుల వంతున పన్ను చెల్లించాడు.

వెంగళరెడ్డిగారి దగ్గర మిక్కిలిగా బలసిన చక్కని యెద్దు ఒకటి ఉండేది. (ఈ యెద్దునే తరువాతి కాలంలో అప్పలాపురం చెన్నారెడ్డి కొన్నాడు. ''అప్పలాపురం చెన్నారెడ్డి యెద్దుల కథ'' అనే వీరగాథానిక ఒకటి ఉంది). ఒకనాడు దళితుల పిల్లలు ఆటలాడుకుంటూ బలిసివున్న వెంగళరెడ్డిగారి యెద్దును చూచి ఆ యెద్దునిస్తే తమకు పండుగ వెళ్ళిపోతుందని అన్నారట. రెడ్డిగారి జీతగాండ్రు ఆ మాటలు విని కోపించి ఆ పిల్లల వెంటబడి తరిమి తరిమి కొట్టారు. వెంగళరెడ్డిగారికి ఈ విషయం తెలిసి, ఆ దళితుల పిల్లలందరినీ రప్పించి, వారికి కడుపునిండా భోజనాలు పెట్టించి, ఆ యెద్దును వారి యిళ్ళకు తోలించారు. (పాటలో ఇంతవరకే ఉంది. కాని జనశ్రుతిని బట్టి చెప్పే కథలో ఆ పిల్లల పెద్దలు వెంగళరెడ్డిగారి దగ్గరకు వచ్చి, మళ్ళీ ఆ యెద్దును తోలితెచ్చి, ''మహాప్రభో! పిల్లలు తెలియక చేసిన తప్పును క్షమించండి!'' అని బ్రతిమాలిరట. ఇదే సమంజసంగా తోస్తోంది).

వెంగళరెడ్డిగారు ఎప్పుడూ రాత్రులలోనే ప్రయాణాలు చేస్తూ ఉండేవారు. ఒకసారి విరూపాక్షికి పోవాలని బయలుదేరారు. దారిలో నలుగురు ''గొరక దొంగలు'' రెడ్డిగారిని చంపడంకోసం అడ్డగించారట. వెంగళరెడ్డిగారు ''నాయనలారా! మీరు ఆకలితో ఉన్నారు. అన్నం తిన్న తర్వాత నన్ను చంపండి'' అని, ఆ దొంగల్ని యింటికి తీసుకొచ్చి, కడుపునిండుగా భోజనాలు పెట్టి, తరవాత ''నన్ను చంపండి'' అన్నారట.

దొంగలు నలుగురూ ఆయన కాళ్ల పై పడి క్షమించమని వేడుకొన్నారు ఆదొంగల పెళ్లాంపిల్లలు ఇండ్ల దగ్గర వాళ్ళకోసం ఎదురుచూస్తూ ఉంటారని తలచి నలుగురు దొంగలకూ నాలుగు బియ్యంమూటలు గాడిదలపై వేయించి త్రోవ ఖర్చులిచ్చి ఆదొంగలను సాగనంపాడు వెంగళరెడ్డి గాంధీజీ పుట్టకపూర్వమే అహింసా సిద్ధాంతాన్ని అమలు జరిపిన మహానుభావుడు బుడ్డా వెంగళరెడ్డి గారు!

ఒకనాడు రెడ్డిగారు పచ్చ గుర్రమెక్కి చెన్నంపల్లె కు వెళ్లబోతున్నారు ఆ చెన్నంపల్లెలో వెంగళరెడ్డిగారిని చంపాలని కొందరు శత్రువులు మాటుపెట్టి ఉన్నారట ఆ శత్రువులు యింటిలో ఉన్న ఒక హరిజన యువకుడు వెంటనే ఉయ్యాలవాడకు వచ్చి ఈ విషయం వెంగళరెడ్డిగారికి విన్నవించాడు ఆ హరిజన యువకుడికి తనపై ఉన్న భక్తికి మెచ్చి అతనిని తనదగ్గరే వుంచుకొని పెంచి పెద్దచేసి వైభవోపేతంగా అతనికి పెండ్లిచేసారు రెడ్డిగారు మూడుదినాలు జరిపిన ఆ హరిజనుని పెండ్లికి దానకర్ణుడైన వెంగళరెడ్డిగారు ప్రజలకు ఎటువంటి శాసనం చేశారో చూడండి!

చుట్టూ ఉండే ఆమడ పొడుగూ - లోపల మూడు దినముల వరకూ
కుండపెట్టి కూడొండిన వాడికి - జులుమానుందని పలికెనయా!

ఉయ్యాలవాడ గ్రామానికి చుట్టుప్రక్కల ఆమడ మేరలో గల గ్రామవాసులందరూ మూడు దినాలపాటు తన యింట్లోనే భోజనం చేయాలట! దీనినతిక్రమించి స్వయంగా వంట చేసికొన్న లారికి జుల్మానా విధిస్తారట రెడ్డిగారు!

ఒకప్పుడు వెంగళరెడ్డిగారు తమ జొన్న చేలల్లో కంకుల కోతకు దళితులను పిలిచి కంకులన్నీ మీరు కోసుకొని వట్టిచొప్పను నాకు పంపండి అనిచెప్పాడట వాళ్లు అలాగే చేయగా వెంగళరెడ్డిగారి బంధువులు కోపించి ఆ దళితులను పట్టుకొని కొట్టి చావడిలో బంధించారట అది వెంగళరెడ్డి గారికి తెలిసి ఎంతక్షోభించాడో చూడండి

ఎవరు కొట్టిరో నా పిల్లలనూ - ఎవరు తిట్టిరో నా ఎల్లలనూ
మూడు నూర్లా దుడ్డు పోసీ - మందినెల్ల యిడిపించెనయా!

ఈవిధంగా వెంగళరెడ్డిగారిపై వ్యాప్తిలో ఉన్న వీరగాధానికలో రెడ్డిగారి దాతృత్వాన్ని ప్రశంసించేటువంటి ఏడు కధలు మాత్రమే చెప్పబడ్డాయి ఇంకా ఎన్నో కధలు వచన రూపంలో రాయలసీమ జనపదాలలో వృద్ధుల చేత చెప్పబడుతున్నాయి (ఇటు వంటి వచన కధలను నలభై వరకూ నేను సంపాదించాను)

బుడ్డా వెంగళరెడ్డిగారి పాటలో ఒక విశేషం ఉంది. ఇందులో కేవలం కథా కథనమే కాకుండా, రసవంతమైన కవిత్వం కూడా ఉంది. బాగా బలిసివున్న వెంగళరెడ్డిగారి కోడెను చూచి, ఆటలాడుతున్న దళితుల పిల్లలు తమలో తాము సంభాషించుకోవడం చాలా సహజంగా, జానపద పరిభాషలో ఆ కోడెను మన కళ్ళకు కట్టినట్టుగా మంచి వర్ణనతో కొనసాగుతుంది.

**ఒరె మల్లుగా! యిటుసూడరా! – ఒరె యెల్లుగా! యిటు సూడరా!**
**యెంగళరెడ్డివి యీర యెద్దులూ – యెంగళరెడ్డివి యీర కోడెలూ**
**కాటుక కన్నుల కర్రె కోడెరా – కార్తిక మాసంలో రెడ్డి పట్టినడు**
**నాలుగు కాళ్ళా మట్టమున్నదీ – నడినెత్తిన మరి సుక్కవున్నదీ**
**బిళ్ళ కొమ్ములా కర్రె కోడెరా – బిగువు కండలా యీర కోడెరా**
**పందుం బియ్యం గిత్తయితే మా – పండుగవుతదని పలికిరయా!**

ఈ యెద్దును హరిజనవాడలకు తోలుతు వెంగళరెడ్డిగారు దుఃఖపోవడం కూడా ఎంతో ఆర్ద్రంగా వర్ణితమయింది పాటలో-

**ఏమి యెరుగని యెద్దుగిత్తకూ – పుటిక మేతలే పెట్టెనయా**
**చెవులోననే ఎంగళరెడ్డి – 'నాయనా! ఓ బసవదేవుడా!**
**నీకూ నాకూ ఋణాలు దీరెను – మాలవాండ్ల యిండ్లకు నీవు**
**ఒడ్డేలి కట్టెకు పూజకెల్ల' మని – సెప్పెనయా!**

వెంగళరెడ్డిగారి కీర్తి ఎండ కాసిన మండలమంతా ప్రాకిపోయిందట!

**ఎండగాసినా మండలానికీ**
**ఎరుకగలిగినా రెడ్డివయా!**

ఈ విధంగా ఎవరైనా తన్ను పొగిడితే వీథి అరుగుమీద కూర్చుని వికవిక నవ్వుతూ ఉండే వాడట వెంగళరెడ్డి!

బుడ్డా వెంగళరెడ్డిగారు చెంగావి పంచెలు సింగారించుకొని, గుర్రమెక్కి-చెన్నపట్టణం వెడితే, ఆ పట్టణంలోని సాహెబు దొరలు, ఇన్స్పెక్టర్లు, పోలీసుజవాన్లు, వెంగళరెడ్డిగారికి-

**సాబు సలాములు సేసిరయా!**
**వొంగొంగి సలాములు సేసిరయా!!**

రాయలసీమ దానకర్ణుడైన బుడ్డా వెంగళరెడ్డిగారు ఎన్నిరకాల దానాలు చేశారో తెలుపుతూ ఈ పాటలో ఒకచోట ఇలా ఉంది

హరినారాయణ అన్నవారికీ – అన్నవస్త్రము లిప్పించెనయా!
గోయిందాయని పాడే జనులకు – గోవుదానమే చేసెనయా!
పాలు లేని పసిబాలురకెల్లా – పాల సలేంద్రలు పెట్టెనయా!
పెళ్ళిళ్ళుకానీ బీదజనులకూ – పెళ్ళిళ్ళే సేయించెనయా
కాలులేని కరమొండి వాళ్ళకూ – ఒంటెద్దు బళ్ళు సేయించెనయా
కుంటివాళ్ళకూ గుడ్డివాళ్లకూ – ఈడూ జోడూ మనుములు సూసీ
పెళ్లిళ్లే సేయించెనయా – పెళ్లిళ్లే సేయించెనయా!
పుణ్యం సేసిన యెంగళరెడ్డికి – పూలపానుపే వచ్చునయా!
మాటా సాచ్చం తెలిసిన ప్రెబువని – మల్లెపూల పాన్పేతురయా!!

ఉయ్యాలవాడలో ఉన్న వెంగళరెడ్డిగారి వంశస్థుల దగ్గర ఈనాటికీ ఈ దాతృత్వ గుణం కనబడుతుంది ప్రతి సంవత్సరమూ ఉగాది పండుగనాడు వెంగళరెడ్డిగారి సమాధి దగ్గర కుంటివారికి గ్రుడ్డివారికి పంచభక్ష్య పరమాన్నాలతో గొప్ప అన్నదానం జరుగుతుంది ఈ అపూర్వమైన అన్నదానాన్ని వెంగళరెడ్డిగారి వంశస్థులే నిర్వహిస్తారు బస్తాలకొద్దీ బియ్యం వండి అన్నం రాసులుగా పోస్తారు దేశం నలుమూలలనుంచీ వేలాదిగా బిచ్చగాళ్ళు ఉయ్యాలవాడకు చేరుతారు ఈ బిచ్చగాళ్లందరూ భోజనం చేయడానికి ముందు బుడ్డా వెంగళరెడ్డిగారికి విక్టోరియా మహారాణి యిచ్చిన స్వర్ణపతకాన్ని కళ్ళకు అద్దుకుంటారు గ్రుడ్డి వాళ్ళుకూడా పతకాన్ని చేతులతో తడిమి ఆ చేతుల్ని కళ్లకు అద్దుకుంటారు ఈ పని చేయకుండా ఒక్క బిచ్చగాడైనా ముద్దయెత్తడు! ఈ దానకర్ణుడు యశ కాయు డనడంలో ఇంక సందేహమేముంది?

బుడ్డా వెంగళరెడ్డిగారు ఎప్పుడూ పేదలకు అన్నదానమే చేసేవాడు కాని ధనదానం చేసేవాడు కాడు మానవుని ప్రాణాలను నిలిపేది పరబ్రహ్మస్వరూపమైన అన్నమే అని ఆయన నమ్మకం అందుచేత ప్రాణాధారమైన అన్నాన్నే దానం చేసేవాడు ఒకవేళ ఎప్పుడైనా బిచ్చగాడికి డబ్బిస్తే ఒక్క దమ్మిడీ మాత్రమే యిచ్చేవాడు అందువల్ల కొందరు బిచ్చగాళ్లు

బుడ్డా యెంగళరెడ్డీ దమ్మీడి దమ్మీడి!
ఎన్నాళ్లు బతికినా దమ్మీడి దమ్మీడి !!– అని పాడేవారు

వెంగళరెడ్డిగారి జీవితమంతా సమగ్రంగా చిత్రిస్తూ 'బందుమియ్యా' అనే ముస్లిముకవి చక్కని ద్విపద కావ్యాన్ని రచించాడు. అది అముద్రితం. ఈ బందుమియ్యా బుడ్డా వెంగళరెడ్డిగారికి సమకాలికుడు. ఇతడు ముక్కమళ్ల గ్రామస్థుడు. (ఈ కావ్యాన్ని ఇప్పుడు ఈ గ్రంథంలో అనుబంధంగా ముద్రించాను).

నంద్యాలకు చెందిన శ్రీ మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (కవితా సామ్రాజ్యము) బుడ్డా వెంగళరెడ్డిగారి జీవిత చరిత్రను వచన గ్రంథంగా వ్రాశారు.

శ్రీ వెంపోగారు వెంగళరెడ్డిగారి చరిత్రను బుర్రకథగా రచించారు.

ఈ రేనాటి సూర్యచంద్రులను ప్రశంసిస్తూ ఉయ్యాలవాడ గ్రామానికి చెందిన ''పాణ్యం సోదరకవులు'' (పాణ్యం నరసరామయ్యగారు, పాణ్యం లక్ష్మీనరసయ్యగారు లేక గుండయ్యగారు) చెప్పిన రెండు పద్యాలతో నా వ్యాసాన్ని ముగిస్తున్నాను.

**ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గురించి:**

**అమితప్రాభవ సర్వసైన్యసముపేతాంగ్లేయ సామ్రాజ్య సిం**
**హము మీసల్ నులివెట్టి లాగుచు, నుదగ్రాటోప వీరోచితో**
**ద్యమ సంరంభమొనర్చి నట్టి, 'నరసింహారెడ్డి' కాస్థాన రం**
**గముగా, భూరి యశంబుఁగాంచినది, యీ గ్రామంబు పూర్వంబునన్.**

**బుడ్డా వెంగళరెడ్డిని గురించి:**

**కలియుగ దానకర్ణుఁడనఁగా నుతికెక్కుచు, నాంగ్లరాజ్ఞి చేఁ**
**గలిత యశస్సువర్ణ పతకంబు బహూకృతి పొందినట్టి, య**
**య్యలఘుఁ డుదారశీల మహితాత్ముఁడు, వేంగళరెడ్డిగారికిన్,**
**సులలిత జన్మభూమియగుచున్, గణనీయతగాంచె మీఁదటన్.**

(ఆకాశవాణి కడప కేంద్రంనుండి 1993లోను, 1995లోను ప్రసారమైన రెండు ప్రసంగాలను కలిపి సిద్ధం చేసిన వ్యాసం)

# రెండవ అధ్యాయము

# 'రాయలసీమ వీరసింహము'

# ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ

దేశికవితాప్రియు లింతవఱకును గుర్తింపని ఉత్తమ చారిత్రక వీరగాథలలో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ యొకటి రాయలసీమలో కడప కర్నూలు మండలములలో దీనికి గొప్ప ప్రచారమున్నది

నారసింహారెడ్డి పందొమ్మిదవ శతాబ్ది మధ్య భాగమున రేనాటిసీమనేలిన మహావీరుఁడు ఇతఁడు నొస్సం కోటను బాలించిన చెంచుమల్ల జయరామిరెడ్డి మనుమఁడును దత్తపుత్రుఁడునునని తెలియుచున్నది కడప కర్నూలు అనంతపురము బళ్లారి మండలములలో నలువది యాఱు గ్రామముల కధిపతి నారసింహారెడ్డి రూపనగుడి ఉయ్యాలవాడ ఉప్పులూరు గుళ్లదుర్తి గిద్దలూరు మున్నగు గ్రామములలో నితడు నిర్మించిన కోటలు నగరులు నేఁటికిని గలవు ఉప్పులూరు సంస్థానాధీశులగు ప్యారావారు నారసింహారెడ్డి మూలపురుషులని రేనాటి సీమలోని పెద్దల వలనఁ దెలియుచున్నది కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా చెలిమళ్ల రుద్రవర మను గ్రామములో నారసింహారెడ్డి వంశీకులను గొలిచెడి ఎచ్చుగుంట్లున్నారు వీరికడ నాకు లభించిన యొక వంశవృక్షములోఁగూడ నారసింహారెడ్డి మూలపురుషులు ప్యారా [1] వారనియే యున్నది ( ప్యారా లక్ష్మిరెడ్డి మూలపురుషుఁడు) కావున నీతని యింటిపేరు ప్యారావారై యుండవలెను ప్యారావారిది సగునాల గోత్రము కాని నారసింహారెడ్డిపై పిచ్చుకుంట్లు పాడుచున్న యొక లఘువీరగాథ (Balladling) లో నితని యింటిపేరు మద్దెలవారు అనియుఁ దండ్రిపేరు పెద్దిరెడ్డి యనియుఁ దాతపేరు జయరామిరెడ్డి యనియుఁ గలదు

*1 ప్యారా శబ్దములోని ప్యా అనుదానిలో పే పా అనువానికి మధ్యగల ధ్వని వినఁబడు చున్నది ( ఏ ఆ లకు బధ్య ధ్వని తాటాకు శబ్దములోని టా వంటిది ) ఏ ఆ లకు మధ్యగల యీ ధ్వనిని భాషా శాస్త్రజ్ఞులు æ అను గుర్తుతో సూచింతురు బ్యాంకు శబ్దములోని బ్యా లో కూడా నిట్టి ధ్వనియే యున్నది*

**తండ్రిపేరే పెద్దిరెడ్డి – తాతపేర్ జయరామిరెడ్డి**
**ఇంటి పేరే మద్దెలోళ్లు – తానపేర్ నరసింహారెడ్డి**
**వొహువా! నరసింహారెడ్డీ! నీ పేరంటే – రాజా నరసింహారెడ్డి![2]**

ఇతడు 'రూపనగుడి' గ్రామములోఁ బుట్టెననియు, 'ఉయ్యాలవాడ'లోఁ బెరిగెననియుఁ, బాలు అన్నము తినినది 'గుళ్లదుర్తి' గ్రామమనియు నీ వీరగాథానికలోఁ గలదు. ఉయ్యాలవాడలోఁ బెరిగి పెద్దవాఁడగుటచేఁ గాఁబోలును నితనికి 'ఉయ్యాలవాడ నారసింహారెడ్డి' యని పేరు వచ్చినది. ఇతఁడు రెడ్లలో మోటాటి వంశమునకుఁ జెందినవాఁడు. మోటాటిరెడ్లలోఁగూడ వీరిది రాజవంశము. (మామూలు మోటాటి రెడ్లకును వీరికిని సంబంధములేదు). అందుచే వీరిని 'దొరవారు' అని పిలుతురు. వేఱొక కోలాటపుకోపులో నితఁడు 'దొరవారి నరసింహ్వారెడ్డీ!' అని సంబోధింపఁబడినాడు. నారసింహారెడ్డి వంశీకులు 'నగరి' (కోట)లో నివసించుటచే వీరిని 'నగరివారు' అనియుఁ బిలుతురు. అఱువదియాఱు గ్రామముల కధిపతులగు వీరిని 'జమేదారులు' అందురు.

నారసింహారెడ్డి తాతయగు జయరామిరెడ్డి కాలములోనే, అనఁగా క్రీ.శ. 1800లోనే ఆంగ్లేయులీ 'నొస్సం' సంస్థానమును లోబఱుచుకొని, యీ రాజవంశమువారికి నెలకుఁ బదునొకండు రూపాయలు 'తవర్జీ' (భరణము) నేర్పాటు చేసిరి. (ఆంగ్లేయు లెంతటి దురాశాపరులో తెలిసికొనుటకీ యుదాహరణము చాలును. అఱువదియాఱు గ్రామముల కధిపతులగు జమేదారులకు నెలకు, బదునొకండు రూపాయల భరణమఁట!). క్రీ.శ. 1845 వఱకును నీ తవర్జీ ఉయ్యాలవాడలో నున్న నారసింహారెడ్డికి వచ్చుచుండెను. ఆ సంవత్సరము నారసింహారెడ్డి తనకు రావలసిన తవర్జీ కొఱకై కోవెలకుంట్ల (కోయిలకుంట్ల) తహశీల్‌దారు కడకుఁ దన భటుని పంపెను. (తన కుమారుఁడగు 'దొరసుబ్బయ్య'ను బంపెనని మఱికొందఱు తెల్పుదురు.) తహశీల్దార్ తవర్జీ నీయ కుండుటయేకాక నారసింహారెడ్డిని దుర్భాషలాడినాఁడు[3].''

---

*2. కర్నూలు జిల్లా, నందికొట్కూరు తాలూకా, చెలిమిళ్ల రుద్రవరములో 21-4-1966న పిచ్చుకుంట్ల చిన్ననాగన్న పాడినపాట.*

*3. కోవెలకుంట్ల తహశీల్దారునకు నారసింహారెడ్డి యనిన పడదట. రేనాటిసీమలోని వృద్ధులు దీనికొక కారణమును దెల్పుచున్నారు. తహశీల్దారునకు కోవెలకుంట్లలోనొక వేశ్య యున్నదఁట. ఆ వేశ్యకడకే నారసింహారెడ్డి కూడ పోవుచుండెనఁట. అందుచేత తహశీల్దారునకు రెడ్డిపై నీర్ష్యాద్వేషములు పెచ్చుపెరిగెను.*

ఆ నరసింహ దాసరి[4] క్రింద మఱియొక దాసరియా? ఆ నరసింహదాసరినే రమ్మనుము పొమ్ము అని భటునికడ నీసడించెనఁట ఆ భటుఁడు ఉయ్యాలవాడకుఁబోయి నారసింహారెడ్డితో జరిగిన సంగతి చెప్పెను అది విని నారసింహారెడ్డి దండతాడిత భుజంగమైనాఁడు అట్టి యవమానమును భరించుటకన్నఁ జచ్చుట మేలని నిశ్చయించుకొనినాఁడు రేపు మధ్యాహ్నము పండ్రెండుగంటలకు నరసింహ దాసరియే నీ కడకు వచ్చును కాచుకొనుము! అని అదే సేవకునిచే తహశిల్దారునకుఁ గబురువెట్టెను

రెడ్డి మఱునాఁడయిదువందలమంది బోయసైన్యమును దీసికొని పట్టపగలు కోవెలకుంట్ల పట్టణముపై దండెత్తెను తహశీల్దారుని బట్టి తలగొట్టి ధనాగారముకడనున్న బొందెలవాఁడు వారసింగు[5]ను జంపి దానిని దోచుకొని కచేరీ నంతయు ధ్వంసముచేసి తహశీల్దారు శిరస్సును వారసింగు శిరస్సును దెచ్చి నొస్సం దగ్గరనున్న నయనాలప్పకొండ లో గల యొక శివాలయమున గుహలో దాచినాఁడు

కడపలోనున్న కలెక్టరుకును పోలీసు సూపరింటెండెంటుకును నీ హత్యావిషయము తెలిసి అన్వేషణ ప్రారంభించిరి ఉయ్యాలవాడలోని నారసింహారెడ్డి కడకు వచ్చి కోవెలకుంట్లలో జరిగిన హత్యను గుఱించి అతనినే ప్రశ్నించిరి (ఒక ప్రాంతమున నొకనేరము జరిగినప్పుడు ఆ ప్రాంతములోని పాళెగాండ్ర సహాయమును దీసికొనుట ఆంగ్లేయుల రాజనీతి) నారసింహారెడ్డి తనకేమియుఁ దెలియదనియు బహుశ ఔకురాజులు నీ పనిని జేసియుందురనియుఁ దెల్పెను అందుచే నాంగ్లేయులు ఔకురాజగు నంద్యాల నారాయణరాజుగారిని వారి బంధువును చిట్వేలి తవర్జీదారుఁడునునగు నంద్యాల వేంకట రామరాజుగారిని బంధించి కారాగారములో నుంచిరి

అపరాధపరిశోధకులు పరిశీలన ప్రారంభించి నయనాలప్ప కొండలోఁ గల శిరస్సులను గనుగొనిరి నారసింహారెడ్డి అనుచరులగు గోసాయి వెంకన్న ఒడ్డె ఓబన్న అనువారలను బంధించి సత్యమును గనుగొనిరి నారసింహారెడ్డిని బంధించుటకుఁ గొందఱు పోలీసులను ఉయ్యాలవాడకుఁ బంపిరి వారు నారసింహారెడ్డిని

4 నారసింహారెడ్డి గొప్ప విష్ణుభక్తుడు నుదుటిపై పెద్దతిరుమణి తీర్చిదిద్దుకొనెడివాడు

5 ఈ బొందెలవానిపేరు హరిసింగ్ అని కలవటాల జయరామారావుగారు రచించిన రేనాటి వీరుఁడు నవల (1925)లోఁగలదు కాని నాకు లభించిన ఒక వీరగాథానికలో ట్రెజరీకడనున్న బొందెలవాఁడు వారసింగు అని యున్నది

బట్టుకొనుటకు బదులుగా నతనిచే దన్నులుతిని శిక్షింపఁబడి ప్రాణములతో బయట పడిరి పోలీసువారు నారసింహారెడ్డిని బట్టుకొనుటకు భయపడుచుండిరి బ్రిటిషువారు 1846లో నారసింహారెడ్డి పైకి సైన్యమును బంపరి నొస్సము దగ్గఱ దానినాతఁడోడించెను అందుచే 1847లో నాంగ్లేయులు లెఫ్టినెంట్ వాట్సన్ (Lt Watson) అను గొప్పసేనాని నాయకత్వమున నసంఖ్యాకమైన సేనావాహినితో నారసింహారెడ్డి నణచుటకు నిశ్చయించిరి నారసింహారెడ్డియు వేలకొలఁది సైన్యములకను సమకూర్చుకొని గిద్దలూరు దగ్గఱ వాట్సన్‌తో ఘోర యుద్ధము చేసెను రెడ్డి సైన్యమంతయు నష్టము కాఁగా నల్లమల కొండలలోనికిఁ దప్పించుకొని పోయెను అటనుండి ఎఱ్ఱమలలోనికిఁ బాఱిపోయెను ఆంగ్లేయు లాతనిని బట్టుట కెన్నియో ప్రయత్నములు చేసిరి కాని ఫలించలేదు

కొంతకాలము గడచెను నారసింహారెడ్డి జగన్నాథపురము కొండ పై[6] నుండెను అతనికడ నొక వంటమనిషి[7] యుండెను బ్రిటిషు వారామెకు లంచమిచ్చి నారసింహారెడ్డిని బట్టుకొనిరి ఆ వంటమనిషి నారసింహారెడ్డికి విపరీతముగా సారాయి పట్టించి ఆతని తుపాకిలో నీళ్ళుపోసి యుంచినదఁట నారసింహారెడ్డిని బంధించి కోవెలకుంట్లకుఁ దెచ్చి జుఱ్ఱేటియొడ్డున నురితీసిరి

ఇట్లు భారతదేశమున స్వాతంత్ర్యమునకై మానధనమును గాపాడుకొనుటకై ఆంగ్లేయులతోఁ బోరాడిన మొట్టమొదటి వీరుఁడు నారసింహారెడ్డి ఇతఁడు భారత ప్రథమ స్వాతంత్ర్య సమరముకన్నఁ బది సంవత్సరములు ముందుగనే ఆంగ్లేయులను ఢీకొన్న వీరశిఖామణి! ఇతఁడీ యుద్ధమును క్రీ శ 1846 47 సంవత్సరములలో జరిపినాఁడని ఆంగ్లేయులు వ్రాసికొనిన రాష్ట్రపరిపాలనా చరిత్రలనుబట్టియు మాండలిక చరిత్రలనుబట్టియుఁ దెలియుచున్నది మద్రాసురాష్ట్రపాలనాచరిత్ర రెండవ సంపుటములో నారసింహారెడ్డి కావించిన విప్లవము క్రీ శ 1846లో జరిగినట్లున్నది

In 1846 a descendant of the dispossessed poligars of Nossam dissatisfied with the pension he received attempted

6 కోవెలకుంట్ల నుండి పేరుసోమల పోవు మార్గములో నున్నది

7 ఈమె వంటమనిషి కాదనియు నారసింహారెడ్డి ఉంపుడుకత్తెయనియు నీమె స్వగ్రామము గొల్లవిండ్లపల్లె యనియుఁ గొందఱు చెప్పుచున్నారు నాకు లభించిన వీరగాథలో నీమె ఉంపుడుకత్తెగానే యున్నది పేరు జానకమ్మ యని గలదు ఈ పేరు యథార్థమైనదో లేక గాథాకారుఁడు కల్పించినదేమో తెలియదు

to excite a general rebellion and collected on the frontiers two forces of several thousand men Each was promptly defeated by British detachments and before the end of the year quiet was completely restored Since that time no event of historical importance has occured [8]

బ్రిటిషువారు వ్రాసికొన్న యీ వ్రాఁతలను బట్టి నారసింహారెడ్డి విప్లవము చిన్నదికాదనియు వేలకొలది సైన్యములను సమకూర్చుకొని అతఁడు క్రీ శ 1846లోనే రెండు పర్యాయములాంగ్లేయుల నెదిరించెననియు విశదమగుచున్నది పై గ్రంధములోనే 1846వ సంవత్సరమునుగూర్చి మరియొక పుటలో నిట్లున్నది

1846 Serious disturbances in the Cuddapah district Troops sent to put them down [9]

మద్రాసురాష్ట్ర పరిపాలనా చరిత్ర మూఁడవ సంపుటములో నారసింహారెడ్డి విప్లవము క్రీ శ 1847లో జరిగినట్లున్నది ఇందు ఉయ్యాలవాడ గ్రామచరిత్రను వ్రాయుచు నారసింహారెడ్డి విప్లవమును అతఁడు లెఫ్టినెంట్ వాట్సన్ తో గిద్దలూరు కడ చేసిన యుద్ధము పేరుసోముల యను గ్రామము నొద్దఁ బట్టుబడుట ఉరితీయఁబడుట మొదలగునవి మాత్రమేకాక మఱియొక క్రొత్తవిషయము కూడ నిందుఁ జెప్పఁబడినది ఉరితీయఁబడిన నారసింహారెడ్డి శిరస్సును బ్రిటిషువారు కోవెలకుంట్ల కోటలో నురికంబముపై 1877 వఱకును వ్రేలాడదీసి యుంచిరఁట! భారతీయుల స్వాతంత్ర్యేచ్ఛను బ్రిటిషు వారెంత క్రూరముగా నణచివేసిరో దీనినిబట్టి గుర్తింపవచ్చును

Ooyyalavanda In 1847 a disturbance was caused by Narasimha Reddy pensioned poligar of this place and grandson of Jayaram Reddy the last powerful Zamindar of Nossam He unsuccessfully attacked Coilcoontla treasury and sheltered himself in hill forests of Yerramalas and Nullamullays At Giddalore he gave battle to Leiutenent Watson and killed the Tahsildar of Cumbum He then escaped into the Nullamullays and was subsequently captured near

8 *Mannual of the administration of the Madras Presidency Volume II P75*

9 *Ibid P 265* నారసింహారెడ్డి కాలమున నేఁటి కర్నూలుజిల్లాలోని కోవెలకుంట్ల ప్రాంతమంతయు కడపజిల్లాలో నుండెడిది

Perusomala in Koilkoontla talook and hanged His head was kept hung in the fort on the gibbet till 1877[10]

నారసింహారెడ్డి శిరస్సును కోటలో ఉరికొయ్య వ్రేలాడగట్టిన విషయము దొరవారి నరసింహ్వారెడ్డి! నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి! అను లఘువీరగాథ కోలాటపుకోపులోఁ గూడఁ దెలుపఁ బడినది ఈ పాటలో ఉరికొయ్య కు బదులుగా కోట బురుజు అని చెప్పబడినది

'కండ్లకూ గంతాలు గట్టీ నోటినిండా బట్లు పెట్టీ
నిలువునా నీ తలా గొట్టీ కోట బురుజుకు గట్టిరీ'[11]

26 11 1850లో కడపజిల్లా చిట్టివేల్ తాలూకా తవర్జీదారుఁడైన నంద్యాల వేంకటరామరాజుగారు రెవిన్యూబోర్డువారికి వ్రాసిన లేఖలో నారసింహారెడ్డి విప్లవము పరాభవనామ సంవత్సరము క్రీ శ 1845లో జరిగినదని కలదు[12] అనఁగా నారసింహారెడ్డి తిరుగుబాటు క్రీ శ 1845 1846 1847 - ఈ మూడు సంవత్సరములలోను జరిగినదని నిశ్చయింపవలసి యున్నది 1845లో నితఁడు కోవెలకుంట్ల పై దండెత్తి తహసిల్‌దారును జంపయుండును ఆ నేరము ఔకురాజులపై మోపఁగా బ్రిటిషువారు ఔకురాజులను ఖైదుజేసినదియు నీ సంవత్సరమే దీనికిఁ బైన దెల్పిన లేఖయందే ప్రమాణమున్నది 1846లో నారసింహారెడ్డి వేలకొలఁది సైన్యములను సమీకరించుకొని రెండు పర్యాయము లాంగ్లేయులతోఁ బోరాడెను మరల 1847లో గిద్దలూరు దగ్గఱ లెఫ్టినెంట్ వాట్సన్‌తో ఘోరయుద్ధముచేసి నల్లమల అరణ్యములలోనికిఁ దప్పించుకొనెను ఆ సంవత్సరమే పట్టుబడి ఉరి తీయఁబడెను

ఈ నారసింహారెడ్డిని గూర్చిన చారిత్రక విషయముల నాధారముగాఁ జేసికొని 1925వ సంవత్సరములో శ్రీ కలవటాల జయరామారావుగారు రేనాటివీరుఁడు అను నవలను రచించి ప్రకటించిరి ఇందు సత్యముతోఁబాటు కొంత కల్పనయు జోడింపఁబడియున్నది

ఉయ్యాలవాడ నారసింహారెడ్డికడ ఓబళాచార్యుఁడు అను నాస్థానకవి యుండెనని తెలియుచున్నది ఈ యోబళాచార్యునకును నాకాలమున కర్నూలుమండలమునఁ బ్రసిద్ధికెక్కిన కృష్టిపాటి వేంకటకవికిని సఖ్యమునిమిత్తమై

*10 Mannual of the administration of the Madras Presidency Volume III P251*

*11 త్రివేణి పుట 270*

*12 రేనాటి వీరుఁడు పుటలు 104 106*

సంభాషణాత్మకముగా జరిగిన రెండు పద్యములను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ చాటుపద్యమణిమంజరిలో నిచ్చియున్నారు[13] అందు వేటూరివారు వేంకట సుబ్బకవిని గూర్చి వ్రాయుచు ఈయన కర్నూలు మండలవాస ఇప్పటికి డెబ్బదియేండ్లకు పూర్వమున్నవాడు అనిరి దీనినిబట్టి కూడ నారసింహారెడ్డి కాలము నూహింపవచ్చును ఈ చాటుపద్య మణిమంజరి దుందుభి జ్యేష్ఠము న ప్రకటింపబడినది అనగా క్రీ శ 1923 ముద్రింపబడునాటికి రెండు మూడేండ్ల క్రిందటనే శాస్త్రిగారీ పద్యములను సంపాదించి పరిష్కరించి యుందురు అనగా 1920 ప్రాంతమున నీ మాటలను శాస్త్రిగారు వ్రాసి యుందురని తలంపవచ్చును అప్పటికి డెబ్బదియేండ్ల పూర్వమనగా క్రీ శ 1850 ప్రాంతమగుచున్నది ఇది వేంకటసుబ్బకవికాలము ఇదియే నారసింహారెడ్డి యాస్థానకవియగు నోబళాచార్యుని కాలముగూడ ఆస్థానకవి 1850 ప్రాంతము వాడు కాగా తత్పోషకుడు 1847 ప్రాంతమున నుండుటలో విప్రతిపత్తిలేదు డాక్టర్ తూమాటి దొణప్పగారు తాము సేకరించిన కోలాటపుపాటకు వ్రాసిన లఘువివరణములో నారసింహారెడ్డి సంఘటన క్రీ శ 1800 1825 నాటిదని తెల్పిరి[14] ఇది ప్రామాదికము ఈ నారసింహారెడ్డి విప్లవము క్రీ శ 1845 47 మధ్యకాలమున జరిగినది నాటి యాంగ్లపాలకులే దీనిని గ్రంథస్థము చేసియున్నారు

ఈ నారసింహారెడ్డి పై ప్రజలలో రెండు వీరగాథానికలును నొక వీరగాథయు వ్యాప్తియందున్నవి దొరవారి నరసింహ్వారెడ్డి! నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి అను కోలాటపు పాటను డాక్టరు తూమాటి దొణప్పగారు అనంతపుర మండలమున సంపాదించిరి (చూ త్రివేణి పుటలు 270 271) వాహువా! నరసింహారెడ్డీ! నీ పేరంటే రాజా నరసింహారెడ్డీ! అను ఎచ్చుకుంట్ల పాటను నేను 1966లో కర్నూలు మండలమున సేకరించితిని ఈ రెండును లఘువీరగాథలు ఇవికాక బొబ్బిలిపాట వరుసలోనున్న పెద్దవీరగాథయు నొకటి కలదు దీనిని నేను కడపమండలమున ప్రొద్దుటూరు తాలూకా అయ్యవారిపల్లెలో నొక జంగమునుండి సేకరించితిని (15 3 1966) ఈ వీరగాథలో పైన దెల్పిన చారిత్రక నామములు లేకున్నను కథయంతము నొకటి రెండు స్వల్పభేదములతో నట్లేయున్నది దీని ప్రారంభమిట్లున్నది

*13 చూ చాటుపద్య మణిమంజరి రెండవ భాగము పుటలు 133 134*

*14 చూ త్రివేణి పుట 270*

రామరామ రఘురామ రామయ్యా, రామయ రఘురామా!
రెడ్డికాదు బంగారపు కడ్డీ నారసింహారెడ్డీ – నాయన
పుట్టిందీ మా గుళ్లదుర్తిలో నారసింహారెడ్డీ –
వచ్చిందీ ఆ రూపనగుడికి నారసింహారెడ్డీ–
నరిసిరెడ్డి ఇంటికి నేడూ దత్తు కొచ్చినాడూ–

నారసింహారెడ్డి రూపనగుడి గ్రామములోనేయుండి ఉయ్యాల వాడకుఁబోయి వచ్చుచుండెననియు నుయ్యాలవాడ గ్రామకక్షలలో నొక హత్య జరిగినపుడు తహశిల్దారునకును నారసింహారెడ్డికిని వాగ్వాదము జరిగెననియు నుయ్యాలవాడ గ్రామములోనే తహశిల్దారు రెడ్డి నవమానించెననియు నిందుఁ జెప్పబడినది నారసింహారెడ్డి తవర్జీకొఱకుఁ దన సేవకుని కోవెలకుంట్లకుఁ బంపిన విషయ మీ కథలోలేదు

నారసింహారెడ్డి కోవెలకుంట్ల పై దండెత్తినప్పుడు తహశిల్దారును ధనాగారమును గాపాడుచుండిన వారసంగు ను మాత్రమే చంపినాఁడు తాలూకా కచ్చేరీని ధ్వంసము చేసినాఁడు ఇది చారిత్రక సత్యము కాని యీ వీరగాధలో నారసింహారెడ్డి కోవెలకుంట్ల నంతటిని కొల్లగొట్టినట్లు చెప్పఁబడినది హుసేన్ అను పఠాను వీరునితోఁ గూడ నారసింహారెడ్డి యుద్ధము చేసినట్లు వర్ణింపఁబడినది తహశిల్దారుని పేరు వీరగాధలో జిలేదారుడు అని యున్నది జిల్లా అధికారి యని దీని కర్థము కాఁబోలు నారసింహారెడ్డి తహశిల్దారు శిరస్సును బొందిలివాఁడైన వారసంగు శిరస్సును నఱికి రెండు శిరస్సులను నయనాలప్ప కొండ లో దాచెనని జనశ్రుతి నేను సేకరించిన పిచ్చుకుంట్ల పాటలోఁగూడ నీ విషయమున్నది కాని వీరగాధలో నీ వృత్తాంతము లేదు తాసిల్దారును జంపినట్లు మాత్రమే కలదు శిరస్సు దాచినట్లు లేదు

గిద్దలూరు దగ్గఱ లెఫ్టినెంట్ వాట్సన్‌తో నారసింహారెడ్డి యుద్ధము చేసెను కాని వీరగాధలో నా యుద్ధము జగన్నాథము కొండదగ్గఱ జరిగినట్లు వర్ణింపఁబడినది ఈ జాతి సైన్యము బళ్ళారినుండి వచ్చినదని గాధాకారుఁడు పాడుచున్నాఁడు ఈ జగన్నాథముకొండకు దిగువన గొల్లవిండ్లపల్లె యను గ్రామ మున్నదనియు నా గ్రామములో జానకమ్మ యను వనిత కలదనియు నీమెకును నారసింహారెడ్డికిని సంబంధమున్నదనియు నాంగ్లేయులీమెకు లంచమిచ్చి నారసింహారెడ్డిని బట్టిరనియు

వీరగాధలోఁ గలదు కాని నారసింహారెడ్డి దగ్గఱ నొక వంటమనిషి యుండెడిదనియు నామె మూలకముగనే ఆంగ్లేయులాతనిని బట్టిరనియు జనశ్రుతి ఆ వంటమనిషి పేరు తెలియదు ఈమె ఉయ్యాలవాడ గ్రామమునకుఁ జెందినదనియు తెలగు (బెస్త) కులములో పుట్టినదనియు తెలియుచున్నది ఎచ్చుకుంట్ల కడనున్న వంశవృక్షములో నారసింహారెడ్డి భార్యపేరు (ఎ)ద్దమ్మ అనియు నాతని తల్లి పేరు సీతమ్మ యనియుఁ గలదు భార్యపేరులో మొదటి యక్షరము సరిగాఁ దెలియుటలేదు అది పెద్దమ్మ కావచ్చును లేదా ఎద్దమ్మ కావచ్చును నారసింహారెడ్డికి బొజ్జయ్య అను తమ్ముఁడును దొరసుబ్బయ్య అను పుత్రుఁడును నుండినట్లు రేనాటి గ్రామవృద్ధులు చెప్పుచున్నారు

నారసింహారెడ్డిది బోయసైన్యము దీనిని సుంకేశల ముక్కమళ్ల ముదిగోడు కానాల సంజామల కొండకరటాల యను గ్రామములనుండి సమకూర్చినాఁడట కఱవుకాటకములు వచ్చినప్పుడు నారసింహారెడ్డి యీబోయలను మిక్కిలి యాదరించెడివాఁడఁట ఆ కృతజ్ఞతచే వారందఱును రెడ్డి పిలిచిన వెంటనే ఆయుధపాణులై ఆనందముతో వచ్చిరి

'కరువు వొచ్చినా కాలమొచ్చినా ఆదరించె రెడ్డీ
అట్టి వక్క మనరెడ్డి మాటలూ చిన్నచెయ్యరాదు
నాలుగు గ్రామాలమందిగా తాము లేచినారు
మూడుమూర్లకూ ముకుందబల్లెం మురవకలేచిందీ
ఆరు మూర్లకూ అలుగు ఈటెలే అదలక లేచినవీ

ఈబోయ సైన్యమునకు ఎల్లాపుల రాణువ అనిపేరు ఈసైన్యమును వెంటఁ బెట్టుకొని నారసింహారెడ్డి కోవెలకుంట్ల పైకి దండెత్తఁగాఁ బ్రజలు హడలెత్తిపోయిరి ఇతఁడు కోవెలకుంట్లను గొల్లగొట్టుట అక్కడ నాంగ్ల ప్రభుత్వము వారితో నితఁడు కావించిన యుద్ధము వీరరసస్ఫూర్తితో వర్ణింపబడినది

అడిగోవచ్చే ఇడిగోవచ్చే నారసింహారెడ్డీ
పళపళ పళపళ కేకలేసెరా నారసింహారెడ్డీ
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డీ
కోబలీ రణబలీ యన్నడే నారసింహారెడ్డీ
ఆవుల మందలో పులీ దుమికినా చందము దుమికినడూ

రెడ్డియెక్కినా గుఱ్ఱము లమిడీ ఏ విధమొచ్చినదీ?
కుప్పిటి గంతులమీద వచ్చెరా బారా హజ్జారీ
వచ్చిన వక్కా సైన్యము అంతా ముందుకు దుమికినది
వంచినట్టి బల్లెములపైననూ వాలలాడుతారు
సాన జేసినా కత్తుల మిందా సవకళించినారు
అరవై వొక్కా తుపాకులండీ ఫెళ ఫెళ వాగినవి
విరగ నరుకుతా పోతాడయ్యా నారసింహారెడ్డీ
తాటి పుచ్చెలా చందము నేడు తలలే పోతావి

ఆలగోడురా బాలగోడురా కొయిల్ కుంట్లలోన
ఎక్కడ చూచిన పీనుగు పెంటలు కొయిల్ కుంట్లలోన

కోవెలకుంట్ల నీ విధముగాఁ గొల్లకొట్టు చుండఁగా హుసేన్ అను పఠానువీరుఁడు రెడ్డినెదిరించెను (లఘు వీరగాథలో వారసింగు అను బొందిలివాఁడు నారసింహారెడ్డి నెదిరించినట్లున్నది) మొదట హుసేన్ వ్రేటు నడిపినాఁడు [15] నారసింహారెడ్డి తన శరీరమంతయు డాలుచాటునఁబెట్టి ఆ వ్రేటునుండి తప్పించుకొనెను తరువాతఁ తన వ్రేటు నడపుచు

పటపట పటపట పండ్లు కొరికెరా నారసింహారెడ్డి
తెల్లనికళ్ళకు రకతము దింపెను నారసింహారెడ్డి
కుడీలొడ్డును తానుగొట్టెరా నారసింహారెడ్డి
మొలకమీసము గోటదీటెరా నారసింహారెడ్డి

ఇట్లు నారసింహారెడ్డి విజృంభించి చేతి చంద్రాయుధమును గిరగిర త్రిప్పి శక్తి కొలఁదిని గొట్టఁగా హుస్సేన్ శిరస్సు పుట్టచెండువలె నెగిరిపడినదఁట! తరువాత

*15* జానపదులలో ఏటునడుపు అను విచిత్ర ప్రయోగమొకటి వాడుకలోనున్నది ఆంగ్లమునఁగల *attack* లేదా *offence* అను మాటలకిది సమానార్థకము ఒక వీరుఁడు ముందు *attack* చేయును ఆ విజృంభణమునుండి రెండవ వీరుఁడు తన్ను రక్షించు కొనును దీనిని *defence* అందురు తరువాత రెండవ వీరుడు తన ఏటు నడుపు ను అప్పుడు మొదటి వీరుఁడు దానిని దప్పించుకొనుటకుఁ బ్రయత్నించును ద్వంద్వయుద్ధ మెప్పుడును నిట్లే జరుగును ఫుట్‌బాల్ వంటి ఆటలలోఁగూడ నిట్టి పరస్పర విజృంభణ పరిరక్షణములను దిలకింప వచ్చును

నారసింహారెడ్డి జిలేదారుని కడకుఁబోయి అప్పుడన్నమాట లిప్పుడు పలుకుము? అని బెదరించి ఆతనిపై నెట్లు పగదీర్చుకొనెనో చూడుఁడు

పళపళ పళపళ కేకలేసెనే నారసింహారెడ్డి
రాజారావ్రూ రాజబహదరు నారసింహారెడ్డి
కోయిలకుంట్లా జిలేదారునీ రెట్టబట్టినాడు
కుర్చీమిందా జిలేదారునీ రెట్టబట్టియిగ్గె
జిలేదారునీ టోపీ గట్టిగ మూడు దొర్లు దొర్లె
టవును బయటికీ ఎత్తి కొట్టెరా నారసింహారెడ్డి
నక్కనోటి జమదండము బాకు పైకి ఎత్తినాడు
పఱ్రుపఱ్రునా బొజ్జను కోసీ పగలజీల్చినాడు
సన్నపేగునూ జంజెమేసెరా నారసింహారెడ్డి
వాని రకతమూ సుక్కబొట్టుగా తాను బెట్టినాడు
పళపళ పళపళ కేకలేసిరీ ఎల్లాపుల రాణ్వ!

కడపలోని పోలీసువారికి నారసింహారెడ్డిని పట్టుటకు సాధ్యముగాక బళ్ళారినుండి జాతిసైన్యమును దెచ్చిరఁట ఆ జాతిసైన్యము వచ్చి జగన్నాధుని కొండదగ్గఱ డేరాల నెత్తిరి

ఎండలకూ బల్ ఎత్తిరిదేవా ఎండిపట్టుడేరా
కార్యానికీ ఎత్తిరిదేవా కావిపట్టుడేరా
పొద్దుపొడుపులకు ఎత్తిరిదేవా పొగడపట్టుడేరా

ఈ జాతిసైన్యమునకును నారసింహారెడ్డి బోయసైన్యమునకును గొప్ప యుద్ధము జరిగినది నారసింహారెడ్డి బోయసైన్యముయొక్క ఉత్సాహమును గాధాకారుఁ డత్యద్భుతముగా వర్ణించినాఁడు

ఈటెలు వేసీ ఈటెలమ్మటే పరవడి గొట్టేది
బాకులు వేసీ బాకులమ్మటే అంతర్లు గొట్టేది
రెడ్డి సుట్టునా వాళ్ళు గనుకనూ గోల్ తిరుగుతారు

నారసింహారెడ్డి తన దివ్యాశ్వమునెక్కి యుద్ధసన్నద్ధుఁడు కాఁగా నా యశ్వపదఘట్టనమున

కాలిదుమ్ము కైలాస మేగెరా గుఱ్ఱము ఘూతాకు
చారడేసి యా పలుగురాళ్లురా పిండి పిండి యగును

ఏలబోయి యీ ప్రపంచమును దిరిగి యేలబోమనియు పుట్టబోయి మన తల్లి కడుపున మళ్ళీ పుట్టబో మనియుఁ బాలెగాండ్రు తెంపు చేసికొని యుద్ధమున కేఁగిరి ఈ యుద్ధమున గాధాకారుఁడాంగ్లేయ సైన్యమును మహమ్మదీయ సైన్యమును వర్ణించినట్లుగా వర్ణించినాఁడు దీనికొక ముఖ్యకారణ మున్నది మన ప్రాచీన వీరగాధలలోఁ దురుష్క సైన్యవర్ణనమున్నదికాని ఆంగ్ల సైన్య వర్ణన మెచ్చటను లేదు వాందీ ఉర్దూపదములు దొరలినట్లుగా గాధాకారున కాంగ్లపదములు రావు అందుచే విదేశీయుల భాషను సూచించుటకు వారే జాతివారైనను మహమ్మదీయులుగ వర్ణించుటయే పరిపాటియైనది జాతివారు తమభాషలో నఱచుచుండఁగా వారిని నారసింహారెడ్డి సైన్యము విఱుగఁ బొడిచినది నాకుఁ గాధను పాడి వినిపించిన యతడు తనకు బాగుగా వచ్చిన దేసింగురాజు కధ వంటి ప్రసిద్ధ కధలలో వచ్చు తురుష్క సైనికుల యుద్ధ వర్ణనలనుండి కొన్ని మాటలను గ్రహించి జాతివారితో నారసింహారెడ్డి చేసిన యుద్ధమును వర్ణించినాఁడు

మారోమారో మారో అంటరు జాతులవారి బలము
మారో అన్నా మాదరుచేదా ఈటెచూడు లచ్మీ
పకడో పకడో పకడో అంటరు జాతులవారి బలము
పకడో అన్నా ధకిడీ కొడకా బాకుచూడు లచ్మీ
గోవిందా నారాయణంటనూ విరగ నరుకుతారు
అరెరెరె రరరే
పొడుస్త వుంటే పడుతున్నావీ పొట్ట పేగులండీ
నరుకుతవుంటే పడుతున్నావీ నల్లగుండులోయీ
చీరుతవుంటే పడుతున్నావీ చిన్నపేగులోయీ
వాళ్ళు తాగినా కల్లూ సారయి వరదులు పోతాది
అప్పుడు తిన్నా పప్పుకూడురా కుప్పలు తెప్పలురా
ఒకణ్ణి మీదా ఒకణ్ణి వేసె ఈటెల గ్రుద్దేది
అట్లగాను రణవిద్దం చేసె నారసింహారెడ్డి
కొట్టి కొట్టి మా కొల్లలాడెరా నారసింహారెడ్డి

నారసింహారెడ్డి ధాక కాఁగలేక జాతివారి సైన్యము పలాయన మంత్రము పఠించినది వారు పాఱిపోవునప్పుడు హాస్యరసము చక్కఁగఁ బోషింపఁబడినది తొందరలో టోపీలు కత్తులు పోగొట్టుకొని గుఱ్ఱములు చనిపోఁగా డేరాలనెక్కి అవియే గుఱ్ఱములని భ్రమించి రైటో! రైటో! అని తోలసాగిరఁట! మఱికొందఱు గుఱ్ఱముల మూతికి నుండెడె లగామును దోకకుఁగట్టి తోకకు నుండెడి దానిని మూతికిఁగట్టి గుఱ్ఱములు కట్టఁబడిన గూటములైనను నూడఁబెఱుకక పరుగులు పెట్టు చుండిరట! ఆ గూటములు గుఱ్ఱముల కాళ్ళ కడ్డుపడి వెనుకవాటున లేచివచ్చి టోపీలు లేనివారి బోడి తలలకుఁ గొట్టుకొనుచుండెనఁట!

వీరగాథలలోఁ దఱచుగా వచ్చెడి సాధారణ ప్రయోగవ్ములు లేక వారానువర్తనములు (Commonplaces) యుద్ధ నినాదములు తీవ్రసంకల్పములు మున్నగునవి యీ కథలో మెండుగా నున్నవి నారసింహారెడ్డిని గూర్చి చెప్పునపుడీ క్రింది వాక్యములు తఱచుగాఁ ప్రయోగింపఁబడుచుండును

అదిగోవచ్చే ఇదిగోవచ్చే నారసింహారెడ్డి
రాజారావు రాజబహదరు నారసింహారెడ్డి
రెడ్డికాదు బంగారపు కడ్డి నారసింహారెడ్డి
ములుకోల కట్టె చేతులో ఉంటే మున్నూటికి మొనగాడు

బొబ్బిలి యుద్ధములోఁ దఱచుగావచ్చు రామ రామా! అనంతకాలము రాజ్యము ఏలేమా? యుగములు జగములు గలంతకాలము భూములు ఏలేమా? అను దానిని బోలిన యుద్ధ నినాదము (war cry) నారసింహారెడ్డి కథలోఁగూడ వచ్చును యుద్ధమున కుఱుకునప్పుడు నారసింహారెడ్డి సైన్యమంతయు నిట్లనును

ఈ పొద్దిదియ రేపు తదియ నరుని ప్రాణమోయి
నీటిమీదను బుగ్గతోటిదీ నరా శరీరమ్ము
ఏలబోయి ఈ ప్రాపంచంలో మరల ఏలబోము
పుట్టబోయి మన తల్లి కడుపునా మళ్ళీ పుట్టేమా?

ఈ కృతనిశ్చయముతోనే ఈ తెంపరితనముతోనే నారసింహారెడ్డియు నతని బోయసైన్యము ఆంగ్ల సేనావాహినిని ఢీకొనిరి

నారసింహారెడ్డి పరాక్రమము పైనను బలముపైనను ఎన్నియో జనశ్రుతు లున్నవి అవి యన్నియును వీరగాధలోని కెక్కలేదు రేనాటి వీరుడు నవలలోఁగూడ నివిలేవు అట్టి కధలను గొన్నింటిని నేను సేకరించితిని నారసింహారెడ్డి తాను చేసిన కోవెలకుంట్ల హత్యలను ఔకురాజులపైఁ బెట్టెను దీనిని బట్టి నారసింహారెడ్డికిని ఔకురాజులకును శత్రుత్వమున్నదని తెలియుచున్నది కాని యీ శత్రుత్వ కారణము రేనాటి వీరుఁడు నవలలోఁ దెలుపఁబడలేదు నారసింహారెడ్డికిని ఔకురాజులకును మధ్య విరోధమేర్పడుటకుఁగలఁ కారణమును దెల్పుకధ యొకటి నేను సంపాదించితిని ఇది గ్రామవృద్ధులు చెప్పు వచన కధ (Folk tale) దీనికి సీతఁడు కధ యని పేరు నారసింహారెడ్డి దగ్గఱ యుద్ధమునకుఁబూర్వము సీతఁడు కలికి నారిగాఁడు అను నిరువురు నమ్మిన బంట్లు కలరు (యుద్ధకాలమున గోసాయి వెంకన్న ఒడ్డె ఓబన్న అనువారు నమ్మినబంట్లు నాకు లభించిన లఘుఁవీరగాధలో వీరి ప్రసక్తి యున్నది) వీరిలో సీతఁడు మహావీరుఁడు నారసింహారెడ్డికి నుద్దియనఁదగినవాఁడు ఈ సీతఁ డెల్లప్పుడును ఉయ్యాలవాడలో నారసింహారెడ్డి కడనే యుండెడివాడు కలికి నారిగాఁడు మాత్రము హనుమదుగుండమను గ్రామములో నుండెడివాఁడు నారసింహారెడ్డి యెచ్చటికిఁబోయినను సీతఁడాతని ప్రక్కనే యుండువాఁడు ఔకురాజులు ప్రతి సంవత్సరమును వేసవికాలమున నొక గొప్పవిందు చేసెడివారు ఔకు గ్రామమున నొక గొప్ప చెఱువున్నది వేసవిలో నీ చెఱువులోని నీరు తగ్గపోవును గావున నందలి చేపలనుబట్టి సాటి జమీందారులకు విందు చేసెడివారు ఆ విందునకుఁ బ్రతి సంవత్సరము నారసింహారెడ్డిని గూడ నాహ్వానించెడివారు ఒకసారి రెడ్డి యావిందునకుఁ బోవుచు సీతనిగూడ ప్రయాణము కమ్మనెను సీతఁడు వీరవేషమును ధరించి బల్లెము చేతఁబట్టి రెడ్డి ననుసరించెను నారసింహారెడ్డి గుఱ్ఱముపై దౌడుతీయుచుండగా సీతఁడాతని ప్రక్కనే కాలి పరుగు పెట్టుచు రెడ్డి గుఱ్ఱముకన్న పదిబారలు ముందుగనే యుండెనఁట! ఔకు పట్టణము సమీపించు చుండెను వీర వేషమును ధరించిన సీతఁడు నడుము దట్టిని నేలకు జీరాడునట్లుగాఁ గట్టుకొనినాడు రాజులు మాత్రమే యట్లు కట్టుకొనవలెను తక్కినవారట్లు కట్టుకొనినచోఁ దమ్మవమానము చేసినట్లును ద్వంద్వ యుద్ధమున కాహ్వానించినట్లును రాజులు భావింతురు అది నాఁటి వీరాచారము సీతని వేషమును గమనించిన నారసింహారెడ్డి ఔకురాజులతో వృధా కలహము వచ్చునని యోచించి ఒరే! సీతా! నీ నడుము దట్టిని కొంచె మెగఁగట్టుము అనెను ఆ మాటలు విని సీతఁడుగ్రుఁడై దొరా! నీవు దొరవుకావు! అని యధిక్షేపించెను నారసింహారెడ్డి వాని పౌరుషమునకు మెచ్చుకోలుగా

నొక్క చిఱునవ్వు నవ్వెను సీతఁడు నడుముదట్టి నేల జీరాడుచుండఁగా నౌకు పట్టణమును బ్రవేశించెను విందులో నౌకు రాజులు సీతని నడుము దట్టినిజూచి కోపించిరి నారసింహారెడ్డికి ఫిర్యాదు చేసిరి నారసింహారెడ్డి సీతని వారింపఁ జూచెను కాని యా వీరుఁడు వినలేదు ఆ విందులోఁ బాల్గొనిన యెవరితోనైనను సరియే తా నొంటి పోరునకు సిద్ధముగా నున్నానని సీతఁడు దండోరా వేయించెను వాని శౌర్యము నెఱిఁగిన వారగుటచే నౌకురాజులుకాని బనగానపల్లె నవాబులు కాని మాఱుమాటాడలేదు అప్పుడు సీతఁడు హేళనగా ఈ ఔకు దాసరులు పల్లెఫకీర్లు నాతో నొంటి పోరునకు రాఁగలవారా! అనెనఁట వారికది మఱింత క్రోధకారణ మయ్యెను తరువాతఁ గొన్ని దినములకు ఔకురాజులు హనుమదుగుండము గ్రామపు పొలిమేర ఱాతిని దిరిగి వచ్చెదమనియుఁ జేతనైనచోఁ దమ్మెదుర్కొన వచ్చుననియు కలికి నారిగానికిఁ గబురు పెట్టిరి అతఁడు భయపడి వెంటనే ఉయ్యాలవాడకుఁ బరుగెత్తుకొని వచ్చి సీతనికీ విషయమును దెలియఁజెప్పెను సీతని కెక్కడలేని యుత్సాహమును వచ్చెను ఔకురాజులతోఁ బోరాటమతనికి సంబరముగా నుండెను నారసింహారెడ్డికిఁ జెప్పినచోఁ బోనీయఁడని సీతడు రహస్యముగాఁ దనబల్లెము తీసికొని కోట బయటకు వచ్చి యుద్ధార్థియై పోవుచున్నాఁడు కావునఁ జేతనున్న సురఁటిని గంటను గోటలోనికి విసరివైచి కలికి నారిగానితోఁ గలసి హనుమదు గుండమునకుఁ బ్రయాణమయ్యెను కలికి నారిగాఁడు వివాహితుఁడు సీతఁడు బ్రహ్మచారి భార్యపుత్రులను దలఁచుకొనుచు కలికి నారిగాఁడు కొంచెము వెనుకడుగు వేయుచుండెను సీతఁడది గ్రహించి తానొక్కఁడే ఔకురాజుల నెదిరింతునని చెప్పి కలికి నారిగాని నింటికిఁ బొమ్మనెను పొలిమేర ఱాతిదగ్గఱ గుట్టములపైనున్న పండ్రెండుగురు ఔకు వీరులను సీతఁడొక్కఁడే తన బల్లెముతోఁ గ్రుమ్మి చంపెను సీతని శౌర్యమునకు ఔకురాజులు భయపడిరి అతనిని జంపనిచో నెప్పటికైనను బ్రమాదమని గ్రహించి యందఱు నొక్కుమ్మడిగా సీతనిపైఁబడి పద్మవ్యూహమున నభిమన్యునిఁగూల్చినట్టుగా నధర్మ యుద్ధమున సీతని పడవైచిరి సీతని కింకను బ్రాణమున్నది ఔకు గ్రామమునకుఁ గొనిపోయి రాజు సమక్షమున నుంచిరి ఔకురాజు సీతనిఁజూచి ఇప్పటికైనను నీ తప్పు నంగీకరించినచోఁ బ్రాణములతో నిన్ను విడుతుము! అనెను ప్రాణములు పోవుచున్నను సీతనికిఁ బౌరుషము తగ్గలేదు నేను బ్రతికినచో మీకు మిండడను గదా! అని యఱచినాఁడు దీనితో ఔకురాజు మండిపడినాఁడు ఈ పొగరుబోతును గొంతు నులిమి చంపివేయుఁడు! అని యాజ్ఞాపించినాఁడు సీతని కొలఁది ప్రాణముగూడ హరింపఁబడినది ఔకురాజులు

సీతని శవమును బల్లకిలో నుంచి ఉయ్యాలవాడకుఁ బంపిరి ఇది నారసింహారెడ్డికిఁ గోపకారణమయ్యెను నాఁటితో ఔకురాజులతో నాతనికిఁగల స్నేహము భగ్నమయ్యెను ఉయ్యాలవాడఁ గ్రామమునకుఁ దూర్పు దిశలో నేఁటికిని సీతని గోరీ యున్నది [16]

నారసింహారెడ్డి మహాబలవంతుఁడనియు నతఁడు చెట్టు క్రిందఁబండుకొని నోటిలో గువ్వరాళ్ళు పోసకొని ఉఫ్ అని పైకి నూదినచోఁ జెట్టుపైనున్న పిట్టలు చచ్చి క్రిందపడెడినని రేనాటి జనపదములలోఁ జెప్పుకొందురు (ఇట్టి సంఘటన యొకమారు కోవెలకుంట్ల ఆళ్ళగడ్డ మార్గములోనున్న కంపమళ్ళ యను గ్రామములో జరిగినదని కోవెలకుంట్ల సెంట్రల్ ఎక్సయిజ్ ఇన్స్పెక్టరు గారి నాయనమ్మ తొంబది యేండ్ల వృద్ధురాలు చెప్పినది) రూపన గుడి సమీపమున నితఁడు కట్టిన కోట శిధిలములను నారసింహారెడ్డి గోడలు అని నేఁటికిని వ్యవహరించుచున్నారు ఇతఁడు గొప్ప శక్త్యారాధకుఁడనియుఁ దెలియుచున్నది ఇతని కోట శిధిలములలో దుర్గగుడి యున్నది జగన్నాధుని కొండమీఁద ఆదిశక్తి దేవాలయమున్నదనియు నావెం తోడ్పాటుతో నారసింహారెడ్డి అయిదువందల శత్రుసైనికులను నఱికినాఁడనియు నాకు లభించిన వీరగాధానికలో నున్నది

నారసింహారెడ్డి కేవలము యుద్ధవీరుఁడే కాదు గొప్ప సాహిత్య పోషకుఁడు కూడ ఈతనికడ ఓబళాచార్యులు అను నాస్థానకవి యుండెడివాఁడు ఇతఁడు రచించినకావ్యము లేవియు నేఁడు తెలియరాకున్నను నొకపద్యము మాత్రము వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్య మణిమంజరిలోఁ గానవచ్చు చున్నది ఇతనికిని కృష్ణపాటి వేంకటసుబ్బకవికిని నశ్యమును గూర్చి జరిగిన సంభాషణ రూపమున నీ పద్యమున్నది ఒకప్పుడు వేంకటసుబ్బకవి ఉయ్యాలవాడ నారసింహారెడ్డి యాస్థానమునకు వచ్చెను నారసింహారెడ్డి యా కవిని సత్కరించి కావ్యగాన మొనర్పవలసినదిగా బ్రార్థిచెను అప్పుడు సుబ్బకవి యాశువుగా నిట్లనెను

ఉ॥ నశ్యము లేదుగా పవన నందన దివ్యకటాక్ష వీక్షణా
వశ్య వరప్రభావ విభ వానుభవాద్భుత భూమిభృద్ఘను
కైశ్య ఘుమంఘుమంఘుమిత గాంగఝరీవిలురత్తరంగ సా

*16 ఈ సీతఁడు కలికి నారిగాఁడు కథ ను కర్నూలు జిల్లా కోవెలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడ గ్రామములో దస్తగిరి యను డెబ్బది సంవత్సరముల వృద్ధుఁడు 17 4 1966న నాకుఁ జెప్పినాఁడు*

దృశ్య కవిత్వతత్త్వ ముఖరీకృత వేంకటసుబ్బసూరికిన్।'

దీనికి సమాధానముగా నారసింహారెడ్డి ఆస్థానకవియగు నోబళాచార్యుండును నిట్లాశువు చెప్పెను

శా 'కోకో' నశ్య మవశ్య మీశ్వర జలా కోటీ రటద్వ్యోధునీ
ప్రాకాశ్యోర్మి సకాశపేశల సుశబ్ద ప్రక్రియోపక్రమా
నేక గ్రంధ నిబంధనార్జిత సమున్నిద్ర ప్రతాప ప్రధా
స్తోక శ్రీకర కృష్ణపాటికుల సింధు స్వచ్ఛ చంద్రోదయా।'

ఈ పద్యమునుబట్టి ఓబళాచార్యుఁడు గొప్ప వ్యుత్పత్తిగల ప్రౌఢకవియని నిస్సందేహముగా జెప్పవచ్చును ఈతఁడు నారసింహారెడ్డి జీవితముపైన గావ్యము నల్లియుండినచో నది దిట్టకవి నారాయణకవి రంగరాయ చరిత్రమువలె భాసిల్లి యుండెడిది। ఓబళాచార్యుఁడు కావ్యమును వ్రాయలేదో లేక వ్రాసియున్నను నది కాలగర్భమునఁ గలిసి పోయినదో నిశ్చయముగాఁ జెప్పలేకున్నాము

నారసింహారెడ్డి ప్రజోపయోగకరములైన పనుల నెన్నింటినో చేసినాఁడు గిద్దలూరు నుండి దొనకొండవఱకును నొకపెద్దకాలిరస్తా వేయించి నాఁడు దొనకొండ దగ్గఱనున్న గంగాదేవి పల్లెలో నీతని వంశీకులుండెడి వారఁట గుళ్ళదుర్తి రూపనగుడి ఉయ్యాలవాడలలో నీతని వంశీకులను నేఁటికిని చూడ వచ్చును

## నారసింహారెడ్డి పూర్వచరిత్ర

క్రీ శ 1329లో కాకతీయ సామ్రాజ్యము తురుష్కుల హస్తగతమైనది ప్రతాపరుద్రుఁడు ఖైదీయై మరణించినాఁడు ఆతని ధనాగారాధ్యక్షులగు హరిహరరాయలు బుక్కరాయలు కూడా ఖైదీలుగా ఢిల్లీకిఁ గొనిపోబడినారు తరువాత ఢిల్లీసుల్తాను వీరియందుఁ గరుణించి కర్నాట రాజ్యమునఁ గొంతభాగమిచ్చి పంపెను ఈ రాయలసోదరులు శ్రీవిద్యారణ్యస్వాములవారి ప్రోత్సాహమున క్రీ శ 1336లో (ధాత సంవత్సర వైశాఖ శుక్ల పంచమి నాఁడు) విద్యానగర మను పట్టణమును నిర్మించి రాజ్యమును విస్తరింపఁజేసిరి గండికోట నుండి కంభము వఱకును గల ప్రదేశములనన్నింటిని జయించి సామంతులను నియమించి వారిచేఁ గప్పములను గొనుచుండిరి అప్పుడు ముళ్ళపాడు గిద్దలూరు నొస్సం ప్రాంతములను చెంచుమల్ల యను రెడ్లవంశమువారి కిచ్చిరి

క్రీ శ 1565లో జరిగిన తళ్ళికోట యుద్ధమున విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను తరువాత ముళ్ళపాడు గిద్దలూరు నొస్సము ప్రాంతవములు హైదరాబాదు నవాబగు కుతుబ్‌షాహీకి లోఁబడెను క్రీ శ 1709లో గిద్దయారును బాలించుచున్న గోపాలరెడ్డి కృష్ణారెడ్డి యను సోదరు లీ నవాబునకు సామంతులై ప్రతిసంవత్సరమును 12 229 పెగోడాలను గప్పముగాఁ జెల్లించుచుండిరి

గోపాలరెడ్డియుఁ గృష్ణారెడ్డియు నపుత్రకులుగనే గతించిరి క్రీ శ 1749లో వీరి వంశమునకు సంబంధించిన రంగారెడ్డి యను నతఁడు వచ్చి ముళ్ళపాడు గిద్దలూరు సమీపమున నొక కోటను గట్టి దానికి క్రొత్తకోట యని పేరుపెట్టి పాలింపఁదొడఁగెను ఇతని తరువాత నితని పుత్రుఁడు రామారెడ్డి క్రీ శ 1763లో రాజ్యమునకు వచ్చెను ఇతని దివాను కేశవరెడ్డి ఈ కేశవరెడ్డి కడప నవాబునకుఁ జెందిన కొన్ని గ్రామములను బట్టుకొనెను అందుచే కడప నవాబైన హలీఖాన్ కోపించి కేశవరెడ్డిని ఖైదుచేసి సిద్ధవటమున బంధించెను రామారెడ్డిని జమీందారు పదవినుండి తొలగించి ఒక్క నొస్సము తాలూకా మాత్రము రామారెడ్డి కుమారుఁడైన రంగారెడ్డి కిచ్చెను

ఎమ్మట క్రీ శ 1779లో రంగారెడ్డి అన్న కుమారుఁడైన జయరామిరెడ్డి ముళ్ళపాడు గిద్దలూరులయొద్ద నొక ఠాణా నేర్పఱచుకొనెను ఆ కాలమున నీ ప్రాంతమంతయు మైసూరురాజ్యము నేలుచుండిన హైదరాలీ కి లోబడియుండెను జయరామిరెడ్డి గిద్దలూరుకడ ఠాణా నేర్పఱచుకొనిన సంగతి హైదరాలీకిఁ దెలిసి గుత్తిలోనున్న తన సర్దారు నేతడ్‌ఖాను ను బంపెను జయరామిరెడ్డి నేతడ్‌ఖాన్‌తో యుద్ధము చేసి పాఱిపోయెను

క్రీ శ 1782 డిసెంబరునెలలో హైదరాలీ చనిపోయెను కంభం మొదలగు ప్రదేశము లాంగ్లేయుల స్వాధీనమయ్యెను అప్పుడు జయరామిరెడ్డి వంశమువారు క్రొత్తకోటను జేరి అది తమదని ప్రకటించుకొనిరి కాని హైదరాలీ కొడుకైన టిప్పుసుల్తాను తన సేనాధిపతియగు ఉమరుద్దీన్ ఖాన్ ను క్రొత్తకోట పైకి పంపెను ఉమరుద్దీన్‌ఖాన్ వచ్చి క్రొత్తకోటను స్వాధీనపఱచుకొని వెళ్ళెను

క్రీ శ 1792తో నాంగ్లేయులకును టిప్పుసుల్తానుకును సంధి జరిగెను అప్పుడు చలిచలమల చిదంబర మను నతఁడు వచ్చి క్రొత్తకోట ప్రాంతములను వశపఱచుకొనెను ఈ చిదంబరము తరువాత జయరామిరెడ్డి యు నతని పుత్రుఁడు నరసింహారెడ్డి యు క్రొత్తకోట నొస్సములకు జమిందారులుగా నుండిరి కాని

నరసింహారెడ్డి ఆంగ్లేయులకుఁ గప్పము సరిగా చెల్లింపనందున క్రీ శ 1800లో క్యాంబెల్ (Cambell) అను నాంగ్లసేనాని వచ్చి యీ కోటలను స్వాధీనము చేసికొని నరసింహారెడ్డిని గుత్తికి ఖైదీగాఁ దీసికొని పోయెను అప్పటి నుండియు నీ వంశమువారికి నెలకు బదునొకండు రూపాయలవంతున తవర్జీ నిచ్చుచుండిరి ఈ తవర్జీ క్రీ శ 1847 వఱకును ఉయ్యాలవాడలోనున్న జయరామిరెడ్డి మనుమఁడగు నారసింహారెడ్డి కిచ్చుచుండిరి

(1925లో కలవటాల జయరామారావుగారు రచించిన రేనాటి వీరుఁడు అను నవల నుండి చూ పుటలు 22 26)

## నంద్యాల వేంకట్రామరాజుగారి లేఖ

మహారాజశ్రీ రివిన్యూ బోర్డువారి సముఖానకు

కడపజిల్లా చిట్టివేల్ తాలూకా తవర్జీదారు నంద్యాల వేంకట్రామరాజువారు సల్లాములు చేసి వ్రాసుకొన్న మనవి అర్జి యేమనగా

కుంపినీ లాగాయతునుంచి సదరు తాలూకాతో నెల ఒకటికి పదమూడు రూపాయల తవర్జీ అనుభవిస్తు సదరు తాలూకాన్ను మజరా ములక్కాయల పల్లెలోను కాపురస్థుల మైయుండి పరాభవ సంవత్సరం అనగా 1845వ సంవత్సరములో కోవెలకుంట్ల తాలూకా ఔకు అనే గ్రామంలో మా తమ్ముని వుండగా వారి భార్య కాయిలాతో నున్నందున ఆ వర్తమానము మాకు తెలిసి వారిని చూచేకొరకు మేము ఔక్కుపోయి వుండగా ఆ సమయంలో ఉయ్యాలవాడ నరసింహారెడ్డి అనేవాడు సర్కారుకు యతిరాజై దిద్దునడుపుతూ వుండే సమయంలో ఔకు నారాయణరాజు వారిమీద కలెక్టరువారికి అనుమానం కలిగి వారికి కైదుకు చేర్చిన సమయములో నేనును అక్కడనే వున్నందున నన్ను కైదుకుచేర్చి కడపకు పంపించినంతట కోర్టు దొరవారి విచారణవల్ల తప్పితం సాబూతుకానందున మూడు సంవత్సరములు జామీను నిష్కర్ష చేయడంలో నారాయణరాజుగారితో పాటు మాకు కులాసా చేసినారు ఆ లాగాయితి నాకు నడుస్తూ వున్న తవర్జీ అనామత్తు చేసినందున జామీను మూడు వత్సరములు వెళ్ళించి కలెక్టరు కాకరేన్ దొరవారి తావుకు వచ్చి మన్విచేయగా బోర్డువారికి మీ సంగతి తెలుపుకోవలసినదని హుకుం యిస్తామని సెలవు యిచ్చినందున సముఖానకు అర్జీ వ్రాసుకున్నాను కలెక్టరు కాకరేన్ దొరవారి దావావల్ల యింతదూరము అయినదేకాని లేకపోతే నిరపరాధిని చుట్టము పాగిగా చూడబోయినందుకు కర్మవశాత్తు

సంభవించినది మరొక వృత్తిగా జీవనము చేయవలసిన వారము కాము నేను నా భార్యలు యిద్దరు నా కుమారుడు కోడలు యిద్దరు కుమార్తెలు నా తమ్ముని భార్య అమె కుమార్తె యిక్కడ నన్ను నమ్మి చూపెట్టుకొన్న జనము ఈ యావజ్జనము యీ జీవనముతో బ్రతుకవలసినది గనుక ధర్మప్రభువులు పేదవాడనైన నా మీద అంత కరణయుంచి నా జీవనము నాకు దయచేసి నన్ను సంరక్షణ చేయవలెనని కోరుతూ యున్నాను

చిట్టివేల్ ఇట్లు

26 11 1850 నంద్యాల వేంకట్రామరాజుగారు

ఈ లేఖకు కల్లెక్టరు కాకరేన్‌దొర వ్రాసిన రిమార్కు ఈ క్రింది విధముగా నున్నది

Entered No 2484 of 1850

From Nandyal Venkata Rama Raju Garu Targedar of Chittivel in the Jilla of Cuddapah

(True Copy) 28 December 1850

(By order)

Praying for the continuance of an allowance of Rs 13 per mensom which was stopped from his having been falsely implicated in the out break of Narasimba Reddi of Uyyalavada

(True copy)

దీనికి ప్రభుత్వమువారిచ్చిన యుత్తర్వు

Under the order of government dated 20th December 1847 the allowance of pension having been resumed the Board cannot comply with his prayer

The Revenue Board office
Fort St George
7 th February 1851

( రేనాటి వీరుడు నవల నుండి చూ పుటలు 104 107)

ఈ లేఖలనుబట్టి ఉయ్యాలవాడ నారసింహారెడ్డి విప్లవము క్రీ శ 1845లోఁ ప్రారంభమైనదనియు నది 1847 వఱకును గొనసాగిన దనియు నీ విప్లవము

కారణముగా కుంఫిణీవారు 20 12 1847లో జమీందారుల కిచ్చెడి భరణములన్నింటిని నిలిపివేసిరనియుఁ దెలియు చున్నది సంస్థానముల నన్నిటిని తమ సామ్రాజ్యమునఁ గలుపుకొనుటయేకాక నిరుపేదలైన జమీందారులయెడ నాంగ్లేయులెంత కాఠిన్యమును వహించిరో కూడ దీనినిబట్టి విశదమగుచున్నది ఔకు రాజులను 1845లో నిర్భంధించి 1847 వఱకును జైలులోనుంచి మూడేండ్ల జామీనుపై విడుదల చేసిరనియు నీ మధ్యకాలమున వారికి వచ్చుచున్న తవర్జీని నిలిపివేసిరనియు జామీను కాలము పూర్తియైన తరువాతఁగూడ (అనఁగా 1850లోఁ గూడ) వారికి తవర్జీనీయ లేదనియుఁ దెలియుచున్నది

## మోటాటి రెడ్లు- అవాంతర భేదములు

రెడ్లలో పోకనాటి పాకనాటి మోటాటి పెడకంటి కొడిదె పంట దేశూరు వెలనాటి మున్నగు శాఖాభేదము లెన్నియో కలవు ఇందు నారసింహారెడ్డి మోటాటి కులమునకుఁ జెందినవాఁడు అందునను రాజవంశీయుఁడు సాధారణులగు మోటాటిరెడ్లకును ఈ రాజవంశపు మోటాటి రెడ్లకును భేదమున్నది ఈ భేదమును సూచించుటకే వీరికి నగరివారు దొరవారు అను విశేషణములను జేర్చుచుందురు ఈ రాజవంశపు మోటాటి రెడ్లకును సాధారణులగు మోటాటి రెడ్లకును వివాహాది సంబంధము లుండవు

ఈ రాజవంశపు మోటాటి రెడ్లలోఁగూడ రెండు శాఖలున్నవి ఇందొక శాఖకు నారసింహారెడ్డి గుంపు అనియు మఱియొక శాఖకు కృష్ణారెడ్డి గుంపు అనియుఁ బేర్లు ఇందు నారసింహారెడ్డిగుంపు అను పేరులోని నారసింహారెడ్డి ప్రస్తుత కథానాయకుఁడైన ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కాదు ఈతని పూర్వీకుఁడైన వీర నరసింహారెడ్డి (చూ అనుబంధము 2) ఈ వీర నరసింహారెడ్డి కాలముననే యీ రెండు గుంపులును నేర్పడినవి ఈ వీర నరసింహా రెడ్డికి కృష్ణారెడ్డియను సోదరుఁడుండెనఁట ఈ సోదరులిరువురును నొక వివాహమునకుఁ బోయిరఁట అక్కడ కృష్ణారెడ్డి భోజన సమయమున పర్దికోకలు ( భోజన సమయమునఁ గూర్చొనుటకై పఱచెడి సన్నని పొడవైన బట్టలు) పఱువగనే యనాహూతుఁడై పోయి కూర్చుండెనఁట ఇది యన్నకుఁ గోపకారణ మైనది తమ్ముఁడు తమ రాజవంశపు మర్యాదను మంట గలిపెనని కోపించి యాతనితో నాటినుండియుఁ దెగ త్రెంపులు చేసికొనెనఁట అప్పటి నుండియు వీర నరసింహుని వంశము వారికిని కృష్ణారెడ్డి

వంశము వారికిని కంచము పొత్తులు కాని మంచము పొత్తులు కాని లేవు (నేఁడు కంచము పొత్తులు మాత్రమున్నవి) కాని ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పుత్రుఁడగు దొరసుబ్బయ్య తన పుత్రికయగు అక్కయ్య ను కృష్ణారెడ్డి గుంపులోని యువకుని కిచ్చి పెండ్లి చేసెనఁట

మోటాటి రాజవంశములో ఈ గుంపుల భేదము ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారి మాతామహుడైన చెంచుమల్ల జయరామిరెడ్డిగారి కాలములో జరిగెనని మఱికొందరు చెప్పుచున్నారు జయరామిరెడ్డిగారి తమ్ముడు కృష్ణారెడ్డి అట మొదట ఈ గుంపులకు జయరామిరెడ్డి గుంపు కృష్ణారెడ్డి గుంపు అని పేర్లట ఈ గుంపులలో 19వ శతాబ్దిలో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి బుడ్డా వెంగళరెడ్డి పేరు ప్రఖ్యాతులు గడించుటచే వారి పేర్లతో ఈ గుంపులను నారసింహారెడ్డి గుంపు బుడ్డా వెంగళరెడ్డి గుంపు అని ఎలుచుట ప్రారంభమైనదట

మోటాటి రాజకులములోని నారసింహారెడ్డి గుంపు లో మొదట మూఁడు వంశములుండెడివి పేరా (ప్యారా) కసాని కర్నాటి ఇందు పేరా వారును కసానివారును గోత్రయాదులు (సగునాల గోత్రము) కర్నాటివారు వీరికి వియ్యపువారు అనఁగా పేరావారును కసానివారును కర్నాటివంశములోని యాడు బిడ్డలను వివాహమాడుచుండెడివారు కర్నాటివారిది మారుట్ల గోత్రము కాలక్రమమున నీ వంశములలో ననేక గృహనామము లుద్భవించినవి గోత్ర దాయాదులిరువదియేడు వంశములుగాను వియ్యపువారు పదునాలు వంశములు గాను చీలిపోయిరి పేరా కసాని కసిరెడ్డి నందిరెడ్డి పెద్దిరెడ్డి కాతా సేగు దాసి గోవిందయ్య అరుకట్ల దండేల కడియపు హనుమంతుడు పాలిమేర కూనాల సంగారు పల్లె లక్ష్మి బసిరెడ్డి పరదేశి భూమిరెడ్డి చిన్నకసాని మద్దెల ముసాని చిరెడ్డి వేములపాటి దాసన అనునవి సగునాల గోత్రదాయాది మోటాటి రాజవంశములు కర్నాటి కానాల అక్కల కట్టా వెట్టి నాగు మశాన చెన్నూరి తిప్పుగారి తరిగోపుల నందవరపు కానాలబోరెడ్డి దాసరి కుక్కలరెడ్డి దేవకమ్మ ఎక్కనాల అనునవి మారుట్ల గోత్రదాయాది వంశములు మొదటి యిరువదియేడు వంశముల వారును దఱువాతి పదునాలు వంశముల వారితో మాత్రమే వియ్యమందుదురు

ఇట్లు సగునాల గోత్రమునకుఁ జెందిన యిరువదియేడు వంశములును మూరుట్ల గోత్రమునకుఁ జెందిన పదునాఱువంశములును గలిసి మోటాటి రాజవంశమున నారసింహారెడ్డి గుంపు నకుఁ జెందును ఇట్లే కృష్ణారెడ్డి గుంపులోఁ గూడ ననేక గృహనామములున్నవి కృష్ణారెడ్డి గుంపులోఁ బ్రధానమైనది చెరుకోళ్ళ గోత్రము క్రీ శ 1845 47 సంవత్సరములలో రేనాటి సీమలో నాంగ్లేయులకు వ్యతిరేకముగా మహావిప్లవమును లేవదీసిన ఉయ్యాలవాడ నారసింహారెడ్డి మోటాటి రాజవంశమున నారసింహారెడ్డి గుంపు నకుఁ జెందినవాఁడు రేనాటి దానకర్ణుఁడని ప్రసిద్ధికెక్కిన బుడ్డా వేంగళరెడ్డిగారు (ఉయ్యాలవాడ క్రీ శ 1822 1900) కృష్ణారెడ్డి గుంపు నకుఁ జెందినవారు నారసింహారెడ్డి గుంపువారు నొస్సముకోటను కృష్ణారెడ్డి గుంపువారు హనుమదుగుండమును బాలించిరి కాలక్రమమున నీరెండు గుంపులకును నాచారవ్యవహారములందుఁగూడ భేదములెన్నియో కలిగినవి అందుఁ గొన్నింటిని జూపెదను

| | నారసింహారెడ్డి గుంపు | కృష్ణారెడ్డి గుంపు |
|---|---|---|
| 1 | తిరుమణిధారులు (వైష్ణవులు) | మోడీలు (శైవులు?) |
| 2 | స్త్రీలు ఎడమపైటను వేసికొందురు | కుడిపైటను వేసికొందురు |
| 3 | విధవ స్త్రీలు రవికను ధరింపరు | విధవ స్త్రీలు సహితము రవికను ధరింతురు |
| 4 | స్త్రీలకు చెవిపుల్ల (చెవికిపైన) ఉండును | చెవిపుల్లలేదు ఉంగరమాల (పోగు) ఉండును |
| 5 | పెండ్లిలో పువ్వులు గంధతాంబూలములు నీళ్ళకుండ నుపయోగింతురు | ఎదురంబలి మసిబోనము నుండును |
| 6 | చనిపోయినప్పుడు శవమును మోసెడివారు పీనుగ నచ్చటనుంచి కోడిని కోసికొని తిని గోవిందకొట్టుచు శవమును తీసికొని పోవుదురు | ఇట్టి పద్ధతిలేదు |
| 7 | శవమును దీసికొనిపోవుటకు పాడె కట్టరు చేతులపైననే మోసికొని పోవుదురు | కట్టెలతో పాడె కట్టి తీసికొని పోవుదురు |

## నారసింహారెడ్డి వంశవృక్షము

(21 4 1966న కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా చెలిమళ్ళ రుద్రవరమను గ్రామములోని ఎచ్చుకుంట్ల కడ సంపాదించితిని)

ఉప్పలూరు సంస్థానాధిపతులు
మూలపురుషుండు
ప్యారా లక్ష్మిరెడ్డి
|
వీర నరసింహారెడ్డి

- ఓబులరెడ్డి
  - వెంకటరెడ్డి
    - విశ్వపతిరెడ్డి
      - పెద్ద ఓబులరెడ్డి
        - చిన్న విశ్వపతి రెడ్డి
          - ఓబులరెడ్డి
            - ఓబులరెడ్డి
              - బు డ్డి
                - జయరామిరెడ్డి
                  - నారసింహారెడ్డి
- వెంకటరెడ్డి
  - పెద్దమల్లారెడ్డి
    - నారసింహారెడ్డి
      - లక్ష్మిరెడ్డి
        - రంగారెడ్డి
          - వెంకటరమణారెడ్డి
        - చలపతిరెడ్డి
          - రెడ్డయ్య
      - కూతురు (భర్త - పెద్ద మల్లారెడ్డి)
    - సీతాపతి రెడ్డి
      - మ డ్డి
        - బుచ్చి రుమాళ్ళరెడ్డి
          - పెద్దనారసింహారెడ్డి
            - నారాయణరెడ్డి
- లక్ష్మిరెడ్డి
  - విమ్సతు నారసింహారెడ్డి
    - చిన్నమల్లారెడ్డి
      - గోపాలరెడ్డి
      - పెరుమాళ్ళరెడ్డి
        - తులసప రెడ్డి
          - చలప య్య
            - చిన్ననారసింహారెడ్డి
              - రంగారెడ్డి
                - పెరుమాళ్ళరెడ్డి
                  - సీతమ్మ (భర్త పెద్ద మల్లారెడ్డి)
                    - ఉయ్యాలవాడ నారసింహారెడ్డి (భార్య సిద్దమ్మ)

## 'నయనాలప్పకొండ'

దీనికి నయనాలప్ప తిప్ప యనియుఁ బేరు ఇది నొస్సమునుండి కోవెల కుంట్ల పోవు మార్గములోనున్నది నొస్సమునకు సమీపమున (ఒక మైలు దూరములో) నున్నది దీనిపై శివాలయమున్నది ఆ శివాలయము గర్భగుడిలో నొక బిలమున్నది ఈ బిలములోనే నారసింహారెడ్డి తాను సంహరించిన తహశిల్దారు బొందిలివాని శిరస్సుల నుప్పుకుండలలో దాచెనని చెప్పుదురు ఈ నయనాలప్పకొండను గూర్చి యొక కథ యున్నది

పూర్వకాలమున నొక గ్రామములో నొక గృహస్థు ఉండెను అతఁడు గాజుల వ్యాపారము చేయుచుండెడివాఁడు అతని భార్య గర్భిణిగా నున్నప్పుడతఁడు దేశాంతరగతుఁడయ్యెను తరువాత పదునైదు సంవత్సరములకుఁ దిరిగి యింటికి వచ్చెను ఆతఁడింటికి వచ్చుసరికి భార్య యెచ్చటికో పోయెను ఇంటఁ బదునైదు సంవత్సరముల కన్య యున్నది ఆ కంసాలి యా కన్య సౌందర్యమును జూచి మోహపరవశుఁడై యామెను బలత్కారించి మానభంగము కావించెను తరువాత కొంతసేపటికి భార్య వచ్చినది ఆమె భర్తను గుర్తించి ఆ కన్య తమ కూతురని తెల్పినది అతని దు ఖమునకు మేరలేదు తాను చేసిన మహాపాపమునకుఁగారణము తన కన్నులేయని నిశ్చయించుకొని వానిని బెరకికొని సమీపముననున్న కొండకుఁబోయి యట తపస్సు చేసికొనెను నయనములు పోయినవాఁడు తపస్సు చేసిన కొండయగుటచే దానికి నయనాలప్ప కొండ యని పేరు వచ్చెను

## ఇతర విషయములు

నారసింహారెడ్డిగూర్చియు నాతని వంశీకులను గూర్చియు రేనాటి సీమలోని గ్రామవృద్ధులు చెప్పిన మఱికొన్ని విషయముల నీ క్రింద పొందుపఱచు చున్నాను

(1) నారసింహారెడ్డి తాతయగు చెంచుమల్ల జయరామిరెడ్డిగారి యొద్ద నొక బంటు కలడఁట అతఁడు గజ్జివాడు మహా బలశాలి ఇనుపరోఁకలి యొకటి చేతఁబట్టుకొని రెడ్డి వెంటఁబోయెడి వాఁడఁట ఒకప్పుడు జయరామిరెడ్డి బనగాన పల్లెకుఁబోయి కొలనులో స్నానము చేయుచుండెనఁట అప్పుడు నవాబు యేనుగు ఒకటి వచ్చి రెడ్డిమీద పడెను వెంటనే ఆ గజ్జివాడు తన రోకలితో దానిని చావమోది తఱిమివైచెను

(2) నారసింహారెడ్డి యొద్దకూడ నొక మహాబలాఢ్యుడగు ముస్లిము అంగరక్షకుడుగా నుండెడివాఁడఁట అతని పేరు ఖాసిం సాహెబ్ ఇతనిది ఆళ్ళగడ్డ తాలూకాలోని రుద్రవరము ఈతఁడు చిట్టచివరి వఱకును నారసింహా రెడ్డి నంటిపెట్టుకొనియే యుండెను జగన్నాధము కొండలోఁగూడ రెడ్డితో నుండెడివాఁడు ఆంగ్లేయులు రెడ్డిని బంధించి కోవెలకుంట్లకుఁ దీసికొనిపోయి ఉరితీయఁగా నితఁడు రెడ్డిలేని జన్మ నాకేల? అని ఆత్మహత్య చేసికొనెను

(3) యుద్ధసమయమున నారసింహారెడ్డి కడ గోసాయి వెంకన్న ఒడ్డె ఓబన్న అను నమ్మిన బంట్లుండెడివారు వీరిలో గోసాయి వెంకన్న గొప్ప మాహాత్మ్యము గలవాఁడు ఇతఁడు చేతిలో నొక యాకుపసరు పోసికొని రాబోవు సంఘటనలను జెప్పెడివాఁడఁట ఆంగ్లేయ సైన్యము లే దిశలో వచ్చుచున్నవో నారసింహారెడ్డి యీ గోసాయి వెంకన్న సహాయముతోఁ దెలిసికొనెడి వాఁడఁట

(4) గిద్దలూరు దగ్గఱనున్న క్రొత్తకోటలో నారసింహారెడ్డి ప్రయోగించిన ఫిరంగియొకటి నేఁటికిని గలదు ఇక్కడ రెడ్డి వాట్సన్‌తో యుద్ధము చేయుచు న్నప్పుడు ఫిరంగినొక దిశలోఁగాల్పించి యచటి సైనికులచే నారసింహారెడ్డి చనిపోయెను! అని యఱచించినాఁడఁట ఆంగ్లేయులందఱను నా దిశకుఁ బరువెత్తిరి ఇంతలో నారసింహారెడ్డి అశ్వముపై వేఱొకదిశలోఁ బాఱిపోయెనఁట!

(5) నారసింహారెడ్డి దగ్గఱ నొక యపూర్వమగు ఖడ్గముండెడిదఁట దానిని జేతితోఁబట్టి విదలించినచోఁ బొడవుగా ముందుకుసాగి శత్రువుల కుత్తుకల నుత్తరించెడిదఁట వీరపాండ్య కట్టబ్రహ్మన సోదరునికడఁగూడ నిట్టి ఖడ్గముండెడిదని చెప్పుదురు

(6) రూపనగుడి గ్రామమునకు సమీపమున నారసింహారెడ్డి గోడలు అను ప్రదేశమున్నది ఇచట పూర్వము బాపనపల్లె యను గ్రామముండెడిదఁట ఇందు బ్రాహ్మణులు విశ్వబ్రాహ్మణులు నివసించెడివారు అహోబల క్షేత్రములోని గుడిని నిర్మించినదీ విశ్వబ్రాహ్మణులే అని చెప్పుదురు నారసింహారెడ్డి గోడల దగ్గఱ వీరు నిర్మించిన దుర్గమ్మ దేవాలయము నేఁటికిని గలదు ఇది గొప్ప మాహాత్మ్యము గల శక్తి ఈగుడి పైకప్పుపై రెండు పాతర్ల ధనముండెడిదఁట దానిని బగులగొట్టి యెవరో యెత్తుకొని పోయిరి విగ్రహము క్రిందకూడ పాతర యున్నదని చెప్పుదురు

నారసింహారెడ్డి గోడలు అను ఈ ప్రదేశములో నిన్న మొన్నటి వఱకును నారసింహారెడ్డి నిర్మించిన మిట్టమిద్దె ఒకటి ఉండెనట అయ్యపురెడ్డిగారి తండ్రి వెంకటరెడ్డిగారు దీనిని పీకి వైచినారట ఇచ్చటి బాపనపల్లె గ్రామమునకు కాపలాగా పుచ్చకాయలపల్లెకు చెందిన బోయ సంజన్న 36 ఏండ్ల క్రిందటి వఱకును ఉండెడివాడు అతనికి నెలకు 30 రూపాయల జీతముండెడిది

## (7) 'నారసింహారెడ్డి గోడలు' దగ్గఱనున్న దుర్గమ్మ మాహాత్మ్యము

నారసింహారెడ్డి గోడలు అను ప్రదేశములో నున్న దుర్గమ్మకు అనేక మాహాత్మ్యములున్నవని చెప్పుదురు శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారు కొన్ని విషయములను చెప్పినారు

(I) దుర్గమ్మ గుడి దగ్గర అర్ధరాత్రివేళ భయంకరమైన పెద్దశబ్దము వినిపించును ఆ శబ్దమును విన్నవారిలో చాలమంది భయపడి చనిపోయినారు 10 సంవత్సరముల క్రిందట అయ్యపురెడ్డిగారు ఆ శబ్దమును విని భయపడి రూపనగుడి వఱకును పరుగెత్తి వచ్చినారట

(II) ఈ దుర్గమ్మను అవమానించినచో వెంటనే చనిపోవుదురు ఈ దేవతకు మ్రొక్కుకొనిన చీరలు సమర్పింపకపోయినచో ఆ చీరలు అంటుకొని పోవును ఒక సంవత్సరము క్రిందట ఉయ్యాలవాడలో ఒక కంసాలివాని భార్య ఒడలు అంటుకొని చనిపోయినది బుడ్డా వెంగళరెడ్డిగారి దగ్గర పహాల్వాన్‌గా ఉండిన చిన్నకమ్మ మనుమడు కమాల్‌దిన్ అనువాడు ఒకసారి ఉయ్యాలవాడనుండి కలవటాల అను గ్రామమునకు పేకాట ఆడుటకై పోవుచు మార్గమధ్యమున ఈ దుర్గకు మ్రొక్కుకొనెను అయినను అతడు ఆటలో ఓడిపోయెను తిరిగి వచ్చుచు మఱల ఈ దుర్గను దర్శించి కోపముతో ఆ విగ్రహముపై ఒక ఊాయి పెట్టి వెళ్ళిపోయెను ఇంటికి వెళ్ళి స్పృహ లేకుండ పడిపోయి చనిపోయెను

(III) ఉయ్యాలవాడలోని దానిమేలు అను ఉపాధ్యాయుడు సైకిలుపై ఈగుడి మీదుగా పోవుచుండగా దప్పిక! దప్పిక! అని ఈ దుర్గ అరచినదట

(IV) ఈ దుర్గ గుడికి ఎదురుగా తూర్పుదిక్కున పూర్వము ఒక కోనేరు ఉండెడిదట ఆ కోనేరులో కంచురథము ఉన్నదట ఈ గుడి శిఖరము యొక్క నీడ ఎక్కడ పడునో అక్కడ కోనేరు ఉండెడిది

(v) అన్నదమ్ములు ముగ్గురు ఈ గుడిదగ్గర ఒకరినొకరు చంపుకొనిరట

(vi) ఈ గుడిలో బంగారము చూపుదునని ఒకడు అల్లూరి వారిని ఇద్దరిని రాత్రివేళ తీసికొని వచ్చి మోసము చేసెను వారిలో ఒకడు చనిపోయెను

(8) నారసింహారెడ్డి వంశీకు లరువది యాఱు గ్రామముల కధికారులు కావున నాయరువదియాఱు గ్రామములలోను వారు బీటు తిరుగవలెను అమావాస్య ముందఱ నెనిమిది రోజులు నమావాస్య తరువాత నెనిమిది రోజులు నీ బీటు తిరుగుట యుండెడిదట ఈ గ్రామములకు సాలీనా 12 229 రూపాయలు ప్రభుత్వమునకు కప్పము చెల్లింప వలెనట నారసింహారెడ్డి వంశీకులైన నగరివారు ఈ 66 గ్రామములకును ధర్మకర్తలుగా నుండి ఆ గ్రామములలో దొంగ పెండ్లి రెండవపెండ్లి ఎదిగిన కూతురు పెండ్లి వ్యభిచారి ఎల్లలకు పెండ్లి చాకలి మంగలి వారిండ్లలో పెండ్లి మాలమాదిగల ఇండ్లలో పెండ్లి జరుగునప్పుడు బాసికము కట్టకుండ చూడవలెను

(9) నారసింహారెడ్డికిని ఆతని పూర్వీకులకును సంబంధించిన శిలాశాసనములు నొస్సము ఉప్పులూరు గ్రామములలో నున్నవి నారసింహారెడ్డికి సంబంధించిన తామ్రశాసనమొకటి సంజామల గ్రామములోని కరణము దగ్గఱ నున్నదని తెలియుచున్నది

(10) నారసింహారెడ్డి కోవెలకుంట్లలోని తాలూకా కచేరిని ముట్టడించినప్పుడు అచ్చటి తాసిల్దారు పారిపోయి ఒక పత్తి కట్టలో దాగుగొనెనట ఆతడు లోపల భయముతో గడగడ వణకుచుండగా పైన పత్తికట్ట కదలుచుండెనట ఆ కదలికను బట్టి నారసింహారెడ్డి బోయసైన్యము ఆ పత్తికట్టను తొలగించి తాసిల్దారును పట్టుకొనిరట

(11) "నారసింహారెడ్డి ఖాండా" ఖాండా అనగా ఖడ్గము దీనినే టేగా అని కూడ ఎలిచెదరు ఇది రూపనగుడిలో శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారి యింటిలో నున్నది నేను దీనిని 17 4 1966 నాడు చూచినాను దీని పొడవు 4 జానలు పిడి పొడవు ఒక జాన మొత్తము 5 జానల పొడవు పిడిమీదను ఖడ్గము మొదటి భాగముననను బంగారు పూతతో చెక్కిన లతలున్నవి కత్తి వెడల్పు పోను పోను హెచ్చి ఉన్నది మొదట 2 1/2 వ్రేళ్ళు చివర 3 వ్రేళ్ళు దీనిని నారసింహారెడ్డి ఖాండా

అందురు (దీని కన్న పొడవైన ఖాండా మఱియొకటి గలదు) అంగుళములలో దీని కొలతలిట్లున్నవి

| | |
|---|---|
| కత్తిపొడవు 32 | కత్తి వెడల్పు మొదట 2 |
| పిడి పొడవు 9 | చివర 2 |
| మొత్తము పొడవు 42 | కత్తిబరువు 2 వీసెలు |

బండరాయిని కొట్టినను ఈ కత్తి పదును మొక్కపోవుట లేదు ఈనాడు పెద్దమ్మ తిరునాళ్ళలో నగరు దున్నపోతు ను నఱకుటకు ఈ ఖాండాను ఉపయోగించు చున్నారు

(12) కొలువు ఈటె ' నారసింహారెడ్డి గ్రామసభ చేసినప్పుడు సేవకులు పట్టుకొనెడి ఈటె ఇది రూపనగుడిలో శ్రీ చినరామిరెడ్డిగారి యింటిలోనున్నది

| | |
|---|---|
| కట్టె ఎత్తు 72 | చుట్టుకొలత 6 |
| ఈటెమొదలులో నగిషీ 8 | ఈటె పొడవు 26 |

మొత్తము ఈటె ఎత్తు 72 +8 +26 106 8 అడుగుల 10 అంగుళములు ఇప్పటికిని పెద్దమ్మ ఉత్సవములో పొలిగంపను ఎత్తునపుడు వేరే ఊరివాడు ఆ పొలిగంపను ఎత్తుకొనిపోకుండ ఈ కొలువు ఈటెలో గుడిచుట్టును తిరుగుదురు

నారసింహారెడ్డి ప్రయోగించిన అనేక ఆయుధములు గుళ్ళదుర్తిలో నుండెడివి కాని ఇవన్నియు నారసింహారెడ్డి దౌహిత్రులు చేసిన ఒక హత్యానేరమున దాచి వేయబడినవి అందుచే నశించి పోయినవి

(13) ''గుఱ్ఱపులాయం ' అనగా గుఱ్ఱపుశాల అని అర్థము ఇది రూపనగుడిలో నున్నది

(14) తాను చనిపోయిన తరువాత పొరక చేట పట్టవద్దని నారసింహారెడ్డి చెప్పెనట ఈ విషయము శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగార్రు 15 3 1966 నాడు నాతో చెప్పినారు

(15) ''జానకి టు పాకి'' నారసింహారెడ్డి దగ్గర ఉండెడిదని చెప్పుదురు

(16) ''నారసింహారెడ్డి మన్ను ' కోవెలకుంట్లలో రంగస్వామి దేవాలయము ప్రక్కన తాటిమానులు పాతి నారసింహారెడ్డిని ఉరితీసిరట జ్వరము వచ్చినవారు

ఆమానుల చుట్టును తిరిగి అచ్చటి మన్ను కొంచెము నోటిలో వేసికొని వెళ్ళెడివారట జ్వరము తగ్గిపోయెడిదట క్రమక్రమముగా అచ్చట పెద్ద గొయ్యి ఏర్పడినదట

కాని నారసింహారెడ్డిని ఉరి తీసిన ప్రదేశమును గురించి కోవెలకుంట్ల నివాస ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ భట్టు పుల్లయ్యగారు (75 సం లు) వేఱుగా చెప్పుచున్నారు నారసింహారెడ్డిని కోవెలకుంట్లకు ఉత్తరదిశలో జుట్టేటి దగ్గఱనున్న కుప్పాలబావి లేక కుక్కబావి దగ్గర ఉరితీసిరట కుప్పాలబావి నే మూడు కుప్పాల బావి అందురు ఇది మూడు కపలల బావి అను పేరు నుండి వచ్చియుండును ఉరితీసినప్పుడు నారసింహారెడ్డి శరీరము నుండి చెమటలు ఏఱులుగా పాఱినవట ఆతని చెమటతో తడిసిన మట్టికి గొప్ప మాహాత్మ్యమున్నదని ప్రజలు నమ్మెడివారు జ్వరము వచ్చిన ఎల్లలకు ఆ మట్టిని మందుగా ఉపయోగించెడివారు

మహాబలాఢ్యుడైన నారసింహారెడ్డిని ఉరితీసినప్పుడు ఆతడు చాలసేపు ఊపిరిని బిగబట్టెనట ఆతని ప్రాణములు పోవుటకు చాలసేపు పట్టినదని శ్రీ కర్నాటి అయ్యపు రెడ్డిగారు నాతో చెప్పినారు

(17) నారసింహారెడ్డి ఆజానుబాహుడు మహాబలశాలి కాళ్ళపై దట్టముగా రోమములుండెడివి వర్షములో వెళ్ళుచున్నప్పుడు ఎద్దు తోకకు మట్టి అంటు కొనునట్లు ఆయన కాలి వెంట్రుకలకు మట్టి అంటుకొనెడిదట (అయ్యపురెడ్డిగారు చెప్పిన విషయము)

(18) ''గుఱ్ఱాలకొండ' గిద్దలూరునకు ఉత్తరముగా 6 కిలోమీటర్ల దూరములో జైరాంపురము నకు సమీపములో ఈ కొండ ఉన్నది ఒకసారి ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పట్టుదలతో ఆ కొండమీదికి తన గుఱ్ఱముపై స్వారి చేయుచు ఎక్కినాడు ఆ కొండ ఎక్కిన తరువాత బడలికతో ఆ గుఱ్ఱము చనిపోయినది దానికి రెడ్డి ఆ కొండమీద సమాధి కట్టించినాడు అందువల్ల దానికి గుఱ్ఱాలకొండ అని పేరు వచ్చినది

(19) ''పూలకోట'' నారసింహారెడ్డి క్రొత్త కోటలో పూలతోట అను ప్రదేశమును బ్రాహ్మణులకు ఈనాముగా నిచ్చినాడు అవధానుల అని యింటి పేరుగల బ్రాహ్మణులు ఈనాటికిని ఆ పూలతోట ప్రదేశమును అనుభవించు చున్నారు

(20) నరవబోడు' గిద్దలూరునకు ఆగ్నేయముగా 3 కిలోమీటర్ల దూరములో నరవ అను గ్రామమున్నది అక్కడ నరవబోడు అని ఎలువబడు

ఒక తిప్పపై నరసింహస్వామి దేవాలయమున్నది ప్రతిదినమును నారసింహారెడ్డి క్రొత్తకోట బురుజుపైనుండి ఆ దేవాలయము వైపు చూచెడివాడు అక్కడి దీపారాధన వెలుగు ఆతనికి కనబడెడిది ఆ వెలుగునకు నమస్కరించుకొని తరువాత భోజనము చేసిడివాడట విప్లవకాలములో నారసింహారెడ్డి ఈ క్రొత్తకోటలో రహస్యముగా నుండెడివాడు [(18) (19) (20) ఈ మూడు విషయములను గిద్దలూరు దగ్గర నున్న కొత్తపల్లె కు చెందిన శ్రీ కాతా చెన్నారెడ్డిగారు 6 2 1999 నాడు నాకు తెలియజేసినారు వీరు ప్రస్తుతము ఉయ్యాలవాడ మండలములోని అల్లూరు గ్రామములోనున్నారు)]

(21) నారసింహారెడ్డి పుట్టింది రూపనగుడి పెరిగింది రూపనగుడి ఏలింది ఉయ్యాలవాడ కట్టింది సవరణ బ్రాహ్మణ అగ్రహారం పెట్టింది పేరు గుళ్ళదుర్తి అని గుళ్ళదుర్తిలోని శ్రీ కసాని సుబ్బారెడ్డిగారు (50సం లు) నాతో 27 4 1966 నాడు చెప్పినారు ఈయన ఇంకను అనేక విషయములు నాకు చెప్పినారు

(22) ' బొజ్జయ్య' ఈయన నారసింహారెడ్డిగారి తమ్ముడు కడపజిల్లా కనులాపురం తాలూకా ఉప్పులూరులో కర్నాటి వారి బిడ్డను వివాహము చేసకొనెను ఈయనకు సంతతి లేదు ఉయ్యాలవాడలోనే ఉండెడివాడు 1900 కు పూర్వము కొన్నాళ్ళు గుళ్ళదుర్తిని పరిపాలించెను ఒకప్పుడు గుళ్ళదుర్తిలో ఒక తీర్పు చెప్పుచుండగా ఒక బోయవాడు ఈయనను కత్తితో కొట్టినాడట ఆ దెబ్బకు బొజ్జయ్య చనిపోయెనట

(23) ''దొర సుబ్బయ్య'' ఈయన నారసింహారెడ్డి కొడుకు ఇంటిపేరు మద్దెలవారు ఈయనకు అక్కయ్య అను కూతురు ఉండెను ఈమెను కృష్ణారెడ్డి గుంపు లోని వానికిచ్చి వివాహము చేసెను ఈమెకు ముగ్గురు కొడుకులు పెద్దమల్లారెడ్డి చిన్నమల్లారెడ్డి బొజ్జయ్య

(24) కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకా చెలిమళ్ళ రుద్రవరములో రెడ్ల గోత్రములు చెప్పెడి పిచ్చుగుంట్లు ఉన్నారు వీరి దగ్గఅ ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారి వంశస్థుల చరిత్ర బుడ్డా వెంగళరెడ్డిగారి వంశస్థుల చరిత్ర ఉన్నది నారసింహారెడ్డిగారి మూల పురుషులు పేరావారు వీరిది సగునాల గోత్రము కసాని వారిది కూడా సగునాల గోత్రమే కర్నాటి వారిది మారుట్ల గోత్రము బుడ్డా వెంగళరెడ్డిగారి యింటిపేరు మద్దెలవారు వీరిది చెరుకోళ్ళ గోత్రము నారసింహారెడ్డి వంశీకులు ఉప్పులూరు సంస్థానమునకు చెందినవారు వీరి మూలపురుషుడు ప్యారా

లక్ష్మీరెడ్డి బుడ్డా వెంగళరెడ్డిగారి వంశీకులు హనుమదు గుండము సంస్థానమునకు చెందినవారు వీరి మూలపురుషుడు హరపురెడ్డి పుల్లారెడ్డి గుళ్ళదుర్తి నగరి సంస్థానమువారి యిండ్ల గోత్రములను గురించి పిచ్చుగుంట్ల వద్ద ఇట్లున్నది

పేరావారిది సగునాల గోత్రము పేరావారు అనగా తియ్యక ముక్కుపోగు పెట్టవలయును వీరు ఆరునాళ్ళ పెండ్లిండ్ల యందు పేరం అతికిన నత్తును పెట్టవలయును ఆభరణాన్ని బట్టి అనగా సొమ్మును బట్టి పేరావారు అని పేరు వచ్చినది (అసలు వీరు) కసాని వారే కసానివారిది సగునాల గోత్రము కసాపురి ఆంజనేయునికి మాన్యము ఇచ్చినామే అని కసానివారు నగరి బోనము మోసేకాడ మాదిగవారి వడే తాంబూలము ముట్టేకాడ అందరము కసానోళ్ళమే అనుకుంటే దేవతా విషయములో ముక్కులకాడ తకరారు పడతామే అని మన సగునాల గోత్రానికి మారు పేర్లుకాని అందరము కసానివారము పేరావారము కట్టుబడి పని చెయ్యాలి

(25) నగరి **తాంబూలము'** గిద్దలూరు పూర్వము కర్నూలు జిల్లాలోనిది ప్రస్తుతము ప్రకాశం జిల్లాలోనికి పోయినది గిద్దలూరుకు సమీపములో ముండ్లపాడుకు దగ్గఱగా నల్లమల కొండలలో నారసింహారెడ్డి క్రొత్తకోట ఉన్నది ఈ ప్రాంతములలోని గ్రామములలో నగరి తాంబూలము అను ఆచారము నేటికిని ఉన్నది బాలికలు రజస్వలలు అయినప్పుడును అత్తవారిండ్లకు వెళ్ళినప్పుడును ప్రధమ తాంబూలముగా నగరి తాంబూలము నిత్తురు నారసింహారెడ్డి నగరు ఈనాడు లేకపోయినను ఆతని కోటగోడకు ఈ తాంబూలమును సమర్పింతురు

(26) **నారసింహారెడ్డి వారసులు - ''బంగారు పూల సూసకము'** పెండ్లి కూతురు తలపై అలంకరించెడి బంగారు తిరుగుడు బిల్లను సూసకము అందురు ఇది గుళ్ళదుర్తి నగరిలో నారసింహారెడ్డి వారసుల (దౌహిత్రుల) కడనుండెడిది దీనిని ఒక వైశ్యుడు కాజేయగా నారసింహారెడ్డి వారసులు ఆతనిని హత్య చేసినారు నారసింహారెడ్డిమీది కోపముతో కుంఫిణీ ప్రభుత్వము వారినందరినీ కఠినముగా శిక్షించినది ఈ సంఘటన జరిగి సుమారు 40 సంవత్సరములయినది (1965 40 1925లో జరిగినది) నారసింహారెడ్డి వారసులు 5గురు అన్నదమ్ములు ప్రభుత్వము వీరిలో మొదటి నలుగురికిని ఉరిశిక్ష విధించినది బాలుడైన చివరి వానికి ద్వీపాంతరవాస శిక్ష విధించినది 1947 భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించినది అప్పుడు ఈ 5వ వాని శిక్ష రద్దు చేయబడినది విడుదలై వచ్చినాడు అప్పటి అతని వయస్సు సుమారు 40 సంవత్సరములు ఈలోగా నారసింహారెడ్డి వారసులకు చెందిన

300 ఎకరాల భూమిని వారి మేనమామలు చూచుచుండిరట తమ మేనల్లుళ్లందరికిని ఉరిశిక్షలు పడినవనియు ద్వీపాంతర వాసమునకు వెళ్ళిన చివరివాడు కూడ తిరిగి రాడనియు భావించి ఆ మేనమామలు వారి ఆస్తినంతయు ఆక్రమించిరట కాని చివరివాడు తిరిగి వచ్చినాడు ఆయినను అతని మేనమామలు ఆ ఆస్తిని స్వాధీనము చేయలేదు నిన్ను మేము పోషించెదము నీవు పెండ్లి చేసి కొనకుము అనిరట అతడు కోపముతో ఒకగొల్లవాని సహాయమున మేనమామ కొడుకును హత్యచేసెనట అయినను ఆ మేనమామలు అతని ఆస్తిని స్వాధీన పరచలేదు అతడు పెండ్లి చేసుకొనినాడు అతనికి ఒక కొడుకు పుట్టెను అతని పేరు గోవిందరెడ్డి కొన్నాళ్ళకు ఆ చివరివాడు చనిపోయెను అతనికి సహాయము చేసినగొల్లవాడు కొడుకుగోవిందరెడ్డి పరముగా కోర్టులో కేసువేసినాడు తన 10 ఎకరాల పొలమునమ్మి ఆ కుఱ్ఱవానికి ఆస్తిని సంక్రమింప జేయుటకు శతవిధముల ప్రయత్నించినాడు అయినను ఫలితము లేకపోయినది మేనమాలు లంచము లిచ్చి కేసు నెగ్గినారు కొన్నాళ్ళకు ఆ గొల్లవాడు కూడగతించినాడు గోవిందరెడ్డి దిక్కులేనివాడయినాడు జమ్మలమడుగులో సుద్దమల్ల చిన్నపరెడ్డి అనువాని యింటిలో పెరిగినాడు ఆ యింటిలోనే పనిచేసికొని బ్రతికెడివాడు ఇటీవలనే ఎక్కడికో వెళ్ళిపోయినాడు

(12 12 1965నాడు పెద్ద పసుపులో గ్రామవృద్ధులు చెప్పిన విషయము)

నారసింహారెడ్డిపై ఉయ్యాలవాడలోనున్న కవివతంసులు శతావధానులు శ్రీ పాణ్యం నరసరామయ్యగారు చెప్పిన పద్యముతో నాయీ వ్యాసమును ముగింతును

మ అమిత ప్రాభవ సర్వసైన్యసముపే తాంగ్లేయ సామ్రాజ్య సిం
హము మీసల్ నులివెట్టి లాగుచు నుదగ్రాటోప వీరోచితో
ద్యమ సంరంభ మొనర్చినట్టి 'నరసింహారెడ్డి' కాస్థాన రం
గముగా భూరియశంబు గాంచినది యీ గ్రామంబు పూర్వంబునన్

(1969 జూన్ నెల భారతి లో ప్రచురింపఁబడిన పరిశోధన వ్యాసము)

ఉపసంహారము ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గుఱించి మొట్టమొదట పరిశోధన చేసిన వ్యక్తిని నేను 1965 66 సంవత్సరాలలో ఈ పరిశోధన చేసితిని దీని ఫలితమును 1969 జూన్ నెల భారతిలో ప్రచురించితని నా తరువాత ఈ పరిశోధనను ముందుకు కొనసాగించిన వ్యక్తి బంగోరె (బండి గోపాలరెడ్డి) ఆయన పరిశోధన ఫలితములు

1977 డిసెంబరు నెలలో పుస్తక రూపములో ( బ్రౌన్‌జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు కడపజాబుల సంకలనం అను పేరుతో) ప్రచురింపబడినది 1986లో హైదరాబాదు విశ్వవిద్యాలయము (Central University) లో చరిత్ర విభాగములో ప్రొ॥ వి రామకృష్ణగారి పర్యవేక్షణలో శ్రీ ఎన్ రాఘవేంద్రగారు ఉయ్యాలవాడు నారసింహారెడ్డి విప్లవమును గుఱించి ఎం ఫిల్ పరిశోధన చేసినారు నారసింహారెడ్డిని గుఱించి సృజనాత్మక సాహిత్యమును సృష్టించిన వారిలో మొట్టమొదటి వ్యక్తి శ్రీ కలవటాల జయరామారావుగారు వీరు 1925లోనే రేనాటి వీరుడు అను నవలను ప్రకటించినారు ఈ నవలలో కేవలము కల్పనలే కాక అనేక చారిత్రకాంశములు కూడ పొందుపరుపబడినవి తరువాత చాలకాలమునకు 1976 సెప్టెంబరు నెలలో శ్రీ పాణ్యం నరసరామయ్యగారు స్వాతంత్ర్య వీరుడు అను పద్యకావ్యమును రచించినారు దీనిని శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారు ( రూపనగుడి మునసబు) 1976లోనే ముద్రించినారు ఈ అయ్యపురెడ్డిగారు 1983 లో గతించినారు వారి జ్ఞాపకార్థము వారి తమ్ములు 1984లో ఈ కావ్యమును మఱల ముద్రించినారు ఎమ్మట 1989 జులై నెలలో శ్రీ యిస్ డి వి అజీజ్ పాలెగాడు అను నవలను రచించి ప్రకటించెను తరువాత కడపలోని సవేరా ఆర్ట్స్ అను నాటక కంపెనీవారు ఉయ్యాలవాడ నారసింహారెడ్డి అను నాటకమును శ్రీ పల్లేటి లక్ష్మీకులశేఖర్‌గారి చేత వ్రాయించి రాయలసీమలో అంతటను ప్రదర్శించుచున్నారు ఇది అముద్రితము దీనిని రచనకు ప్రదర్శనకు సుమారు 1 లక్ష 50వేల రూపాయలు ఖర్చుచేసిన మహానుభావులు కీ శే బుడ్డా వెంగళరెడ్డి వంశానికి చెందిన శ్రీ బుడ్డా వెంగళరెడ్డిగారు ( మాజీ ఎం ఎల్ ఏ వేల్పునూరు వెలుగోడు మండలం కర్నూలు జిల్లా) ఈ నాటకములో నాయక పాత్రను ధరించుచున్నవారు సుప్రసిద్ధ రంగస్థల నటులు శ్రీ శివనాగిరెడ్డిగారు (నంద్యాల) ఇటీవల 1994లో ప్రొద్దుటూరుకు చెందిన డా॥ మైరెడ్డి నరసింహుడుగారు రేనాటివీరుడు పేరుతో ఒక నాటకమును రచించి ముద్రించినారు ప్రకాశం జిల్లా మోక్షగుండం గ్రామానికి చెందిన నా ప్రియమిత్రులు శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు కూడ ఉయ్యాలవాడ నారసింహారెడ్డి చరిత్రను నాటకముగా వ్రాసినారు అది అముద్రితము ఇటీవల హైదరాబాదు దూరదర్శన్‌వారు నారసింహారెడ్డి కధను టి వి సీరియల్‌గా చూపించినారు త్వరలో చలనచిత్రము కూడ రాగలదని ఆశింతము ఇప్పుడు అనగా 1999 ఫిబ్రవరి నెలలో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి 152వ వర్ధంతినాడు నేను రేనాటి సూర్యచంద్రులు అను ఈ గ్రంధమును ప్రకటించుచున్నాను

---

## మూడవ అధ్యాయము

# 'రాయలసీమ దానకర్ణుడు'
# బుడ్డా వేంగళరెడ్డి పాట

వీరగాధల (Ballads) లోను వీరగాధానికల (Balladlings) లోను తఱచుగా యుద్ధవీరవే ప్రశంసింపఁబడు చుండుటను పేరంటాండ్ర కధలలోనం కట్టుపదములలోను మాత్రము త్యాగవీరమున్నది దానవీరమును బ్రశంసించు గాధానికలుగూడఁ దెలుగులోఁ గొన్ని కలవు మానవసేవయే మాధవసేవగా భావించి కఱవుకాటకవములందు సాటిమానవులకుఁ దమ సర్వస్వము నిచ్చివేసిన దానకర్ణులపైఁగూడ జానపదులు భక్తి ప్రపత్తులతోఁ బాటలు పాడుకొందురు రాయలసీమలో బుడ్డా వేంగళరెడ్డి సుద్దపల్లి లక్ష్మమ్మ సుద్దపల్లి రామచంద్రారెడ్డి యాదాళ్ళ నాగమ్మ చిన్న అండ్లూరి శివమ్మ మోదిన్ పకర్‌దిన్ మున్నగువారి పైనను నెల్లూరు మండలమున కోడూరి బాలకోటారెడ్డిగారి పైనను గోదావరీ మండలమున డొక్కా సీతమ్మగారిపైనను నిట్టి పాటలున్నవి ఇవి కేవలము ప్రశంసలైనచో జానపదగేయము (Folk songs) లగునుకాని గాధానికలు కానేరవు కాని వీనిలో బుడ్డా వేంగళరెడ్డిగారి పాట డొక్కా సీతమ్మగారి పాట మున్నగువానిలోఁ గధాకధనమున్నది కావున నివి వీరగాధానికలే!

ఇట్లు దానవీరప్రశంసలగు లఘువీరగాధలలో బుడ్డా వేంగళరెడ్డిగారి పాట ప్రశస్తమైనది దీనికున్న వ్యాప్తి రాయలసీమలో మఱియే యితరగేయమునకును లేదు రాయలసీమలో ముఖ్యంగా రేనాడులో రైళ్ళలోను బస్సులలోను తిరునాళ్ళలోను నెక్కడఁ బట్టిన నక్కడ నీపాట వినిపించుచుండును దీని నెక్కువగాఁ గుంటి గ్రుడ్డివారు పాడుచుందురు

బుడ్డా వేంగళరెడ్డి రేనాటి దానకర్ణుడు రేనాటి సీమకు నుయ్యాలవాడ నారసింహారెడ్డి సూర్యుఁడు కాగా నీ వేంగళరెడ్డి చంద్రుఁడైనాడు ఈ సూర్య చంద్రులిరువురును నుయ్యాలవాడ గ్రామమునకే చెందినవారగుట మఱియొక విశేషము

ఈయన క్రీ శ 1822లో జన్మించి క్రీ శ 1900లో స్వర్గస్థుఁడయ్యెను నారసింహారెడ్డి విప్లవకాలమున వేంగళరెడ్డి యువకుఁడుగా నుండి యుండును క్రీ శ 1866లో విక్టోరియా మహారాణి వేంగళరెడ్డిగారి దానశీలత కబ్బురపడి స్వర్ణపతకమును బహూకరించెను ఇది ఉయ్యాలవాడలో వారి వంశస్థులకడ నేఁటికినిఁ గలదు (17 4 1966ననేనా గ్రామమునకుఁ బోయి దానిని చూచితిని) ఈ స్వర్ణ పతకముపై ముందు భాగమున నాంగ్లములోను వెనుకభాగమున దెలుఁగులోను ఈ క్రింది విధముగా వ్రాయఁబడియున్నది

Presented to Budda Vengala Reddı as a token of the hıgh appreciatıon of Her Majesty s government of hıs munıficent lıberalıty to hıs destıtute countrymen ın the famıne of 1866

1866 సంవత్సరములో సంభవించిన క్షామకాలమందు నిరాధారముగా వుండిన తన స్వదేశస్థులపట్ల జరిగించిన వుత్కృష్ణమయిన ఔదార్యమునకుగాను హర్‌మెజస్టీ రాణిగారివల్ల చేయుబడిన శ్రేష్ఠవుంయిన గణ్యతకు ఆనవాలుగా బుడ్డావెంగళరెడ్డిగారికి బహుమానము యివ్వబడ్డది

క్రీ శ 1866లో రాయలసీమలో గొప్ప క్షామము వచ్చినది అది ధాతనామ సంవత్సరమగుటచే దానిని ధాతకఱవు అని పిలిచిరి ఇది ముఖ్యముగా అనంతపుర మండలమున సంభవించెను బుడ్డా వేంగళరెడ్డిగారు క్షామ పీడితులైన ప్రజలకు మూఁడునెలల పాటన్నవస్త్రములిచ్చి కన్నతండ్రివలెఁ గాపాడెను పండ్రెండు పాతరల ధాన్యమును ఖర్చు చేసెను తనదగ్గఱనున్న ధాన్య మయిపోఁగా మిత్రులదగ్గఱ నప్పుచేసి క్షుధార్తులను బోషించెను శిబి దధీచి కర్ణాదుల కోవలోనివాఁడు వేంగళరెడ్డి!!

బుడ్డా వేంగళరెడ్డిగారి తండ్రి నల్లపరెడ్డి ఉయ్యాలవాడ గ్రామము వీరి స్వస్థలము నల్లపరెడ్డిగారికి వేంగళరెడ్డి జ్యేష్ఠపుత్రుఁడు ఇతని తరువాత తిమ్మమ్మ యను కూఁతురును ఈశ్వరరెడ్డి యను మఱియొక పుత్రుఁడును నతని తరువాత సుబ్బమ్మ యను వేఱొక పుత్రికయుఁ గలిగిరి వేంగళరెడ్డిగారికి వెంకటమ్మ నాగమ్మ యను నిరువురు భార్యలు కలరు వీరిలో నాగమ్మ చనిపోఁగా చెన్నమ్మ యను మఱియొక యువతిని వివాహమాడెను కాని వీరిలోనే యొక్కరికిని సంతానము గలుగలేదు (ఉయ్యాలవాడ గ్రామములో నున్న బుడ్డా దస్తగిరిరెడ్డిగారును శివారెడ్డిగారును వేంగళరెడ్డిగారి తమ్ముఁడగు ఈశ్వరరెడ్డిగారి మనుమలు)

శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించిన బుడ్డా వెంగల రెడ్డి చరిత్ర లో వేంగళరెడ్డిగారి భార్యలపేర్లు వేఱువిధముగా నున్నవి పెద్ద భార్య శేషమ్మ రెండవ భార్య వెంకటమ్మ మూడవ భార్య చెన్నమ్మ

వేంగళరెడ్డిగారి యింటిపేరు పూర్వము మద్దెల వారని యుండెడి దనియు వేంగళరెడ్డిగారు గొప్పదానపరుఁడై కీర్తి గడించిన తరువాత గొప్పవాఁడు వేంగళరెడ్డి యను నర్థమున బడా వెంగళరెడ్డి యని పిలువఁబడుచుండె ననియు నా బడా శబ్దమే జానపదుల యుచ్చారణలో బుడ్డా గా మాఱెననియు రేనాటిలోఁ గొందఱు పెద్దలు చెప్పుచున్నారు నారసింహారెడ్డి యింటిపేరు కూడా మద్దెల వారేయని నాకు లభించిన యొక వీరగాధానికను బట్టి తెలియుచున్నది నారసింహారెడ్డి బుడ్డావేంగళ రెడ్డి యిరువురును బూర్వకాలమున నొకే వంశమువారు జ్ఞాతులుకూడ ఇరువురును మోటాటి రాజవంశీకులే కాని నారసింహారెడ్డి పూర్వీకులలో చెంచుమల్ల జయరామి రెడ్డి కాలముననో లేక వీరనరసింహారెడ్డి కాలముననో యీ రాజకుటుంబములు రెండుగాఁ జీలిపోయినవి అప్పటినుండియు వీరికిని వారికిని వైవాహిక సంబంధములు లేవు ఆచారవ్యవహారములును భిన్నములయినవి★ చిరకాలముగా వచ్చుచున్న మోటాటి రాజవంశము నారసింహారెడ్డి గుంపు అనియు కృష్ణారెడ్డి గుంపు అనియు రెండుగా విడిపోయినది బుడ్డావేంగళరెడ్డిగారు కృష్ణారెడ్డిగుంపునకుఁ జెందిన మోటాటి రాచరెడ్డి!

బుడ్డా వేంగళరెడ్డిగారు చేసిన దానధర్మవులపై నెన్నియెూ కథలు జనపదములలో వ్యాప్తియందున్నవి అందుఁ గొన్ని కథలు మాత్రమే పాటలోఁ బేర్కొనఁబడినవి ఈ పాటకు నేను కర్నూలు మండలమున మూఁడు ప్రతులను సేకరించితిని నంద్యాలలో నొకటి కోవెలకుంట్లలో మఱియొకటి కాకరవాడలో వేఱొకటి స్వల్ప భేదములు తప్ప నీ మూఁడును నొకే రకముగా నున్నవని చెప్పవచ్చును వీని ప్రారంభ మిట్లుండును

**ఉత్తరాది ఉయ్యాలవాడలో – ఉన్నది దరమం సూడరయా**
**నేటికి బుడ్డా యెంగళరెడ్డీ – దొడ్డ పెబువనీ తెలియరయా! ॥ఉత్తరాది॥**

ఇది ఈ పాటకుఁ బునరావృత్తి (Refrain) వేంగళరెడ్డిగారి మూర్తి చిత్రణ మంతయు నీ క్రింది పంక్తులలోఁ గాననగును

★ *చూ ఉయ్యాలవాడ నారసింహారెడ్డికథ అను నావ్యాసము భారతి జూన్ 1969*

దొడ్డ ప్రెబువనీ దొరలు మెచ్చగా – ఇడుపున గూర్చోనుండునయా
ఇడుపున గూర్చో నెంగళరెడ్డీ – యికయిక నగుతా నుండునయా! ॥ఉత్తరాది॥

ధాతకఱవులోఁ దమ ప్రాణములను నిలిపిన రాయలసీమ దానకర్ణునిఁ బ్రజలిట్లు దీవింతురు

దానం దరమం గ్యానం తెలిసీ – దరమరాజువలె ఏలెనయా,
సచ్చిన బ్రతికిన ఎంగళరెడ్డికి –సర్గలోకమే ఉన్నదయా! ॥ఉత్తరాది॥
పున్నెం సేసిన ఎంగళరెడ్డికి – పూల పానుపే ఉండునయా,
మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని – మల్లెపూల పాన్పేతురయా! ॥ఉత్తరాది॥

పుణ్యముఁ జేసిన వేంగళరెడ్డిగారికి స్వర్గములో మల్లెపూల పాన్పు వేయుదురఁట ! ఎంత చల్లని దీవెన!!

దీని తరువాత వేంగళరెడ్డి బ్రాహ్మణున ఆవుపడ్డను దానము చేసిన కథ చెప్పఁబడును వేసవిలో నొక బ్రాహ్మణుఁడు ఉయ్యాలవాడలోని వేంగళరెడ్డిగారి యింటికి వచ్చి మజ్జిగ దాహమిమ్మని కోరెను రెడ్డిగారి చిన్నభార్య చెన్నమ్మగారు లేచుటకు బద్ధకించి మజ్జిగ లేదు పొండు అనెను ఈ మాట అరుగుమీఁదఁ గూర్చున్న వేంగళరెడ్డిగారికి వినఁబడినవి ఆయన దిగ్గున లేచి తిరిగి పోఁబోవుచున్న బ్రాహ్మణునాఁ యింటిలోనికిఁ బోయి కడవ తీసి చూచెను కడవ నిండుగా మజ్జిగ యున్నది లేదని చెప్పిన మజ్జిగను మఱల నిచ్చినచోఁ బాపమని భావించి యా బ్రాహ్మణునకు బంచభక్ష్య పరమాన్నములతో భోజనము పెట్టించెను మజ్జిగ లేనిచో మనకీ ఆవు ఎందులకు? అని భార్యతోఁ జెప్పి పాడిఆవును దూడను నా బ్రాహ్మణునకు దానము చేసెను ఎవరైన నా బ్రాహ్మణుని ఈ ఆవు ఎక్కడిది? అని ప్రశ్నించినచో వేంగళరెడ్డిదని చెప్పవలదనియు నట్లు చెప్పినచోఁ దాను ఋణపడి యుందుననియు నందుచే నా ఆవు దేవునదని చెప్పవలసినదనియు వేంగళరెడ్డిగా రా బ్రాహ్మణునిఁ గోరిరఁట! దాహమును దీర్చు కొనుటకై కొంచెము మజ్జిగ నడుగఁగా ఆవునే తోలియిచ్చిన మహాదాత బుడ్డా వేంగళరెడ్డి!! దీని తరువాత వేంగళరెడ్డిగారి దాతృత్వమును బ్రశంసించు మఱికొన్ని కథలు మరుసగా నీ పాటలో వచ్చును

ఒకనాఁడొక ఫకీరు స్త్రీ వేంగళరెడ్డిగారింటికి భిక్షమునకై వచ్చెను ఆమెకు వెంగళరెడ్డి యొక పట్టుచీరను దానము చేసెను ఆ పట్టుచీర రెడ్డిగారి భార్యయగు

చెన్నమ్మకుఁ బుట్టింటివారు పెట్టినది ఆ చీరను దన భర్త దానము చేసెనని తెలియఁగనే చెన్నమ్మగారు పెరటి మార్గమున వచ్చి యా బిచ్చగత్తెకడనున్న పట్టుచీరను లాగుకొని వేఱొక నూలుచీర నిచ్చెను అది వేంగళరెడ్డిగారికిఁ దెలిసి బాధపడి పట్టుదలతో సరిగానట్టి పట్టుచీరనే నేయించి యా ఫకీరువనితకు దానమిచ్చుటయే కాక యామెకుఁ దోఁబుట్టువుకన్న మిన్నగాఁ జీరసారెలు పెట్టి సాఁగనంపెనఁట!

వెంగళరెడ్డిగారు గుఱ్ఱమెక్కి చెన్నపట్టణములో నున్న రాణికడ కేఁగెను ఆ రాణి రెడ్డినిఁజూచి యేడువేల రూపాయలిచ్చి దానము చేయుమని కోరెను ఆ సభాప్రాంగణము దాటుసరికే యా ధనమంతయు వేంగళరెడ్డి దానము చేసివైచెను ఆతని వితరణ శక్తికి విక్టోరియారాణి యాశ్చర్యచకిత మయ్యెను

**కురిసీమిందా రాణెమ్మ తల్లీ – గుండెలావటిల నిలిపెనయా**
**వీడు ఎక్కడీ నరుడూ కాదూ – సెక్రవర్తి యనుకున్నదయా! ॥ఉత్తరాది॥**
**కిలకిల కిలకిల రాణి నగీ**
**ఎండి బంగరూ అచ్చు ఫారమూ – ఆగదంటనే పలికెనయా!**
**కిలకిల కిలకిల రాణి నగీ – రత్నాలదండ మెడకేసెనయా! ।ఉత్తరాది॥**

అంతేకాదు ఆ రాణి పంద్రెండు పుట్ల ధాన్యము పండెడి వేంగళరెడ్డిగారి పొలమునకుఁ బన్నులేకుండఁజేసెను కాని వేంగళరెడ్డిగారు రాఁబోవు కాలమెట్లుండునోయని సగముపన్ను కట్టెదనని చెప్పెను అప్పటినుండి యకరమునకు మూఁడుకాసులవంతునఁ బన్ను చెల్లించుచుండెను

వేంగళరెడ్డిగారి దగ్గఱ మిక్కిలిగ బలసిన చక్కని యెద్దొకటి యుండెను (ఈ యెద్దునే తరువాతి కాలమున అప్పలాపురం దొంతిరెడ్డి చెన్నారెడ్డి కొనెను) ఒకనాఁడు మాలమాదిగల ఎల్లలాట లాడుకొనుచు బలసియున్న వేంగళరెడ్డిగారి యెద్దునుజూచి ఆ యెద్దు నిచ్చినచోఁ దమకుఁ బండుగ వెడలిపోవునని పల్కిరి రెడ్డిగారి జీతగాండ్రా మాటలువిని కోపించి యాపిల్లల వెంటఁబడి తఱిమి తఱిమి కొట్టిరి వేంగళరెడ్డిగారి కీ విషయము తెలిసి మాలమాదిగల పిల్లలందఱను రప్పించి వారి దెబ్బలకుఁ జికిత్స చేయించి వారికిఁ గడుపుల నిండుగా భోజనములు పెట్టించి ఆ యెద్దును వారికిఁ దోలించెను (పాటలో నింతవఱకే యున్నది కాని జనశ్రుతినిఁబట్టి చెప్పు కథలో నా మాలపిల్లలు పెద్దలు వేంగళరెడ్డిగారి దగ్గఱకు వచ్చి మఱల నా యెద్దును

దోలి తెచ్చి మహాప్రభో! పిల్లలు తెలియక చేసిన తప్పును క్షమింపుఁడు అని బ్రతిమాలిరఁట ఇదియే సమంజసముగాఁ దోచుచున్నది )

వేంగళరెడ్డిగారెప్పుడును రాత్రులందే ప్రయాణములు చేయుచుండెడివారు ఒకప్పుడు విరూపాక్షికిఁ బోఁదలఁచి బయలుదేరెను నలుగురు గొరకదొంగలు రెడ్డిగారినిఁ జంపుటకై యడ్డగించిరఁట వేంగళరెడ్డిగారు నాయనా! మీ రాకలిగొని యున్నారు అన్నము తినిన తరువాత నన్నుఁజంపుడు! అని యా దొంగల నింటికిఁ దెచ్చి కడుపునిండుగా భోజనములు పెట్టి పిమ్మట నన్నుఁ జంపుఁడు అనెనఁట దొంగలు నలుగురును ఆయన కాళ్ళపైఁబడి క్షమింపవేఁడిరి ఆ దొంగల భార్యాపుత్రులిండ్లకడనెదురు చూచుచుందురని తలఁచి నలుగురు దొంగలకును నాలుగు బియ్యపు మూటలు గాడిదలపై వేయించి త్రోవ ఖర్చులిచ్చి యా దొంగలను సాఁగ నంపెను గాంధీజీ పుట్టకపూర్వమే అహింసా సిద్ధాంతము నమలు జరిపిన మహానుభావుఁడు బుడ్డా వేంగళరెడ్డిగారు!

ఒకనాఁడు రెడ్డిగారు పచ్చగుఱ్ఱమునెక్కి చెన్నంపల్లె కుఁ బోవుచుండెను ఆ చెన్నం పల్లెలో వేంగళరెడ్డినిఁ జంపవలెనని కొందఱు శత్రువులు మాటు పెట్టిరఁట ఆ శత్రువుల యింటనున్న మాలవాఁడొకడు ఉయ్యాలవాడకువచ్చి ఈ విషయమును వెంగళరెడ్డిగారికి విన్నవించెను ఆ మాలవానికిఁ దనయందుఁగల భక్తికి మెచ్చి వానిని దన దగ్గఱనే యుంచుకొని పెంచి పెద్దచేసి వైభవోపేతముగా వానికిఁ బెండ్లి చేసెను మూఁడు దినములు జరఁగిన యా మాలవాని పెండ్లికి దానకర్ణుఁడగు వేంగళరెడ్డిగారు ప్రజల కెట్టి శాసనము చేసెనో చూడుఁడు

**చుట్టూ ఉండే ఆమడ పొడుగూ –లోపల మూడు దినముల వరకూ**
**కుండపెట్టి కూడొండిన వాడికి – జులుమానుందని పలికెనయా!**

ఉయ్యాలవాడ గ్రామమునకు జుట్టు ప్రక్కల నామడ మేరలోఁగల గ్రామవాసులందఱును మూఁడు దినములపాటు తన యింటనే భోజనము చేయవలెనఁట! దీని నతిక్రమించి స్వయముగా వంటచేసికొన్నవారికి జుల్మానా విధించునఁట!!

ఒకప్పుడు వేంగళరెడ్డిగారు తమ జొన్న చేలలోఁ గంకుల కోఁతకు మాల మాదిగలను బిలిచి కంకులన్నియును మీరు కోసికొని వట్టి చొప్పను నాకుఁ బంపుఁడు అని చెప్పెను వారట్లు చేయగా వేంగళరెడ్డిగారి బంధువులు కోపించి ఆ

మాలమాదిగలను బట్టుకొని కొట్టి చావడిలో బంధించిరి అది వేంగళరెడ్డి గారికిఁ దెలిసి యెంత క్షోభించెనో చూడుఁడు

ఎవరు కొట్టిరో నా పిల్లలనూ – ఎవరు తిట్టిరో నా పిల్లలనూ
మూడు నూర్లా దుడ్డు పోసీ – మందినెల్ల యిడిపించెనయా!

ఇట్లు వేంగళరెడ్డిగారిపై వ్యాప్తియందున్న వీరగాథానికలో రెడ్డిగారి దాతృత్వమును బ్రశంసించునట్టి యేడుకథలు మాత్రమే చెప్పఁబడినవి ఇంకను ఎన్నియో కథలు వచనరూపమున జనపదములందు వృద్ధులచేఁ జెప్పఁబడుచున్నవి (ఇట్టి వచన కథలను నేను నలుబదివఱకును సంపాదించితిని)

వేంగళరెడ్డిగారి పాటలో నొక విశేషమున్నది ఇందుఁ గేవలము కథాకథనమే కాక రసవంతమగు కవిత్వమును గలదు బలసియున్న వేంగళరెడ్డిగారి కోడెను జూచి ఆటలాడుచున్న మాలమాదిగల ఎల్లలు తమలోఁ దాము భాషించుకొనుట చాల సహజముగా వర్ణింపబడినది

ఒరె మల్లుగా! యిటుసూడరా! – ఒరె యెల్లుగా! యిటు సూడరా!
యెంగళరెడ్డివి యీర యెద్దులూ – యెంగళరెడ్డివి యీర కోడెలూ
కాటుక కన్నుల కట్టె కోడెరా – కార్తిక మాసంలో రెడ్డి పట్టినడు
నాలుగు కాళ్ళా మట్టమున్నదీ – నడినెత్తిన మరి సుక్కవున్నదీ
బిళ్ళ కొమ్ములా కట్టె కోడెరా – బిగువు కండలా యీర కోడెరా
పందుం బియ్యం గిత్తయితే మా – పండుగవుతదని పలికిరయా!

ఈ యెద్దును మాల వాడలకుఁ దోలుచు వేంగళరెడ్డి దు ఖపోయెను

ఏమి యెరుగని యెద్దుగిత్తకూ – పుటిక మేతలే పెట్టెనయా
చెవులోననే వెంగళరెడ్డి – 'నాయనా! ఓ బసవదేవుడా!
నీకూ నాకూ బుణాలు దీరెను – మాలవాండ్ల యిండ్లకు నీవు
ఒడ్డేలి కట్టెకు పూజకెల్ల' మని సెప్పెనయా!

వేంగళరెడ్డిగారి కీర్తి యెండ కాసిన మండలమంతయుఁ బ్రాకిపోయెఁట! ఎండగాసినా మండలానికీ ఎరుకగలిగినా రెడ్డివయా! ఈ విధముగా నెవరైనను బొగిడినచో వీధియరుగుపైఁ గూర్చొని వికవిక నవ్వుచుండెడివాఁడట వేంగళరెడ్డి! ఈయన చెంగావి పంచెలు ఎంగారించుకొని గుఱ్ఱమెక్కి చెన్నపట్టణముపోఁగా నా పట్టణములో

సాహెబుదొరలు ఇన్‌స్పెక్టర్లు పోలీసు జవాన్లు వేంగళరెడ్డిగారికి సాబు సలాములు సేసిరయా వొంగొంగి సలాములు సేసిరయా! బుడ్డా వేంగళరెడ్డిగా రెన్నిరకములు దానములు చేసిరో తెలుపుచు నీ పాటలో నొకచో నిట్లున్నది

హరినారాయణ అన్నవారికీ – అన్నవస్తరము లిప్పించెనయా!
గోయిందాయని పాడే జనులకు – గోవు దానమే చేసెనయా!
పాలు లేని పసిబాలురకెల్లా – పాల సలేంద్రలు పెట్టైనయా!
పెళ్ళిళ్ళుకానీ బీదజనులకూ – పెళ్ళిళ్ళే సేయించెనయా
కాలులేని కరమొండి వాళ్ళకూ – ఒంటెద్దు బళ్ళు సేయించెనయా
కుంటివాళ్ళకూ గుడ్డివాళ్లకూ – ఈడూ జోడూ మనుములు సూసీ
పెళ్లిళ్లే సేయించెనయా – పెళ్లిళ్లే సేయించెనయా!
పుణ్యం సేసిన యెంగళరెడ్డికి – పూలపానుపే వచ్చునయా!
మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని – మల్లెపూల పాన్పేతురయా!

ఉయ్యాలవాడలోఁగల వేంగళరెడ్డిగారి వంశమువారికడ నేఁటికిని ఈ దాతృత్వ గుణమున్నది ప్రతి సంవత్సరమును ఉగాది పండుగనాఁడు వేంగళరెడ్డిగారి సమాధి దగ్గఱ కుంటి గ్రుడ్డివారికిఁ బంచభక్ష్యపరమాన్నములతో గొప్పఅన్నదానము జరుగును ఈ యపూర్వమగు నన్నదానమును వేంగళరెడ్డిగారి వంశస్థులే నిర్వహింతురు బస్తాలకొలది బియ్యమును వండి అన్నమును రాసులుగాఁ బోయుదురు దేశము నలుమూలల నుండియు వేలాదిగా బిచ్చగాండ్రు ఉయ్యాలవాడకుఁ జేరుదురు ఈ బిచ్చగాండ్రందఱును భోజనము చేయుటకు ముందు బుడ్డా వేంగళరెడ్డిగారికి విక్టోరియా మహారాణి యిచ్చిన స్వర్ణపతకమును గన్నుల కద్దుకొందురు గ్రుడ్డివారు సహాతము పతకమును జేతులతోఁదడిమి ఆ చేతులను గన్నుల కద్దుకొందురు ఈ పనిచేయకుండ నొక్క బిచ్చగాఁడైనను ముద్దయెత్తఁడు! ఈ దానకర్ణుఁడు యశ కాయుఁడనుటలో నిఁక సందేహ మేమున్నది?

వేంగళరెడ్డిగా రెప్పుడును పేదల కన్నదానమే చేసెడువారుకాని ధనదానము చేసెడివారు కారు మానవుని ప్రాణములను నిల్పునది పరబ్రహ్మ స్వరూపమగు నన్నమేయని యాయన నమ్మకము అందుచేఁ బ్రాణాధారమగు నన్నమునే దానము చేసెడివారు ఒకవేళ నెప్పుడైనను డబ్బిచ్చినచో నొక్క దమ్మిడీ మాత్రమే యిచ్చెడివారు అందుచేఁ గొందఱు బిచ్చగాండ్రు బుడ్డా యెంగల్‌రెడ్డి దమ్డీ దమ్డీ! యెన్నాళ్ళు బతికినా దమ్డీ దమ్డీ! యని పాడెడివారు

వేంగళరెడ్డిగారి జీవితమంతయు సమగ్రముగా జిత్రించుచు బందుమియ్యా యను ముస్లిముకవి చక్కని ద్విపదకావ్యమును రచించెను ఇది అముద్రితము ఈ బందుమియ్యా బుడ్డా వేంగళరెడ్డిగారికి సమకాలికుఁడు (ఇప్పుడు ఈ గ్రంథములో ఆ ద్విపద కావ్యమును అనుబంధముగా ముద్రించితని )

దానపరురాలైన డొక్కా సీతమ్మగారిపైఁగూడ నిట్టి కధాత్మక గేయమొకటి తూర్పు గోదావరీ మండలములోఁ బాడఁబడుచున్నట్లు తెలియుచున్నది ఇది నాకు లభింపలేదు

## అనుబంధము – 1



## అనుబంధము – 2

బుడ్డా వేంగళరెడ్డిగారి అసలు ఇంటిపేరు మద్దెలవారు వేంగళరెడ్డిగారి తండ్రి మద్దెల నల్లపరెడ్డి ఈ మద్దెల నామము వేంగళరెడ్డిగారి కాలముననే మఱుఁగుపడిపోయి బుడ్డా యను పేరు స్థిరపడినది (ఇది బడా శబ్దమునుండి వచ్చినదని వెనుక తెలియఁ జేసితిని) కాఁబట్టి వేంగళరెడ్డిగారి తమ్ముఁడైన ఈశ్వర రెడ్డిగారికిని వారి సంతానమునకును మద్దెల యను గృహనామముపోయి బుడ్డా యనునది సంక్రమించినది ఇది సమంజసమే కాని వేంగళరెడ్డిగారి చిన్నచెల్లెలు సుబ్బమ్మగారు ఈమె దుబ్బా వారి కోడలు ఈమె సంతానము దుబ్బా వారు కావలసియున్నది కాని వీరు కూడ దానకర్ణుఁడగు తమ మేనమామయందలి భక్తితోఁ దమ యింటిపేరును బుడ్డా గా మార్చుకున్నారు అందుచే నీ సుబ్బమ్మగారి సంతానమును గూడ వేంగళరెడ్డిగారి వంశవృక్షములోఁ జూపవలసివచ్చినది

## అనుబంధము – 3

బుడ్డా వేంగళరెడ్డిగారు క్రీ శ 1822 లో జన్మించినట్లుగా బందుమియ్య తన ద్విపద కావ్యములో (అముద్రితము) స్పష్టముగాఁ జెప్పినాడు ఈ కవి వేంగళరెడ్డిగారి సమకాలికుఁడు కావున నిదిమనకుఁ బ్రమాణము వేంగళరెడ్డి తండ్రియగు నల్లపరెడ్డి పురోహితునితో నిట్లు చెప్పును

'పదినెన్మ నూటనిర్వదిరెండు యేండ్ల
యొదవిన చిత్రభాన్వత్సర జ్యేష్ఠ
మొనరంగ ప్రథమ సంపూర్ణ కందాయ
మున శ్రీశు సితపక్షమున గురువార
మవనిని సౌభాగ్యమను సుయోగమున
నవమి రోహిణి శుభనక్షత్రముననను
రమణీయమైన కర్కాటక లగ్న
సమయాన యా పగల్ సలలితవేళ
నా పూర్వకృతమున నాకు సంతాన
మీ పట్ల కృపజేసె యీశ్వరుం డొసఁగె '

పై పంక్తులలో ద్రుతముమీద యడాగమములు సంధియున్నచోట యడాగమములు నున్నవి బందుమియ్య కవియేగాని పండితుఁడుగాఁ దోపఁడు

## అనుబంధము - 4

బందుమియ్య ద్విపద కావ్యములో వేంగళరెడ్డిగారికి ముగ్గురు భార్యలనియు వారు వరుసగ వెంకటమ్మ నాగమాంబ చెన్నమ్మ యనియుఁ దెలుపఁబడినది కాని ఎచ్చుకుంట్ల కడనున్న గ్రంధములలో నీ భార్యల వరుసక్రమము వేఱుగానున్నది మొదటి భార్య వెంకటమ్మయనియు రెండవ భార్య చెన్నమ్మయనియు మూఁడవ భార్య నాగమ్మ యనియుఁ గలదు అట్లే బందుమియ్య కావ్యములో వేంగళరెడ్డిగారి తల్లిపేరు అక్కమ్మ యని కలదు పిచ్చుకుంట్ల గ్రంధములో నీ పేరు అంకమ్మ గా నున్నది

పిచ్చుకుంట్ల కడనున్న గ్రంధములలో బుడ్డా వేంగళరెడ్డిగారి పూర్వులను గుఱించి యిట్లు వ్రాయఁబడియున్నది

ఉయ్యాలవాడ గ్రామం క్రిష్టారెడ్డిగారి సమస్థానము మద్దెలవారి పెద్దలు మద్దెల నల్లపురెడ్డి భార్య అంకమ్మ పోచావారి ఆడబిడ్డ ఈమె పుట్టినిల్లు ఉయ్యాలవాడ కొడుకులు వెంగళరెడ్డి భార్యలు వెంకటమ్మ పోచావారి ఆడబిడ్డ ఈమె పుట్టినిల్లు ఉయ్యాలవాడ రెండవ భార్య చెన్నమ్మ తరిగోపులవారి ఆడబిడ్డ ఈమె పుట్టినిల్లు బోడెమ్మనూరు మూడవభార్య నాగమ్మ పల్లెవారి ఆడబిడ్డ ఈమె పుట్టినిల్లు వుయ్యాలవాడ వీరు నిస్సంతు ఇదే వంశములో ఈశ్వరరెడ్డి భార్య అంకమ్మ అ(హ)రపు రెడ్డివారి ఆడబిడ్డ ఈమె పుట్టినిల్లు బోడెమ్మనూరు కొడుకులు రామిరెడ్డి భార్య వెంకటమ్మ దుబ్బావారి ఆడబిడ్డ ఈవెు పుట్టినిల్లు వుయ్యాలవాడ ఈ విధముగా నీశ్వరరెడ్డిగారికి రామిరెడ్డియను పుత్రునితోఁబాటు నల్లపురెడ్డి తిమ్మారెడ్డియను మఱియిద్దఱు పుత్రులున్నారనియు బెద్దకొడుకైన రామిరెడ్డికి వెంకటవమ్మయను భార్యయందు ఈశ్వరమ్మ రామిరెడ్డి అక్కమ్మ యనువారు కలిగిరనియు నట్లే నల్లపురెడ్డికి లింగమ్మయను భార్యయందు దస్తగిరిరెడ్డి రామకృష్ణారెడ్డి కలిగిరనియుఁ గలదు వేంగళరెడ్డిగారి తమ్ముఁడైన ఈశ్వరరెడ్డిగారికి మూఁడవతరమువారైన శివారెడ్డి దస్తగిరి రెడ్డిగారలు ఉయ్యాలవాడలో నున్నారు ఎచ్చుగుంట్ల ఇచ్చిన వంశవృక్షములో శివారెడ్డిగారి స్థానము నిరూపింపఁబడలేదు ఈశ్వరరెడ్డిగారి పెద్దకొడుకైన రామిరెడ్డిగారి ద్వితీయ పుత్రుఁడు శివారెడ్డిగారు దీనిని ఎచ్చుకుంట్లు చూపలేదు

## అనుబంధము - 5

బుడ్డా వేంగళరెడ్డిగారికి చెన్నపట్టణములో విక్టోరియా మహారాణి స్వర్ణపతకమును బహూకరించినట్లుగాఁ బాటలో నున్నది ఇది సరికాదు విక్టోరియా మహారాణి తన పాలనా కాలములో ఇండియాకు వచ్చినట్లు లేదు ఆమె సీలుతోనున్న పతకమును మద్రాసు గవర్నరు రెడ్డిగారికి బహూకరించియుండును బనగానపల్లెలోని కల్లెక్టరు రెడ్డిగారి దాతృత్వమున కాశ్చర్యపడి మద్రాసు గవర్నరుకుఁ దెలియఁజేసెనని యు నతఁడు ఇంగ్లండునకు వ్రాసి రాణి యనుమతిని బొంది స్వర్ణపతకమును బహూకరించెననియుఁ దెలియుచున్నది

ఈ స్వర్ణపతకము వేంగళరెడ్డిగారికి రెండు మాఱులీయబడినట్లు తెలియుచున్నది క్రీ శ 1866లో మొదట నిచ్చినప్పుడది 20 తులముల బంగారముతోఁ జేయబడినట్టిది దీనిని రెడ్డిగారు తన దండకుఁ గట్టుకొనెడివాఁడఁట దీని నెవరో దొంగలు తస్కరించిరఁట ఈ విషయమును రెడ్డిగారెవరితోను జెప్పలేదు కాని యొకప్పుడు బనగానపల్లెలోని కల్లెక్టరు రెడ్డిగారిని జూడవచ్చి పతకమును గూర్చి ప్రశ్నించెను రెడ్డి చిఱునవ్వు నవ్వెను కల్లెక్టరుకు అనుమానము వచ్చెను నొక్కి యడిగెను అప్పుడు రెడ్డి జరిగిన విషయమును జెప్పెను ఆ కల్లెక్టరు వెంటనే మద్రాసు గవర్నరుకు వ్రాసి వేఱొక పతకమును దెప్పించి యిచ్చెను ఇప్పుడు ఉయ్యాలవాడలో వేంగళరెడ్డిగారి వంశస్థులకడ నున్నది యీ రెండవ పతకమే ఇద 10 తులముల బంగారముతోఁ జేయఁబడినది ఈ పతకములో నాయకమణివలె మధ్యనొక పెద్దగుండ్రనిబిళ్ళ ఆ బిళ్ళ పైభాగమున విక్టోరియారాణి కిరీటము ఆ బిళ్ళ ముందుభాగమున నాంగ్లములోను వెనుక భాగమునఁ దెలుఁగులోను వేంగళరెడ్డిగారి దాతృత్వమును ప్రశంసించు వాక్యములును గలవు మధ్యనున్న గుండ్రనిబిళ్ళకు రెండువైపులను నాఱేసి చిన్నబిళ్ళలు వరుసక్రమమున నతుకఁబడి యున్నవి ఈ పతకమంతయు నొకచెక్క పెట్టెలోఁ బెట్టఁబడి యున్నది ఇదియొక సంవత్సరము బుడ్డా శివారెడ్డిగారి యింటను మఱియొక సంవత్సరము బుడ్డా దస్తగిరి రెడ్డిగారి యింటను నుండును

## అనుబంధము - 6

ఉయ్యాలవాడ గ్రామమునకుఁ బశ్చిమముగా నూరిబయట పంటపొలములో వేంగళరెడ్డిగారి సమాధియున్నది ఇట నొక పెద్దమఱ్ఱిచెట్టు గలదు ... ధి

కిరువైపులను సత్రములు కట్టబడియున్నవి ప్రతి సంవత్సరమును ఉగాది పండుగనాఁడు ఈ సత్రముల దగ్గఱ గొప్పయన్నదానము చేయఁబడును ఉగాది రేపు అనఁగా (అమావాస్యనాడు) బుడ్డా వేంగళరెడ్డిగారి చిన్నచెల్లెలైన సుబ్బమ్మగారి వంశస్థులు సంతర్పణ చేయుదురు ఉగాదినాఁడు వేంగళరెడ్డిగారి తమ్ముఁడైన ఈశ్వరరెడ్డిగారి వంశస్థులు సంతర్పణ చేయుదురు

వేంగళరెడ్డిగారి వంశస్థులకడ నేటికిని దాతృత్వగుణము హెచ్చుగా కనఁబడును బుడ్డా వేంగళరెడ్డిగారిని గూర్చిన విషయములను సేకరించుటకై నేను 17 4 1966న ఉయ్యాలవాడ గ్రామముమ కేఁగి బుడ్డా శివారెడ్డిగారిని వారి పుత్రులు శ్రీరాములు రెడ్డిగారిని దర్శించితిని శివారెడ్డిగారి దాయాదులైన బుడ్డా దస్తగిరి రెడ్డిగారిని రామకృష్ణారెడ్డిగారిని గూడఁజూచితిని వీరందఱును నన్ను అపూర్వముగా సత్కరించుటయే కాక వెండిపళ్ళెరములో షడ్రసోపేతముగా భోజనముఁబెట్టి తాంబూల మిచ్చి పట్టు పరుపులపై నొక గంట విశ్రమించిన తరువాతఁగాని నన్నుఁ బోనీయలేదు నేను వారి మన్నన నీ జన్మలో మఱువలేను

## అనుబంధము – 7

బుడ్డా వేంగళరెడ్డిగారి దాతృత్వమును బ్రశంసించు కథలనేకములున్నవి వీనిలో నేడు కథలు మాత్రము వెంగళరెడ్డిగారి పాట లోఁ బేర్కొనఁబడినవి అవి (1) బ్రాహ్మణుఁడొకడు మజ్జిగనడుగఁగా నెనుమును దానము చేయుట (ఇది ఎనుము కాదు గోవు అని కొందఱు) (2) ఫకీరు స్త్రీకి వస్త్రదానము చేయుట (3) చెన్నపట్టణమునకేగి రాణి ప్రశంసల నందుకొనుట (4) మాలమాదిగల పిల్లలకుఁ దన యెద్దును గోసికొని తినుటకై దానము చేయుట (5) తన్నుఁజంపఁ దలఁచిన దొంగలను సత్కరించి పంపుట (6) తన్ను మృత్యువు నుండి కాపాడిన మాలవానికిఁ బెండ్లి చేయుట (7) జొన్న కంకులను కూలీలకిచ్చి తాను వట్టి చొప్పను పరిగ్రహించుట ఈ యేడు కథలేకాక మఱెన్నియో కథలు ప్రచారమందున్నవి ఉయ్యాలవాడలో దస్తగిరియను డెబ్బదియేండ్ల వృద్ధుడిట్టి కథలు కొన్ని నాకుఁ జెప్పినాఁడు వాని నీ క్రింద పొందు పఱుచుచున్నాను

(1) ఉయ్యాలవాడ గ్రామమునకు మూఁడు మైళ్ళ దూరములో పాంపల్లె యను గ్రామమున్నది ఆ గ్రామములో ఆదిశేషయ్య వేంకటాచార్యులు అను

నిరువురు బ్రాహ్మణులుండిరి వారి యింటిలో నొకప్పుడు వివాహము జరిగెను ఆ వివాహమునకు బంగారు మొలత్రాడు కావలసి వచ్చెను బుడ్డా వేంగళరెడ్డిగారి దగ్గఱ నాలుగు బంగారు మొలత్రాళ్ళుండెడివి ఒక్కొక్కటి శేరు శేరు బంగారముతోఁ జేయఁబడినట్టివి ఆ బ్రాహ్మణు లిరువురును ఉయ్యాలవాడకు వచ్చి రెడ్డిగారిని దర్శించి యొక మొలత్రాడు నరువుగా నిమ్మనిరి రెడ్డి యిచ్చెను వివాహానంతరము మఱల ఆ బ్రాహ్మణులు వచ్చి మొలత్రాడును తిరిగి యీయఁబోగా రెడ్డి వారితో స్వామీ! దీనిని మీరే యుంచుకొనుడు అని దానము చేసెను

(2) ఒకనాడు వేంగళరెడ్డిగారికడకొక బ్రాహ్మణుఁడు వచ్చెను రెడ్డి యతనికి భక్తితో నమస్కరించి పది రూపాయలు దానము చేసెను దానికా బ్రాహ్మణుఁడు సంతృప్తిఁజెందక రెడ్డితో నాకు వందరూపాయలు కావలెను! అనెను వేంగళరెడ్డిగారు చిఱునవ్వు నవ్వుచు స్వామీ! తమకెంత ప్రాప్తమున్నదో అంత వచ్చినది తీసికొని తృప్తిఁజెందుఁడు! అని సవినయముగా మనవిచేసెను దానికా బ్రాహ్మణు డంగీకరింప లేదు నీ వీయదలఁచుకొన్నచో వందరూపాయలీయవచ్చును గదా! దీనికిని నా ప్రాప్తమునకును సంబంధమేమున్నది? అని ప్రశ్నించెను వేంగళరెడ్డిగారు మనలో నేమున్నది స్వామీ అంతయు దైవలీల! నేడు మీకు పదిరూపాయలే ప్రాప్తమున్నవి అందుచే నా చేతికిఁ బదిరూపాయలే వచ్చినవి అని చెప్పి రెండు చేటలలో బియ్యము పోయించి యా రెండుచేటలను నా బ్రాహ్మణునెదుట పెట్టించి స్వామీ! మీ ప్రాప్తమును బరీక్షించుకొనుఁడు! అనెను ఆ బ్రాహ్మణుఁ డొకచేట నెన్నుకొనెను వేంగళరెడ్డి యా చేటలోని బియ్యము నొత్తిగించి చూపెను పదిరూపాయలేయున్నవి! చూచితిరా స్వామీ! నేఁడు మీకు పదిరూపాయలే ప్రాప్తము! అనెను కాని యా బ్రాహ్మణుఁడు నమ్మలేదు పైగా వేంగళరెడ్డిగారి ననుమానించెను గూడ మీరు రెండు చేటలలోను పదిరూపాయలే యుంచినారు! అని యధిక్షేపించినాఁడు వేంగళరెడ్డిగారు చిఱునవ్వుతోనే ఎచ్చివాడా! చూడుము అని రెండవచేటలోని బియ్యము నొత్తిగించి చూపెను అందులో వందరూపాయల నోటున్నది బ్రాహ్మణుఁడు సిగ్గుపడి పదిరూపాయలతోఁ దృప్తిఁజెంది వెడలిపోయెను

(3) వేంగళరెడ్డిగారి కొకప్పుడు రాచపుండు లేచెను దానికి వైద్యము చేయించుకొనుటకై పేరుసోమల యను గ్రామములోనున్న దూదేకుల సాహెబు కడకు వెళ్ళెను రెడ్డిగారిని జూచుటకై చుట్టుప్రక్కల గ్రామములనుండి యెందరో వచ్చిరి తన్నుఁ జూడవచ్చినవారందఱకును రెడ్డిగారు మాంసాహారముతో భోజనముల నేర్పాటు

చేయించెనఁట ఒక రోజుకాదు రెండు రోజులుకాదు వారా గ్రామములో నెంతకాలముండిరో అంతకాలము నట్లే సంతర్పణ గావించిరఁట!

(4) బుడ్డా వేంగళరెడ్డిగారెప్పుడును నొంటరిగా భోజనము చేసెడివారు కారు తనతోఁ బ్రతిదినమును గనీసము పదిమందియైనను నుండవలెను పదిమందితోఁ గూర్చున్నను దన భోజనము ప్రత్యేకముగా నుండరాదు తనకెట్టి భోజనము వడ్డింతురో తక్కినవారికిని నదే భోజనము వడ్డింపవలెను లేనిచో భుజించెడివాఁడు కాడు అందుచే నాయన భార్యలు భర్తతో సమముగా నతిధుల కన్నపానముల నొసఁగెడివారు ఊరికే పెట్టిన అమ్మా! నీ మొగుడుతో సమానంగా పెట్టు అను సామెత వేంగళరెడ్డిగారి యింట వ్యర్థమైనది

(5) వేంగళరెడ్డిగారు ప్రతి సంవత్సరము నుగాది పండుగనాఁడు పెద్దయెత్తున అన్నదానము చేసెడివాఁడు (ఈ సంప్రదాయమునే ఆయన వంశస్థులు నేటికిని పాటించుచున్నారు) ఆ దానములోఁ బేదలచే నేయి త్రాగించెడివాఁడు శేరు అర్థశేరు పావు అరపావు పట్టెడి రేకుగిన్నెలు (పావులు) చేయించి వానితో నెవరెంత త్రాగిన నంత నేయి భోజనమునకు ముందు పోసెడివాఁడు ఆ రోజులలో 12శేర్ల నేయి త్రాగెడి మనుష్యులు కూడ నుండెడివారఁట

(6) ఉయ్యాలవాడకు సమీపములో సర్వాయిపల్లె కలదు అటనొక ధనికుఁడుండెను ఇతఁడు మేనా పగటి దివిటీ కల పాళెగాడు బుడ్డా వేంగళరెడ్డిగారికి దానపరుఁడుగా పేరువచ్చుటను జూచి యతఁడు సహింపక తానును ధర్మపరుఁడనని చాటుకొనఁదలఁచెను ఉగాదినాఁడు తన గ్రామము మీదుగా పోవుచున్న భిక్షువులనాం భోజనము పెట్టి మనిషికి రూపాయి చొప్పున బత్తెమిత్తునని చెప్పెను కాని యాభిక్షువు లాతని మాటలు వినక తిన్నఁగా ఉయ్యాలవాడ కేతెంచిరి

(7) క్రీ శ 1866లో అనంతపుర మండలమున దుర్భర క్షామము సంభవించెను ప్రజలు వేలాదిగా వలసపోయిరి రోజు రోజు వందలకొలది జనులు ఉయ్యాలవాడకుఁ జేరఁజొచ్చిరి వేంగళరెడ్డిగారు వచ్చినవారందఱికిని లేదనకుండ తృప్తిగా భోజనములు పెట్టెడివారు రెడ్డిగారికడ 12 పాతర్ల ధాన్య ముండెను ఒక్కొక్క పాతరలో 120 బస్తాలు మొత్తము 120X12 1440 బస్తాల ధాన్యము ఈ ధాన్యమంతయు నా క్షామకాలమున వెచ్చించి వేసెను ఈ ధాన్యముతో మూఁడు మాసములు క్షామపీడితులను బోషించెను వేంగళరెడ్డిగారి యింటికడ భోజనములు

చే. తృప్తిగా గోవిందలు కొట్టుకొనుచు బనగానపల్లెమీఁదుగా క్షామపీడితులు పోవుచుండిరి అప్పుడు బనగానపల్లెకు వచ్చియున్న గవర్నరు ఈ జనప్రవాహమును జూచి విషయమును దెలిసికొని ఆశ్చర్యపడి ఉయ్యాలవాడకు వచ్చి ఆ దానకర్ణుని స్వయముగాఁజూచి ఢిల్లీలోని వైస్రాయికిని ఇంగ్లండులోని మహారాణికిని దెలియఁజేసెనఁట అప్పుడు మహారాణి వేంగళరెడ్డిగారికి స్వర్ణపతకమును బహూకరించెను

(8) బుడ్డా వేంగళరెడ్డిగారి కీర్తి దేశమంతయు వ్యాపించెను వారిని జూచుటకై పజలు తండోపతండములుగా నుయ్యాలవాడకు వచ్చుచుండెడివారు ఒకనాఁడెచటినుండియో నలుగురు రైతులు వేంగళరెడ్డిగారిని చూడవచ్చిరి వారు ఉయ్యాలవాడ గ్రామము సమీపమునకు పోయిరి అటనొక జొన్న బస్తాలతోనున్న బండి యూరిలోనికిఁ బోవుచుండెను దాని వెనుక నొక వృద్ధుఁడు రాలిపోయిన జొన్న విత్తుల నేఱుకొనుచుఁ బోవుచుండెను గ్రామస్థుఁడొకడా వృద్ధునిఁజూపి ఆయనయే బుడ్డా వేంగళరెడ్డిగారు! అనెను చూడవచ్చిన రైతులామాటలు నమ్మలేదు వారిలో నొకడు ఇతఁడా వేంగళరెడ్డి? మేము నమ్మజాలము బుడ్డా వేంగళరెడ్డివంటి గొప్పవాఁడు బండి వెనుక రాలిపోయిన జొన్న విత్తనముల నేఱుకొనునా? అనెను ఈ మాటలు బండివెనుక పోవుచున్న వేంగళరెడ్డిగారికి వినిపించినవి ఆయన మాటాడలేదు ఊరిలోనికి బోయిన తరువాత నావృద్ధుఁడే బుడ్డా వేంగళరెడ్డియని చూడవచ్చిన రైతులు గ్రహించిరి రెడ్డిగారితో మాటలాడుచు భోజన సమయము వఱకును నుండిపోయిరి భోజనములు చేయుదురులెండు అని రెడ్డిగారు చెప్పెను వారు పాదప్రక్షాళనము గావించుకొని భోజనమునకుఁ గూర్చుండిరి ఆకలితో నకనకలాడుచున్నవారు విస్తళ్ళ వంకచూచి కొయ్యబారిపోయిరి విస్తళ్ళలో నన్నమునకు బదులు వెండి రూపాయలు ప్రోవుపెట్టబడియుండెను అప్పుడు వేంగళరెడ్డి గారచ్చటికి వచ్చి నవ్వుచు నాయనలారా! నేను బండివెనుక రాలిపోయిన జొన్నవిత్తనముల నెందులకేఱితినో యిప్పుడైనను దెలిసినదా? మనుష్యుని ప్రాణములు నిలబెట్టునది ధాన్యమే కాని ధనము కాదు! అందుకే నేను పేదలకెల్లప్పుడును అన్నమునే దానము చేయుదును! అనెను రైతులా మాటలువిని సిగ్గుపడి తమ తప్పును క్షమింపవేడిరి వేంగళరెడ్డి వారికి పంచభక్ష్యపరమాన్నములతో భోజనము పెట్టి సాగనంపెను

(9) వేంగళరెడ్డిగారు పేదల కన్నదానము చేసినను బ్రాహ్మణులకు మాత్రము ధనదానమును గూడ చేయుచుండెడివాఁడు ఆయనకు బ్రాహ్మణుల యెడ

విపరీతమగు భక్తి బ్రాహ్మణులకెప్పు డే దానము చేసినను స్వామీ! ఇప్పుడింతేయున్నది మఱియొక సారి దయచేయుఁడు ఇంకను నిచ్చెదను! అని భంగపోయెడివాఁడఁట!

(10) ఒకప్పుడు వేంగళరెడ్డిగారి పొలములో వేరు సెనగకాయలు పెఱుకుచుండిరి వేంగళరెడ్డిగారచటకుఁబోయి కాయలన్నియుఁ గూలీలకు దానము చేసివైచెను తరువాత వేంగళరెడ్డిగారి తమ్ముఁడగు ఈశ్వరరెడ్డి యచటకు వచ్చెను కాయలు లేని పిప్పకట్టె మిగిలియుండుటఁజూచి ఈశ్వరరెడ్డి అన్నతో అన్నా! కాయలన్నియు దానము చేసి వైచితివి ఇక నాకేమి యున్నది? అని పలికెను వేంగళరెడ్డిగారు నవ్వుచు తమ్ముఁడా! చింతింపకుము ఈ పిప్పి కట్టెను దులుపుకొనుము నీ భాగము కాయలు నీకు రాలును అనెను ఈశ్వరరెడ్డి ఎప్పికట్టెను దులిపింపఁగా వేరుసెనగకాయలు జలజల రాలెనఁట! ఈ విషయము నుయ్యాలవాడలోఁ బ్రతివారును జెప్పుచున్నారు ఈ దానకర్ణుఁ డింతటి మహిమాన్వితుఁడనుటలో నిసుమంతయు నాశ్చర్యము లేదు

(11) కడపజిల్లా పులివెందుల తాలూకాలో వెంపల్లె యను గ్రామమున్నది ఆ గ్రామములో కొండలరాయఁడు అను దైవము వెలసియున్నాఁడు ఆ దేవునికిఁ బ్రతి సంవత్సరమును గొప్ప యుత్సవము జరుగును ఆ యుత్సవ ప్రారంభమున నా గ్రామపురెడ్డి (మునసబు) కొండలరాయని విగ్రహమునకుఁ బూలదండ వేయుము ఆ పూలదండ వేసిన తరువాతనే యుత్సవము ప్రారంభము కావలెను ఇది యొక నియమము కొన్నాళ్ళకా రెడ్డి (మునసబు) చనిపోయెను ఆ సంవత్సరము కొండలరాయని యుత్సవములో రెడ్డి భార్య దేవునికి పూలదండ వేయబోయెను కాని ఆ గ్రామములోని వైశ్యులందుల కంగీకరింప లేదు పూలదండను దామే వేయ సంకల్పించిరి రెడ్లకును వైశ్యులకును బట్టింపులు హెచ్చెను రెడ్డి భార్య దేశమందు గీర్తి ప్రతిష్ఠలు కలిగిన బుడ్డా వేంగళరెడ్డిగారికి వార్తనంపెను తనకు న్యాయమ కలుగునట్లు చేయవలయునదిగాఁ బ్రార్థించెను వేంగళరెడ్డిగారిని దమ గ్రామమునకు రావలసినదిగా నాహ్వానించెను వేంగళరెడ్డిగారు వేంపల్లె గ్రామమువచ్చుటకొక షరతు పెట్టెను తాను వచ్చెడి మార్గములోఁ బదిమైళ్ళ కొకచోట పదిబస్తాల బియ్యము వేసియుంచినచోఁ దానువచ్చి యా గ్రామవ్యవహారమును బరిష్కరింతునని చెప్పెను వేంపల్లి రెడ్డి భార్య అందుల కంగీకరించి అట్లే యేర్పాటు చేసెను వేంగళరెడ్డిగారు ఉయ్యాలవాడనుండి బండిలో బయలుదేరెను చేత నొక శేరు పట్టుకొని బండిలోఁ గూర్చుండెను దారి పొడవునను శేరుతో బియ్యము దానముచేయుచు వేంపల్లెకు వెళ్ళెను తగవును

బరిష్కరించి కొండలరాయనికిఁ బూలదండ వేసెడి హక్కు రెడ్డి భార్యకే కలదని తీర్పుచెప్పివచ్చెను ఆ గ్రామ వైశ్యులును వేంగళరెడ్డి తీర్పును శిరసావహించిరి

(12) విక్టోరియా రాణి పతకమును స్వీకరించుటకై వేంగళరెడ్డిగారు మద్రాసు వెళ్ళినప్పుడు బ్రిటిషు అధికారులు ఇంగ్లీషు భాషలో త్వరత్వరగా మాటాడుచుండిరఁట అది వేంగళరెడ్డిగారికి కంకర! కంకర! అనునట్లు వినఁబడెనఁట కంకర కావలసినదని ఆంగ్లేయులు కోరుచుండిరని రెడ్డి భావించి యిట్లనెనఁట కంకర అయితే నాదొక వెయ్యిబళ్ళు వేయించుకోండి!

(13) కఱవుదినములలో నాంగ్ల సైనికులొకప్పుడు ఉయ్యాలవాడ మార్గము గుండా పోవుచు నాకలిచే మిక్కిలి బాధపడిరఁట అప్పుడు వేంగళరెడ్డిగారు వారిని దన గృహమున కాహ్వానించి తృప్తిగా భోజనములు పెట్టించెనఁట

(14) వేంగళరెడ్డిగారి దగ్గఱ పచ్చటి గుఱ్ఱ ముండెడిది ఇది చక్కటి జాతి గుఱ్ఱము వేంగళరెడ్డిగారెచ్చటికిఁ బోయినను దీనిపైఁ బోయెడివారు ఈ గుఱ్ఱమునకు దినమునకు ముంతెడు ఉలవలు ఉయ్యాలవాడలోనున్న యొక వ్యాపారి యిచ్చెడివాఁడు ప్రతిదినము ముంతెడు ఉలవలు పద్దు వ్రాసుకొనెడివాఁడు సంవత్సరము కాఁగానే వేంగళరెడ్డిగారతని బాకీని తీర్చెడివారు ఏండ్ల తరబడి యిట్లే జరుగుచుండెను ధరణి సీతారామయ్య అను బ్రాహ్మణుఁడు వేంగళరెడ్డిగారి గురువు ఈ సీతారామయ్య గారిపై వేంగళరెడ్డిగారి కమితమైన భక్తి అందుచేఁ దన జాతిగుఱ్ఱము నా గురువునకు దానము చేఁ వైచెను రెడ్డిగారి దగ్గఱ గుఱ్ఱము లేకపోయినను అతడు రోజుకు ముంతెడులవలిచ్చినట్లుగా సంవత్సరము పాటు పద్దువ్రాసెనఁట! సంవత్సరము పూర్తికాఁగానే రెడ్డి కడకు వచ్చి బాకీ ని జెల్లింపవలసినదిగాఁ గోరెనఁట రెడ్డిగారి యనుచరుఁడొకడు అతని మోసమును రెడ్డితోఁ జెప్పెనఁట అప్పుడు వేంగళరెడ్డిగారు చిఱునవ్వు నవ్వుచు పోనీలేరా తెలియకచేశాడులేరా! అని సంవత్సరమునకగు ఉలవల ఖర్చు నాతని కిప్పించెనఁట రెడ్డిగారి మహౌదార్యమునకిది మచ్చుతునుక!

(15) రాయలసీమలో నొకరకమైన జూదము పల్లెలలో నాడబడుచుండును రెండు బిళ్ళ పెంకుల కొకవైపున సున్నమును బూసి పైకెగుర వేయుదురు రెండును నెఱ్ఱగాఁబడినచో గెలిచినట్లు ఒకటి యెఱ్ఱగాను మఱియొకటి తెల్లగాను బడినచో సగము గెలిచినట్లు రెండును దెల్లగాఁబడినచో నోడినట్లు కాఁబోలును ఈ యాటకు చిత్తాట లేక హెడ్డాట యని పేరు (దీనిని సత్యభామ యాట యనియుఁ

బిలుతరు కాబోలు) దీనిని బగటివేళ ఊరిలోను నూరిబయట తోటలలోను నుబుసుపోక కాడుచుందురు కొందఱు దీనిని రాత్రివేళ సహితము జూదముగా ధనమును బణము పెట్టి యాడుచుందురు

ఒకనాటి రాత్రివేళ బుడ్డా వేంగళరెడ్డిగారు ఉయ్యాలవాడ గ్రామమున నడివీధిలో వెడలు చుండిరి ఒక యింటిలో నలుగురైదుగురు వ్యక్తుల సంరంభము వినవచ్చెను ప్రమిద దీపము వెలుగులోఁ గోలాహలము చేయుచుండిరి కొందఱు పడు సత్యభామలా ఎట్టగా! అని యఱచు చుండిరి వేంగళరెడ్డిగారు మూసియున్న యా యింటి తలుపు దగ్గఱకు వెళ్ళి ఒరేయ్! మీ సత్యభామని చూస్తాను తలుపు తియ్యండిరా! అని కేకపెట్టెను లోపల నైదుగురు చిత్తాటనాడుచుండిరి మాదిగ నడిపోడు బిల్లెంకట కట్టినబి చిన్నోబలం కాలగురప్ప. వేంగళరెడ్డిగారి గొంతు వినగనే వీరి పైప్రాణములు పైకెగిరిపోయెను రాత్రివేళ చిత్తాటనాడుటను వేంగళరెడ్డిగారు సహింపరని వారికి బాగుగాఁ దెలియును అందుచే దీపమునార్పివైచి యాచీకటిలో నలుగురును నాలుగు మూలల నక్కియుండిరి ఒక్క కాలగురప్ప మాత్రము ధైర్యముతోఁ తలుపు తెఱచి పశ్చాత్తాపముతో నీ ముచ్చె తగలనీ యీ దరిద్రం పోతుందేమో! అనినాఁడు ( ముచ్చె యనఁగాఁ గాలిజోడు ఇది రాయలసీమ మాండలికము) ఎవరెవరాడుచుండిరని రెడ్డి ప్రశ్నించెను గురప్ప తక్కిన నలుగురి పేర్లను జెప్పెను సరె యని రెడ్డి వెడలిపోయెను

మరునాఁడు వేంగళరెడ్డి సత్యభామ వోళ్ళంతా రావాలి అని తలారి మునిచేఁ గబురు పెట్టెను మాదిగ నడిపోడు బిల్లెంకట కట్టినబి చిన్నోబలం కాలగురప్ప ఈ యయిదుగురు గుప్పిట ప్రాణములు పెట్టుకొని సాయంకాలము వేళ వేంగళరెడ్డిగారి యింటికి వెళ్ళిరి వేంగళరెడ్డిగారు వారిని జూచి కోపముతో అందరూ వరుసగా పడమటి దిక్కున నిలబడండి! అని యఱచిరి నారందఱును పిల్లులవలె పడమటి దిక్కున నిలబడిరి ఒరే! తలారి మునీ! సెలకోల పట్టుకురారా! అని వేంగళరెడ్డిగారు గద్దించిరి ఈ మాటలు విన్న సత్యభామ యాటగాండ్రు భయముతో గజగజ వణుకుచుండిరి ఇంతలో తలారిముని సెలకోల పట్టుకొనివచ్చెను అది సాయంకాలము కావున సత్యభామవారు పడమటి దిక్కున నిలబడియుండుటచేఁ దూర్పుదిక్కున వారి నీడలు పొడవుగాఁబడియున్నవి వీళ్ళ నీడల ఎట్టలమీద రెండేట్లు కొట్టు అని వేంగళరెడ్డిగారు తలారిముని కాజ్ఞాపించిరి తలారిముని యట్లే సత్యభామవారి నీడల పిట్టలపై సెలకోలతోఁ గొట్టెను! వేంగళరెడ్డిగారా జూదరులను

జూచి పగలు మాల్లో ఆడుకోండి ఈసారి రాత్రివేళ సత్యభామ ఆట ఆడితే సెలకోల నీడల మీదకాదు పైన తగులుతుంది జాగ్రత్త! అని హెచ్చరించెను బ్రతుకుజీవుడాయని సత్యభామవారు పలాయనము చిత్తగించిరి బుడ్డా వేంగళరెడ్డిగారి మనస్సు నవ్యనవనీత సమాన మని ఈ సంఘటన చెప్పకయే చెప్పుచున్నది దోషులను సహితము శిక్షించుట కాయన మనస్సు వెనుకాడెడిది!

(16) బుడ్డా వేంగళరెడ్డిగారిదగ్గఱ బలాఢ్యులైన వ్యక్తులు చాలమంది యుండెడివారు వీరు బియ్యము బస్తాలను చిన్న చిన్న మూటలను విసరినట్లుగాఁ జేతులతో విసర్వైచెడివారఁట 10 బస్తాలతో నిండియున్న బండికిఁ గందెన పూయవలసి వచ్చుచో చక్రమును భుజముతో నెత్తిపట్టెడివారఁట వేంగళరెడ్డిగా రెందరో వస్తాదులను బోషించుచుండెడివారు వీరిలో పెద్దకమ్ము చిన్నకమ్ము అను ముస్లిము సోదరులు ముఖ్యులు వీ రసహాయశూరులు వేంగళరెడ్డిగారికి నమ్మినబంట్లు వీరిలో బెద్దకమ్ము రైలు ఇంచెనుమీదుగా గుఱ్ఱమును దుమికించినాఁడఁట వీని శౌర్యమునకు మెచ్చి విక్టోరియా మహారాణి బంగారు కడియము బహూకరించెనఁట ఇక చిన్నకమ్ము జగత్ప్రసిద్ధికెక్కిన పహిల్వాను వేంగళరెడ్డిగారిపై నెన్నికధలున్నవో యీ చిన్నకమ్ముపై నన్నికధలు వ్యాప్తియందున్నవి ఇతఁడు పదునాఱేండ్ల బాలుఁడుగా నున్నప్పుడే వేంగళరెడ్డిగారితనిని పంజాబు పంపించి రసూల్‌ఖాన్ అను వస్తాదుకడ కుస్తీ నేర్పించెనఁట ఈ రసూల్‌ఖాన్ ఉయ్యాలవాడకువచ్చి వేంగళరెడ్డిగారిచే బహుమానములు పొందుచుండెడివాఁడు ఈ రసూల్‌ఖాన్ ఒకప్పుడు మలయాళ దేశమునకుఁబోయి కుస్తీపట్టఁగా నట గొల్లలు కొందఱితనిని మంత్రశక్తిచే నోడించిరఁట అప్పుడితని శిష్యుడగు చిన్నకమ్మువెళ్ళి వారిని చిత్తుగా నోడించెను మార్గమధ్యమున మైసూరు రాజావారిదగ్గఱనున్న మునుస్వామి యను వస్తాదును గూడా చిన్నకమ్ము ధైర్యముతో నోడించెను మైసూరు మహారాజు మెచ్చి చిన్నకమ్ము చేతికి బంగారు కడియములు కాలికి నాగుటందెను వేసెను కోవెలకుంట్లలో మహమ్మద్‌ఖాన్ అను వస్తాదును పంజాబులో అల్లావుద్దీన్ అను వస్తాదును చిన్నకమ్ము ఓడించినాఁడు ఒకప్పుడీ చిన్నకమ్ము చేతులతో చిఱుతపులిని గూడఁ జంపెనఁట

కర్నూలు దగ్గఱ గోరంట్ల యను గ్రామమున్నది అక్కడ ప్రతి సంవత్సరమును గొప్ప తిరుమాళ్ళు జరుగును ఒక సంవత్సర మా తిరునాళ్లలో మలిరెడ్డి యను వస్తాదు మొలతాడు కట్టినమొగోడికి నేను మిండణ్ణి! షని దండోరా చేయించెనఁట ఈ దండోరాను ఉయ్యాలవాడకుఁ జెందిన యొక చాకలి విని

పరుగెత్తుకొని వచ్చి హరవరము (ఉయ్యాలవాడ సమీపములోనున్న గ్రామము) దగ్గఱనున్న చిన్న కమ్మనకుఁ జెప్పెను చన్నికమ్మ వెంటనే బయలు దేరెను చాకలి యాతని ననుసరించెను ఇద్దఱును గోరెంట్ల తిరునాళ్ళకుఁ బోయిరి ఆ తిరునాళ్ళలో మలిరెడ్డి వస్తాదు రధముపైఁ గూర్చుండి యూరేగుచుండెను ముందు దండోరా సాగుచుండెను చుట్టును వందమంది బోయవాండ్రు మలిరెడ్డికి నండగానుండిరి చిన్నకమ్మ ఒక్క యుదుటున రధము పైకి దమికి మలిరెడ్డిని జిత్తు చేసి క్రిందికి విసరి వైచినాఁడు బోయలందఱును రధముపైనున్న చిన్నకమ్మపైఁ బడఁబోయిరి చిన్నకమ్మకుఁ దోడుగావచ్చిన చాకలి కఱ్ఱసాములోఁ గడునేర్పరి ఆతఁడు తన చేతి కఱ్ఱతో బోయలనందఱను రధము దరికిఁ జేరకుండ నాపినాఁడఁట మలిరెడ్డి తన యోటమి నంగీకరించి బోయలను వారించెను

(17) రాయలసీమలో ముఖ్యముగా కడప కర్నూలు మండలములలో నెద్దుల పందెములు విస్తారముగా జరుగుచుండెను ఈ పందెములకొఱకై ఒంగోలు జాతిగిత్తలను ప్రత్యేక శ్రద్ధతో మేపుచుందురు పెద్దపెద్దబండలను లాగించుట చక్రములు తిరుగకుండ కట్టివేసిన బండి నిసుకలో లాగించుట చేయుదురు [ఇట్టి పందెములలో అప్పలాపురం (ఇంటిపేరు దొంతిరెడ్డి) చెన్నారెడ్డియను నతఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు ఇతఁడు వేంగళరెడ్డిగారికిఁ దరువాతి తరమువాఁడు] బుడ్డా వేంగళరెడ్డిగారు గొప్ప యెద్దులను మేపు చుండెడివారు ఆ చుట్టు ప్రక్కల జరుగు పందెము లన్నింటిలోను వేంగళ రెడ్డిగారి యెద్దులే గెలుచుచుండెడివి వేంగళరెడ్డిగారి దగ్గఱ శేషన్న యను సేద్యగాడుండెడివాఁడు అతఁడే యెద్దుల పందెములను నిర్వహించెడివాఁడు ఎద్దులను దయారు చేయుటలో నతఁడు కడునేర్పరి వేంగళరెడ్డిగారు చనిపోయిన తరువాత వారి తమ్ముఁడు ఈశ్వరరెడ్డి గారి పుత్రుఁడగు నల్లపరెడ్డి యొక యెద్దు నమ్మి వేసెను దానిని అప్పలాపురం చెన్నారెడ్డి కొనెను వేంగళరెడ్డిగారి వంశస్థులలో నేటికిని ఈ పందెపుటెద్దులను దయారు చేయు నలవాటు గలదు 1966లో నేను ఉయ్యాలవాడ వెళ్ళినప్పుడు బుడ్డా శివారెడ్డిగారి యింటికడ ఏనుఁగులవలెనున్న యెద్దులను జూచితిని

(18) పూర్వము టీకాలు వేయుట యనిన గ్రామములోని బాలబాలికలకు సంహాస్వప్నము ఇండ్లలోనుండి బయటకు వచ్చెడివారు కారు టీకాలు వేయబడినవారు గొల్లున నేడ్చుచుండెడివారు కాని ఉయ్యాలవాడ గ్రామములో నిట్టి

బెడద యుండెడిది కాదు టీకాలు వేయించుకొనెడి బాలబాలికలకు బుడ్డా వేంగళరెడ్డిగారు లడ్డులు పంచిపెట్టెడివారు అందుచేఁ బలువారు మిక్కిలి యుత్సాహముతో ముందునకు వచ్చి టీకాలు వేయించుకొనెడివారు టీకాలు వేసెడి హెల్తుఇన్‌స్పెక్టరుకుఁగూడ నా రోజు రెడ్డిగారి యింటనే పంచభక్ష్య పరమాన్నములతో భోజనము!

క్రీ శ 1900 సంవత్సరములో నొకసారి ఉయ్యాలవాడలో టీకాలు వేయుచుండిరి ఉదయము నుండి మధ్యాహ్నమువఱకును వేంగళరెడ్డిగారు లడ్డులు పంచిపెట్టిరి టీకాలు వేసిన ఇన్‌స్పెక్టరుకుఁగూడ భోజనము పెట్టించిరి అభ్యంగన స్నానము చేయఁదలఁచి రెడ్డిగారు నూనె పట్టించుకొనిరి భార్య వేడినీళ్ళు తోడినది స్నానము చేయఁదలచి పీటపైఁ గూర్చుండెను అంతే! కూర్చున్నరెడ్డి కూర్చున్నట్లే ప్రాణములు విడిచెను! దానధర్మములు చేసిన యీ పుణ్యాత్ముఁడు మరణబాధను కించిత్తైనను ననుభవింపక సునాయాసముగా స్వర్గమునకేఁగెను!! విదురుడు కోరిన అనాయాస మరణము వేంగళరెడ్డిగారి వంటి పుణ్యాత్ములకే సిద్ధించును పాపాత్ములకు దుర్మరణము ప్రాప్తించును

(19) చనిపోవుటకు కొద్దిరోజుల ముందు పొరుగూరినుండి వేంగళరెడ్డిగారి కడకొక బ్రాహ్మణుఁడు వచ్చెను తన కుమారున కుపనయనము చేయవలెననియు నందుచే నూఱు రూపాయలు కావలెననియు నడిగెను వేంగళరెడ్డిగారు వెంటనే నూరు రూపాయల నిచ్చిరి కాని ఆ బ్రాహ్మణుడు అయ్యా! ఈ ధనమును మీ యొద్దనే యుంచుడు ఉపనయనము రేపనఁగా నేను వచ్చి తీసికొందును అని చెప్పెను వేంగళరెడ్డిగారు సరే యనిరి నెలరోజులు గడచెను ఆ బ్రాహ్మణుఁడు పడిగపాడు రస్తాగుండా ఉయ్యాలవాడకు వచ్చుచుండెను ఆ మార్గములో వేంగళరెడ్డిగారు పచ్చని గుఱ్ఱముపై నెక్కి యా బ్రాహ్మణున కెదురయ్యెను బ్రాహ్మణుఁడాయనకు భక్తితో నమస్కరించెను రెడ్డిగారు ప్రతినమస్కారము చేసి స్వామీ! తమధనము పసుపుగుడ్డలో చుట్టి వెదురు కొమ్ములో పెట్టి ఎద్దులు పండుకొనేచోట దంతుల్లో పెట్టాను మావాళ్ళనడిగి తీసికోండి నేను పనిమీద వెడుతున్నాను అని చెప్పి అదృశ్యుఁడయ్యెను ఆ బ్రాహ్మణుఁడు ఉయ్యాలవాడకు వచ్చి వేంగళరెడ్డిగారు తనకు పడిగపాడు రస్తాలోఁ గనపడినారనియు తనకీయవలసిన ధనమును ఫలానాచోట పెట్టినానని చెప్పిరనియు నింటివారితోఁ దెల్పెను ఇంటివారాశ్చర్యపడిరి అప్పటికి

వేంగళరెడ్డిగారు చనిపోయి పదిరోజులయినది। అయినను బరిశీలింపనెంచి యెద్దులు పండుకొనుచోట ధంతులనుజూడగా నొక వెదురుకొమ్ము కనిఎంచెను దానిని దీసిచూడగా నందులో నొక పసుపుగుడ్డను జుట్టబడి వందరూపాయలు భద్రముగా నుండెను। వేంగళరెడ్డిగారి బంధువులును నూరిలోనివారును ఆశ్చర్యచకితులైరి। బ్రాహ్మణుని ఆనందమునకు మేరలేదు। చనిపోయిన వేంగళరెడ్డిగారిని చూడగలిగి నందులకుఁ దన జన్మ ధన్యమైనట్లుగా భావించెను ఆహా! మరణించినను వేంగళరెడ్డిగారి దాతృత్వమునకు వన్నె తగ్గలేదు! అందువలననే ఆయన అపర దానకర్ణుఁడైనాడు!

(20) బుడ్డా వేంగళరెడ్డిగారు చనిపోవుటకు ముందుగా వాయిదాల పద్ధతిపై ఒక కోడెను కొనినాడు రెండు వాయిదాలు కట్టినాడు మూడవ వాయిదా వచ్చుసరికి చనిపోయినాడు క్షురకర్మ చేయించుకొని కుర్చీపీద కూర్చుండి చవురు పెట్టించుకొని స్నానము చేయబోయి నీళ్ళు తోడుమని భార్యతో చెప్పి కుర్చీమీద కూర్చుండినాడు భార్య నీళ్ళు తోడి వచ్చుసరికి కుర్చీమీదనే ప్రాణము వదలివేసినాడు రెడ్డిగారిని సమాధి చేసినారు సంవత్సరము తరువాత ఎద్దు నిచ్చినవారు మూడవ వాయిదాకు వచ్చుచున్నారు మార్గమధ్యమున ( నడిమద్దినాల అదాటయి జానపదుడు ప్రయోగించిన వాక్యము) వేంగళరెడ్డి కనపడి ఒరే! నేను ఊరికి పోతున్నాను ఫలానా గాడిపట్టున చప్టా క్రింద మీ మూడవ వాయిదా దుడ్డు పెట్టినాను మావాళ్ళనడిగి ఇప్పించుకోండిరా! పోండిరా! అని చెప్పి మాయమైపోయినాడు

ఆ ఎద్దుల బేరగాండ్రు వేంగళరెడ్డిగారి యింటికి వచ్చి నాయనా! బుడ్డా వెంగళరెడ్డిగారు ఊరికిపోతా డబ్బు ఇప్పిచ్చుకోమన్నారు డబ్బు ఇవ్వండి అనినారు ఒరే! బుడ్డా వెంగళరెడ్డి నిరుడు చనిపోయినాడు సమాధి కూడా చూఎస్తాం రండి అనినారు బంధువులు ఫలానా గాడిపట్టున చప్టా క్రింద డబ్బు ఉందన్నారు రెడ్డిగారు ఆ డబ్బు మా వాయిదాకు సరిపోతే మా సొమ్ము వాయిదాకన్నా ఎక్కువ ఉంటే మీ సొమ్ము అనినారు ఎద్దుల బేరగాండ్రు ఊరి పెద్దలు వెళ్ళి చూడగా వేంగళరెడ్డిగారు చెప్పినట్టుగనే గాడిపట్టున చప్టాక్రింద రూపాయలు సరిగా మూడవ వాయిదాకు సరిపోవునట్లుగానే ఉన్నవట సత్యమైన డబ్బు కాబట్టి మాది మాకున్నది ఈ బుడ్డా వెంగళరెడ్డి ధర్మంగా మా డబ్బు మాకు చెల్లించినాడు కాబట్టి ఏటా మా కోడెబేరగాళ్ళం వెంగళరెడ్డిగారి పేరుతో రుసుము చెల్లిస్తాము అని చెప్పి వెడలిపోయిరట (శ్రీ మామద్దు నరసన్న అను జానపదగాయకుడు 19 12 1965నాడు నంద్యాలలో నాకు చెప్పిన విషయము)

## అనుబంధము - 8

బుడ్డా వేంగళరెడ్డిగారిపై ముక్కమళ్ళ గ్రామమునకుఁ జెందిన బందుమియ్యా లే బందుభాయి యను ముస్లిముకవి రచించిన ద్విపదకావ్యము కలదని వెనుక తెలియఁజేసితిని ఇది అముద్రితము★

నంద్యాలకు జెందిన శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (కవితా సామ్రాజ్యము) బుడ్డా వేంగళరెడ్డిగారి జీవిత చరిత్రను వచన గ్రంథముగా వ్రాసి యున్నారు దీనిని 1968లో శ్రీ బుడ్డా వేంకట రామిరెడ్డిగారు ముద్రించినారు

శ్రీ వెంపోగారు వేంగళరెడ్డిగారి చరిత్రను బుఱ్ఱకథగా రచించియున్నారు ఇది ముద్రితము

(కర్నూలు జిల్లా తెర్నెకల్లు గ్రామమునకు చెందిన శ్రీ అందలం కృష్ణమూర్తిగారు 1973 మే నెలలో మహాదాత (బుడ్డా వేంగళరెడ్డి) అను పద్యకావ్యమును రచించినారు దీనిని కూడ శ్రీ బుడ్డా వేంకటరామిరెడ్డిగారే ముద్రించినారు ఈ కావ్యములో 165 పద్యములున్నవి

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గురించి పాలెగాడు అను నవలను రచించిన శ్రీ యస్ డి వి అజీజ్ మహాదాత అను పేరుతో బుడ్డా వేంగళరెడ్డి గారిని గుఱించి కూడ ఒక నవలను సిద్ధము చేసినాడు ఇది త్వరలో ముద్రణ కానున్నది

ఉయ్యాలవాడ గ్రామమునకుఁజెందిన పాణ్యం సోదరకవులు (పాణ్యం నరసరామయ్యగారు పాణ్యం లక్ష్మీనరసయ్యగారు లేకగుండయ్యగారు) తమ ప్రభాత రేఖలు అను ఖండకావ్యములో వేంగళరెడ్డిగారిపై నొక పద్యమును వ్రాసియున్నారు ఆ పద్యముతో నాయీ సుదీర్ఘవ్యాసమును ముగింతును

'కలియుగ దానకర్ణుఁ డనఁగా నుతికెక్కుచు నాంగ్లరాజ్ఞిచేఁ
గలిత యశస్సువర్ణ బతకంబు బహూకృతి పొందినట్టి య
య్యలఘుఁ డుదారశీల మహితాత్ముఁడు వేంగళరెడ్డిగారికిన్
సులలిత జన్మభూమి యగుచున్ గణనీయత గాంచె మీదటన్'

(1971 సెప్టెంబరు నెల భారతి లో ప్రచురింపఁబడిన పరిశోధన వ్యాసము)

★ ఇప్పుడు ఈ గ్రంథములో బందుమియ్యా ద్విపద కావ్యము అనుబంధముగా ముద్రింపబడినది

## అనుబంధము–9

### బుడ్డా వేంగళరెడ్డిగారి వంశవృక్షము (1999)

### నాలుగు – ఐదు తరములు




★ బుడ్డా వేంగళరెడ్డిగారు తన తమ్ముని మూడవ కుమారుడైన తిమ్మారెడ్డిని దత్తు చేసికొనెను

★ బుడ్డా వేంగళరెడ్డిగారి పెద్దచెల్లెలు తిమ్మమ్మగారు తన చెల్లెలు సుబ్బమ్మగారి మనుమడైన చిన రామిరెడ్డిని దత్తు చేసికొనెను


3 దస్తగిరిరెడ్డి + నారమ్మ
వేణుగోపాలరెడ్డి
+లక్షవ గేసమ్మ
ఈశ్వరరెడ్డి
+తులసమ్మ
నల్లపరెడ్డి
+నారాయణమ్మ
వెంకటేశ్వరరెడ్డి
+ లక్ష్మిదేవమ్మ
రాహుల్ కుమార్‌రెడ్డి
రాజశేఖరరెడ్డి
రాజేశ్వరరెడ్డి
చంద్రమౌళిరెడ్డి
అమరనాథరెడ్డి
రామేశ్వరరెడ్డి


4 రామిరెడ్డి + గోవిందమ్మ
పెద్దసీతారామిరెడ్డి
పెద్ద భార్య
ఈశ్వరమ్మ
(ఈమె
దస్తగిరిరెడ్డి
గారి అక్క)
చిన్న భార్య
నాగమ్మ
చిన్న సీతారామిరెడ్డి
భార్య శేషమ్మ
వెంకటరామిరెడ్డి
భార్య ఈశ్వరమ్మ
చంద్రశేఖరరెడ్డి
విజయభాస్కరరెడ్డి
సత్యనారాయణరెడ్డి
వెంగళరెడ్డి
రామమోహనరెడ్డి
డా॥ పెద్ద శంకరరెడ్డి
చిన్నశంకరరెడ్డి
పాండురంగారెడ్డి

## నాలుగవ అధ్యాయము

# జానపద కవిత్వము



## 1 ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వీరగాధ

కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా రాజుపాళెం దగ్గరనున్న అయ్యవారి పల్లె లో 15 3 1966 నాడు శ్రీ గుండా లాలన్న అనే జంగం (సుద్దులవాడు) పాడగా సేకరించిన వీరగాధ ఈ లాలన్న నిరక్షరాస్యుడు అప్పటికి 45 సంవత్సరముల వయస్సులో ఉన్నవాడు ఇతని తండ్రి రామన్న ఆ రామన్నే ఈ వీరగాధను కవికట్టి ఉండవచ్చును ఆ రామన్న బుడ్డా వెంగళరెడ్డిగారికి సమకాలికుడు అతడు నారసింహారెడ్డిని కూడా స్వయముగా చూచినాడట ఈ వీరగాధను సేకరించిన రోజున అయ్యవారిపల్లెలో శ్రీ గజ్జెల వెంకట్రామయ్య అనే యాదవుడు మాకు భోజన సదుపాయాలు ఏర్పాటు చేసినారు వారికి మిక్కిలి కృతజ్ఞుడను

నారసింహారెడ్డి వీరగాధను పాడే జంగాలు 1965 నాటికే చాలా తక్కువమంది (ముగ్గురే ముగ్గురు) ఉన్నారు ఈ ముగ్గురూ కడప జిల్లాలోనే ఉండేవారు జమ్మలమడుగు తాలూకాలో పెద్ద పసుపుల గ్రామం దగ్గర మేడదిన్నె లో వీరన్న అనే బుట్ట ఎరుకలవాడు పాడేవాడు ముద్దనూరు దగ్గరనున్న కమ్మవారి పల్లె లో సుద్దుల రాముడు అనే వ్యక్తి పాడేవాడు ప్రొద్దుటూరు తాలూకాలో రాజుపాలెం దగ్గర ఉన్న

అయ్యవారి పల్లె లో గుండా పెదలాలప్ప పాడేవాడు నేను ఈ లాలప్పను మాత్రమే కలుసుకోగలిగాను అతని దగ్గరనుండి ఈ వీరగాధను సేకరించాను

కడప కర్నూలు జిల్లాల్లో జంగాలను సుద్దులవాళ్ళు అని పిలుస్తారు కాని నిజానికి సుద్దులవాళ్ళు అంటే కాటమరాజు కధలను పాడే యాదవ గాధాకారులు అలా అని ఈ జంగాలు పాడే కధలన్నింటినీ జంగం కధలు అని పిలవడానికి కూడా వీలులేదు జంగం కధ 1900 ప్రాంతంలో బయలుదేరిన ఒక ప్రత్యేక ప్రక్రియ ఇది పద్యాలు దరువులు కీర్తనలతో కూడిన యక్షగానం వంటి రచన కాబట్టి రాయలసీమ పరిభాషలో ఈ నారసింహారెడ్డి వీరగాధను సుద్దులుకధ అనే ఎలుస్తున్నాను ఇక్కడ సుద్దులవారు అంటే జంగములు అని అర్థం చేసుకోవాలి అయినా ఇది యక్షగానం వంటి జంగం కధ మాత్రం కాదు ఇది జంగాలు పాడే బొబ్బిలి కధవంటి వీరగాధ అని అర్థం చేసుకోవాలి

ఈ వీరగాధ ప్రకారం నారసింహారెడ్డి పుట్టుక గుళ్ళదుర్తిలో రూపనగుడిలో ఉన్న నరిసిరెడ్డి యింటికి దత్తు వచ్చినాడు ఇతని తండ్రి మల్లారెడ్డి తల్లి నాగమ్మ ఇంటిపేరు కసానివారు నారసింహారెడ్డి మేనమామ పేరు నరిసిరెడ్డి ఇతడు నారసింహారెడ్డికి తన కూతుర్నిచ్చి పెండ్లిచేసి ఇల్లరికం తెచ్చుకున్నాడు నారసింహారెడ్డికి ఉయ్యాలవాడలో కూడా ఇల్లు ఉంది

పాట *రామరామరఘు రామరామయా రామయరఘురామా!*
*రెడ్డికాదు బంగారపు కడ్డీ నారసింహరెడ్డీ*
*పుట్టిందీ మా గుండ్లదుర్తిలో నారసింహరెడ్డీ*
*వచ్చిందీ ఆ రూపనగుడికీ నారసింహరెడ్డీ*
*నరిసీరెడ్డీ యింటికి నేడూ దత్తు కొచ్చినాడూ*

వచనం నరిసి రెడ్డికి పుత్ర సంతానం లేదు ప్రేమగా నారసింహారెడ్డిని సాకినాడు కొన్ని ఏండ్లు గడిచిన తరువాత కరవు వచ్చింది కొండ సుంకేశల ఊరి బోయవాండ్లు ఎకిలి వాండ్లు నల్లబోతులవాండ్లు మండ్లవాండ్లు ఎల్లాపులు ( బోయలు వీరిలో అనేక గోత్రాలవారు ఉన్నారు) ముక్కమళ్ళలో ఉండే బీదలు ముదిగోడులో ఉండే బోయ వాండ్లు కానాలలో ఉండేవారు సంజామలలో ఉండే బీదలు అంతా నారసింహారెడ్డి దాపుకు వచ్చినారు పస్తుండే వాని ముఖము చూచేవాడు కాదు రెడ్డి గాదెలలో నుండి ధాన్యం పగుల గొట్టించి భోజనాలు పెట్టి ధాన్యం ఇచ్చి పంపినాడు ఇట్లా ధానధర్మాలు చేయటం వల్ల రెడ్డికి ముఖ్యంగా స్నేహితులు ఏర్పడినారు రెడ్డి దేనికి పిలిచినా పోతున్నారు

వాళ్ళు   నీకేలాటి ఇబ్బంది వచ్చినా మమల్ని మరిచిపోకుండా ఎలు రెడ్డీ!   అన్నారు వాళ్ళు)

ఒకప్పుడు ఉయ్యాలవాడ సంస్థానమున పెడకంటి వారికీ మోటాటి వారికీ పేరిటి ( పార్టీ విరోధం) కలిసింది ( పెడకంటి మోటాటి అనేవి రెడ్లలోని రెండు ప్రధానశాఖలు) అందరూ మత్తువస్తువ త్రాగి మధ్యాహ్నం వేళ బయలు దేరినారు రణవిద్ధం కలిసినాది

పాట   *హరీ రాం రఘురామ రాఘవా రామయ రఘురామా!*
*అట్టి వేళలో పేరిటిదారులు ప్రయాణమైనారు*
*వారికి గనుకా మత్తు వస్తువా వారు దాపినారు*
*మత్తు వస్తువా వోంకారములా బయలుదేరినారు*
*వెంకటరెడ్డి సైన్యాన్ని ప్రయత్నం జేసినడు*

వచనం  గ్రామం బయటికి పోయి రెండు వర్గాలూ యుద్ధం చేసినవి పెడకంటి కాపు నరిసరెడ్డి మోటాటి కాపు వెంకటరెడ్డి నరిసరెడ్డి పార్టీలో ఒకరిని మోటాటివారు ఖూనీ చేసినారు

పాట   *అక్కడ గనకా రణావిద్దములు వారికి గలిసినవి*
*పళపళ పళపళ కేకలు వేసీ పడీ దుంకినారు*
*నరిసీరెడ్డీ మనిషిన ఒకనిని ఖూని చేసినారు*
*అట్టివేళలో సైన్యం అంతా గడగడ వణికినది*
*తాగిన మత్తూ అంతా గట్టిగ తగ్గిపోయినది*
*పరారి అయ్యి ఉరికిరి గనుకా పాళెగాండ్లునేడు*
*అట్టివేళలో వెంకటరెడ్డీ వెంబడి బడినారు*
*సైన్యం అంతా వెంబడిబడుతూ తాము లేచినారు*
*నరిసరెడ్డి యా సైన్యమ్మంతా ఇండ్లలో పడినారు*
*పట్టపగలు ఆ యిండ్లల్లోనా వాకిళ్ళేశారు*

వచనం   వెంకటరెడ్డి మనకు భయపడి పరారి అయినాడు ఇక వెనక్కి తిరగండి అన్నాడు నరిసరెడ్డి ఎవరి యిండ్లల్లో వారు ఉండినారు నరిసరెడ్డి తన పార్టీలో ఖూనీ జరిగిందని కరణం అప్పయ్యను ఎలవనంపి కేసు వ్రాయించినాడు

పాట తలారి వాని చేతికైననూ జాబు లిచ్చినారు
జాబులు దీసుక తలారివాడూ ప్రయాణమైనాడు
కోవెలకుంట్లా రస్తాలండీ తాను బట్టినాడు
పాంపల్లెనూ గుళ్ళదుర్తినీ తలారి దాటాడు
కోవెలకుంట్లా కచ్చేరి కొచ్చీ జాబులిచ్చినాడు

వచనం తలారివాడు పాంపల్లెదాటి గుల్లదుర్తి దాటి కోవెలకుంట్ల కచ్చేరి కొచ్చి జాబు కమ్మలు చేతికిచ్చినాడు సర్కారు పటపట పటపట జాబులు చదువుకొని ఓహో! ఖూనీకేసు! పదవొస్తున్నాము అని సబ్ఇన్స్పెక్టరు తాసిల్దారును తోడు చేసికొని పోలీసులతో ఉయ్యాలవాడుకు వచ్చినాడు అంతా రెడ్డిసావిట్లో కూర్చున్నారు అప్పుడు నరిసిరెడ్డిగారు వచ్చి సర్కారుకు భోజనాలు ఏర్పాటు చేసి ఖూనీ జరిగిన చోటు కొచ్చి శవాన్ని చూసినాడు ఎడమ డొక్కను ఒక పోటు వీపున ఒక పోటు రొమ్మున ఒక పోటు మూడు పోట్లతో మరణించినాడు ఆ శవాన్ని తెచ్చి రెడ్డిసావిడ దగ్గర పండబెట్టినారు అక్కడ ముద్దాయిలను పట్టడానికి ఉత్తరువు వచ్చినాది

పాట అట్టి వేళలో వెంకటరెడ్డీ కండ్ల జూచినాడూ
సరకారు చేతిలో మనము జిక్కితే చిన్నతనము లమిడీ
ఎక్కడి జనమూ అక్కడ నేడూ దావరమైనారూ
అట్టి వక్కా సరకారు మందీ వెతుకులాడినారూ
అట్టి వక్క మా ఎంకట రెడ్డీ ఎక్కడి కొచ్చాడూ
రూపనగూడీ గ్రామానికే త్వరగ వచ్చినాడూ –
''దండములయ్యా! దండములయ్యా! నారసింహరెడ్డీ!''

వచనం విషయమంతా చెప్పి సర్కారునుండి తన్ను రక్షించమని మొరపెట్టుకున్నాడు నారసింహారెడ్డి మేనమామ మేనత్త వద్దు నాయనా! ఆ కేసుల్లో నువ్వు తలదూర్చవద్దు అన్నారు నారసింహారెడ్డి వారితో వచ్చి పాదములు పట్టుకున్నాడు అభయ హస్తమిచ్చినాను ఏమి ఫరవాలేదు వెళ్ళి మాట్లాడుతాను అన్నాడు దానికి వారు

పాట 'అల్లుడా! నా మేనల్లుడా! నారసింహరెడ్డీ!
ధర్మము కాదూ న్యాయము గాదూ నారసింహరెడ్డి
చెప్పిన మాటలు మొరాలకించవో నారసింహరెడ్డీ
లేనిపోనీ విరోధములొచ్చూ నారసింహరెడ్డీ

ఎంత చెప్పినా వినుకోడయ్యా నారసింహారెడ్డి
అట్టి వేళలో బయలు దేరెరా నారసింహారెడ్డి
గుఱ్ఱాన్నైనా సింగారించిరి భటులు అంతలోన-
నాలుగు కాళ్ళకు నాగుటందెలే గుఱానికేశారు
పళ్ళనందునా కత్తెరకళ్ళెం గుఱానికేశారు
ముత్తేలా ముఖమాల నెత్తికి గుఱానికేశారు
వెండిది వొక్కా జీనుపళ్ళెమే గుఱానికేశారు
రాజారావూ రాజబహదరూ నారసింహారెడ్డి
ములుకోల కట్టె చేతిలోఉంటే మున్నూటికి మొనగాడు
అట్టి వక్క మన రెడ్డి గట్టిగా గుఱ్ఱమెక్కినాడు
వెంకటరెడ్డిని యింట దాపుకొని గుఱ్ఱమెక్కినాడు
కుప్పిటిగంతుల మీద వచ్చెరా బారాహజ్జారి
గుఱ్ఱమెక్కి ఉయ్యాలవాడకే ధకీలు వడ్డాడు
అదిగో వచ్చె ఇదిగో వచ్చే నారసింహారెడ్డి
ప్రేములీగ కుర్చీలు గట్టిగా తాము వేసినారు
భైరోహో భైరోహో కుర్చీ ఉప్పర్ దే'

వచనం అప్పుడు నారసింహారెడ్డి గుఱ్ఱం దిగివచ్చి కుర్చీలో కూర్చున్నాడు నరిసిరెడ్డి అక్కడే ఉండినాడు ఆ ఖూనీకేసు రిపోర్టు సబ్ఇన్స్పెక్టరు వ్రాస్తున్నాడు

పాట సార్జెంటు గనకా ప్రక్కనె ఏమో కొలువు దీరినాడు
కుడీప్రక్కనా జిలేదారుడూ కొలువు దీరినాడు
కులామందునా బ్రాహ్మడు గనకా తాను ఉన్నడయ్యా

వచనం శవానికున్న మూడు దెబ్బలూ వ్రాసుకున్నారు ముద్దాయిలను చెప్పమని నరిసిరెడ్డి నడిగినారు అప్పుడు నరిసిరెడ్డి చూచి అనంతరెడ్డి సుబ్బారెడ్డి తిమ్మారెడ్డి అని ముగ్గురు ముద్దాయిలను ఏర్పరచినాడు నిష్కారణంగా అనంతరెడ్డిని పెట్టినాడు నరిసిరెడ్డి

పాట అట్టి వేళలో కన్నుల జూచె నారసింహారెడ్డి
'ధర్మ మెరుగడూ పుణ్యమెరుగడే అనంతారెడ్డి
అట్టివానినీ కేసులోపటా ఇరికియ్యరాదురయ్యా'

నరిసరెడ్డినీ దండించాడు నారసింహారెడ్డి
అట్టివేళలో జిలేదారుడూ కండ్ల జూచినాడు,
'నీకేమాయీ ప్రక్కనుండు నీవు మాటలాడరాదు'
అగ్గిమీద మరి గుగ్గిలమాయె నారసింహారెడ్డి
'మూడుదుడ్ల జీతగాడివి నీకే పౌరుషముంటే
నాకు ఉండదా జిలేదారుడా! రెడ్డిపుటక నాది'
అరికాలి మంట మరి నెత్తికెక్కానే జిలేదారుకైన
'ఎద్దు ముడ్డనూ పొడుచుకు బ్రతికే రెడ్డివాడివయ్యా
నీకు గనకనా ఇంత శౌర్యమూ ఎవరు ఇచ్చినారూ?'
జిలేదారుని మాటలు వినెనే నారసింహారెడ్డి
పటపట పటపట పండ్లు కొరికెనే నారసింహారెడ్డి
తెల్లని కండ్లకు తెచ్చె రకతములు నారసింహారెడ్డి
కుడీమీసమూ ఒడాదిద్దెనే నారసింహారెడ్డి
'పుచ్చినట్టి వంకాయలు తిందువు బాపనోడ నీవు
కొయ్యగూరలా కట్టలు తిందువు బాపనోడ నీవు!
ఎంత పొగరురా జిలేదారుడా ఎంత పొగరు నీకు!

వచనం రెడ్డి మాటలు విన్న జిలేదారుడు ఆగ్రుడై మండి నీది ఏవూరురా? నా సంగతి తెలియక మాట్లాడినావు నేను జిలేదారుణ్ణి నిన్ను ఐదురోజుల్లో జైలులో పెట్టిస్తాను చూసుకో! అన్నాడు నారసింహారెడ్డికి శూరత్వం పుట్టింది

పాట 'పట్టపగలె నీ కోయిలకుంట్లనే కొల్లగొట్టెదాను
పండిన పడకలో జిలేదారుడా నీ శిరము గోసెదాను

వచనం మూడు దినములలో నీ శిరము కొయ్యక పోతే నేను నారసింహారెడ్డినే కాను నా యింటి పేరు కసానివారే కాదు అన్నాడు చూస్తామంటే చూస్తాం అన్నారు

పాట అట్టివేళలో రెడ్డిగనుకనూ కండ్ల జూచినాడు
భళీ అంటనూ కేకను పెట్టీ కింద దుమికినాడు
అప్పుడేమిరా ఇప్పుణ్ణే నీ తఢాకు చూతాము
అట్టివేళలో చిన్నా పెద్దా కండ్ల జూచినారు
రెడ్డిని గనకా ప్రక్కకు నేడూ తాము దొబ్బినారు

స్టానబలమూ తనకు లేదనీ జిలేదారుడేమో
అట్టి వేళలో దిగ్గున లేచే జిలేదారుడేమో
పోలీసులనూ వెంటబెట్టుకొని జిలేదారుడేమో
మెల్లమెల్లగా కోవెలకుంట్లా దారిపట్టినాడు

వచనం శవాన్ని నరిసిరెడ్డి దహనం చేయించినాడు నారసింహారెడ్డి కోప తాపుడై గుఱ్ఱాన్నెక్కి రూపన గుడికి వచ్చినాడు ఆ ప్రొద్దు అంతా ఆ రేత్రి అంతా చిన్నా పెద్దతో ఆలోచించినాడు తెల్లవారి చక్కగా ఉయ్యాలవాడకు వచ్చినాడు

పాట చిన్నా పెద్దా అందరు గనుకా మనవి చేసినారు
'ముందుకు పెట్టిన పాదం నేనూ వెనక్కి పెట్టనుగా
పిలవండయ్యా! ఎలవండయ్యా! కరణం అప్పోజీ
ఎలవనంపితే వెళ్ళివచ్చెరా కరణం అప్పోజీ
మమ్ము పిలిచిన కారణమేలా? మాతో పని ఏలా?
నిన్ను ఎలిచినా కారణముందీ నీతో పని ఉందీ
కోయిలకుంట్లా జిలేదారుడూ మాటలాడినాడూ
పట్టపగలులో కోయిలకుంట్లనె నేను కొట్టవలెను
కలం దారిగా బుట్టి గట్టిగా పక్కలో పెట్టాడు
తెల్లకాయితం చేతబట్టెనే కరణం అప్పోజీ
కొండకరాటల సుంకేసులకు జాబు రాయమనెను
ముక్కమళ్ళ - ముదిగోడులకైనా జాబు రాయమనెను
కానాలా-సంజామలకైనా జాబు రాయమనెను
'జాబు చూసినా తక్షణమందూ బయలుదేరవలెను
నేను చేసినా ప్రతిగ్గనైనా గెలిపించావలెనూ
ఇంతమందికీ మీతోనైనా మనవి చేసినాను'
అంతమందికీ తలారి చేతా జాబులంపినాడు

వచనం తలారివాడు జాబులు తీసికొని సుంకేశల ముక్కమళ్ళ ముదిగోడు కానాల సంజామల కొండకరాటలకు పోయి జాబులిచ్చినాడు

పాట 'కరువు వచ్చినా కాలమొచ్చినా ఆదరించె రెడ్డి
అట్టి వక్క మన రెడ్డి మాటలూ చిన్న చెయ్యరాదు'

పల్లె పల్లె ఎల్లాపుల రాణువ బయలుదేరినాది
నాలుగైదు గ్రామాలమందిగా తాము లేచినారు
మూడు నూర్లకూ ముకుంద బల్లెం మురవక లేచింది
ఆరునూర్లకూ అలుగు ఈటెలే అదరక లేచినవి
తొమ్మిది నూర్లా సైన్యమక్కడా ఖరారు అయ్యింది

వచనం వీరందరూ కొండకరాటల దగ్గర సమావేశమయినారు మత్తు వస్తువు తాగినారు వీరాలాపాలు పలుకుతున్నారు

పాట 'కింద ఉన్నదా మీద ఉన్నదా కోయిలకుంట్ల లక్ష్మి
కోయిల్‌కుంట్లాటవును గట్టిగా తాము కొట్టవలెను'
అట్లగంట ఎల్లాపుల రాణువ సాగివచ్చినాది
రేయీ వొక్కా వగలు అంటనే కదలి వచ్చినాది
రూపనగుడి గ్రామానికి నేడూ కదలివచ్చినాది

వచనం సైన్యమంతా వచ్చి కుందేట్లో దిగినారు వాళ్ళు వచ్చిన విషయం నారసింహారెడ్డికి తెలిసింది

పాట కండబట్టినా మూడు పొట్టేళ్ళను కోయించినాడు రెడ్డి
మూడూ డబ్బాల్ మత్తు వస్తువా తెప్పించినాడు రెడ్డి
పొట్టనిండుగా భోజనాలు పెట్టించినాడు రెడ్డి
వచ్చిన పనినీ రాణువకప్పుడు తెలియ చెప్పినాడు
పాళెగాండ్రురా అట్టివేళలో శౌర్యం బలికినరు

వచనం అందరూ కలిసి ఉయ్యాలవాడకు వచ్చినారు నరిసిరెడ్డినీ అతని మనుషుల్నీ పిలచినాడు రెడ్డి సర్కారు వారి తరపున వస్తావా? అన్నాడు వాళ్ళు పరారి అయినారు

పాట 'ఈ పొద్దింట్లో రేపు మంటిలో[1] నరుని ప్రాణమోయి!
పుట్టబొయ్యి మన గుళ్ళదుర్తిలో మళ్ళీ పుట్టేమా?
చేరబొయ్యి మన రూపనగుడిలో మళ్ళీ చేరేమా?
చచ్చిన బ్రతికిన ప్రపంచమందూ పేరు ఒకటే చాలూ
నూరేండ్లు బ్రతికినా ఒక్కరోజునా వెళ్ళేపోవాలా

[1] ఈ పొద్దు ఇంటిలో రేపు మంటిలో మంటిలో మట్టిలో

ఈ పొద్దింట్లో రేపుమంటిలో నరుని ప్రాణమోయీా
చచ్చిన బ్రతికిన ప్రపంచమందూా ఖ్యాతి ఒక్కటి చాలు'
అర్వై వొక్కా తుపాకులయినా తాము లేపినారు

వచనం బుడ్డా వెంగళరెడ్డిగారి పొలాలు ఉన్న రస్తాగుండా పాంపల్లె అనే గ్రామం దాటినారు గుండ్లదుర్తి ఏటికాడ దుమికినారు

పాట ఏడిగడ్డలో వారు గట్టిగా ఎల్ల దాటినారు
గుండ్లదుర్తిలో గమిని లోపలా ఫలాల్ దుమికినారు
వళవళ వళవళ కేకలేసిరీ ఎల్లావుల రాణ్వ
అర్వై వొక్కా తుపాకులేమో అఘూవు లేపినరు
ఊళ్ళను వుండే జనమంతానూా గడగడ వణికినరు

వచనం ఏమిరెడ్డీ! ఎక్కడికి? అన్నారు స్వగ్రామం వారు విషయమంతా చెప్పినాడు నారసింహారెడ్డి ఆ గ్రామంలో ఉండే మాలమాదిగలు 200 మంది రెడ్డి వెంబడి బయలు దేరినారు

పాట అట్టి వేళలో బయలుదేరనే నారసింహారెడ్డి
రాజారావ్ రాజబహదరూా నారసింహారెడ్డి
గమినిగుండనూా బయలుదేరనే నారసింహారెడ్డి
జమ్మలమడుగూా కోయిల్‌కుంట్లా రోడ్డు ఎక్కినాడు
రోడ్డు మీదనూా వెళ్ళిపోతడే నారసింహారెడ్డి
ఆడనించి మరి వెళ్ళి వచ్చెరా నారసింహారెడ్డి
కోయిల్‌కుంట్లా సమస్థానమూా కదలివచ్చినాడు
కోయిల్‌కుంట్లా గమిని వద్దనే యోచన చేసినడు
పగవారిచేత నా రాణువ ఎన్నడు దెబ్బలు తినరాదు
ఎల్లావుల రాణువ దెబ్బలు తింటే చిన్నతనము నాకు'
అంట గట్టిగా తాను బలికినే నారసింహారెడ్డి
'సాదన చేసిన రెక్కలు మాకూా పట్లు పట్టినావి
ఇంతకాదు మరియింతలు వచ్చిన భయపడబోమన్న
సెలవు లివ్వవే సెలవులివ్వవే నారసింహారెడ్డి'
అట్టి వేళలో సెలవు లిచ్చెను నారసింహారెడ్డి

అర్థవై వక్కా తుపాకులాకూ మందుగుండు నేడు
వారు గనకనూ బందోబస్తూ తాము చేసినారు
అట్టి వేళలో గుఱ్ఱమెక్కినే నారసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టినే నారసింహారెడ్డి
చచ్చిన బ్రతికిన ప్రపంచమందూ ఖ్యాతి ఉండవలెను
నరా శరీరం ఇలలో ఎన్నడు శాశ్వతమ్ము కాదు
నాకు నాలుగూ జిల్లాల్లోపల ఖ్యాతి ఉండవలెను
మూడు నూర్లకే ముకుంద బల్లెం మురవక లేచింది
తకధిం తకధిం తళాంగు ధివ్వ!
ఆరు నూర్లకే అలుగు ఈటెలూ అదరక లేచినవి
వళవళ వళవళ కేకలేసిరీ ఎల్లావుల రాణ్వ
అప్పుడు గన్నా కోటలోపలా పడా ధుమికినారు
కోయిలకుంట్లా సమస్థానములో పాళెగాండ్లు నేడు
మేడలు మిద్దెలు బోనేశ్వరములు తాము ఎక్కినారు
సిత్తారూ సవికీలు గట్టిగా తాము ఎక్కినారు
ఊళ్ళ కొద్దిగా రాళ్ళు బట్టుకా మిద్దె లెక్కినారు
స్వాతి చిత్త సంధించిన విధమూ రాళ్ళ దెబ్బలండీ
సాధన చేసిన పురుషుడు అండీ నారసింహారెడ్డి
సాధన చేసిన బోయవాండ్లుగా ఎల్లావుల రాణ్వ
డాళ్ళు కత్తులూ చేతబట్టుకా తాము నిలిచినారు
డాళ్ళ చాటునా శరీరమంతా దాపు చేసినారు
ఎక్కడ రాళ్ళూ అక్కడ నేడూ ఎగర గొట్టినారు
'ఏల బోయి మన రూపనగుడినీ మళ్ళీ ఏలేమా?
పుట్టబోయ్యి మన తల్లి కడుపునా మళ్ళీ పుట్టేమా?
చచ్చిన బ్రతికిన ప్రపంచమందూ పేరు ఒకటి చాలు
సలాములయ్యా! సలాములయ్యా! నారసింహారెడ్డి!'
అట్టి ఏళలో పాళెగాండ్రుగా కేకలేసినారు
రెండు నూర్లకూ సైన్యంఅయ్యా కోయిల్‌కుంట్ల వాండ్లు
మాలవాండ్లునూ బోయవాండ్లునూ తురకవాండ్లు నేడు
మత్తు వస్తువులు రైతులు వారికి మరియు తాపినారు

వచ్చిన వక్కా సైన్యంమిందా పారాబందోరీ
అట్టివేళలో పారాలో పల తాను నిలిచినాడు
'ఆలుబిడ్డలా మీదా మీకూ ఆశలు ఉంటేనా
ఇంటికి తిరిగీ వెళ్ళి పోండిరా పాళెగాండ్రలారా!
తల్లిదండ్రిపై ప్రేమలు ఉంటే ఇంటికి వెళ్ళండి
రక్తకూడు ఒడి గట్టుకుంటె నామీదికి రావలెను'
'ఈ పొద్దిదియా రేపు తదియా నరుని ప్రాణమోయీ
నీటి మీదనూ బుగ్గ తోటిదీ నరా శరీరంబూ
ఎంత మాత్రమూ ఎనక్కి మేమూ జరగమయ్యా రెడ్డి'
సెలవులు కొడుకా సెలవులు కొడుకా పాళెగాండ్లలారా!'
వళవళ వళవళ కేకలేసిరీ పాళెగాండ్లు నేడు
'కోబలీ! రణబలీ!' అన్నరే పాళెగాండ్లు నేడు
అట్టి ఏళలో కన్నుల జూసే నారసింహరెడ్డి
వళవళ వళవళ కేకలేసెరా నారసింహరెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహరెడ్డి
కోబలీ!రణబలీ!' అన్నడే నారసింహరెడ్డి
ఆవులమందలొ పులీధుమికినా చందము ధుమికినడు
రెడ్డి ఎక్కినా గుఱ్ఱము లమిడీ ఏ విధమొచ్చినది?
కుప్పటి గంతుల మీద వచ్చెరా బారాహజ్జారి
వచ్చిన వక్కా సైన్యము అంతా దండులొ దుమికినరు
వంచినట్టి బల్లేలపైననూ వాలలాడుతారు
సాన జేసినా కత్తుల మిందా సవకళించినారు
అరవై వొక్కా తుపాకులండీ ఫెళఫెళ వాగినవి
గోవిందా! నారాయణ' న్నడే నారుసింహరెడ్డి
తల్లిదండ్రులకు తాను భక్తితో దణ్ణ మెట్టినాడు
ఆయుధమిచ్చిన గురువుల వారికి వందనమన్నాడు
విరగ నరుకుతా పోతాడయ్యా నారసింహరెడ్డి
తాటిపుచ్చెలా చందము నేడూ తలలే పోతావి
పొడుస్త వుంటే పడుతా వున్నవి పొట్ట పేగులోయి
నరుకుత వుంటే పడుతున్నావి నల్లగుండులోయి

చీరుతవుంటే పడుతున్నావీ చిన్న పేగులోయి
వాళ్ళు తాగినా కల్లూ సారాయ్ వరదలు పోతాది
అప్పుడు తిన్నా పప్పుకూడురా కుప్పలు తెప్పలురా
ఒకణ్ణి మీద ఒకణ్ణి వేసీ వీటెల గుద్దీరీ
పారా గొట్టీ పారా మీదా వొరగనూకుతారు
అట్టి వేళలో వస్తాడప్పా నారసింహారెడ్డి
గవిలో నుండీ పులిపిల్ల మాద్రి బయలుదెల్లినాడు
ఇరగ నరుకుతా కోటను అంతా వెల్ల నరికినారు
పసిడి బిడ్డ బాలింత తల్లులూ దు ఖా పోతారు
ఆలగోడురా బాలగోడురా కొయిలకుంట్లలోన
ఎక్కడ జూసిన పీనుగుపెంటలు కోయిలకుంట్లలోన
పళపళ పళపళ కేకలేసి మరి ఎందువచ్చినారు?
వర్తకులుండే వీధిలోపలా పడా ధుమికినారు
గడగడ గడగడ గడగడ వణికిరి వర్తకూలు దేవా!
అదిగో వచ్చె ఇదిగో వచ్చె నారసింహారెడ్డి
కోమటోళ్ళ బాజారు లోపలా నారసింహారెడ్డి
పప్పుగంపలూ ఉప్పుగంపలూ ఏకము చేసినరు
రణావిద్దమూ చేస్తాగనకా కదిలి వచ్చినారు
అట్టివేళలో పరానువారీ చిన్నవాడు నేడు
తురక వాళ్ళయా చిన్నవాడురా ఉసేను సాహేబు
'అతనంతా ప్రతాపశాలీ మనము కాదనేడు'
గుజాన్నివకటీ తాను వేసేనే ఉసేనయ్యగారు
గడ్డగ మొకటీ చేతబట్టెనే ఉసేనయ్యగారు
అట్టివేళలో బయలుదేరెనే ఉసేనయ్యగారు
రెడ్డి ధాటి కెదురొడ్డి నిలిచెనే ఉసేనయ్యగారు
'ఏవూరు నీది? ఏ పల్లెనీది? ఎరుగజెప్పవోయి?'
ఉసేనయ్యనూ కండ్ల జూసెనే నారసింహారెడ్డి
నా సంగతి ఈడికి తెలియక నేడూ తాను వచ్చినాడు
రాజారావూ రాజబహదరూ నారసింహారెడ్డి
తకధిం తకధిం తళాంగుధిప్ప!

వం నీ వెవరు?

నా పేరు నారసింహారెడ్డి మాది రూపనగుడి

నీ పేరు?

నా పేరు ఉసేను సాహెబ్

ఎందుకు వచ్చావు?

రణవిద్దానికి రణాశూరుడనై వచ్చాను!

ఎ 'నా చేతనూ యుద్ధం గనుకా చెయ్యలేవు నీవు'
'కోయిలకుంట్లా సమస్థానములో చచ్చిన వొకటేను
చచ్చిన బ్రతికిన పేరుంటేను చాలు గట్టిగాను
ప్రాపంచంలో నరాశరీరము స్థిరము కాదురన్నా'

వం

నారసింహారెడ్డి నీది వున్న వూరు నాది వేరూరు ఉన్న ఊరు వేటు విడుస్తావా? లేక వేరూరు వేటు విడవమన్నావా?

ఉసేన్ సాహెబ్ అయితే నా ఏటే నేను విడుస్తున్నాను తట్టుకో

ట వళవళ వళవళ కేకలేసెనే ఉసేనయ్యగారు
చంద్రాయుధమూ చేతబట్టెనే ఉసేనయ్యగారు
ధీన్‌ధీన్ మౌలాలి అన్నడే ఉసేనయ్యగారు
ఆనెగొంది మౌలాలి దేవుడా దండములన్నాడు
గుల్బర్గా బందే నవాజులూ దండములన్నాడు
ఓ పెనుగొండా బావాదేవుడ దండములన్నాడు
ధీన్ ధీన్ మౌలాలి అంటనూ ఆయుధము తిప్పినాడు
గరగర దిప్పీ గట్టిగ లష్టీ ఏటు నడిపినాడు
వచ్చే కత్తిని తాను తట్టెరా నారసింహరెడ్డి
మూడు ఏట్లనూ తప్పించుకొనెను నారసింహరెడ్డి
నీ ఏటేమీ నా ఏటొచ్చె తలచుకొమన్నాడు
పటపట పటపట పండ్లు కొరికెరా నారసింహరెడ్డి
తెల్లని గుడ్లకు తెచ్చె రకతముతొ నారసింహరెడ్డి

కుడీలొడ్డును తానుగొట్టెరా నారసింహారెడ్డి
మొలక మీసమూ గోట దీటెరా నారసింహారెడ్డి
నీ ఏటేమీ నా ఏటొచ్చె తలుచుకోమన్నాడు
ఎడమన ఏటూ తాను జూపెరా నారసింహారెడ్డి
కుడినా పోటూ తాను జూపెరా నారసింహారెడ్డి
నెత్తిమీద మా నరుకు జూపెరా నారసింహారెడ్డి
గిరగిర గిరగిర ఆయుధంబునే తాను ద్రిప్పనాడు
రెట్ట కొద్ది తన ఏటు నడిపెనే నారసింహారెడ్డి
ఉసేను సాబూ శిరము ఎగిరెనూ పుట్ట చెండు రీతి
ఉసేను సాబూ శిరము గట్టిగా ఎగిరి ఎగిరి వడెను
రాజారావూ రాజ బహదరూ నారసింహారెడ్డి
రెడ్డికాదు బంగారపు కడ్డీ నారసింహారెడ్డి
పట్టపగలు మన కొయిలకుంట్లనే కొల్లగొట్టినాడు
ఒంటిగంట మా ఏళలోపలా నారసింహారెడ్డి
ఆడనించి మరి బయలుదేరెరా నారసింహారెడ్డి
బీనుపాటి రస్తాను బట్టెనే నారసింహారెడ్డి
ఏటి కాడికే ఎళ్ళి వచ్చెరా నారసింహారెడ్డి
ఏటి ప్రక్కనే ఉన్నాదయ్యా కొయిలకుంట్ల కోట
పాళెగాండ్లతో పళపళ పళపళ కేకలేసినాడు
కోయిలకుంట్లా కోటను గట్టిగ చుట్టుకున్నరండి
కోయిలకుంట్లా కచేరి చుట్టూ ఆయుధాలు నేడు
కత్తిపోటు మరి కమాయి పోటూ కలబడి తిరిగేది
'అప్పుడు అన్నా మాటలు లక్ష్మీ ఇప్పుడు పలకాలా'
ఎక్కడున్నవో ఎందు ఉన్నవో జిలేలుదారుడా!
నేను చేసినా ప్రతిజ్ఞ నీవూ కనుగొనలేకాను
పొల్లు మాటలే ఆడినావురా జిలేలుదారుడా!'
పళపళ పళపళ కేకలేసెనే నారసింహారెడ్డి
రాజారావ్ రాజబహదరూ నారసింహారెడ్డి
కోయిలకుంట్లా జిలేదారునీ రెట్టబట్టినాడు

కుర్చీమిందా జిలేదారునీ రెట్ట బట్టి యిగ్గె
జిలేదారునీ టోపి గట్టిగ మూడు దొర్లు దొర్లె
టవును బయటికీ ఎత్తికొట్టెరా నారసింహారెడ్డి
నక్కనోటి జమదండం బాకూ పైకి ఎత్తినాడు
నీ యేటేమీ నా యేటొచ్చే తలుచుకొ' మన్నాడు
అట్టి ఒక్క ఆ జిలేదారునీ బొజ్జపైగ నేడు
రెట్టగొట్టి మా యేటు నడిపెరా నారసింహారెడ్డి
పర్రు పర్రునా బొజ్జను కోసీ పగల జీల్చినాడు
నన్నపేగును జంజెమేసెరా నారసింహారెడ్డి
వాని రకతమూ సుక్క బొట్లుగా తానుబెట్టినాడు
పళపళ పళపళ కేకలేసిరీ ఎల్లాపుల రాణ్వ
అట్టి వేళలో సరకార్మందీ కండ్ల జూసినారు
'గోలిఎరావ్' 'గోలిపిరావ్'[1] అంటూ సరకారుత్తరువు
ఎక్కడున్నవే? ఎందు ఉన్నవే నారసింహారెడ్డి?
రచ్చించావే రచ్చించావే నారసింహారెడ్డి
మమ్ముల నీవూ కాపాడ వయా నారసింహారెడ్డి'
బోయసైన్యము రెడ్డికప్పుడు దండమెట్టినారు
పళపళ పళపళ కేకలేసిరీ ఎల్లాపుల రాణ్వ
అట్టివేళలో పనెండుమందీ పోలీసులవాండ్లు
రెడ్డి మీదికీ వారూ నేడూ పైబడి వస్తారు
పళపళ పళపళ కేకలేసిరీ ఎల్లాపుల రాణ్వ
మీ యేటేమీ మా యేటొచ్చే తలుచుకొమన్నారు
ఎల్లాపులందరూ పోలీసువాండ్ల మింద ధుమికినారు
పనెండుమందీ పొలీసువాండ్లా గొంతు కోసినారు
రైటమ్మంటా కిందికి దుమికే సబ్ఇన్స్పెక్టారు
టోపీ తీసీ చంకను బెట్టీ పారి ఉరుకుతాడు
ఎట్టి టోపినీ కండ్ల జూస్తెనే ఎగిరి చంపుతారు
ఎవరి టోపులూ వాండ్ల చంకలో వాండ్లు బెట్టినారు

[1] గోలీ Bullet ఎరావ్ Fire

చెప్పక తర్లీ వీధికి వచ్చీ వారిండ్లలో బడినారు
రోయిన పారా చిక్కున పారా బందొబస్తు నేడు
వరానుపారా రోయిన పారా బందొబస్తు నేడు
ఆడజేరినా పాళెగాండ్లురా ఎటువంటీవారు
వటవట వటవట బీగాలన్నీ వగలగొట్టినారు
అట్టివేళలో గడియలన్నియూ విరగగొట్టినారు
సరకరు ఖజాన బీగం దీసీ కొల్లగొట్టినారు
ఖజానలోని పైకమునంతా మలువుకున్నరండి
ఆడనించి మరి బయలుదేరెరా నారసింహరెడ్డి
'అమడాలా' 'బిజినామల' వల్లెలు ఎళ్ళదాటినాడు
బనగానవల్లె దావ బట్టెనే నారసింహరెడ్డి
కొట్టిన వొక్కా ఖజాన దుడ్డూ ఖర్చుపెట్టుతాడు
సరకారు చేతిలో మనము చిక్కితే రండవద్దులండి'[3]
జగన్నాధమూ కొండజేరెరా నారసింహరెడ్డి

వచనం పాళెగాండ్లు అందరూ అక్కడే ఉండినారు వారికి బత్తెములు తిండితీర్థాలు అన్నీ అక్కడే ఏర్పాటు చేసినాడు నారసింహరెడ్డి సర్కారు వారికి నారసింహరెడ్డిని పట్టుకోవడం శక్యం కాలేదు అందువల్ల బళ్ళారిలో ఉండే జాతి దొరలకు లేఖలు వ్రాసినారు

పాట రాం రాం రఘు రాం రాఘవా అనంత గుణధామా!
బళ్ళారిలో ఉండే జాతి దొరలకూ జాబులు వ్రాస్తారు
'రెడ్డిని గనకా పట్టుటానికీ మా చేతను కాలేదు
మీరువైతేను మాటలచేతా రెడ్డిని వడతారు
శేరుశేరు బంగారు కడియములు బహుమతులిస్తాము
ఎడికెడేసి బంగారు గొలుసులే బహుమతులిస్తాము
అందుకు మూడూ ఇందుకు నాలుగు ఏడు లక్షలోయి
ఏడు లక్షలాపైకం మీకూ దొరలకు ఈనాము
అదీ సాలకా రాకాపోతే జాతి దొరల్లారా!

[3] రండ వద్దులు చిన్నతనము

సాలుకు నూరూ గొడ్డుటావులూ బహుమతులిస్తాము
పన్నెండొక్కా మోజు పాటేళ్ళు మీకే ఈనాము
సీమకొండి బరండి సారాయి మీకే ఈనాము''
గరగర గరగర గరగర గరగర జాబులు వ్రాశారు
జాబులు వ్రాసీ మోరులు[4] వేసీ సాగనంపినారు

వచనం ఒక బుడ్డ పాళెగాడు జాబులు పట్టుకొని కోయిలకుంట్లవదలి బళ్ళారికి బయలుదేరినాడు

పాట జమ్మలమడుగూ రోడ్డు వెంబడీ బుడ్డ పాళెగాడు
'మాయలూరు' 'అల్లూరు' గట్టిగా ఎళ్ళదాటినాడు
జమ్మలమడుగూ రోడ్డు ఎంబడే కదలి వచ్చినాడు
'ఉప్పలపాడు' గట్టిగ తాను ఎళ్ళదాటినాడు
జమ్మలమడుగూ' 'ముద్దనూరు'నూ ఎళ్ళదాటినాడు
'తాడిపర్తి' మరి 'గుత్తి' 'గుంతకల్లు' ఎళ్ళదాటినాడు
రైలు మింద మరి 'బళ్ళారి'కైనా ఎళ్ళి సేరినాడు
బళ్ళారిలోకి తాను వచ్చెనే బుడ్డ పాళెగాడు
సెంట్రల్ జైలూ ప్రక్కకు వాడూ చేరవచ్చినాడు
జాతివాండ్ల యా దండూపేటా అక్కడ వున్నాది
అందరికీని గొప్పవాడురా భిళ్ళందొరగారు
అక్కడి కొచ్చీ నిలిచినాడురా బుడ్డపాళెగాడు
సలాంజేసీ జాబుకమ్మలే చేతికిచ్చినాడు
అట్టి జాబులూ చేతబట్టెరా భిళ్ళంధొరగారు
అట్టి ఏళలో కన్నుల జూసే భిళ్ళంధొరగారు
మాటలచేతా నేను గట్టిగా రెడ్డిని బట్టేనా!

వచనం భిళ్ళంధొరగారు ఫిరంగి గుండ్లు తోపుసామాను జజాయి సామాను కమ్మి బండ్లకు ఎత్తించినాడు జాతిసైన్యాన్ని సిద్ధం చేసినాడు

పాట సైన్యమంతయూ తాము లేచిరీ జాతుల బలమంతా
కోటల ప్రక్కన దిగుమజిలయ్యిరి జాతుల సైన్యంబు

[4] మోరులు మొహరులు

రణం రణం రణం రణం అంటూ భేరులు గొట్టారు
తాసులవారో[5] జాతిగంటలూ ఝణాన మ్రోగినవి
జాతుల వారీ దస్తు పిలంగొరో[6] తాను వాగినాది
ఆడనుంచి ఆ జాతిసైన్యమూ తాను లేచినాది
ఏనుగాలు గుఱ్ఱాలు వారుగా కమించి లేపారు
ఒంటెలబారూ ఒగ్గీలండీ తొరగా లేచినవి
అట్టి వొక్క సైన్యాన్ని గట్టిగా జాతి దొరలు నేడు
రేయీవొక్కా పగ౭ అంటనే[7] జాతుల బలమంతా
ఆడనుంచిరా జాతులవారీ సైన్యం వొస్తాదీ
రేయీవొక్కా పగలు అంటనే కదలి వచ్చినారు
మజిలీలూ మజిలీలు వేస్తనే కదలి వచ్చినారు
అల్లగాను బనగానపల్లెకూ చేరవచ్చినారు
జగన్నాధమూ కొండకాడికే చేరవచ్చినారు
జగన్నాధమూ కొండ చుట్టుగా ముట్టడేసినారు
ఎండలాకు బల్ ఎత్తిరి దేవా ఎండిపట్టుదేరా
కార్యానికీ ఎత్తిరి దేవా కాయి[8] పట్టు దేరా
పొద్దు పొడుపులకు ఎత్తిరి దేవా పొగడ పట్టుదేరా
ఏనిగాల గుఱ్ఱాల బారునూ కట్టివేసినారు

వచనం ఆ జగన్నాధం కొండపైన నారసింహారెడ్డి ఎక్కడ ఉండినాడో తెల్లవారికి తెలియలేదు అందువల్ల రణభేరీలు మ్రోగించినారు

పాట రణం రణం రణం రణం అంటూ భేరులు కొట్టారు
తాసులవారీ తాముగంటలే ఝణాన మ్రోగినవి
జాతులవారీ దస్తుపిలంగోరి తాను వాగినాది

వచనం నడికొండలో ఉన్న నారసింహారెడ్డి ఆ శబ్దాలు విన్నాడు తన పాళెగాండ్లను హెచ్చరించినాడు మేము మా రక్తపు కూడు ఒడిగట్టుకున్నాము నువ్వు అగ్నిలో దూకమన్నా దూకుతాము అన్నారు పాళెగాండ్లు నాయనలారా! సేనాధిపతులారా!

[5] తాసులవారీ గంట గంటకు తాసు గంట (కన్నడ పదము) [6] ఎలంగొరి ఎల్లిన గ్రోవి
[7] రేయిని ఒక పగలుగా భావిస్తూ [8] కాయి కావి

నా గుఱ్ఱాన్ని శృంగారింప జెయ్యండి అన్నాడు నారసింహారెడ్డి అందరూ యుద్ధానికి సిద్ధమయినారు

పాట నాలుగు కాళ్ళకు నాగుటందెలే గుఱానికేశారు
పళ్ళసందునా కత్తెర కళ్ళెం గుఱానికేశారు
ముత్తేలా ముఖమాల నెత్తికీ గుఱానికేశారు
వెండిది అయినా జీనుపళ్ళెమే గుఱానికేశారు
ఇట్టి విధముగా రెడ్డి గుఱాన్నీ సవరణ జేశారు
రాజారావూ రాజ బహదరూ నారసింహరెడ్డి
ములుకోల కట్టె చేతిలో ఉంటే మున్నూటికి మొనగాడు
అట్టి వొక్క మన రెడ్డి గట్టిగా గుఱ్ఱమెక్కినాడు
కొరడా ఏటూ మడమ తన్నురా గుఱాన్ని కొట్టాడు
రామ రామ రఘు రామ రాఘవా రామయ రఘు రామా
స్వాతీ చిత్తా చందము దేవా ఆయుధాలు మెరిసె
ఆయుధాలతో రెడ్డి వెంటనే బయలుదేరినారు
రాణువ నప్పుడు హెచ్చరించెను నారసింహరెడ్డి
'ఈ పొద్దిదియా రేపుతదియా నరుని ప్రాణమోయి
నీటిమీదనూ బుగ్గ తోటిదీ నరాశరీరమ్మూ
ఈ పొద్దింట్లో రేపుమంటిలో నరుని ప్రాణమోయి
ఏలబోయి ఈ ప్రాపంచంలో మరల ఏలబోము
పుట్టబొయ్యి మన తల్లి కడుపునా మళ్ళీ పుట్టేమా?
ఎవరి శౌర్యమును వారు జూపుచూ యుద్ధం చెయ్యండి
లెయ్యండోయీ! లెయ్యండోయీ! పాళెగాండ్లలారా!'
లెయ్యండంటే తాము లేచిరీ పాళెగాండ్లు నేడు
మండీమీలా వస్తున్నారూ ఎల్లావుల దండు
కులమందునా వాల్మీకమ్మూ రాణువ సైన్యంబు
ఈటెలు వేసీ ఈటెలమ్మటే పరపడి గొట్టేది
బాకులు వేసీ బాకులమ్మటే అంతర్లు కొట్టేది
రెడ్డినుట్టునా వాండ్లు గనుకనా గోల్[1] తిరుగుతారు

[1] గోల్ గస్తీ

గుఱాన్ని వొకటీ డావుటించెనే[10] నారసింహారెడ్డి
రెడ్డి ఎక్కినా గుఱ్ఱము లమిడీ ఏ విధమున్నాదీ
గుఱ్ఱము వొక్కా భలము గట్టిగా ఏ విధమున్నాదీ
గుఱ్ఱము వొక్కా ఘాతుక దేవా కలదు గట్టిగాను
కాలిదుమ్ము కైలాసమేగెరా గుఱ్ఱము ఘాతాకు
చారెడేసిరా వలుగు రాళ్ళురా పిండి పిండి రవుడీ
అట్టి గుఱ్ఱమును ఎక్కినాడురా నారసింహారెడ్డి
జాతులవారీ సైన్యము నందూ వడా ధుమికినారు
'హుషారండీ హుషారప్పా పాళెగాండ్లలారా'
'మీ వొక్కదయలు గట్టిగాను మా మీదను వుంటేను
మాకు వచ్చినా భయము లేదుగా నారసింహారెడ్డి'
ఎడమ భాగమున కెళ్ళి వచ్చెరా నారసింహారెడ్డి
కుడీభాగమున కెళ్ళి వచ్చిరీ పాళెగాండ్లు దేవా
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డి
వళవళ వళవళ కేకలేసుతా నరుకుత పోతాడు
తన కులమింటీ దేముడు గనుకా నారసింహులేమొ
''నీ పాదమునూ నేను బట్టినా నీవే దిక్కంటి
నరా సాయమూ నాకు లేదురా నీ సాయము తప్ప
పక్షులాకు ప్రాణాలు ఇచ్చినా ఉదార రక్షకుడా!
రక్షించయ్యా రక్షించయ్యా నారసింహస్వామి
అంటాగన్నా దండమెట్టెనే నారసింహారెడ్డి
ఆవులమందలో పులీ ధుమికినా చందము ధుమికినడు
పారాగొట్టే పారామిందనె వొరగ నూకుతాడు
కుంఫిణి గొట్టే కుంఫిణి మిందనె కూల నూకుతాడు
ఎడమను కుడినీ నరుకుతపోవ్వా నారసింహారెడ్డి
తాటివుచ్చెలా చందము దేవా తలలే పోతావి
ఇక్కడ గన్నా సైన్యం గన్నా బయలు వచ్చినారా
'కోబలీ! రణబలీ!' అంటనే దండులో ధుమికారు

[10] డావుటించు సవారి చేయు

''ఏలబోయి ఈ ప్రాపంచంలో మరల ఏలబోము
పుట్టబోయ్యి మన తల్లి కడుపునా మల్లా బుట్టేమా?'
పాళెగాండ్లకూ ఈ విధమ్ముగా పౌరుషమొచ్చింది
రామ రామ రఘురామ రామయా రామయ రఘురామా
'మారో మారో మారో' అంటరు జాతివారి బలమూ
'మారో అన్నా మాదరు ఛేదా ఈటెమాడు లష్మీ!
'పకడో పకడో పకడో' అంటరు జాతివారి బలమూ
'పకడో అన్నా ధగిడీ కొడుకా బాకుమాడు లష్మీ!'
గోవిందా నారాయణంటనూ విరగ నరుకుతారా
అరరర రరరే
పొడుస్తవుంటే పడుతున్నావీ పొట్ట పేగులండీ
నరుకుత వుంటే పడుతున్నావీ నల్లగుండెలోయీ
వాళ్ళు తాగిన కల్లూ సారాయ్ వరదలు పోతాదీ
అప్పుడు తిన్నా పప్పుకూడురా కుప్పలు తెప్పలురా
అట్లగానూ రణవిద్దం సేస్తా సేనాపతులేమొ
కొట్టి కొట్టి మా కొల్లలాడెరా నారసింహరెడ్డి
కొండసుట్టు మూడు సుట్లు తిరిగిరీ పాళెగాండ్లు నేడు
సావంగా మరి సిక్కిన పదగుల[11] కండ్ల జూసినారూ
'అల్లా హల్లా హల్లా' అంటూ పరారు అవుతారూ
టోపులు లేకా పరానుమందీ కుండల కురికేదీ
కత్తులు లేకా పరానుమందీ కట్టెల కురికేదీ
గుఱాలు లేకా జాతులవారూ డేరా లెక్కేదీ
'రైటో రైటో రైటో' అంటా డేరా కొట్టేదీ
'రైటో లేదూ మీటో లేదూ' ఈటెన గుద్దేది
కట్టివేసినా గుఱాల కాడికి జాతిదండు వచ్చె
మూతికి వుండే లగాము తీసీ తోకకు పెట్టేదీ
తోకకు వుండే లగాము తీసీ మూతికి పెట్టేదీ
వీపున కంతా డొక్కకు వేసీ బిగించి కట్టేదీ

[11] పదగులు  కాలిబంట్లు

వొకడీ గుఱ్ఱం మీదకు లఖ్మీ ఇద్దరు ముగ్గురుగా
గూటామన్నా ఊడగొట్టకా గుఱాన్ని కొట్టేదీ
దెబ్బలాకు మరి తట్టుకొనలేక గూటం పెరుక్కోని
గుఱ్ఱం అప్పుడు సవారు గన్కా తాను లేచినాది
గుఱ్ఱం గూటం మోకాలికి గొట్టుక మెండు ఎగిసినాది
జాతివాండ్ల ఆ బోడిగుండ్లకూ లొటాన గొట్టేది
ఇద్దరి ముగ్గురి మొయ్యలేకనే క్రిందికి ఉరికేది

వచనం అప్పుడు భిళ్ళంధొర తోప్కాను[12] నిండా మందుకూరి బారు చేసకొని పెట్టినాడు ఎడమ ప్రక్కనించి రణవిద్దం చేస్తా నారసింహారెడ్డి వస్తున్నాడు

పాట రాజారావ్రూ రాజ బహదరూ నారసింహారెడ్డి
విరగ నరుకుతా వస్తాడయ్యా నారసంహారెడ్డి
అట్టి విధముగా వచ్చే రెడ్డికి బారు పెట్టినాడు
హరే రాం రఘురామ రాఘవా రామయ రఘురామా
అట్టి వేళలో తోపుకానునే ఉడాయించినాడు[13]
అగ్గి కక్కుతా తోపుగుండు మరి దూసుకు వస్తాది
ఢాం' అన్నా శబ్దం వినెనూ నారసింహారెడ్డి
అరరర రరరే
కలిగెర మోసం కలిగెర మోసం ప్రాణం పోతాది
ఎవడోగన్కా దొంగ ఏటునే తాను నడిపినాడు
వచ్చే వొక్కా తోపుగుండుకు డాలు వొడ్డినాడు
'ఫటా' మంటనే తోపుగుండు మరి ఎగిరి పడినదండీ
అట్టి వేళలో విద్దం సేస్తా నారసంహారెడ్డి
జాతివాడు భిళ్ళంధొర రెడ్డిని కండ్ల జూచినాడు
ఇక్కడ ఉంటే నా ప్రాణమే ఎట్టిక పోతాది
అంట గట్టిగా[14] పరారు ఆయె భిళ్ళంధొరగారు
'పారిపొయ్యేవాని గొట్టితే పవరు కమ్మి[15] లఖ్మీ'

[1] తోప్కాను ఫరంగి
[14] గట్టిగా తొందరగా
[13] ఉడాయించినాడు పేల్చినాడు
[15] పవరు కమ్మి పౌరుషము తక్కువ

చెప్పకుండనే పరారు అయిరీ జాతివారి బలము
ఎవరి ఊర్లకూ వారు గనకనూ పారి ఉరికినారు

వచనం పాళెగాండ్లు రణవిద్దం చేసి కొండ చుట్టూ మూడుసార్లు తిరిగినారు జాతిసైన్యం అంతా పరారు అయినాది అప్పుడు నారసింహరెడ్డి పారిపొయ్యే వారిని కొడితే పౌరుషం కాదని తన దండును వారించినాడు పాళెగాండ్లతో తిరిగి జగన్నాధపురం కొండ చేరినాడు జాతి సైన్యమంతా పశ్చాత్తాప పడినారు లంచాలు మాకు లేకపోతే పోయె ప్రాణాలు దక్కితే చాలు అని సంతృప్త పడ్డారు ఖజానా కొట్టిన ధనంతో నారసింహరెడ్డి సైన్యం కాలక్షేపం చేస్తావుంది ఆ జగన్నాధపురం కొండ దిగువున ఒక మైలు దూరంలో గొల్లవిండ్ల పల్లె గ్రామం ఉన్నది ఆ గ్రామంలో జానకమ్మ అనే స్త్రీ ఉన్నది నారసింహరెడ్డితో ఆమెకు సంబంధం కలిసినది రాత్రివేళ రెడ్డి రహస్యంగా ఆమె యింటికి వెళ్ళి స్నానం చేసి భోజనం చేసి వస్తూ ఉండేవాడు

పాట *'గొల్లవిండ్ల' యను పల్లెలోపలా 'జానికమ్మ' గారు*
*పెడకంటీ కాపుకులమునా జానికమ్మగారు*
*అర్ధరాత్రి అపరాత్రి ఏళలో నారసింహరెడ్డి*
*కలికి ఏళ గాంధారి ఏళలో నారసింహరెడ్డి*
*రాయి రాయి కరిగేటి ఏళలో నారసింహరెడ్డి*
*మాను మాను వొరిగేటి ఏళలో నారసింహరెడ్డి*
*కొరివి దెయ్యములు కొట్లాడు ఏళలో నారసింహరెడ్డి*
*బావుల్లోనా నీళ్ళుఅన్నియూ నిదరబోవు ఏళ*
*బసవదేవుడూ మేతమెయ్యనీ అర్ధరాత్రి ఏళ*
*పసిబిడ్డలూ తల్లిపాలుమరి తాగ మరసేవేళ*
*అట్టి ఏళలో బయలుదేరెరా నారసింహరెడ్డి*
*జగన్నాధునీ కొండ యిడిచెరా నారసింహరెడ్డి*
*'గొల్లవిండ్ల' కే కదలి వచ్చెరా నారసింహరెడ్డి*
*రాజారావూ రాజ బహదరూ నారసింహరెడ్డి*

వచనం జానికమ్మ యింటి ముందర గుఱ్ఱాన్ని కట్టేసినాడు అప్పటికే జానికమ్మ ఒక కడివెడు నీళ్ళు కాచి ఉంచినది జాలారు బండెక్కి నారసింహరెడ్డి జలకాలు ఆడి తలార స్నానం చేసి ధూమ్రమైన[1] వస్త్రములు ధరించి పట్టెమంచం పానుపు కాడికి

[1] ధూమ్రము నలుపు మించగలసిన ఎరుపు

వచ్చిన వాడాయెను జానికమ్మ నవకాయ పిండివంటలు వండి పీటలు వేసి భోజనం వడ్డించినాది రెడ్డి ఆ భోజనం చేసివచ్చి పట్టెమంచం మీద ఆనందంగా కొలువు దీరిన వాడాయెను అప్పుడు జానికమ్మ బంగారు తబుకులో కర్పూర తాంబూలములు ఇచ్చింది ఆ తాంబూలము వేసికొని పదహైదు నిమిషములున్న వాడాయెను పోయి వస్తానని జానికమ్మతో చెప్పి పోయినాడు ఇట్లా వస్తా పోతా ఉండేవాడు ఇట్లు ఒకనెల గడిచింది అప్పటికి ఈ భారీ భారీ రాజులంతా ఆలోచన చేసినారు నారసింహారెడ్డిని పట్టమని బనగానపల్లె గులామల్లీని అడిగినారు సర్కారు తనవల్ల కాదన్నాడు గులామల్లీ కొన్ని దినములు గడిచినాక గొల్లవిండ్ల పల్లె గ్రామానికి నారసింహారెడ్డి రాత్రివేళ వస్తా పోతా వున్నట్లు కొందరికి తెలిసింది జారత్వం చోరత్వం భూలక్ష్మి దాచదు ఈ గొల్లవిండ్ల పల్లె రైతు ఒకడు కోయిలకుంట్ల గ్రామానికి వెళ్ళినాడు ఈరైతు అక్కడికి వెళ్ళేసరికి సర్కారువారు నారసింహారెడ్డిని పట్టుట ఎట్లా! అని ఆలోచనచేస్తాఉండినారు ఈ రైతును అడిగినారు మొదట తనకేమీ తెలియదనినాడు తరువాత నారసింహారెడ్డి ప్రతిరాత్రీ గొల్లవిండ్ల పల్లెలో జానికమ్మ అనే ఆమె యింటికి వస్తాడనీ వారిద్దరికీ సంబంధం ఉన్నాదనీ ఆమెను పట్టుకుంటే తెలుస్తాందనీ సర్కారుతో చెప్పినాడు

పాట *అరే రాం రఘు రామ రామయా రామయ రఘురామా*
*మారువేషములు వేశారయ్యా సరకారూమంది*
*గొల్లవిండ్లకే కదలివచ్చిరీ సరకారూమంది*
*జానికమ్మ ఆ యింటికాడికే కదలివచ్చినారు*
*'రెడ్డిని పట్టీయి రెడ్డిని పట్టీయి జానికమ్మ నీవు*
*పట్టిస్తే రూపాయలు వేయీ లంచం ఇస్తాము'*
*లంచం కోసం ఆశపడ్డదీ జానికమ్మగారు*

వచనం వేయి రూపాయలు లంచం ఇస్తాము రెడ్డిని మాకు పట్టీయ్యి అనినారు సర్కారువారు జానికమ్మ కేవలం ఉంపుడుకత్తె కాబట్టి ఆ లంచానికి ఆశపడినాది కోళ్ళు తినేవాడు పోతే గొజ్జెలు తినేవాడు వస్తాడు ఇదీ ఉంపుడు కత్తెల ప్రేమ! వారిని రాత్రి ఒంటిగంటకు రమ్మన్నాది దుడ్డు ముందుగా ఇమ్మన్నాది సర్కారు వెయ్యి రూపాయలు ఆమెకు ఇచ్చినారు ఆ డబ్బును ఆమె దాపం[17] చేసినాది సర్కారు వారు కోయిలకుంట్లకు కబురు చేసినారు ప్రొద్దుగుంకే వేళకు బందోబస్తుతో రమ్మని తంతి ఇచ్చినారు

[17] దాపం దాపరికం దాచుకొనుట

పాట అట్టి వేళలో కోయిలకుంట్లలో పాళెగాళ్ళు గలరు
రిజర్వు వొక్కా పోలీసులను వెంట లేపినారు
పోలీసు వారిని వారు గట్టిగా వెంటదోలుకోని
అట్టి వేళలో జీపుకారునే వారు దీసినారు
మందీ మారూబలము గనకనా వెంటదోలుకొని
ప్రొద్దు గ్రుంకినా గంటకు నేడూ ఆజరు[11] పడినారు
రైతులిండ్లలో వాళ్ళు గనకనా తాము జేరినారు

వచనం జగన్నాధపురం కొండపై అరణ్యములో వున్న నారసింహారెడ్డికి ఇదేమీ తెలియదు మామూలుగా పోతున్నాడు మామూలుగా వస్తున్నాడు తన పాళెగాళ్లతో తాను ఎక్కడికి వెడుతున్నాడో చెప్పలేదు ఒక సీసా మత్తు వస్తువ జానికమ్మ తెచ్చి తన యింట్లో ఒక ప్రక్కన పెట్టినాది అర్ధరాత్రి ఒంటిగంటవేళ నారసింహారెడ్డి గొల్లవిండ్లకు బయలు దేరినాడు

పాట అట్టి వేళలో బయలు దేరెరా నారసింహారెడ్డి
రాజారావ్ రాజ బహదరూ నారసింహారెడ్డి
గొల్లావిండ్లా పల్లె గ్రామమూ రెడ్డి వచ్చినాడు
జానికమ్మ ఆ యింటికాడికే కదలి వచ్చినాడు
ఇంటి ముందరే గుఱ్ఱాన్ని కట్టి తలుపు తట్టినాడు
'తలుపు తీయవే తలుపు తీయవే భామా జానాకీ!'
దిగ్గున లేచీ తలుపు తీసెరా జానకమ్మగారు
పట్టెమంచమూ పానుపు మిందా కొలువు దీరినాడు
'దండములయ్యా! దండములయ్యా! నారసింహారెడ్డి!
ఒప్పులు తప్పులు క్షమియించావే నారసింహారెడ్డి!
మంచి మత్యమూ నీకు తెస్తినీ నారసింహారెడ్డి!
అనుభవింపవే అనుభవింపవే నారసింహారెడ్డి!''
మత్తువస్తువా సీసా రెడ్డికి అంది యిచ్చినాది
కల్లా కపటం తెలియని రెడ్డి గటగట త్రాగాడు

[11] ఆజరు హజరు

వచనం మద్యం పుచ్చుకోవడం నారసింహారెడ్డికి దినమ్మూ అలవాటున్నాది కాని ఆ దినం ఎక్కువగా ఇచ్చినాది జానికమ్మ కొంచెం పని వుంది ఇప్పుడే వస్తాను అని చెప్పి బయటకు వెళ్ళిపోయినాది జానికమ్మ సరకారు వారు ఉన్నచోటుకు వెళ్ళినాది

పాట సరకారు వారి అంచునకయితే త్వరగా వచ్చింది
'వచ్చి వున్నడూ వచ్చివున్నడూ నారసింహారెడ్డి
మన యింటిలోపలికి వచ్చి వున్నడూ నారసింహారెడ్డి
తక్షణమందూ వస్తే గట్టిగ రెడ్డి చిక్కుతాడు
లేకపోతె మీ వశముగాదురా సరకారూమంది'
అట్టివేళలో సరకరు మందీ తాము లేచినారు
జానికమ్మ ఆ యింటి చుట్టూనూ ముట్టడేసినారు
అట్టి వేళలో రెడ్డి గనకనూ ఇంటిలో ఉన్నాడు
అరరర రరరే
ఎంత మోసమూ నన్ను జేస్తివే జానికమ్మ నీవు'
వాకిలి కాడికి సరకరు మందీ వచ్చి చేరినారు
ఇంటిలోనికీ పోవటానికీ గుండె చాలలేదు
గడగడ గడగడ వణుకుతారురా సరకారూమంది
ధైర్యం చేసీ సబ్ఇన్స్పెక్టరు ముందుకొచ్చినాడు
'అతడు దేముడా మానవ మాత్రుడు మనలాంటీ మనిషే'
అంటూ తానూ సబ్ఇన్స్పెక్టరు ముందు కొచ్చినాడు
రెడ్డిని గనకా తక్షణమందూ పట్టబొయ్యినాడు
అట్టి వేళలో రెడ్డీ గనకా కండ్ల జూసినాడు
'ఈ పొద్దిదియా రేపు తదియా నరుని ప్రాణమోయీ
నీటి మీదనూ బుగ్గ తోటిదీ నరా శరీరమ్ము
ఏలబోయి ఈ ప్రపంచంలో మరల ఏలబోము
పుట్టబోయి మన తల్లి కడుపునా మల్లా బుట్టేమా?'
పళపళ పళపళ కేకలేసెరా నారసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డి
అట్టివేళలో సబ్ఇన్స్పెక్టర్ని తాను బట్టినాడు
ఎత్తి వానినీ నేలకు గొట్టే నారసింహారెడ్డి

నక్కనోటి జమదండం బాకుతో ఏటు నడిపినాడు
బొజ్జలో పొడిచి పర్రున కోసి పగల జీల్చినాడు
సన్నపేగునూ జంజమేసెరా నారసింహారెడ్డి
వాని రకతమూ సుక్క బొట్టుగా తాను బెట్టినాడు

వచనం పదిరోజులున్నా భార్యే ఒక్కరోజున్నా భార్యే తన తరువాత జానికమ్మను ఎవరైనా ఉంచుకుంటే అది తనకు చిన్నతనమని భావించి ఆమెను కూడా చంపి వేసినాడు

పాట నక్కనోటి జమదండం బాకును చేతబట్టినాడు
గోవిందా నారాయణంటనే ఏటు నడిపినాడు
మాలు[19] లోపలా హతమైపోయే జానికమ్మగారు
అట్టి వేళలో కన్నుల జూచే నారసింహారెడ్డి
రక్తమెకములా బయలున ధుమికెను నారసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డి
గోవిందా నారాయణంటనే విరగ నరుకుతాడు
సరకారు మందిలో పడాధుమికెరా నారసింహారెడ్డి
ఎడమన కుడినా నరుకుత వచ్చే నారసింహారెడ్డి
అయిదుమంది పోలీసువాళ్ళనే గదిమి నరికినాడు
రెడ్డికి అపుడు మద్యపు కైపూ జాస్తీ అయినాది
తూగుతు తొర్లుతు రెడ్డి అప్పుడూ తడబడ పడుతుండె
అట్టివేళలో సరకరుమందీ కండ్లజూసినారు
మంచి సమయమూ మనకు చిక్కెనని కేకలేసినారు
తూగుతువున్నా రెడ్డినప్పుడూ తాము పట్టినారు
అరెరెర రెరెరే
కాళ్ళకైన సంకెళ్ళు గట్టిగా తాము వేసినారు
చేతులాకు బేడీలు గట్టిగా రెడ్డికి వేశారు
తకధిం తకధిం తళంగు జువ్వా
కోయిలకుంట్లా కోటకు వారు పట్టుక వచ్చారు

[19] మాలు మహలు ఇల్లు

*కోయిలకుంట్లా కోట లోపలా రెడ్డిని నిలబెట్టి*
*రేత్రి అంతటా పారావుంచిరి సరకారూమంది*
*గల్లుశిక్షనే ఖరారు చేసిరి సరకారూమంది*
*భళ్ళు భళ్ళునా తెల్లవారెనూ కొయిలకుంట్లలోన*
*అట్టివేళలో రెడ్డిని బట్టీ తాము దెచ్చినారు*
*జుర్రేటి గట్టుకు రెడ్డిని గనకా తీసికొచ్చినారు*
*ఏటి గట్టునా గుంజలు పాతీ కొరితికి కేసినారు*
*విలవిల విలవిల రెడ్డి తన్నుకొని ప్రాణమిడిచినాడు*
*సచ్చిన బతికిన కీర్తికెక్కేనూ నారసింహరెడ్డి!*
*వీరస్వర్గమే చూరగొనెనురా నారసింహరెడ్డి!!*
*వైకుంఠానికి చేరిపోయెరా నారసింహరెడ్డి!*
*విష్ణుమూర్తిలో ఐక్యమాయెరా నారసింహరెడ్డి!!*

వచనం నారసింహారెడ్డి బంధువులు చుట్టపక్కాలకు లేఖలు వ్రాసినారు వారందరూ దు ఖపడుతూ వచ్చి రెడ్డి శవాన్ని రూపనగుడికి తెచ్చినారు తలవార స్నానం చేయించి ఘనమైన వస్త్ర భూషణములు కట్టి భాజా భజంత్రీలతో ఉత్తర దిశలో దహనం చేసినారు నారసింహారెడ్డికి సితిమతులు[20] ఏర్పాటు చేసి అతనిని వైకుంఠానికి పంపించినారు

(తాను చనిపోయిన తరువాత తన బంధువులు పొరక చేట పట్టవద్దని నారసింహారెడ్డి చెప్పినాడట ఈ విషయం నారసింహారెడ్డి వంశీకులును రూపనగుడి మునసబుగారును నా ప్రియమిత్రులును అయిన శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారు 15-3 1966నాడు నాతో చెప్పినారు తంగిరాల)

[20] సితిమతులు చిన్నదినం పెద్దదినం

# 2 వొహువా! నరసింహారెడ్డి!

(పిచ్చుకుంట్లు పాడే పాట)

వొహువా! నరసింహారెడ్డి!
నీ పేరంటే – రాజా నరసింహారెడ్డి! ॥వొహువా॥

పుట్టింది రూపనగూడి
పెరిగిం దుయ్యాలవాడ
పాలు వన్నము దీనింది
గుళ్ళదుర్తి గ్రామంలో – ॥వొహువా॥

నారసింహారెడ్డి దెబ్బా
భూమీ గడగడా వొణికే
భూమినుండే ఆదిలక్ష్మి
తోడు బలికిన్నాది గాదా! – ॥వొహువా॥

భళిరే! నరసింహారెడ్డి!
నీ పేరంటే – రాజా నరసింహారెడ్డి!

నారసింహారెడ్డి దెబ్బా
ఉరవకొండా కెరుకాయే
ఉరవకొండా సాలెవాడూ
లాకదబ్బులు[1] ఈపునేసే – ॥ భళిరే॥

నారసింహారెడ్డి దెబ్బా
గుత్తి సీమా కెరుకాయే
గుత్తిలుండే సాకలోడు
సాకిరేవ్ బండాలు ఇడిసే – ॥భళిరే॥

[1] లాకదబ్బులు సాలెపడుగులో పెట్టే కర్రలు

సైరా! నరసింహారెడ్డి
నీ పేరంటే - రాజా నరసింహారెడ్డి!

నారసింహారెడ్డి దెబ్బా
ఊరబిచికలు ఊరనుండవు
పొట్టే ఎచికలు పాలము నుండవు
పసిపిల్లలు పాలు తాగరు - //సైరా//

నారసింహారెడ్డి ఎంబడి
అయిదు నూర్లకు జనములేచే
కత్తీ కత్తికీ ఖేలం[2]
కానీ నరసింహారెడ్డీ - //సైరా//

భళిరా! నరసింహారెడ్డి!
నీ పేరంటే - రాజా నరసింహారెడ్డి!

నారసింహారెడ్డి ఎంబడి
గోసాయీ ఎంకన్న
గోసాయి ఎంకన్నా
ఒడ్డే ఓబన్నేమొ - //భళిరా//

కొయిలకుంట్లా కొట్టినాడూ
గిద్దలూరూ దోచినాడూ
కుడీమీసా మెుడాదిద్దీ
రచ్చకట్టన కొలువుదీరే - //భళిరా//

వాహువా! నరసింహారెడ్డి!
నీ పేరంటే - రాజా నరసింహారెడ్డి!

[2] ఖేలం ఆట

కొయిలకుంట్లా తాసీల్దారూ
శిరసునేమో నరికినాడూ
బొందిలోడూ వారసింగూ
వాని శిరసూ నరికినాడూ
రెండు శిరసులు నరికినాడూ
నయనలప్పులో దాచినాడు - ॥వొహువా॥

గోలుకొండది గొడ్డు గొర్రా
బుక్కవట్నం, సన్న బియ్యం
కాలవాడీ ఉడికె తప్పుడు
కల్లి బిల్లీ లేపినాడూ - ॥వొహువా॥

సైరా! నరసింహారెడ్డి!
నీ పేరంటే - రాజా నరసింహారెడ్డి!

కొయిలకుంట్లా కరణమయ్యా
అయన పేరే ఎంకట్రాముడు
లక్ష్మిరెడ్డి[3] ధాకలాకూ
దత్తనాలా[4] మూట ఎత్తుకు
పారిపోతడు కరణమయ్యా - ॥సైరా॥

నారసింహారెడ్డి ఎంబడి
అయిదునూర్లకు జనము లేచే
కచేరీనీ మట్టుబెట్టే
ధనాహారం కొల్లగొట్టే - ॥సైరా॥

భళిరే! నరసింహారెడ్డి!
నీ పేరంటే - రాజా నరసింహారెడ్డి!

[3] నారసింహారెడ్డి పూర్తిపేరు లక్ష్మీనరసింహారెడ్డి కాబోలు
[4] దస్త్రాల మూట

*జగన్నాథుని కొండమీదా*
*ఆదిశక్తీ దేవళంబూ*
*ఆదిశక్తిని తోడుబెట్టుకు*
*అయిదు నూర్లకు నరికినాడూ -* *॥భళిరే॥*

*తండ్రిపేరే పెద్దిరెడ్డీ*
*తాతపేర్ జయరామిరెడ్డీ*
*ఇంటి పేరే మద్దెలోళ్ళూ*
*తానపేర్ నరసింహరెడ్డీ -* *॥భళిరే॥*

(ఎచ్చుకుంట్ల పెదనాగన్న కుమారుడు చిననాగన్న కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకా చెలిమళ్ళ రుద్రవరం గ్రామంలో 21 4 1966 నాడు పాడినపాట చిననాగన్న ఈ పాటను తన మామ గంగన్న దగ్గర నేర్చుకున్నాడట తంగిరాల)

## 3 దొరవారి నరసింహ్వారెడ్డీ!

### (కోలాటం పాట)

రాయలసీమ పాళియగాండ్ర పుట్ట ఊరికొక ఒడయడు పల్లెకొక పాళెగాడు కుంపిణీ వారి బావుటా క్రొత్తగా ఎగిరిన కాలములో చాలమంది పాళెగాండ్రు లొంగలేదు వారిలో ఈ దొరవారి నరసింహారెడ్డి ఒకడు కోయిల కుంట్ల తాలూకా ఉయ్యాలవాడ పరిసరముల ఇతని ప్రభుత్వము చెల్లుచుండినది కుంపిణీ దొరతనమును ఎదిరించి వీరమరణము పొందినాడు ఇది క్రీ శ 1800 1825 నాటి సంఘటన కోలాటము పాట ఇది

*దొరవారి నరసింహ్వారెడ్డీ!*
*నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డీ!* *॥దొర॥*

*రేనాటి సీమలోనా రెడ్డోళ్ళ[1] కులములోనా*
*దొరవారీ వమిశానా[2] ధీరుడే నరసింహ్వారెడ్డి* *॥దొర॥*

కోయిల్‌కుంట్లా గుట్టలెంటా కుందేరూ వొడ్డులెంటా
గుర్రమెక్కీ నీవు వస్తే కుంపిణీకీ గుండె దిగులూ ॥దొర॥

కాలికీ సంకెండ్లు వేసీ చేతీకీ బేడీలు వేసీ
పారాతో పట్టి తెచ్చీ బందికానులో పెట్టిరీ ॥దొర॥

కండ్లకూ గంతాలు గట్టీ నోటినిండా బట్లు పెట్టీ
నిలువునా నీ తలా గొట్టీ కోట బురుజుకు గట్టిరీ ॥దొర॥

కాసిలోనా తల్లికేమో చావు సుద్దీ దెలిసినాదీ
కన్న కడుపే తల్లటించే గంగలోనా గంగ గలిసే

దొరవారి నరసింహ్వారెడ్డి!
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి!

(పాడినవారు దూదేకుల బాబయ్య వురఫ్ సిద్రెప్ప సూరేపల్లి తాడిపర్తి తాలూకా అనంతపురం జిల్లా సేకరించినవారు ఆచార్య తూమాటి దొణప్ప త్రివేణి ఆంధ్ర ప్రదేశ్ జానపద గేయాల సంకలనం పుటలు 284 285)

1 రెడ్డివారి

2 వంశమున

3 గుట్టలవెంట

4 ఒడ్డు గట్టు

5 గస్తుకావలి (పహరా ఉర్దూ శబ్దము)

6 ఆ యదనున నరసింహారెడ్డి తల్లి కాశీయాత్రకు వెడలియుండినట్లును పుత్రుని మరణవార్త ఆమె కాశియందుండగా తెలిసినట్లును చెప్పుదురు

# 4 ఉత్తరాది ఉయ్యాలవాడలో (1)

(బుడ్డా వెంగళరెడ్డిగారిని గురించి గుడ్డిదాసరులు పాడేపాట
కోవెలకుంట్లలో సేకరించినది)

ఉత్తరాది ఉయ్యాలవాడలో
ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళ రెడ్డీ
దొడ్డ ప్రెబువనీ తెలియరయా!! ॥ఉత్తరాది॥

దొడ్డ ప్రెబువనీ దొరలు మెచ్చగా
ఇడుపున గూర్చోనుండునయా!
ఇడుపున గూర్చో వెంగళరెడ్డీ
ఇక ఇక నగుతా నుండునయా!! ॥ఇడుపున॥

అరి[1] నారాయణ అనేటి జనులకు
అన్నవస్తరము లిచ్చెనయా!
గోయిందా అని పాడే జనులకు
గోవు దానమే సేసెనయా!! ॥గోయిందా॥

అండీ లండీ లెండి బంగారము
బండ్లు గట్టి తోలించెనయా!
బండి పైకము దండి కొమెర[2] లో
దండిగ దరమము సేసెనయా!! ॥బండి॥

మాటా సొచ్చెం తెలిసిన ప్రెబువని
మల్లెపూల పాన్పుండు నయా!
పున్నెం సేసిన యెంగళరెడ్డికి
పూలపానుపే ఉండునయా!! ॥పున్నెం॥

[1] హరి

[2] కడపజిల్లాలో జమ్మల మడుగు తాలూకాలో కొమ్మెర గ్రామం

పరాయిదేశం పోయిన రెడ్డికి
పాన్పులేపు దిండుండునయా!
దిండి సుతారం[3] మెండుగ జనులూ
అండ బాయకా నుందురయా!! ॥దిండి॥

పరాయిదేశం ఎక్కడనుండియొ
బాపనయ్య ఒకడొచ్చెనయా!
యెంగళరెడ్డీ యింటికి ఎళ్ళీ
మజ్జిగీయమని అడిగెనయా!! ॥యెంగళ॥

యెంగళరెడ్డీ సిన్న బారియా[4]
సిన్నబారియా సెన్నమతల్లీ –
లేవలేకనే సల్లని తల్లీ
లేవు లేవు అని పలికెనయా! ॥లేవ॥

సూస్త తాళమనీ[5] యెంగళరెడ్డీ
ఇంటిలోపలికి యెళ్ళెనయా!
కాండవమీనా[6] సిబ్బి తీసితే
కదలక మజ్జిగ ఉండెనయా!! ॥కాండవ॥

పాడిలేని బ్రతుకేల అంటనీ
రోసగింపులూ సేసెనయా!
పాలు సక్కెరా పంచదారలూ
బాపనయ్యకే పంచెనయా!! ॥పాలు॥

లేవు లేవు అని పోసిన మజ్జిగ
దోసమంచు మది నెంచెనయా!
పడ్డను దూడను యెంగళరెడ్డీ
పగ్గమేసి పట్టించెనయా!! ॥అవును॥

[3] దిండు చుట్టూ
[4] చిన్నభార్య
[5] తాళము అని
[6] కడవపైన

తల్లిపిల్లనూ యెంగళరెడ్డీ
పగ్గమేసి పట్టించెనయా!
నీదీ కాదిది నాదీ కాదూ
ఆ దేవుని సొమ్మని పలికెనయా!! ॥నీది॥

జీనీ ఏసీ గుఱ్ఱాన్ని ఎక్కి
సెన్నపట్టణము సేరెనయా!
సెన్నపట్టణము ఎన్నిదొరలునూ
వొంగి సలాములు సేసిరయా!!
వొంగొంగి సలాములు సేసిరయా!!

మూలము తెలిసిన యెంగళ రెడ్డీ
మూడు లోకములు ఏలెనయా!
ఎండగాసినా మండలానికీ
ఎరిక గలిగినా రెడ్డివయా!! ॥ఎండ॥

పెళ్ళిళ్ళు కాని బీద బాపలకు[7]
పెళ్ళిళ్ళూ సేయించెనయా!
కళ్ళూ కాళ్ళూ లేనివాళ్ళకూ
ఎద్దు బళ్ళు తోలించెనయా!! ॥కళ్ళూ॥

బంగరు శాలువ పాగా చుట్టీ
బారులు కొలువే వెళ్ళెనయా!
బళ్ళారి కోర్టులో బలే జవాన్లూ
చార్జీలూ సబిన్‌స్పెక్టర్లు, గవర్నరు
వొంగి సలాములు సేసిరయా!
వొంగొంగి సలాములు సేసిరయా!!

మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని
మల్లెపూల పాన్పుండునయా!

[7] బ్రాహ్మణులకు

పున్నెం సేసిన యెంగళరెడ్డికి
పూలపానుపే ఉండునయా!! ॥పున్నెం॥

సెంగాయి[1] పంచెలు సింగారించీ
రాణెమ్మ దగ్గిరి కెళ్ళెనయా!
రాణెమ్మ సూసీ కిలకిల నవ్వీ
రత్నహారమే మెడకేసెనయా!! ॥రాణెమ్మ॥

పన్నెండేలో[2] పట్టాభూమికి
పన్నులేదనీ పలికెనయా!
పన్నులేని మన బీద పంటలని
యెంగళరెడ్డీ పలికెనయా!! ॥పన్నులేని॥

ఎకరాకూ ఒక దమ్మిడి పన్నూ
ఏరుపాటు సేయించెనయా!
పున్నెం సేసిన రాణెమ్మ తల్లికి
పూలపానుపే ఉండునయా!! ॥పున్నెం॥

ఉత్తరాది ఉయ్యాలవాడలో
ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళరెడ్డీ
దొడ్డ ప్రెబువనీ తెలియరయా!!

(కర్నూలు జిల్లా కోవెలకుంట్లలో బస్సుస్టాండులో 15 12 1965 నాడు ఒక గ్రుడ్డివాడు పాడగా వ్రాసుకున్న పాట ఆ జానపదుని పేరు నాగెళ్ళ సుబ్బరాయుడు అతని స్వగ్రామం కోవెలకుంట్ల తాలూకాలోని సంగపట్నం తంగిరాల)

[1] చెంగావి

[2] పన్నెండువేల

## 5 ఉత్తరాది ఉయ్యాలవాడలో (11)

(బుడ్డా వెంగళరెడ్డిగారిని గురించి గుడ్డిదాసరులు పాడేపాట
నంద్యాలలో సేకరించినది)

నాందీ ప్రస్తావనలు

*ఉత్తరాది ఉయ్యాలవాడలో*
*ఉన్నది దరమం సూడరయా!*
*నేటికి బుడ్డా యెంగళ రెడ్డీ*
*దొడ్డ ప్రెబువనీ తెలియరయా!!*
*దానపరుడు బుడ్డెంగళరెడ్డీ*
*నల్లని ప్రెబువని తలియరయా★*

*దొడ్డప్రెబువని దొరలు మెచ్చగా*
*ఇడుపున గూర్చోనుండునయా!*
*ఇడుపున గూర్చో నెంగళరెడ్డీ*
*ఇక ఇక నగుతా నుండునయా!!*

*దానం దరమం గ్యానం[1] తెలిసీ*
*దరమరాజువలె ఏలెనయా!*
*సచ్చిన బతికిన యెంగళరెడ్డికి*
*సర్గలోకమే ఉన్నదయా!!*

*పున్నెం సేసిన యెంగళరెడ్డికి*
*పూలవాను పే వచ్చునయా!*
*మాటా సొచ్చెం[2] తెలిసిన ప్రెబువని*
*మల్లెపూల పాన్పేతురయా!!*

*అండీ లండీ లెండి బంగారు*
*బండి గట్టి తోలించెనయా!*

[1] *దానం ధర్మం జ్ఞానం*

[2] స్వచ్ఛం

★ *తలచుకొనుడు*

బండి పైకమూ దండి కొమిరెలో
దండిగ దానం సేసెనయా!!

పరాయిదేశం పోయిన రెడ్డికి
పాన్పు లేపు దిండుండునయా!
దిండు చుట్టును దండిగ జనులూ
అండ బాయకా నుందురయా!!

మజ్జిగ దాహం అడిగిన బ్రాహ్మణునకు ఆవును దానము చేయుట

పరాయిదేశం నుండి ఒక్కవరి
బ్రామ్మనోత్తముం[1] డొచ్చెనయా!
యెంగళరెడ్డీ యింటికి బోయీ
మజ్జిగియ్యమని అడిగెనయా!!

యెంగళరెడ్డీ ఎన్నబారియా
సిన్నబారియా సెన్నమతల్లీ
లేవలేకనే నల్లనితల్లీ
లేపు లేపు అని పలికెనయా!

కురిసి మిందనుం డెంగళరెడ్డీ
గుండె లావటీల లేసెనయా!
సూస్తా తాళమని యంగళరెడ్డీ
ఇంటి లోపలికి ఎల్లెనయా!!

కుండ కుండ శోధించిన రెడ్డీ
భాండమనేమో సూసెగదా!
భాండవ నిండా మజ్జిగ బెట్టుక
లేపు లేపు అని మజ్జిగ పోస్తే
పురుగులాయి ఉల కొట్టుగదా!!

[1] బ్రాహ్మణోత్తముడు

పాలు సక్కెరా పంచదారలూ
బాపనయ్యకొడ్డించెగదా!
కండ సక్కెరా కలాకండ
బాపనయ్యకే పెట్టెగదా!!

బోంచేసినా బాపనయ్యకూ
తాంబూలా మందించెగదా!
కన్నులారనే యెంగళరెడ్డి
గాటిపట్టు[4] కే సూసెగదా!!

కోర కొమ్ములా పల్ల పడ్డ అది
పెయ్యదూడనే ఈనింది గదా!
మజ్జిగ లేని యింటి లోపలా
పాడి యేలయని పలికె గదా!
మనకీ మజ్జిగ లేకుంటె మానె –
పగ్గమేసి ఆ యెంగళరెడ్డీ
దూడను ఆవును తోలించెనయా!!
నీదీ కాదూ నాదీ కాదూ
ఆ దేవునిదని పలకపయా!!

## బుడ్డా వెంగళరెడ్డిగారి కీర్తి వ్యాపించుట

సెంగయి పంచెలు సింగారించుకు
సెన్నపట్నమే సేరెనయా!
సెన్నపట్నములో సాయెబు దొరలూ
ఇనీస్పెటర్లు పోలీసు జవాన్లు
సాబు సలాములు సేసిరయా!
వంగి సలాములు సేసిరయా!!
వొంగొంగి సలాములు సేసిరయా!!

[4] గాటిపట్టు పశువులను కట్టెడి కొట్టము

దరమాత్ముని యెంగళరెడ్డిని
బటువు బ్రామ్మలే పొగిడిరయా।

ఎండ గాసినా మండలానికీ
ఎరుక గలిగినా రెడ్డివయా।
ఇరువున గూర్చ్ వెంగళరెడ్డీ
ఇక ఇక నగుతా నుండునయా।।

పున్నెం సేసిన యెంగళరెడ్డికి
పూలపానుపే వచ్చునయా।
మాటా సొచ్చెం తెలిసిన ప్రెబువని
మల్లెపూల పాన్పేతురయా।।

## బుడ్డా వెంగళరెడ్డిగారు చేసిన వివిధ దానములు

అరినారాయణ అన్నవారికీ
అన్నవస్తరము లిప్పించునయా।
గోయిందా అని పాడే జనులకు
గోవు దానమే సేసునయా।।

పాలు లేని పసిబాలులకెల్లా
పాల సలేంద్రలు పెట్టునయా।
పెండ్లిండ్లు కాని బీద జనులకూ
పెండ్లిండ్లే సేయించెనయా।।

కాలులేని కరమొండివాళ్ళకూ
ఒంటెద్దు బళ్ళు సేయించెనయా।
కుంటి వాళ్ళకూ గుడ్డి వాళ్ళకూ
ఈడు జోడూ మన్నుములు సూసీ
పెండ్లిండ్లే సేయించెనయా।।

పున్నెం సేసిన యెంగళరెడ్డికి
పూలపానుపే వచ్చునయా।

దరమాత్ముని యెంగళరెడ్డిని
బటువు బ్రామ్మలే పొగిడిరయా!!

బుడ్డా వెంగళరెడ్డిగారు విక్టోరియా మహారాణిని చూచుటకై చెన్నపట్టమునకు వెళ్ళుట- ఆమె బంగారు పతకమును బహూకరించుట

జీనూ ఏసీ గుఱ్ఱాన్ని ఎక్కీ
రాణి ఎదటకే పోయెనయా!
రాణీదేవీ కన్నుల జూచీ
కురిసీ పీట లేయించెనయా!!
దానపరుడ బుడ్డెంగళ రెడ్డీ
కూర్చోమంటనె పలికెనయా!
కోట్ల ద్రవ్యమూ రెడ్డి దగ్గరా
కువ్వ[5] లేను పోయించెనయా!!
దరమాత్ముడా! యెంగళరెడ్డీ
దానము సేయుమని పలికెగదా!
రాణీగారీ రచ్చపైకమూ
నేను గనకనూ దానము సేస్తే
బాకి పడతనని పలికెగదా!!
దానము సేయుము రచ్చ పైకము
బాకిలేదు అని పలికె గదా!
ఒడీ గట్టుకొని యెంగళరెడ్డీ
దండిగ దానం సేసెనయా!
కచేరికోటా దాటగనే ఇక
సాలలేదు అని పలికె గదా!!

కిలకిల కిలకిల రాణి నగీ
అచ్చు పొరమూ ఎండి బంగారూ
ఆగదంటనే పలికెనయా!

[5] కుప్ప

కిలకిల కిలకిల రాణి నగీ
రాణిబిళ్ళ మెడకేసెనయా!
రత్నాల దండ మెడకేసెనయా!!
నీ–పన్నెండుపుట్లూ పండే భూమికి
పన్నులేదు అని పలికె గదా!!
ముందు కాలమెటువంటిదో తల్లీ
అరద పన్ను వేమనియె గదా!!
ఎకరాకూ మూడు కాసుల వంతున
దైవరు బొక్కుల దస్కతులేమో
సేసెగదా!!
ఇంతకు దప్పితె పన్నేలేదని
లెక్కమొరులో ఒత్తెనయా!!
కుంటి వాళ్ళకూ గుడ్డివాళ్ళకూ
సాదులకూ సన్నాసులందరికి
సచ్చిన బతికిన టక్కొట్టే లేదని
పలికె గదా!!

## మాలమాదిగల పిల్లలకు గిత్తను దానము చేయుట

కారితీక మాసములో రెడ్డీ
కాటుక కన్నుల కర్రెకోడనే – పట్టెనయా!
నాలుగు కాళ్ళా మట్టమున్నదీ
నడినెత్తిన మరి సుక్క ఉన్నదీ
బిళ్ళ కొమ్ములా కర్రె కోడనే – పట్టెనయా!
మాల మాదిగా పిల్లలు వాళ్ళూ
ఎల్లుగాడు మరి మల్లుగాడునూ
ఆటలాడనే వచ్చిరయా!
చెండాటలాడనే వచ్చిరయా!
ఇదేనా మన యెంగళరెడ్డీ
కాటుక కన్నుల కర్రె కోడె అని – పలికిరయా!

పందుంబియ్యాం గిత్తయితే మా
పండగయితదని పలికిరయా!!
జీతగాళ్లు మరి కమతగాళ్ళు
కన్నులారనే జూసిరయా!
చెవ్వులారనే యిన్నరయా!
సెలకోలలు ములుకోలలు దీసుక
పిల్లలెంబడే పడినరయా!
ఆడబన్నరూ ఈడబన్నరూ
వాళ్ళిళ్ళ దాపునా బన్నరయా!
దండమయ్య ఓ యెంగళరెడ్డీ
నీకు దండమని పలికిరయా!
చాలు చాలు నీ కొలువు చాలునని – పలికిరయా!
ఏమర్రా ఒరి జీతగాళ్ళు ఒరి కమతగాళ్లు
చిగిలి కోర్టుకు పయనం మనకీ
తగిలె నంటనే పలికెనయా!
ఎంటనే ఈ కట్టు వాళ్ళను
పిలవానంపీ యెంగళరెడ్డీ
మాలమాదిగా యిళ్ళకు బోయీ
పిల్లలనయినా పట్టుకరమ్మని – పలికెనయా!
ఎంటనే ఈ కట్టువాళ్ళు
మాల మాదిగల యిళ్ళకు పోయి
ఏమర్రా ఒరి మాలమాదిగలు
బుడ్డా యెంగళరెడ్డి ఎలుస్తడు – అని పలికిరయా!
యెంగళరెడ్డీ మాట అంటనే
పలీజరమూ వచ్చెనయా!
పిల్లలనయినా తోల్కొని వారూ
యెంగళరెడ్డీ భేటీకైననూ – పోయిరయా!
దండమయ్య ఓ యెంగళరెడ్డీ
నీకు దండమని పలికిరయా!
గోడపెల్లలూ ఇటిక పెల్లలూ

పొయ్యిలోన కాలేసెనయా!
దూది పరుపులా మీన పండబెట్టి
ఉడుకులేసు కాపించెనయా!
ఉడుకు నీళ్ళతో యెంగళరెడ్డీ
మొకాలు ఇక కడిగించెనయా!
జొన్న పులగమూ ఎల్ల ఈ సెలా
కారము ఇకనే పెట్టించెనయా!
నాలుగు పుట్లూ పట్టే పాతర
జొన్నలు బయటా పోసెనయా!
కుటుంబాలకూ తగినట్టుగ ఆ
జొన్నలేసు కొలిపించెయా!
ఏమి ఎరగని ఎద్దుగిత్తకూ
పుటిక మేతలే పెట్టెనయా!
చెవి లోపలనే యెంగళరెడ్డీ
నాయనా! ఓ బసవ దేవుడా!
నీకూ నాకూ ఋణాలు దీరెను
మాలావాండ్లా ఇండ్లకు నీవూ
ఒడ్డేలి కట్టెకు పూజకెల్లమని – చెప్పెనయా!
వగ్గమేసి ఆ యెంగళరెడ్డీ
మాలమాదిగల కిచ్చెనయా!
సాలలేదు అని పలికితె మీకు
నరకమున్నదని తెలిపెనయా!

ఉత్తరాది ఉయ్యాలవాడలో
ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళరెడ్డీ
దొడ్డ ప్రెబువనీ తెలియరయా!!

పున్నెము సేసిన యెంగళరెడ్డీకి
పూలపానుపే ఉండునయా!

మాటా సాచ్చెం తెలిసిన ప్రెబువని
మల్లెపూల పాన్పేతురయా!

## గౌరక దొంగలు బుడ్డా వెంగళరెడ్డిగారిని చంపవచ్చుట

జీనూ ఏసీ గురాన్ని ఎక్కీ
ఇరూపాచ్చి[6]కే ఎడలెనయా!
నలుగురేను మరి గౌరక దొంగలూ
చంపడానికే వచ్చిరయా!
'నాయనా! ఒరి గౌరక దొంగలూ
ఆకలి గొనినరు గౌరక దొంగలూ
అన్నము దీనీ నన్ను సంపు డని పలికెనయా!
నలుగురేను ఆ గౌరక దొంగలకు
బోజనాలు పెట్టించెనయా!
బోజనాలు బోంచేసిన వారికి
తాంబూలా లందించెనయా!
'నాయనా! ఒరి గౌరక దొంగలూ!
నన్ను జంప మని పలికెనయా!
 నిన్ను జంపుటకు రెడ్డిగారు మా
కాళ్ళు సేతులే ఆడ' వంటనే పలికిరయా!
 ఈడదింటిరీ ఈడ ఏర్గితిరి
భారియ పిల్లలు ఎదురుసూత్త' రని - పలికెనయా!
అయిదు గాడ్దెలకు బియ్యం మూటలు
యెంగళ రెడ్డెత్తించెనయా!
నలుగురైన ఆ గౌరక దొంగలకు
దోవ కర్చులే ఇచ్చెనయా!

ఉత్తరాది ఉయ్యాలవాడలో
ఉన్నది దరమం సూడరయా!

[6] విరూపాక్షి

నేటికి బుడ్డా యెంగళరెడ్డీ
దొడ్డ ప్రెబువని తెలియరయా!

దానపరుడు బుడ్డెంగళరెడ్డీ
సల్లని ప్రెబువని తలియరయా!

పున్నెము సేసిన యెంగళరెడ్డికి
పూల పానుపే వచ్చునయా!
మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని
మల్లెపూల పాన్పేతురయా!!

తురక బూబమ్మకు పట్టుచీరను, రెండెకరాల భూమిని దానము చేయుట

పరాయిదేశం నుండి వక్కా
తురక బూవమా వచ్చెనయా!
నాయనా! ఓయి యెంగళరెడ్డీ
ఒక పాత వస్తర మియ్యవయా!
కన్నులారనే యెంగళరెడ్డీ
ఇంటిలోనికే సూసెనయా!
యెంగళరెడ్డీ సిన్న బారియకు
పుట్టింటోరూ పెట్టిన యట్టీ
సీర వొక్కటే ఉండెనయా!
దండెంమిందా సీరను దీసీ
తురక బూవమ్మ కిచ్చెగదా!
కన్నులారనే యెంగళరెడ్డీ
సిన్నబారియా సూసెనయా
తులకా బూవమ సెతిలో సీరా
సిన్నబారియా గుంజుకొనే!
నేను ఇచ్చినా దరమం ఈమే
తిరుగుబాటునే సేసెననీ –
ఎంట ఎంటనే యెంగళరెడ్డీ

సీరలు నేసే మాలవాన్ని - పిలవం పెనయా!
కండెలు పడుగూ ఎత్తూమొత్తము - తూచెనయా!
నాయనా! ఒరి మాలవాడా!
తురక బూవమకు సీర ఒక్కటీ నెయ్యమనే!
ఎంట ఎంటనే యెంగళరెడ్డీ
మిసును[7] మీదనే రెయికో[8] లైన కుట్టించెనయా!
వొడీ బియ్యము కొబ్బరి గిన్నెలు
బియ్యమేను తెప్పించెనయా!
రెండెకరాలా భూమీ ఒయినా
తురక బూవమకు పసుపు కుంకుమా కిచ్చెనయా!
పుట్టింటీ ఒక బిడ్డ లెక్కనే
ఉచ్చవమ్ము[9] సేయించెనయా!

భరతవాక్యము

పున్నెం సేసిన యెంగళరెడ్డికి
పూలపానుపే వచ్చునయా!
మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని
మల్లెపూల పాన్పేతురయా!!

దానం దరమం గ్యానం తెలిసీ
దరమరాజువలె ఏలెనయా!
సచ్చిన బతికిన యెంగళరెడ్డికి
సర్గలోకమే ఉన్నదయా!!

7 మిషను

8 రవిక

9 ఉత్సవమ్ము

ఉత్తరాది ఉయ్యాలవాడలో
ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళ రెడ్డీ
దొడ్డ ప్రెబువనీ తెలియరయా!!
దానపరుడు ఋడ్డెంగళరెడ్డీ
నల్లని ప్రెబువని తలియరయా

దొడ్డ ప్రెబువని దొరలు మెచ్చగా
ఇడుపున గూర్చోనుండునయా!
ఇడుపున గూర్చో నెంగళరెడ్డీ
ఇక ఇక నగుతా నుండునయా!!

ఈ పాటను నేను కర్నూలు జిల్లా నంద్యాలలో 19 12 1965 నాడు సేకరించినాను శ్రీ మానుద్దు నరసన్న (50 సంవత్సరాలు) అతని కూతురు శ్రీమతి చిలుకోళ్ళ వెంకటమ్మ (35సంవత్సరాలు) పాడినారు వీరు దళిత క్రైస్తవులు ఆనాడు నేను తీసిన ఫొటోలో శ్రీమతి వెంకటమ్మ ఆమె భర్త శ్రీ చిలకోళ్ళ సుబ్బయ్య (45 సంవత్సరాలు) ఉన్నారు తంగిరాల

## అనుబంధము - I

# బ్రిటీష్ ప్రభుత్వంపై ఉయ్యాలవాడ నరసింహారెడ్డి సాయుధ తిరుగుబాటు

-బంగోరె (బండి గోపాలరెడ్డి)

తెలుగుగడ్డ మీదనుంచి యించుమించు 130 యేళ్ళ క్రితం బ్రిటీష్ ప్రభుత్వం పై సాయుధ పోరాటానికి దిగిన వుయ్యాలవాడ నరసింహారెడ్డిని నేటి రాజకీయ పరిభాషలో చెప్పాలంటే స్వాతంత్ర్య యోధుడుగా[1] లేదా ఆదిమ ఆంధ్ర నక్సలైట్‌గా అభివర్ణించవచ్చు

ఇటీవలి కాలంలో నక్సలైట్లు సాయుధ పోరాటమగ్నులై హత్యలు చేసినా మరొకటి చేసినా వారిని నడిపించింది వొక ఆర్థిక రాజకీయ సిద్ధాంతం తీవ మార్క్సిజానికి కల్పించుకొన్న వొక పత్యేక భాష్యాన్ని బట్టి వారు ఆ అవగాహనకు వచ్చారు ఆ ఆచరణకు దిగారు ఆ రకం రాజకీయ నిబద్ధత నరసింహారెడ్డిలో మృగ్యం కానీ స్వభావంలో గాక పోయినా స్వరూపంలో మాత్రం ఆయన పోరాటం నేటి నక్సలైట్ల కోవకు చెందినదనవచ్చు

బ్రిటీష్ ప్రభుత్వం పై నరసింహారెడ్డి ఆనాడు ఆ రకమైన పోరాటానికి దిగినప్పుడు మార్క్సిజం అనేది రూపు దిద్దుకోలేదు ఇండియాలో అప్పటికి సిపాయిల పితూరీ (1857) కూడా జరిగి వుండలేదు భారతీయుల్లో ముఖ్యంగా పల్లె ప్రాంతాల్లో జాతీయ భావబీజాలు సైతం సరిగా పురుడు పోసుకోలేదు

మరి యే ప్రేరణతో యే అవగాహనతో యే శక్తుల ఆసరాతో ఆయన బ్రిటీష్ వారితో తలపడ్డాడో మన ఆంధ్ర చరిత్రకారులు యింకా పరిశీలించలేదు మనవాళ్ళు పట్టించుకోకపోయినా బెంగాలీ చరిత్రకారుడు డాక్టర్ యస్ బి చౌధురి 1955లో

*[1] నరసింహారెడ్డిని వొక స్వాతంత్ర్య యోధుడుగా చిత్రిస్తూ శ్రీపాణ్యం నరసరామయ్య 1976లో పద్యకావ్యాన్నే ప్రకటించారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు అభినందనము వ్రాస్తూ ఇట్టివారెందరి పచ్చినెత్తురు కండలో ఈ పుణ్యభూమిలో ఇంకి యెండిపోయిన తర్వాతగదా యీ మహాదేవికి స్వతంత్ర భూమిక వేసుకొనుట సాధ్యమైది మరి దీనిని స్వార్థపరుల అవాభయము నుండి తప్పించి నెలకొల్పుటకు ఇంకెంతో వివేకుల రక్తము ప్రవహింపవలయున్నదని మనమిప్పుడు గమనించుచున్నాము అని అన్నారు*

ప్రకటించిన Civil Disturbances during the British Rule in India (1765 1857) అనే గ్రంధంలో యీ నరసింహారెడ్డి పోరాటానికి వొక సముచితమైన స్థానాన్నే యిచ్చివున్నాడు

చరిత్రకు సంబంధించి పెక్కు విషయాల్లో అభిప్రాయ భేదాలున్నట్లే యీ తిరుగుబాటు వుద్యమాల్ని కూడా చులకనగా త్రోసివేసే వారిని[2] గురించి పై గ్రంధ పీరికలో ఆచార్య యస్ సి సర్కార్ సరియైన సూచనే వొకటి చేశాడు

The risings against British authority have often enough been dismissed as the outcome of the machinations of a number of dispossessed malcontented persons But ofcourse the problem is where the following came from and why did people respond to the intrigues of the interested parties It is after all a superficial view of history to remain satisfied with attributing all disturbances to agitators

ఇటీవల కాలంలో నక్సలైట్ల సాయుధ పోరాటాన్ని గురించి వాళ్ళు చేపట్టిన చర్యలను గురించి రెండు పరస్పర విరుద్ధమైన అంచనాలు చర్చలు వున్నాయి వారిని అటు నరరూప రాక్షసులు గానూ యిటు విప్లవకారులు గానూ చిత్రించిన సమకాలీన రచనలు మనకు లేకపోలేదు వాళ్ళు జరిపిన హత్యలను వ్యక్తిగత హత్యలు గా గానీ లేదా యేవో స్వప్రయోజనాల కోసం చేసిన మామూలు హత్యలుగా గానీ భావించడానికి లేదనీ స్పష్టమైన రాజకీయ హత్యలుగా వాటిని పరిగణించవలసి వుంటుందన్న జస్టిస్ చిన్నప రెడ్డివంటి హైకోర్టు న్యాయమూర్తులూ మనకు లేక పోలేదు

నరసింహారెడ్డి నడిపిన పోరాటం వీరగాధల కెక్కిన తీరునుబట్టి ఆయన్ను గురించి పేరు వూరులేని జానపదులు రచించిన కోలాటపు పాటలు తదితర జానపద గేయాల సరళిని బట్టి చూస్తే పరాయి ప్రభుత్వాన్ని కఠోరంగా యెదుర్కొన్న వొక చిన్న విప్లవ వీరుడుగా మనం భావించవలసి వుంటుంది ఆచార్య తూమాటి దొణప్పగారు సేకరించిన కోలాటపు పాట డాక్టర్ తంగిరాల వెంకట సుబ్బారావుగారు

[2] ఇట్లా త్రోసివేసిన చరిత్రకారులు మనకు లేకపోలేదు మామిడిపూడి వెంకట రంగయ్యగారు *1965లో* రాష్ట్ర ప్రభుత్వం చేత ప్రకటింపజేసిన *The Freedom Struggle in Andhra Pradesh (Andhra) volume one (Pp 42 3)లో* పాత ధోరణిలో పాత ఆధారాలతోనే సరిపుచ్చారు తప్ప వొక్క అడుగు ముందుకుపోయి వొక్క అదనపు వివరమైనా యివ్వలేదు

సేకరించిన పిచ్చిగుంట్ల పాట మొదలైనవి యిట్లా నరసింహారెడ్డిని గురించి వున్న జానపద సారస్వతం తక్కువేమీ కాదు [3]

ఇక యీయన పోరాటం సాగుతున్నప్పుడు బ్రిటీష్ ప్రభుత్వోద్యోగుల మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలు నరసింహారెడ్డిని పట్టుకోడానికి ఆయన తిరుగుబాటును అణిచివేయడానికి తీసుకొన్న చర్యలకు సంబంధించిన ప్రభుత్వ రికార్డులు పత్రాలు యీ తిరుగుబాటు కారణాలు ఫలితాల గురించి ప్రభుత్వాధికారులు తయారుచేసిన రిపోర్టులు నివేదికలు యిట్లా యీ తిరుగుబాటుకు సంబంధించి బ్రిటీష్ ప్రభుత్వం నాటి రికార్డులు పోయినవిపోగా వ్రాతప్రతుల రూపంలో మిగిలి వున్నవి దండిగానే వున్నాయి తమిళనాడు ఆర్కైవ్స్ (మద్రాసు) లోనూ ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ (హైదరాబాదు) లోనూ ఈ వ్రాతప్రతుల సంగతటుంచి అదృష్టవశాత్తు నరసింహారెడ్డి తిరుగుబాటును వున్నంతలో పూసగుచ్చినట్టు వివరించి చెప్పే అయిదు సంపుటాల ఆధార గ్రంధాన్నొక దానిని ప్రభుత్వం కడప డిస్ట్రిక్ ప్రెస్ లో అచ్చు వేయించింది 1914 15 19 సంవత్సరాల్లో [4] ఇందులో ఆనాడు (1846 48 52) కడపజిల్లా కలెక్టర్ గవర్నర్ చీఫ్ సెక్రెటరీ మిలిటరీ ఆఫీసర్ల మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలను అచ్చువేయడం జరిగింది

అంగట్లో అన్నీ వున్నా అల్లుడు నోట్లో శని అన్నట్లు యిన్నివున్నా బ్రిటీష్ ప్రభుత్వం యిన్నిట్నీ భద్రపరచి పెట్టిపోయినా వీటిని పట్టించుకున్న ఆంధ్ర చరిత్రకారులెవరూ యింతవరకూ లేరనే చెప్పాలి ఆధునిక చరిత్ర రచనపట్ల మనవారి అలక్ష్యానికి యిదొక మచ్చుతునకగా పేర్కొనవచ్చు నేలవిడిచి సాముచేయడం మన

[3] *త్రివేణి ఆంధ్రదేశ జానపదగేయములు ఆం ప్ర సంగీతనాటక అకాడమీ ప్రచురణ హైదరాబదు పేజీలు 270 71లో శ్రీ దోణప్పసేకరించిన పాట డాక్టర్ తంగిరాల శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి తెలుగు వీరగాధా కవిత్వము పైన సమర్పించిన థీసిస్ (1968) రెండో సంపుటం పేజీలు 817 31 భారతి 1969 జూన్‌లో డాక్టర్ తంగిరాల వ్యాసం ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కధ ఇక నరసింహారెడ్డిని గూర్చి కలవటాల జయరామరావు వ్రాసిన నవల రేనాటి వీరుడు (1925) కూడా వొకటున్నట్లున్నది ఇందు సత్యముతోపాటు కొంత కల్పనయు జోడింపబడి యున్నది అన్నారు తంగిరాలవారు*

[4] *A Selection of papers from the old records of the Cuddapah district official report of a revolt by poligar Narasimha Reddy in Koilcuntla taluk (which formed part of Cuddapah distrct) in 1846 (5 volumes) Cuddapan 1914-19 ఈ అయిదు సంపుటాల ప్రతి తాలూకు జెరాక్స్ కాపీ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని సి పి బ్రౌన్ ప్రాజెక్ట్ విభాగం (తెలుగు శాఖ) లో వుంది*

చరిత్రకారులకు అనాదిగా వస్తున్న విద్యే ఆధారపత్రాలు గ్రంధాలు యిన్ని వున్నప్పటికీ వీటిని సద్వినియోగం చేసుకోలేకపోవడం మనవాళ్ళ అలసతకూ అజ్ఞతకూ నిదర్శనం

అయితే చరిత్ర రచనకు ప్రభుత్వ రికార్డు లొక్కటే వేదం కాదు కారాదు సంపూర్ణ సత్యమంతా అందులోనే దాగివుండదు వాటిలోనే సర్వవివరాలు సాక్షాత్కారం కావు ప్రభుత్వ రికార్డులకున్న యిట్టి విలువను గురించి వొక అజ్ఞాత చరిత్రకారుడు హెచ్చరిస్తున్నాడు చూడండి

the student should remember that their value (the value of the government records) is not so great as their scope They may be relied on to tell the truth but not the whole truth They exhibit the mechanical accuracy and stiffness of an auto mation without the warm passions and emotions that inform all human affairs Seldom do these old volumes strike the per sonal note For that we must turn to private journals to letters to friends or enemies or semi-official letters perhaps long since passed into oblivion The student must therefore be warned against accepting the part for the whole or from allowing his judgement to be unduly influenced by the inhuman propriety of these official documents [5]

ప్రభుత్వ రికార్డుల పరిమితులను గురించి యిందులో సరియైన హెచ్చరికలే వున్నాయి ఈ తిరుగుబాటుకు సంబంధించి వొకవైపు లభ్యమవుతున్న ఆ జానపద సారస్వతం మరొకవైపు ప్రభుత్వ రికార్డుల సంచయం వీటి పరిధులను దాటుకొని చరిత్ర కారులుగా మన అన్వేషణ యింకా విస్తృతంగా కొనసాగాలి ఇంకా సుదూరాలకు వెళ్ళాలి ఈ చిరు విప్లవాన్ని అణిచి వేయడంలో ప్రత్యక్ష సంబంధమున్న ఆనాటి బ్రిటీష్ కలెక్టర్ల తదితర ఆఫీసర్ల తాలూకు ప్రయివేటు డైరీలు తదితర పేపర్లలో మనకు యేవైనా అదనంగా ఆయువుపట్లు దొరికినా దొరకవచ్చు ననిపిస్తున్నది ఈ ప్రయివేట్ పేపర్లకోసం లండన్ లైబ్రరీల్లో గాలించవలసి వుంటుంది

కుంపణీ సర్కారుపై నరసింహారెడ్డి తిరుగుబాటు జోరుగా సాగుతున్నప్పుడు గానీ అది సమసిపోయిన తర్వాతకానీ - సమకాలికులైన తెలుగువారు కట్టిన అంచనాలు

---

[5] *Hand book to the Revenue Records of the Ceded Districts Madras 1932 P2 (introductory remarks by the compiler)*

వ్రాసిన యితర వ్రాతలుగానీ మనకిప్పుడు దాదాపు కానరావడం లేదు ఈ దృష్ట్యా చూస్తే నరసింహారెడ్డి తిరుగుబాటు తారస్థాయిలో వున్నప్పుడు ఆయన వొక సెన్సేషనల్ వార్త గా మద్రాసు కుంపిణీ అధికారుల్ని కలవర పరుస్తున్నప్పుడు బ్రౌన్ ఆనాడు కడపలో తనకు తెల్సిన తెలుగువాళ్ళకు వ్రాసి వారి నుండి రాబట్టిన ఆ జాబు (పేజీలు 3 ౪) వొక్కటే మనకు మిగిలిన చారిత్రక పత్రం నరసింహారెడ్డిని గురించి సమకాలీన జనంలో వున్న భావజాలాన్ని పరిమితమైన పరిధిలోనైనా ఆజాబు సూచిస్తున్నది బ్రౌన్ ఆజాబును యే వుద్దేశంతో భద్రపరచి పెట్టినా మనం యీనాడు వొక చారిత్రక కోణం నుండి పరిశీలించడానికి అనువుగా వుంది

నరసింహారెడ్డిని వొక పచ్చి దారిదోపిడీ దొంగలముఠా నాయకుడుగా చిత్రించిన సి సుబ్బయ్య అనే వ్యక్తి సి పి బ్రౌన్‌కు ఆనాడు వ్రాసిన ఆజాబులోని అభిప్రాయాలను విలువకట్టేముందు ఆజాబు వ్రాసిన వ్యక్తి తాలూకు చైతన్యస్థాయి సామాజిక అవగాహన యెట్లాంటివి అని పరిశీలించ వలసి వుంటుంది నేడు సైతం నక్సలైట్లు జరిపే కార్యకలాపాలను గురించి కూడా యిదేరకం అభిప్రాయాలను వెలిబుచ్చే చైతన్యస్థాయి కల్గిన వ్యక్తులకు కొదువలేదు గదా

1846 సెప్టెంబరు నాటికి నరసింహారెడ్డి మద్రాసులో వొక గగ్గోలు సృష్టించి వున్నాడు ఆయన్ను పట్టుకోడానికి వేలాదిమంది సైన్యాన్ని కడప ప్రాంతంలో ప్రత్యేకంగా దింపి కూర్చున్నది ప్రభుత్వం అప్పటికి పోస్ట్‌మాస్టర్ జనరల్‌గాను తెలుగు ట్రాన్సలేటర్‌గానూ మద్రాసులో వుంటున్న బ్రౌన్‌లో సహజంగా ఆసక్తిని రగిల్చి వుండగల సంఘటన కాబట్టి తనలో కడప అనుబంధం విశేషంగా వుండబట్టి దాన్ని గురించి వివరంగా తెలుపమని కడపకు జాబు వ్రాసి వుండాలి నమ్మకస్తుడైన చెలికాడు అయోధ్యాపురం కృష్ణారెడ్డి ఆనాటికి లేడు అతను చనిపోయి అప్పటికి రెండేళ్ళయింది కనుకనే యీ సుబ్బయ్యకు వ్రాసి వివరాలు పంపమని కోరివుండాలి ఫలితంగా వచ్చిన జవాబే అది

ఈ జాబుల్లో సుబ్బయ్య పేర్కొన్న కర్నూలు రైటర్ దగ్గర్నుంచి కానీ మరొక స్నేహితుడు దగ్గర్నుంచి కానీ నరసింహారెడ్డిని గురించి బ్రౌన్‌కు మరేమైనా జాబులొచ్చాయా అని బ్రౌన్ జాబుల సంపుటాలు తిరగేశాను నా కళ్ళకు కనపళ్ళేదు మరింత జాగ్రత్తగా వెతికితే యిందుకు సంబంధించిన వొకటి రెండు జాబులు దొరకవచ్చునేమో ననిపిస్తుంది

నరసింహారెడ్డి తిరుగుబాటు వుదంతంలో దాగివున్న పెక్కు కీలకమైన ఆర్థిక రాజకీయ అంశాల సంగతటుంచి దానికి సంబంధించిన సరియైన క్రానాలజీ (కాల క్రమణిక) నైనా మనవాళ్ళు పట్టించుకోలేదు ఏయే తేదుల్లో ఈ పోరాటం ప్రారంభమై వుధృత రూపం దాల్చిందీ యెప్పుడు మిలిటరీతో తలపడిందీ యేతేదీన ఆయన పట్టుబడిందీ యెప్పుడు ఆయన్ను వురితీసిందీ మొదలైన ప్రాథమిక వివరాలు సైతం మనవాళ్ళు చెప్పిన పాపానపోలేదు ఆచార్య దోణప్పగారు తాను సేకరించిన కోలాటపు పాటకు సమకూర్చిన లఘుపీఠికలో యీ నరసింహారెడ్డి సంఘటన 1800 1825 నాటిదని వ్రాశారు [6]

డాక్టర్ తంగిరాల వెంకటసుబ్బారావుగారు మరింత దరిదాపుల్లోకి వచ్చి 1845 47 మధ్యకాలంలో జరిగినదై వుండాలన్నారు [7]

నరసింహారెడ్డి తిరుగుబాటును గూర్చిన కాలక్రమణిక ను మరింత వివరంగా క్లుప్తంగానైనా చెప్పుకొందాం

**1846 జూలై 6** మజ్జారి నరసింహారెడ్డి అనే పించన్ దారుడైన పాళయగారు (Pension poligar) కొందరు కొండవాళ్ళను కట్టుబడి బంట్రోతులను పోగు చేసుకొని ఆయుధాలు సమకూర్చుకొని ప్రభుత్వాన్ని ధిక్కరించడానికి ఆయత్తమవుతున్నాడని కోయిలకుంట్ల తాసీల్దార్ వగైరా తాలూకా అధికార్లకు తెలిసి బంట్రోతుల్ని పెట్టి బందోబస్తుగా పంపిస్తే ఆయన సరిగా సమాధానం చెప్పక తిరగబడి బెదరగొట్టి పంపించినట్లు కోయిలకుంట్ల హెడ్ పోలీస్ తనకు వర్తమానం పంపాడనీ అందువల్ల నరసింహారెడ్డినీ అతని మనుషుల్ని వొక కంట కనిపెడుతూ వుండవలసిందిగా కోరుతూ కర్నూలులోని గవర్నర్ తాలూకు యేజంట్‌కు కడప య్యాక్టింగ్ కలెక్టర్ కాక్రేన్ (Cochrane) 6వ తేదీన వొక జాబు వ్రాసి పంపాడు

**1846 జూలై 11** చాగలమర్రి తాలూకాలోని రుద్రవరం గ్రామం పైనబడి నరసింహారెడ్డి బృందం (బహుశా 7 8 తేదీల్లో కావచ్చు) కొల్లగొట్టుకొని

*[6]దోణప్పగారి లఘుపీఠిక రాయలసీమ పాళియగాండ్ర పుట్ట ఊరికొక ఒడయడు పల్లెకొక పాళెగాడు కుంఫిణీవారి బావుటా క్రొత్తగా ఎగిరిన కాలములో చాలమంది పాళెగాండ్రు లొంగలేదు వారిలో ఈ దొరవారి నరసింహారెడ్డి ఒకడు కోయిలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడ పరిసరముల ఇతని ప్రభుత్వము చెల్లు చుండినది కుంఫిణీ దొరతనమును ఎదిరించి వీరమరణము పొందినాడు ఇది క్రీ శ 1800 1825 నాటి సంఘటన (చూ త్రివేణి పేజీ 270)*

*[7]లోగడ 11 పేజీలో ప్రస్తావించబడిన డాక్టర్ తంగిరాల వారి థీసిస్ భారతిలో వ్యాసం*

పోతుండగా పోలీసు బంట్రోతులు తదితర ప్రభుత్వ తరపు మనషులు వెళ్ళి మిట్టపల్లి దగ్గర వాళ్ళను యెదురుకోగా అక్కడ జరిగిన పోరాటంలో హెడ్ డఫేదార్ మరో తొమ్మిదిమంది బంట్రోతుల్ని నరసింహారెడ్డి మనుషులు చంపివేసి వాళ్ళ దగ్గరున్న ఆయుధాలను లాక్కొని పరారై పోయినట్లు కలెక్టర్‌కు దువ్వూరు తాలూకా తాసీల్దారు ద్వారా వర్తమానం వెళ్లింది కలెక్టర్ యిదేదో చిలికి చిలికి గాలివాన అయ్యేటట్లున్నదని భావించక తప్పలేదు మిలిటరీని వెంటనే పరుగులమీద దువ్వూరు కోయిలకుంట్ల ప్రాంతాలకు పంపి శాంతి భద్రతలను కాపాడవలసిందిగా కడపలోవున్న మిలిటరీ కమాండింగ్ ఆఫీసరుకు జాబువ్రాసి పంపాడు కర్నూలులోని గవర్నర్ యేజంటు సహాయాన్ని కూడా అర్థిస్తూ మరొక జాబు వ్రాశాడు

**1846 జూలై 12** నరసింహారెడ్డి బృందం జూలై 10వ తేదీన కోయలకుంట్ల ట్రెజరీ ఆఫీసు పైబడి నానావిధ్వంసం చేసి ట్రెజరీని కొల్లగొట్టుకొని ఆనాటికి అందులో మిగిలివున్న 805 రూపాయలా 10 అణాలా నాలుగు పైసల డబ్బును దమ్మిడీలతో సహ వూడ్చుకు పోయారు [8] అడ్డగించిన ప్రభుత్వ సిబ్బందిని చిందర వందర చేసి

[8] *ట్రెజరీ నుంచి దోచుకున్న డబ్బులో నరసింహారెడ్డికి రావల్సిన మే నెల పెన్షన్ రు 11 10 8 పైసలు డ్రా చేయబడి చెల్లించనందువల్ల అది కూడా చేరి వున్నదన్నమాట ఉయ్యాలవాడ జాగీర్దార్ పెదమల్లారెడ్డి ముగ్గురు కొడుకుల్లో చిన్నవాడు మన కథానాయకుడు నరసింహారెడ్డి కోయిలకుంట్ల తాలూకా బ్రిటిష్‌వారి కిందకు వచ్చినప్పుడు యేటా 30వేల రూపాయల పైచిలుకు రెవెన్యూ వచ్చే ఆ ఉయ్యాలవాడ జాగీర్‌ను లాక్కొని పెదమల్లారెడ్డి కుటుంబానికి నెలకు 70 రూపాయల భరణం (పెన్షన్) యేర్పాటు చేశారు ఇందులో పెదమల్లారెడ్డి సోదరుడు చినమల్లారెడ్డికి సగభాగం పోగా పెదమల్లారెడ్డి ముగ్గురు కొడుకులు (నరసింహారెడ్డి యిద్దరు అన్నలు) కు మిగతా సగం 35 రూపాయలు మిగిలింది నరసింహారెడ్డి యిద్దరన్నలతో తగవులాడి విడిపోవడంతో యీ 35 రూపాయల్లో మూడోవంతు 11 10 8 మాత్రమే తన పెన్షన్ కింద దక్కింది అయితే నరసింహారెడ్డి మాతామహుడైన నొసం జమిందార్ జయరామిరెడ్డికి మన్రో యేటా 22 వేల రెవెన్యూ వచ్చే జాగీర్‌ను తీసుకొని నెలకు వెయ్యిరూపాయిల పెన్షన్ యేర్పరిచాడు గనుక యిట్లా తన తల్లివారి వైపునుంచి కొంత ముట్టుతుండేది నరసింహారెడ్డికి ఈ జయరామిరెడ్డి తర్వాత నొసంకు జమిందారైన ఆయన కొడుకు మరో నరసింహారెడ్డి నిస్సంతుగా మరణించడంతో ఆ పెన్షన్ కాస్తా క్రమంగా తగ్గిపోతూ పూర్తిగా ప్రభుత్వ స్వాధీనం కావడంతో మన కథానాయకుడు నరసింహారెడ్డికి తాతలనాటి ప్రాభవం తగ్గిపోయింది తన తల్లివారివైపు పెన్షన్ షేర్ కోసం ప్రభుత్వంతో యెంత పోరుకాడినా వచ్చింది కాదు (నెలకు 11 రూపాయల పెన్షన్ వచ్చే నరసింహారెడ్డికి ఆస్థానమేమిటి? ఆస్థానకవి యేమిటి? వేటూరి ప్రభాకరశాస్త్రి చాటుపద్య మణిమంజరిలో వ్రాసినట్లు నశ్యంమీద పద్యాలు చెప్పిన ఓబళాచార్యుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి దగ్గరున్న కవిగాక నొసం నరసింహారెడ్డి ఆస్థానకవి అయివుండే దానికి ఆస్కారమున్నది )*

పెక్కుమందిని గాయపరచి వొక డఫేదారును అయిదుమంది పోలీస్ బంట్రోతుల్ని చంపవేశారు ఇక్కడ జరిగిన యీ పోరాటంలో నరసింహారెడ్డి స్వయంగా పాల్గొన్నాడు ట్రెజరీ పైకప్పు మీదకు డఫేదారు యెక్కి కాల్పులు జరుపుతుంటే నరసింహారెడ్డి తన అనుచరులనుంచి తుపాకి (matchlock) లాక్కొని గురిపెట్టి డఫేదార్‌ను వొక్క గుండు దెబ్బతో పడగొట్టాడట ఈ విధ్వంసంలో నరసింహారెడ్డి మనుషులూ కొందరు చనిపోయారు కోయిలకుంట్ల తాసీల్దార్ రాఘవాచార్యులను నరసింహారెడ్డి మనుషులు చిక్కించుకొని నిర్బంధంలోకి తీసుకొని వెళ్ళారు కడక అతగాడి పల్లకీని కూడా బోయీలతో సహా పట్టుకెళ్ళారు ఈ సంఘటనతో కోయిల కుంట్ల ప్రజలు భీతావహులై వున్నారని కోయిలకుంట్ల సబ్ ఆఫీసర్ జమ్మలమడుగు హెడ్ పోలీసుద్వారా పంపిన వర్తమానం జూలై 11వ తేది రాత్రి (వేకువ జామున 2 గంటలకు) కలెక్టర్ కాక్రేన్‌కు చేరింది

ఈ కబురందగానే కలెక్టర్ రారెత్తిపోయాడు బళ్లారిలో వున్న దత్తమండలాల సైనికాధికారి (బ్రిగేడియర్ జనరల్) కి అర్జంటుగా కబురంపించాడు వున్న పళాన వీలైనంత యెక్కువమంది సైన్యాన్ని పంపించవలసిందిగా కోరుతూ ఈ కోయిలకుంట్ల దోపిడీ వర్తమానం కాక్రేన్ మదనపల్లిలో విడిది చేసి వుండగా చేరిందట [9]

మొదట్లో అందిన అంచనాల ప్రకారం నరసింహారెడ్డి నాయకత్వంలో 9 వేల మంది చేరివుండవచ్చుననుకొన్నారు కానీ కలెక్టర్ మాత్రం వోరుమంటే 3 000 మందికి మించకపోవచ్చుననుకొన్నాడు వనపర్తి జమిందార్ రాజారామేశ్వరరావు మునగాల రామకృష్ణారెడ్డి జటప్రోలు సంస్థానాధీశుడు లక్ష్మణరాయడు పెనుగొండ ఔకు జమీందార్లు హైదరాబాదుకు చెందిన సలామ్‌ఖాన్ కర్నూలుకు చెందిన పాపాఖాన్ బనగానిపల్లె నవాబు మహమదాలీఖాన్ ప్రభృతులు నరసింహారెడ్డికి అండగా వుంటున్నారనీ ముఖ్యంగా కట్టుబడి బంట్రోతులు చెంచువాళ్ళు వడ్డెవాళ్ళు బోయవాళ్ళు యానాదులు కడకు కొందరు బ్రాహ్మణులు సైతం నరసింహారెడ్డి మురాలో ప్రత్యక్షంగా చేరివున్నారనీ కొందరు అరబ్బులు కూడా పరోక్ష సహాయం అందిస్తున్నారనీ అభిప్రాయపడ్డాడు కలెక్టరు

కోయిలకుంట్ల ట్రెజరీ తర్వాత నరసింహారెడ్డి మురా జమ్మలమడుగు ట్రెజరీని కూడా కొల్లగొట్టాలనుకొన్నారట గానీ మిలిటరీ పటాలాలు వస్తున్నాయని తెల్సుకొని ఆ ఆలోచన మానుకొన్నారట కడపనుంచి కర్నూలునుంచి

[9] *Brief History of Madanapalli F A Coleridge Trichonopoly 1911 Pp 23-4*

బళ్ళారినుంచి కంభం కడకు సికిందరాబాదు నుంచి యిట్లా నానా ప్రాంతాలనుంచి సైన్యం వచ్చి ముసురుకోవడం ప్రారంభించింది

**1846 జూలై 23** కంభంనుంచి వస్తున్న లెఫ్టినెంట్ వాట్సన్ నాయకత్వంలో వచ్చిన మిలిటరీ వాళ్ళు గిద్దలూరు దగ్గర నరసింహారెడ్డితో తలపడ్డారు తిరుగుబాటుదార్ల మురా 5 వేలమంది వుంటారని మిలిటరీ అంచనా వాట్సన్ కిందవున్న సైన్యమేమో వందమంది ఈ వందమందికి జతగా కంభం తాసీల్దార్ మరికొందరు పోలీసు బంట్రోతులు తోడయ్యారు అంతే వేలాదిమంది ప్రత్యర్థులతో పోరాటమంటే ప్రతికూల ఫలితాలకు దారితీయవచ్చునని భయపడ్డాడు వాట్సన్ అయినా అయిదుగంటల సేపు హోరాహోరీ పోరాటం సాగింది ఒక పాడుబడ్డ కోటలో చేరి వాట్సన్ తన సైన్యాన్ని పురమాయించి పోరాటంలోకి దింపి మందుగుండు సామగ్రి అయిపోనీకుండా పొదుపుగా వ్యూహం ప్రకారం వుపయోగించాడు చీకటిబడితే తనకు ప్రతికూలం కావచ్చునని పోరాటాన్ని వుధృతం చేశాడు ఈ పోరాటంలో నల్గురు సిపాయీలు మరణించారు మరో ముగ్గురుకు తీవ్రమైన గాయాలే తగిలాయి నరసింహారెడ్డి మనుషులు 200 మంది దాకా చనిపోయారు నాలుగు చిన్న ఫిరంగులు (జజాయీలు) వాట్సన్ బృందానికి పట్టుపడ్డాయి కప్పర కప్పర చీకటిపడ్డ తర్వాత వాట్సన్ వెనుకంజవేశాడు గిద్దలూరుకు 5 మైళ్ళ యివతలవున్న సెట్టివీడుకు తన సైన్యాన్ని తరలించుకు వెళ్ళాడు నరసింహారెడ్డి కూడా తెలివిగా తప్పించుకొని తన మురాను అటువైపు అయిదుమైళ్ళలో వున్న ముండ్లపాడుకు మళ్ళించుకుపోయాడు

జూలై 24వ తేది కర్నూలునుంచి వచ్చిన కెప్టెన్ నాట్ కెప్టెన్ రసెల్ సైన్యం కిష్టం సెట్టిపల్లె చేరుకున్నారు ముండ్లపాడులో నరసింహారెడ్డి బలగం చేరివున్నారని తెలిసి అక్కడికి చేరుకొన్నారు పోరాటానికి దిగారు మళ్ళీ హోరాహోరీ సమరం జరిగింది ఒకసిపాయి చనిపోయాడు ముగ్గురు తీవ్రంగా గాయపడ్డారు నరసింహారెడ్డి బృందంలోని వాళ్ళు 15 మంది దాకా చనిపోయారు మరో 10 మంది సైన్యానికి పట్టుబడ్డారు

అయితే యిక్కడ జరిగిన ముఖ్యవిషయం కంభం తాసీల్దార్ (జంగం రెడ్డి శ్రీనివాసరావు?)ను నరసింహారెడ్డివాళ్ళు కాల్చి చంపగలిగారు నరసింహారెడ్డి మనుషులు అడవుల్లో కొండల్లో కోనల్లో బడి తప్పుకున్నారు కంభం వైపు గుత్తకనుమగండా వెళ్ళి కొత్తకోట చేరుకున్నాడు నరసింహారెడ్డి

ఈ పోరాటాలతో యిరుపక్షాల శక్తి సామర్ధ్యాలు పరస్పరం తెల్సివచ్చాయి ఆధునికమైన ఆయుధసామగ్రి సుశిక్షితులైన సైనిక సిబ్బంది వొకరికి అండగా వుంటే మరొకరికేమో మొరటు ఆయుధాలేవున్నా శత్రువులకు అంతు చిక్కకుండా కొండలు కోనలు అడవుల యిరుకుదారులన్నీ కొట్టినపిండిగా దూసుకుపోయి తిరగగలిగే స్థానికుల బలగం వుంది నాలుగువైపులా మోహరించివున్న మిలిటరీ దళాలు దుర్గమమైన యీ కంటక మార్గాల్లో ప్రయాణం చేయడమంటే యిబ్బందేనని ప్రభుత్వాధికారులు గుర్తింపుకు తెచ్చుకొన్నారు

పోరాటంలో తమకు పట్టుబడ్డ మనుషులను పట్టుకొని కూపీలు తీయడం ప్రారంభించారు నరసింహారెడ్డికి ప్రత్యక్ష పరోక్ష సహాయాలు అందజేశారని అనుమానమున్న పెక్కుమంది కట్టుబడి యినాందార్లు తవర్జీదార్లను పట్టి జైళ్లలో పెట్టి వాంసించడం ప్రారంభించారు వారినుంచి నరసింహారెడ్డిని గురించి వీలైనంత సమాచారాన్ని అధికారులు రాబట్టగలిగారు నరసింహారెడ్డి అన్న ( కుమార మల్లారెడ్డి) తొలినుంచి తమ్ముడికి వ్యతిరేకంగా నిల్చాడు బ్రిటీష్‌వారికి ఆఖరుదాకా పూర్తి అండదండలిస్తూ వచ్చాడు [10]

నరసింహారెడ్డి కొత్తకోటలోని తన మామ యింట్లో పెళ్ళాం బిడ్డల్ని తల్లిని వదిలిపెట్టివెళ్ళాడు (రెడ్డికి ముగ్గురు భార్యలు మొదటి భార్యకు 16 యేళ్ళ కొడుకు రెండో భార్యద్వారా వొక కుమార్తె మూడో భార్యకు యిద్దరు కొడుకులు తల్లీ అత్తా మామా యిదీ ఆయన సంసారం) పెద్దకొడుకు మాత్రం యెట్లాగో తప్పించుకు వెళ్ళాడు మిగతా కుటుంబ సభ్యులనంతా పట్టుకొని మిలిటరీ యెస్కార్ట్‌తో కడపకు తీసుకుపోయి అక్కడొక బంగళా లో పెట్టి నిర్బంధంలో వుంచారు చుట్టూ మిలిటరీ పారా వుంచారు [11]

ఇక నరసింహారెడ్డిగాలింపు కార్యక్రమం ప్రారంభమైంది ఆయన్ను యెట్లాగైనా పట్టుకోవడం ప్రభుత్వానికి వొక ముఖ్య ధ్యేయమైపోయింది పెద్దా చిన్నా

[10] *తమకు చేసిన యీ సహాయానికి ప్రతిఫలంగా నరసింహారెడ్డి అన్నలిద్దరకూ వస్తున్న రు 23 5 4 పైసల పెన్షన్‌ను రెండింతలు చేస్తూ కుంపిణీ ప్రభుత్వం 1847 జూన్ 26న వుత్తర్వు చేసింది*

[1] *నరసింహారెడ్డి భార్యా పిల్లలను నిర్బంధంలో వుంచినంతకాలం ఆయనకు లోగడ యిస్తూ వచ్చిన 11 రూపాయలా చిల్లర పెన్షన్‌ను వారికి బత్తా కింద యిచ్చే యేర్పాటు చేశాడు కలెక్టర్ కేసు పరిష్కారమైన తర్వాత 1847 జూన్ నుంచి యీ పెన్షన్ యివ్వడం ఆపేశారు*

అధికారులందర్నీ యీ పనిమీదకే పురమాయించడం జరిగింది జిల్లా అంతటా వాళ్ళకు యిదే నిత్యకార్యక్రమమై పోయింది [12]

నరసింహారెడ్డి కొండలుదాటి కోనలుదాటి హైదరాబాదు ప్రాంతంలోకి వెళ్ళి అక్కడ జనసమీకరణ చేస్తున్నాడని కొందరు కాదు నల్లమల కొండల్లోనే వున్నాడని మరికొందరు ఈ పక్క అడవుల్లోనుంచి వెళ్ళాడనీ కాదు ఆ పక్క తిప్పలమీద నుంచి వెళ్ళాడనీ యిట్లా తలా వొకమాట తలా వొక సలహా ఈ అన్ని తావులకూ మనుషుల్ని పంప మిలటరీని పంపి వెతికించేవారు ఒక దశలో వర్షాలుపడి వాగులు నిండి ప్రవహించడంతో మిలిటరీవాళ్ళు ప్రయాణించడం కష్టమైపోయింది

ఆ వూరును దోచుకోడానికి వస్తారనీ యీ వూరును కొల్లగొట్టడానికి వచ్చారనీ యిట్లా రోజుకో పుకారు వారానికో వార్త లూటీలు దోపీడీలు జరక్కుండా ఆయా వూళ్ళల్లో యెక్కడికక్కడ జగజ్జెట్టీలవంటి వాళ్ళను యేరి ప్రత్యేకంగా బత్తాలిచ్చి జీతాలిచ్చి గ్రామ కాపలాలు యేర్పాటు చేశారు మరికొందర్ని మిలిటరీకి సహాయంగా వుంచారు

కొత్తకోటలో కొన్ని పత్రాలు దొరికాయి నరసింహారెడ్డికీ హైదరాబాదులోని కొందరు నవాబులకూ మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలున్న పత్రాలు గోల్కొండ నవాబు మొహరుతో వున్న వొక పత్రం కూడా దొరికింది కానీ అది ఫోర్జరీదని తేలిందట హైదరాబాదులోని రెసిడెంటుకు తాకీదులు వెళ్ళాయి నరసింహారెడ్డి ఆయన సహచరులనబడే వారిపై గట్టి నిఘా వుంచి పెట్టమని అనుమానమున్న ప్రతి మనిషినీ పట్టితెచ్చి జైళ్ళలో పెట్టేవారు సకల సమాచారమూ రాబట్టేవారు జిల్లాలోని జైళ్ళన్నీ యీ బాపతు మనషులతో నిండిపోయాయి ఒక దశలో 600మందిదాకా జైళ్ళలో వున్నట్లు రికార్డులు తెలుపుతున్నాయి

నరసింహారెడ్డిని ప్రభుత్వ ద్రోహిగా ప్రకటించారు ఆయన్ను పట్టితెచ్చినవారికి వెయ్యిరూపాయలు బహుమానం అని చాటింపులు వేయించారు కొంతకాలం పోయిన తర్వాత రెండువేలు బహుమానమన్నారు ఒక్క నరసింహారెడ్డినేకాక ఆయన ముఠాలోని ముఖ్యులనబడే అయిదుమందిని పట్టితెచ్చినవారికి కూడా బహుమానాలని చాటించారు గోసాయి వెంకయ్య కర్నం అశ్వద్ధామ దాసరి రోశిరెడ్డి జంగం మల్లయ్య యిట్లా

[12] చూడు జాబుల విభాగం 3వ పేజీలో కింద గీతవున్న వాక్యం

ముఖ్యుల జాబితా యెప్పటికప్పుడు పెరిగిపోతూ వచ్చింది వీళ్ళలో మరీముఖ్యుడు ఆకుమళ్ళ గ్రామానికి చెందినగోసాయి వెంకయ్య నరసింహారెడ్డి తిరుగుబాటు వెనుక గోసాయి వెంకయ్య ప్రోత్సాహ ప్రేరణలు ప్రధానంగా పనిచేసినట్లు కలెక్టర్ భావించాడు

ఈ గోసాయి వెంకయ్య నరసింహారెడ్డికి వొక విధంగా మతగురువు వంటివాడనీ అప్పుడప్పుడూ భవిష్యద్దర్శనం చేసి రెడ్డికి కొన్ని హితబోధలు చేసేవాడనీ కుంఎణీ సర్కారుపై సాయుధ పోరాటానికి దిగనిదే నరసింహారెడ్డికి అతీగతీ లేదనీ మంత్రోపదేశం చేసినవాడు యీ గోసాయేననీ కలెక్టర్ గట్టిగా అభిప్రాయపడ్డాడు ఎన్ని తుపాకిగుండ్లు తగిలినా నిన్నేమీ చేయవని చెప్పి రెడ్డికి యేదో పసరుపూత పూసి ఆశీర్వదించి పంపాడని కూడా అంటారు కలెక్టర్ రిపోర్టులో యితన్ని గూర్చి వివరంగానే వ్రాశాడు

ఏమైతేనేం మిలిటరీ సహాయంతో ప్రభుత్వం జరిఎన యీ గాలింపు చర్యలవల్ల నరఎంహారెడ్డి బృందంలోని కొందర్ని పట్టుకోగలిగారు వీళ్ళందరినుంచీ సాక్ష్యాలు నమోదు చేసి వీళ్ళ వాదనలు విచారించి కేసును నడిఎ ఫౌజుదారీ అదాలత్ (కోర్టు)కు సమర్పించడానికి ప్రభుత్వం డబ్ల్యు ఏ డి ఇంగ్లిస్ (W A D Inglis) ను స్పెషల్ కమీషనర్‌గా నియమించింది ఇట్లా యీ కర్మకాండతో జూలై ఆగస్టు సెప్టెంబరు మాసాలు గడిచిపోయాయి

అక్టోబరునెల వచ్చింది నరసింహారెడ్డి ప్రభుత్వానికి దొరికిపోయాడు ప్రభుత్వ వర్గాల్లో సంతోషం పెల్లుబికింది

**1846** అక్టోబరు **6**న పట్టుబడినమైనం ఎర్రమల నల్లమల కొండల మధ్యగల పెరుసోమల కొండల్లో (దాదాపు 6 మైళ్ళ కైవారం గల్గిన కొండలని కలెక్టర్ వర్ణన) జగన్నాథ దేవళంలో నరసింహారెడ్డి వున్నాడని తెల్సి కలెక్టర్ కాక్రేన్ మిలిటరీ సాయంతో అక్కడికి వెళ్ళాడు కొండలచుటూ సైన్యాన్ని పెట్టి తుపాకులతో కాల్పులవర్షం అన్ని దిక్కులనుంచీ కురిపించ మన్నాడు ఈ కాల్పుల కుండపోతలో షుమారు 40 50 మంది నరసింహారెడ్డి మనుషులు చనిపోయారు 90 మంది పట్టుబడిపోయారు మరో వందమందిదాకా బాగా గాయపడ్డారు నరఎంహారెడ్డి నిస్సహాయుడుగా మిగిలిపోయి యెటూ పోలేక చిక్కుబడిపోయాడు కాలికి గుండుదెబ్బ తగిలి కుంటుకుంటూ కొదమఎంగంలాంటి మనిషి మిలిటరీ వాళ్ళకు దొరికిపోయాడు మూడు నెలల అరాచకం మూడు నిమిషాల్లో అంతమైపోయిందనుకున్నాడు కలెక్టర్

కేసు నడిచింది మొత్తం 901 మందిపై నేరం మోపబడింది వీరిలో 412 మందిపై నేరం రుజువు కాలేదని వదిలివేయడం జరిగింది 273 మందిని స్వల్పమైన సెక్యూరిటీ తీసుకొని వదిలివేశారు 112 మందికి మాత్రం కఠినశిక్షలే పడ్డాయి 14యేళ్ళ నుంచి 5 యేళ్ళదాకా జైలు శిక్షలు ఎంతమందో స్పష్టంగా తెలియడం లేదుగానీ బంకోలుకు పంపించబడ్డవారు (ద్వీపాంతరవాస శిక్ష పడ్డవారు) కూడా కొందరున్నారు ఔకు రాజుల్లో కనిష్ఠ సోదరుడు వీరిలో వొకడు

నరసింహారెడ్డికి మాత్రం వురిశిక్ష పడింది ఫౌజుదారీ అదాలత్ (కోర్టు) మజ్జారి నరసింహారెడ్డిని వురితీయమని తీర్పు (1847 జనవరి 9న?) చెప్పింది ఊరకే వురితీయడం కాదు వురి తర్వాత అతని శిరస్సును కోయిలకుంట్ల దగ్గర వొక బురుజుపై గొలుసులతో బంధించి తూకుమాను కు వేలాడదీయవల్సిందిగా కూడా తీర్పు 1834 నాటి రెగ్యులేషన్ వొకటి శెక్షన్ రెండు కిందనూ 1802 నాటి రెగ్యులేషన్ యెనిమిది శెక్షన్ పదికిందనూ యీ వురిశిక్ష విధించామని కోర్టు తీర్పు తిరుగుబాటు హత్యలు దొంగతనాలు చేసిన నేరానికి

ఈ వురిశిక్షకు గవర్నర్ ఆమోదముద్ర 1847 ఫిబ్రవరి 6న పడింది

**1847 ఫిబ్రవరి 22** పలానారోజున పలానాచోట నరసింహారెడ్డిని వురితీయ బోతున్నామని ప్రభుత్వం వూరూరా చాటింపు వేయించింది 1847 ఫిబ్రవరి 22వతేది సోమవారం (ఉదయం) 7 గంటలకు కలెక్టర్ కాక్రేన్ సమక్షంలో పర్యవేక్షణలో నరసింహారెడ్డిని ఘోరంగా వురితీశారు [13]

దాదాపు 2వేలమంది పైచిలుకు ప్రజలు తమను నిశ్శబ్ద రక్షకుని ఆవహించి తమనోళ్లు కుట్టేసినట్లు కిమ్మనకుండా వళ్ళంతా కళ్ళుచేసుకుని గుడ్లప్పగించి నిక్కినిక్కి చూశారు నరసింహారెడ్డిని వురితీస్తుంటే ఒక మనిషిని నిలువునా వురితీసి వొకానొక తిరుగుబాటును అధఃపాతాళానికి అణిచివేసినట్లు చరిత్రలో పేరు తెచ్చుకుంది కుంఫిణీ ప్రభుత్వం!

ఈ నరసింహారెడ్డి శిరస్సు రెండుమూడు తరాలదాకా చుట్టుప్రక్కల ప్రజల్ని తస్మాత్ జాగ్రత్త అంటూ హెచ్చరిస్తూ 1877దాకా ఆ బురుజుకు వేలాడుతూ వుణ్ణిందట [14]

[13] *at a spot selected near the town of Koilcuntla* అని కలెక్టర్ వ్రాత కాగా జానపద పాటనుబట్టి నరసింహారెడ్డిని వురితీసింది జుర్రేటి వొడ్డున అని డాక్టర్ తంగిరాల వ్రాశారు

[14] *A Manual of the Kurnool District Narahari Gopala Kristnamah Chetty Madras 1886 P 42*

అతడు ప్రారంభ మొనరించినట్టి యుద్య
మమ్మె రవులుచు నొక దశాబ్దమ్ము నకును
క్షితి 'సిపాయి ఎతూరి' గా కింవదంతి
గన్న 'స్వాతంత్ర్య సమరంబు' గా జ్వలించె

అతని జీవాత్మ భౌతికమైన తనువు
వదిలి యంతట వ్యాపించి బహు మహోద్య
మమ్ము లొనరించి యొక శతాబ్దమ్మునకును
మాతృభూమికి స్వాతంత్ర్య మహిమగూర్చె [15]

* * *

దొరవారి నరసింహ్వారెడ్డి
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి ॥దొర॥
రేనాటి సీమలోనా రెడ్డోళ్ళ కులములోనా
దొరవారి వమిశానా ధీరుడే నరసింహ్వారెడ్డి ॥దొర॥
కోయిల్కుంట్లా గుట్టలెంటా కుందేరూ వొడ్డులెంటా
గుఱ్రమెక్కి నీవు వస్తే కుంపిణీకి గుండెదిగులూ ॥దొర॥
కాలికీ సంకెండ్లు వేసీ చేతికీ బేడీలు వేసీ
పారాతో పట్టితెచ్చి బందికానులొ పెట్టిరీ ॥దొర॥
కండ్లకూ గంతాలు గట్టీ నోటినిండా బట్లు[16] పెట్టీ
నిలువునా నీ తలా గొట్టీ కోట బురుజుకు గట్టిరీ ॥దొర॥
కాసిలోనా తల్లికేమో చావుసుద్దీ దెలిసినాదీ
కన్నకడుపే తల్లటించే గంగలోనా గంగ గలిసే

[15] స్వాతంత్ర్య వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి చరిత్ర (పద్యకావ్యం) పాణ్యం నరసరామయ్య ఉయ్యాలవాడ 1976 పేజీ 82

[16] త్రివేణి లోని ఆ పాటను చదువుతూ వొక మిత్రుడు నోటినిండా బట్లు యేమిటి బుడ్లు అని వుండాలేమో నన్నాడు బుడ్లు కన్నా బట్లు రూపమే సరి అనిపిస్తున్నది రెడ్డోళ్ళ వమిశాన గుట్టలెంటా వొడ్డులెంటా పారా అనే మామూలు వాటికి అర్థాలిచ్చిన దోణప్పగారు యీ చిత్రమైన శబ్దానికి యిచ్చివుండివుంటే ఆ మిత్రుడు యీ పారాంతరాన్ని వూహించి వుండేవాడు కాదేమో బట్ట బట్టలు బట్లు గుడ్డలు అనుకొంటే సరిపోతుందనిపిస్తుంది

దొరవారి నరసింహ్వారెడ్డి
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి[17]

అని వుయ్యాలవాడ నరసింహారెడ్డి వీరగాధను గురించి ప్రచారంలో వున్న వొక కోలాటపు పాట

వీరావేశం వుట్టిపడేలా జానపదులు కవిగట్టిన మరొక పాటలోనుంచి కొన్ని చరణాలు

అడుగోవచ్చె ఇడుగోవచ్చె నారసింహారెడ్డీ
వళవళ వళవళ కేకలేసెరా నారసింహారెడ్డీ
చంద్రాయుధమూ చేత బట్టెనే నారసింహారెడ్డీ

ఆవుల మందలో పులీ దుమికినా చందము దుమికినడూ

కరువు వొచ్చినా కాలమొచ్చినా ఆదరించె రెడ్డీ
అట్టి వక్క మనరెడ్డి మాటలూ చిన్నచెయ్యరాదు
నాలుగు గ్రామాలమందిగా తాము లేచినారు [18]

కుంఫిణీ సర్కారుపై నరసింహారెడ్డి నడిపిన సాయుధ తిరుగుబాటు గాధ యిదీ క్లుప్తంగా అతిక్లుప్తంగా

* * *

ఈ తిరుగుబాటుకు మూలకారణాలేమిటి? ఈ పోరాటంలో యింత జన సమీకరణ యెట్లా జరిగినట్లు? ఇందరు కట్టుబడి యినామ్‌దార్లు బంట్రోతులు తదితరులు నరసింహారెడ్డికి అండగా యెందుకు చేరినట్లు? ఆర్థిక రాజకీయ కారణాలేమైనా వున్నాయా? లేకకేవలం వొకవ్యక్తి యేదో వళ్ళుతెలియని వీరావేశంలోబడి నడిఎన వొకానొక వ్యక్తిగత పోరాటమేనా? ఈ కీలకమైన విషయంలో ఈనాడే కాదు ఆనాడు కూడా బోలెడన్ని అభిప్రాయ భేదాలు వుండనే వున్నాయి

[17] త్రివేణి ఆంధ్రప్రదేశ్ జానపద గేయములు ఆం ప్ర సంగీత నాటక అకాడమీ ప్రచురణ హైదరాబాదు 1960 పేజీలు 270 71 (తూమాటి దొణప్పగారు సేకరించిన పాట)
[18] డాక్టర్ తంగిరాల వెంకట సుబ్బారావు థీసిస్ తెలుగు వీరగాధా కవిత్వము భారతి వ్యాసం

ప్రభుత్వం నియమించిన స్పెషల్‌కమీషనర్ డబ్ల్యు ఏ డి ఇంగ్లిస్ 1847 జనవరి 19వ తేదీని జుడిషియల్ డిపార్ట్‌మెంట్ సెక్రెటరీకి 12 పేజీలలో వొక సుదీర్ఘమైన రిపోర్టు సమర్పించాడు ఇందులో ఆయనచేసిన ప్రధానమైన వాదం గ్రామ కట్టుబడి యీనాందార్లు తవర్జీదార్ల సమస్యలపట్ల ప్రభుత్వాధికార్ల కఠోరమైన వైఖరి మూలంగా వాళ్ళలో అసంతృప్తి క్రమంగా రాజుకుంటూ వచ్చిందనీ అందువల్లనే వాళ్ళు నరసింహారెడ్డి నాయకత్వం కింద చేరి తమ సమస్యలకు పరిష్కార మార్గం వెతుక్కోడానికిగాను యీ తిరుగుబాటులో ప్రత్యక్ష భాగస్వాములుగా చేరారని ఇంకా మరికొన్ని పరిపాలనా సంబంధమైన కారణాలను కూడా ఆయన చూపాడు

ఆయన చూపిన యీ ప్రధాన సమస్యను కట్టుబళ్ళ సమస్యను సాకల్యంగా అర్థం చేసుకోవాలంటే మద్రాస్ నాటి దత్తమండలాల రైత్వారీ సెటిల్మెంట్ వ్యవస్థను చారిత్రక కోణంనుంచి అవగాహనకు తెచ్చుకోవలసి వుంది ఆయన ప్రవేశపెట్టిన రెవెన్యూ సెటిల్మెంట్ పద్ధతుల్లో ముఖ్యంగా యీ కట్టుబడి భట్టవృత్తి యినామ్‌లు క్రమంగా యెట్లా అమలు జరుగుతూ వచ్చిందీ గ్రామస్థాయి కట్టుదిట్టాలలో యే విధంగా మార్పులు సంభవిస్తూ వచ్చిందీ అనే విషయాలను మనసుకు తెచ్చుకోనిదే ఇంగ్లిస్ చూపిన కట్టుబళ్ళ కారణాలను గురించి పరిశీలించడం సాధ్యంకాదు

సరిగా యీ తిరుగుబాటుకు ముందు కలెక్టర్ కాక్రేన్ 1845 డిసెంబర్‌లో కొన్ని కట్టుబడి మాన్యాల వంశపారంపర్య హక్కుల రద్దుకు కొందరు కట్టుబడి బంట్రోతుల బదిలీకి గ్రామ పోలీస్ వ్యవస్థ పునర్నిర్మాణానికి సంబంధించిన కొన్ని ప్రతిపాదనలు రివెన్యూ బోర్డుకు పంపాడు 1846 మే నెలలో ఇరవైమంది కట్టుబడి మాన్యాల వంశపారంపర్య హక్కులను రద్దుచేస్తూ కొందరు కట్టుబడి బంట్రోతులు నిస్సంతుగా మరణిస్తే వారి హక్కులను రద్దుపరచి ఆ మాన్యాలను ప్రభుత్వం వశపరచుకొంటూ గ్రామ విధులను సరిగా నిర్వర్తించని కొందరి తవర్జీని తగ్గిస్తూ వుత్తర్వులు జారీ చేశాడు ఈ రకం వుత్తర్వుల మూలంగానే కట్టుబడి బంట్రోతుల్లో అలజడి కలిగి వారు నరసింహారెడ్డి తిరుగబాటులో చేరడానికి ప్రధాన కారణమైందని ఇంగ్లిస్ తన రిపోర్టులో వాదించాడు

ఈ ఇంగ్లిస్ రిపోర్టులోని మాటల్ని ఆధారం చేసుకొనే యస్ బి చౌధురి తన గ్రంథంలో యిట్లా వ్రాశాడు

and in 1845 an order was passed restricting the tenure of these grants to existing lives This last order provoked

the rising of Narasimha Reddi In consequence of these disturbances a special commissioner was appointed later on to deal with the whole question of assignments His work resulted in the enfranchisement of a number of inams It was also made obligaroty on the part of the government to surrender its right to resume in return for a quitrent [19]

కానీ యీ ఇంగ్లిస్ చూఎన ఆ కారణాలను మిగతా అందరూ త్రోసి రాజన్నారు ఇంగ్లిస్ చూపిన కారణాలపై నీ అభిప్రాయాలేమిటో తెలపమని ప్రభుత్వం కల్లెక్టర్ కాక్రేన్‌ను కోరింది ప్రధాన కారణమని ఆయన దేన్నయితే చూపాడో యీాయన దాన్ని కాదన్నాడు తన కారణాలు తాను సూచిస్తూ మరొక సుదీర్ఘమైన ప్రతి రిపోర్టును పంపాడు ఆయన యెన్ని లెక్కలు యిచ్చాడో యీాయనా అంతకంటే యెక్కువ లెక్క-పక్కలే యిచ్చాడు

While disaffection if any existed was entirely local (and) confined solely at first to the Taluk of Coilcoontla, and latterly to Bunganpally and part of Kurnool where, however no such interference with the cuttoobadies was contemplated at all and that the Cuttoobadies of the rest of the District numbering 11 756 individuals not only exhibited no signs of discontent but rendered good and zealous service against the rebels

ఇట్లాగే కర్నూలులోని గవర్నర్ యేజంట్ యస్ స్కాట్ కూడా ఇంగ్లిస్ కారణాలను కాదన్నాడు కడకు రివెన్యూ బోర్డుకూడా ఇంగ్లిస్‌తో యేకీభవించ లేదు వీటన్నిట్నీ యిక్కడ చర్చించాలంటే యీ అధ్యాయం యింకా ఇంత పెరుగుతుంది ఎన్నో రిపోర్టుయు నివేదికలు యెన్నో అభిప్రాయాలూ వున్నాయి ఇవిగాక యింకా మరెన్నో రికార్డ్స్ వున్నాయి లండన్ దాకా నడిచిన రికార్డులు చరిత్రకారులుగా వీటన్నిట్నీ మనం బేరీజు వేసుకుని యీ తిరుగుబాటు వెనుకగల ఆర్థిక రాజకీయ కారణాలకోసం అన్వేషించవలసి వుంటుంది భావి పరిశోధకుడికి యీ రంగాన్ని వదిలి వేయడమే ప్రస్తుతం నేను చేయగల్గిన పని

[19]*Civil Distrubances during the British Rule in India (1765 1857) S B Chaudhuri 1955 Pp 29 152*

ఇక కోయిలకుంట్ల తాసీల్దార్ వుదంతం వొకటుంది ఆ తాసీల్దార్ రాఘవాచార్యులు పాపాలభైరవుడుగా నరసింహారెడ్డి తిరుగుబాటుకు వొక ముఖ్య కారకుడైనట్లు కడప కల్లెక్టరు కర్నూలులోని యేజంటు యిద్దరూ యేక కంఠంగా తమ రిపోర్టుల్లో వ్రాశారు

1846 జూన్‌లో నరసింహారెడ్డి తనకు రావల్సిన మేనెల పెన్షన్ డబ్బును నేరుగా కోయిలకుంట్ల ట్రెజరీకి వెళ్ళి తీసుకోకుండా వొక మనిషిని పెట్టి చీటి వ్రాసి తెమ్మని పంపాడట లోగడ కొన్నిసార్లు యిట్లాగే పంపినప్పుడు తాసీల్దార్ సమ్మతించి యిచ్చి పంపినా యీసారి మాత్రం ఆ వచ్చిన మనిషిని యేదో దుర్భాషలాడి రెడ్డి నేరుగా వస్తేనేగానీ యిచ్చేదిలేదు పొమ్మన్నాడు దీనిమీదట రెడ్డి రాకుండా మొండి కేసుకొని టలాయిస్తుంటే తాసీల్దార్ వారంట్ యిచ్చి బంట్రోతుల్ని పంపడంతో ఘర్షణ ప్రారంభమై వచ్చినవాళ్ళను నరసింహారెడ్డి తన్ని తరమడంతో పోరాటానికి బీజావాపం జరిగిందని అంటారు

అసలు తాసీల్దార్ రాఘవాచార్యులు ఫక్తు లంచగొండి అధికారి అనీ కట్టుబడి బంట్రోతులచేత నానా సొంత చాకిరీ చేయించుకుంటూ బ్రాహ్మణాధిక్య భావంతో వాళ్ళను నీచంగా మాట్లాడేవాడని కూడా అంటారు ఈయన స్థానికుడు కూడా కాదు అంతకుముందున్న కల్లెక్టర్ యీయన్ను వేరే జిల్లానుంచి రప్పించి వుద్యోగ మిచ్చినట్లు వొక రిపోర్టునుబట్టి తెలుస్తుంది

కోయిలకుంట్ల ట్రెజరీపై నరసింహారెడ్డి మనుషులు దొమ్మీకి వచ్చినప్పుడు యితను అయిపులేకుండా యెక్కడో దాక్కున్నాడనీ అంతేగాకుండా అంతకు మూడు రోజుల ముందు యిటువంటి దొమ్మీ వొకటి వుండవచ్చునని పసిగట్టి ట్రెజరీలో రహస్యంగా దాచుకొని వుండిన తన సొంత డబ్బు దస్కాన్ని తీసేసుకుపోయాడని కల్లెక్టర్ రిపోర్టు

తాసీల్దార్‌పై నరసింహారెడ్డికి అంత కక్ష వున్నప్పుడు కోయిలకుంట్ల ట్రెజరీ దొమ్మీలో యీయన్ని చంపివేయకుండా నిర్బంధంలోకి మాత్రమే యెందుకు తీసుకున్నట్లు అనే ప్రశ్న వుదయిస్తుంది ఈయన బ్రాహ్మణుడు కావడంవల్ల చంపితే బ్రహ్మహత్యా పాపం యెక్కడ చుట్టుకుంటుందో ననే మూఢ నమ్మకమే కాకుండా నరసింహారెడ్డి కూడా వైష్ణవుడు కావడం మతరీత్యా యిద్దరూ వొకే మఠానికి చెందినవారు కావడం కారణాలుగా చూపారు రివెన్యూ బోర్డు రిపోర్టులో

నిర్బంధంలో నుంచి బయటపడ్డ తర్వాత యి రాఘవాచార్యుల్ని వుద్యోగంలో నుంచి తొలగించివేశాడు కలెక్టర్ తాను నిర్బంధంలో వుండగా వొక చేతికి తీవ్రమైన గాయాలు తగిలి ఆ చేయి పనికి రాకుండా పోయిందనీ ప్రభుత్వ సేవలో వుండగా తనకు యీ కష్టనష్టం వాటిల్లింది గనుక కనీసం పెన్షన్ అయినా యిమ్మనీ అర్జీ పెట్టుకున్నాడు ఆ తాసీల్దారాచార్యులు అందుకూ వల్లకాదని వ్రాశాడు కలెక్టర్ అయితే నరసింహారెడ్డితో జరిగిన పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన కంభం తాసీల్దార్ భార్యకు నెలకు 35 రూపాయలు తదితర వుద్యోగుల కుటుంబాలకు తలా 4 5 6 రూపాయల చొప్పున పెన్షన్ మంజూరు చేసింది ప్రభుత్వం

* * *

నేటి నక్సలైట్లతో నరసింహారెడ్డిని పోల్చడం కొందరికి నచ్చకపోవచ్చుగానీ యీ సందర్భంలో వొక విషయం జ్ఞప్తికి వస్తున్నది ఈ జాబుల సంపుటాల్లోనే ఆనాటి తెలుగు పత్రికల్లో పడిన సంపాదక లేఖలు పెక్కింటిని కూడా బ్రౌన్ కాపీ చేయించి పెట్టాడు 1843లో కడపజిల్లా వ్యక్తికి సంబంధించిన వోక వార్తాలేఖ ను లోగడ (1973లో) నేను ప్రకటించిన బ్రౌన్ జాబులు తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుంచి 1857 దాకా అనే గ్రంథం (పుటలు 47 9)లో యిస్తూ ఆ అధ్యాయానికి ఆనాటి నక్సలైట్లు న్యాయం జరగక తిరుగుబాటును వరించిన సామాన్యులు అనే శీర్షిక పెట్టిన వైనం స్మరణకు వస్తున్నది

(బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు – కడప జాబుల సంకలనం – బంగోరె, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి డిసెంబరు 1977 పుటలు 9–28)

* * *

# సి పి బ్రౌన్ కడప జాబులు

## ఉయ్యాలవాడ నరసింహారెడ్డి సాయుధ తిరుగుబాటు

## 1

### సి పి బ్రౌన్ దొరగారికి 1846 సెప్టెంబరు 14వ తేదీ కడప నుండి సి సుబ్బయ్య వ్రాసిన జాబు

మహారాజశ్రీ సి పి బ్రౌన్ యిస్కోయరు గారి సముఖానకు —

శేవకుడు సుబ్బయ్య అనేక సలాములు చేశి వ్రాసుకున్న విజ్ఞాపనము యీ నెల 14వ తేదివరకు ప్రభువులవారి అనుగ్రహము వల్లను కడపలో క్షేమం అచ్చట ప్రభువులవార్ల యొక్క క్షేమసంతోషాతిశయములు మాకు తెలిశి సంతోషాంని పొందుటకు అనుగ్రహపత్రికె దయచేసి అంపించవలయునని ప్రార్ధిస్తున్నాను

యిటీవల కర్నూలులో రెడ్డిగారి గుండా యెక్కువలు జరిగినట్లు తెలియనందున విజ్ఞాపనం వ్రాసుకోనభ్యంతరమైనది సముఖానకు వస్తున్నానని తెలియపరుచుకున్న ప్రకారం యీ నెల 6వ తేదీని ప్రయాణమై మొన్నటి రోజ్ను కడపకు వచ్చి చేరినాను యిచ్చట కడపలో నున్న చుట్టుపక్కల 5 6 ఆమడ పరియంతం రెడ్డియొక్క భయంవల్లను ధనీకులు వూళ్ళు విడిచిపెట్టిపోయిన వారున్ను ధనము మాత్రం బైట జాగ్రత పరచివుండేవాండ్లున్నుగా వున్నారు కడమ సాధారణమైనవారు సాయంత్రం 5 5½ ఘంట ప్రొద్దుకు వీధి తలుపులు పెరటి తలుపులు వేసుకునేవారు కొందరు ఆ వేళకే భోజనములు కాచేసుకొని పక్కవీధులలో నిరుపేదలైన వారి యిండ్లలో పరుండేవారున్ను పల్లెలకు పోయి పరుండెవారుగా వున్నారు యిదిగాక పదిరోజులనాడు యిచ్చటి సెసన్ జెడ్జిగారికి రెడ్డి అర్జి మూలముగా కడప ఖజానా కొళ్ళకు వస్తున్నాను మీరు వుండవలసిన జాగ్రతలో వుండవలసినదని తెలియ జేసుకున్నాడు అది మొదలు ఖజానా వద్దను 200కి శిఫాయిలను కత్తులు తుపాకిలతో సిద్ధపరచి కావిలి వుంచివున్నారు జవాన్లు మొదలు తుపాకిలు కత్తులతో వుషారుగా వున్నారు అయితే రెడ్డిగారి తరపు దివిటీ దొంగల వుపద్రవము వల్లను ప్రజలు అత్యంతమైన భీతిని పొందుతున్నారు 5 6రోజుల కిందట దివిటి దొంగలు వచ్చి రెండు యిండ్లు దోచుకొని పోయినారు వారు రావడం

150కి 200 దివిటీలు వేసుకొని బొగ్గులు పూసుకుని తుపాకిలు కాల్చుకుంటూ వచ్చి యింధ్లల్లో జొరబడి వున్నవల్లా యెత్తుకుని చేతుల వేళ్ళకు గుడ్డలు చుట్టి నూనె పోశి వుుట్టించి వున్న ద్రవ్యమంతా అగుపరచమని శ్రమపెట్టుతున్నారని యిచ్చటివారలవల్లను తెలిశినది నేను యిచ్చటికి వచ్చిన రోజు సమాచారం బేతం చెరువు వద్దను రెడ్డిగారు వున్నారని కడప కలకటరు వారు యింకా కొంత జనమున్ను కర్నూల్ నుంచి కమీసనర్ వారు కొంత తురుపున్ను పోయి కాచివుండగా సదరహి రెడ్డిగారు కోవెలగుంట తాలూకాకు వచ్చి పోద్దుటూరిలో వుండేవారికి వక వుత్తరం మూలంగా రెండు మూడు రోజులలో యీ వూరు కొళ్ళకు వస్తున్నాను మీరు తగు జాగ్రత్తలో వుండవలసినదని వ్రాసిన వుత్తరమును కలకటరువారి వద్దికి అంపించగా కలకటరువారు పొద్దుటూరికి పోవుటకు 4 కుంఫిణీలను దౌడు అంపించమని వ్రాసిన ప్రకారం అంపించినారున్ను కొంతమంది జవానులను నూతనముగా జీవనము కలగచేసి అచ్చటికి సహాయార్థమై అంపించినారు యింతకు మించిన సమాచారములు తెలియ లేదు చక్కగా విచారించుకొని వస్తున్నాను

కర్నూలు వద్ద జరిగే సంగతులు ప్రభువుల వారికి విశదమయ్యే కొరకు అచ్చట వుండే రైటరుగుండా సముఖానకు ఆర్జీ వచ్చును ఒకవేళ నా పేర వచ్చినా ధొరవారు చిత్తగించవలశినది యిచ్చట జరిగే సమాచారములు యిచ్చట నాకు మిక్కిలి స్నేహితుడున్నాడుగనుక ఆయనగుండా ముందు వుత్తరములు వచ్చేలాగున జాగ్రత్త పరిచివున్నాను దివ్య చిత్తానకు తేవలెను

నేను రేపటిదినం యిచ్చటినుంచి తర్లివస్తున్నాను దివ్యచిత్తానకు తెచ్చి రక్షించకోరుతున్నాను

యిదే అనేక సలాములు

Cuddapah
14 September 1846

Sir
Your most obedient
humble servant
C Soobiah *

* Madras Government Oriental Manuscripts Library లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్ 419 పేజీ 126

# 2

# కొండూరు కరణం వున్నం సుబ్బరాయుడు అర్జీ
(తేదీలేదు)

మహారాజరాజశ్రీ ఘనమైన రివిన్యూ బోరడువారి సముఖానకు

కడప జిల్లాలో చేరిన చిట్టివెల్ తాల్కూ కొండూరు కరణం వున్నం సుబ్బరాయుడు అనేక సల్లాములు చేశి వ్రాసుకున్న మనవి అర్జీ యేమంటే తాము దయచేశిన హిండెరసుంన్యూ* వక అర్జిన్ని కలకటరు క్యాకరిన్ ధొరవారు తిమ్మానాయణిప్యేట మొక్కాంల్లో వుండాగా యిస్తిని అవి చిత్తగించి తిరుగా నా చేతికి యిచ్చి తారహిల్ ధొరవారి చేతికి యిస్తే వారు నీకు వుత్తర్వు యిస్తారు పొమ్మని శల్వు యిచ్చిరి ఆ ప్రకారం హిండెరసుంన్యూ పెద్ద ధొరపేర వ్రాసుకున్న అర్జిన్ని చిన్న ధొరపేర వక అర్జిన్ని యీ మూడున్ను చిన్నధొరవారికి యివ్వగా వారు చూచుకొని నీవు బోరడుకు యేల పోయినావు మేము విచారించక పోతిమె అయినా మంచిది నీ కరిణీకం పని నీకు యిస్తున్నాము యిప్పట్లో నారశింహ్వారెడ్డిని పట్టే యెత్నంల్లో వున్నాము నీవు యిక్కడనే వుండమని శలవు యిచ్చినందున నెలా పదిహేను దినములు వుండిన ఎమ్మట మునిషిల మాట అంగీకరించి బోరడు వారు పని యిమ్మని వ్రాయలేదు సబబునామా యిమ్మని వ్రాశినారు అని సబబు యిచ్చి పొమ్మనిరి అదే తేదిని యీ యొక్క సబబునామాంన్ను యిద్దరు ధొరలున్ను మునిషిలు జర్గించినవైనం వక అర్జిన్ని తాము దయచేశిన హిండేరసున్ను యీ మూటికిన్ని తేదివారతో కూడా నకలు వ్రాసుకొని అసళ్ళు పోస్టు మునిషదువ్వూరి వెంకోజీరావు దగ్గర యిచ్చి రశీదు పుచ్చుకొని వూరికి పోయి ఖర్చుకు సంపాయించుకొని సముఖానకు వత్తామని వస్తూవుండగా కడప బజారులో పండుకొని వుండగా ఆ రాత్రి మూప దొంగలు తీసుక పోయినందున యావత్తు దస్తైవజులు పోయినందున తారీఖులు అర్జీలు దాఖల్ చేయలేదు

నా భాగానకు గుమాస్తాగా వుండేవాడు ధనవంతుడయినందున మునిషి నిండా ఆమోదించి వారి యిష్టానుసారం ప్రకారం సబబునామా యిచ్చినారే కాని యీ పైకి నేను వప్పుకున్నది లేదు అనుభవించినది లేదు యిదే జిల్లాల్లో చేరిన

Indorse అని బ్రౌన్ వ్రాత

తాలూకాల్లో 400 500 రూపాయలు ఛఫావణి చేశిన కరణాల్కు జురుమ్నా పుచ్చుకొని వారి పనులు వారికి యిచ్చి వున్నారు నేను ఛఫావణి చేశి వుండలేదు నా ఫిర్యాది ధనవంతుడయినందున తహశ్శీల్దారు నరశింగరావు మునిషి నారాయణరాయుడు యీ యిద్దరు నామీద కార్పణ్యంచాత ధొరలకు వారి యిష్టప్రకారం తెలిపి రు50 జురుమానా భరతరఫి నా హిస్సాకు నా ఫిర్యాదిని గుమాస్తాగా వుంచి నాకు మూడు శిక్షలు జరిపినారు యీ కుంఫిణీలో మూడు శిక్షలు జరపడం యిదివరలో లేదు నన్ను బహు అన్యాయం చేశినారు గనుక తాము ధర్మప్రభువులని సముఖాన మనవి అర్జీ యిచ్చుకున్నాను నా మనవి చిత్తగించి నా పని నాకు దయచేయించే లాగున కల్కుటరు ధొరకు హుకుం దయ చాయవలెనని ప్రార్థిస్తూ వున్నాను చిత్తగించవలెను *

(ఈ లేఖలో యిప్పట్లో నారశింహ్వారెడ్డిని పట్టే యెత్నంల్లో వున్నాము అనే వాక్యాన్ని బట్టీ కలెక్టర్ కాక్రేన్ పేరును బట్టీ ఇది 1846 జూలై అక్టోబరు నెలల మధ్య వ్రాసిన ఉత్తరంగా ఊహించవచ్చును తంగిరాల)

Madras Government Oriental Manuscripts Library లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్ 420 పేజీ 163

## అనుబంధము - II

# రేనాటి వీరుఁడు (నవల)

**-కలవటాల జయరామారావు**

కీ శే కలవటాల జయరామారావుగారు 1925లో ఈ చారిత్రక నవలను ప్రకటించినారు వీరు కడపజిల్లాలోని జమ్మలమడుగు నివాసి వీరు అనేక నాటకములు నవలలు రచించి ప్రకటించినట్లు తెలియుచున్నది సువర్ణకేసరీ కృష్ణసేన అను నవలను కలియుగ దర్పణము అను పంఘసంస్కరణమును ప్రతిపాదించు నాటకమును తుకారాం అను అయిదంకముల నాటకమును జయరామారావుగారు 1925 నాటికే ప్రకటించియున్నారు గండికోట వినాశము (The Fall of Gandikota) అను అయిదంకముల చారిత్రాత్మక నాటకమును గోలకొండ పతనము అను నాటకమును ప్రేమలేఖ (Love Letter) అను రచనను ఆనాటికే వీరు రచించి ప్రకటించుటకు సిద్ధముగా నుండిరని కూడ రేనాఁటి వీరుఁడు నవలయొక్క 2 3 4 అట్టలపై వ్రాసిన ప్రకటనలను బట్టి తెలియుచున్నది భవానీ గ్రంధమాల అను పేరుతో జమ్మలమడుగు నుండి వీరు ఈ గ్రంధములను ప్రకటించియున్నారు వానిలో ఈ రేనాటి వీరుఁడు వీరి మూడవ గ్రంధము ఈ నవలలో నారసింహారెడ్డి విప్లవముతోపాటు మూఢ విశ్వాసములను ఖండించుట జాతరలలో బలులనిచ్చు పద్ధతిని వ్యతిరేకించుట కోడి పందెముల అనర్ధములను తెలియజేయుట గ్రామ మురాకతులను తీవ్రముగా నిరసించుట మున్నగు అంశములు కానవచ్చును వీనిని బట్టి ఈ రచయితపై కందుకూరి వీరేశలింగముగారి ప్రభావము కలదని భావింపవచ్చును జయరామారావు గారు శానిటరీ ఇన్స్పెక్టరుగా పనిచేసియుండిరని రేనాటిలో పెద్దలు చెప్పగా విని యున్నాను రేనాఁటి వీరుఁడు అను నవల యొక్క ముఖపత్రముపై Bhavani Granthamala 3 The Hero of Renad By Kalavatala Jaya Rama Rao - అని యున్నది ఈ నవలలోని Inner Title అంకితము చరిత్రాత్మక స్థలములు విషయానుక్రమణిక జనమంచి శేషాద్రిశర్మగారి పీఠిక రచయిత విజ్ఞప్తి యధాతధముగా నిచ్చుచున్నాను జయరామారావుగారు ఈ నవలను కీర్తిశేషుడైన తన మూడవ అన్న శేషయామాత్యునకు అంకితము చేసెను వీరరాఘవరాజుగారు అను ఔకురాజుగారి సహాయముతో ఈ నవలను ప్రకటించినట్లు తెలియుచున్నది ఆ రాజుగారి ఛాయాచిత్రము కూడ ఈ నవలలో నున్నది

**- తంగిరాల**

భవానీ గ్రంథమాల - 3

# రేనాటి వీరుఁడు

(చరిత్రాత్మకముగు చక్కని నవల)

కల్వటాల జయరామారావుగారిచే
రచియింపబడినది

మొదటి కూర్పు *1000* ప్రతులు

బెజవాడ
వాణీ ముద్రాక్షర శాలయందు
ముద్రింపబడినది
1925

 వెల *12* అణాలు

# రేనాటి వీరుఁడు

## అంకితము

తే గీ గణిత వ్యవహార వైద్యంబు కవిత లనెడి
కళల నాల్గింటి నేర్చిన ఘనుడటంచు
యశముగాంచిన యట్టి మాయయ్య యయ్యెఁ
దనరు సంజీవరావు కుఁ దగిన యట్టి
పుత్రులము నల్గురము మేము బుట్టినాము
ఒక్కొకర మొక్క కళనేర్చి యుండునటులఁ
గోరి మృతినొందెఁగాఁబోలు కోరినటులె
పెద్దకొమరుండు వ్యవహార వేత్తయయ్యెఁ
గనఁగ రెండవ పుత్రుండు గణిత మెఱిఁగె
వెలసె మూఁడవ సూనుండు వెజ్జుఁగాగ
కవిని నేనయ్యెఁదిన్నఁగా గ్రంధ రచన
జేయుచుండఁగఁ బ్రేమ నా చెలు వెఱింగి
నాదు మూడవ యన్న తా మోదమొందు
నేర్పుఁగానఁగ నేనిల నేర్వనైతి
పూర్వపాపంబు నన్వీడి పోకయుండ
సుగుణనిధియగు ననుజుండు సోలెనకట!
దు ఖ వారాశిలో మమ్ము దొర్లఁజేసి
శేషయామాత్యు దేవుండు జేర్చె దివిని
మఱువవలెనన్న నాతఁడు మఱపురాడు
అట్టివానికిఁ జేతు నే నంకితంబు

## ఈ పుస్తకమున వచ్చు ముఖ్యమగు చరిత్రాత్మక స్థలములు

1 విజయనగరము
2 హైదరాబాదు
3 ఓరుగల్లు
4 ఒంటిమిట్ట (ఏకశిలా నగరము)
5 గండికోట
6 కంభం
7 ముండ్లపాడు
8 గిద్దలూరు
9 నొసం
10 కడప
11 కోవెలకుంట్ల
12 ఉయ్యాలవాడ
13 ఔకు
14 సిద్ధవటం
15 చిట్టివేల్
16 ముత్యాలపాడు
17 గుత్తి
18 తాటిపర్తి
19 నంద్యాల
20 జమ్మలమడుగు
21 ప్రొద్దుటూరు
22 ఆకుమళ్ళ
23 కొండ సుంకేసుల
24 కల్వటాల
25 పేరు సోముల
26 ఆల్వకొండ

రేనాటి వీరుఁడు (నవల) 161

## విషయానుక్రమణిక

# పీఠిక

ఆర్యులారా!

రేనాటి వీరుఁడు అను చారిత్రక కధను సంతోషమున నందుకొని పఠించితిని శైలి సర్వజన సుబోధముగా నున్నది ప్రతి ప్రకరణము మొదటను వ్రాసిన కధాసూచిక ఆ ప్రకరణార్ధమును సులువుగ బోధించుచున్నయది అందందుదాహరింపఁ బడిన పద్యములు గ్రంధకర్తగారి చాతుర్యమును వెల్లడించుచున్నవి ఇది దత్తమండలమున జరిగిన కధగాన దానింగూర్చి పెంచి వ్రాయనక్కఱ యుండదు దేశమునందు గ్రంధకర్త గారికిఁగల సద్భావ మీ గ్రంధము ద్వారా బోధ పడక మానదు పుస్తకమంతయుఁ జదువగా సంఘదురాచారముల మాన్పుటయే కర్తగారి తాత్పర్యమని తేటపడును వారి కృషి నిరంతరాయముగ దినదినాభివృద్ధి నొంది వారికి సత్కీర్తిని దేజాలునదగుఁగాక! ఇంత కన్నఁ జక్కని శైలిని దత్తమండల పవిత్ర స్థల చరిత్రమును బ్రబంధ కల్పనగా వ్రాసి యశస్సును దిక్కుల వ్యాపింపఁ జేయుదురని నమ్మెదను వారికీ కార్యమునఁ బట్టుదల తగ్గకుండ భగవంతుఁ డనుగ్రహించుఁగాక!

విధేయుడు

**జనమంచి శేషాద్రిశర్మ**

ఆంధ్ర శ్రీమద్రామాయణ

బ్రహ్మాండ పురాణాది గ్రంధకర్త

కడప

2-9-1925

# విజ్ఞప్తి

భాషాభిమానులారా!

ఈ నవల నాలవ రత్నము కథ చరిత్రాత్మకంబును కథననుసరించి కొద్దిగ కల్పితంబునునై యున్నది అట్టిది సాహసంబయ్యును బాల్యచాపల్యంబున రచింపఁ గడంగితిని నన్నిందులకు మన్నింపఁ దజ్ఞుల వేడెద

ఇందలి కథ రేనాటిసీమలో జరిగినది విషయమును ముందుగనె క్లుప్తముగ వ్రాయనెంచి మఱల చదువరులే చదివి తెలిసికొనగలరని యాభారము పాఠక మహాశయులకే వదలితిని

ఈ వీరుని చారిత్రవమును రచించుటకుఁ దగిన చరిత్రాత్మక విషయములకై మిక్కిలి శ్రమపడి సంపాదించి వాటి నాధారముగాఁ జేసికొని వ్రాసితిని నూతన విషయములఁ దెలిసిన వారుండిన దయతో నాకుఁ దెలిపిన రెండవ కూర్పున వాటినిఁ జేర్చెద

బాల్యరచనలు కసుగాయలు (కాన) కనరూనక మానవు ఇది బుధులకు విదితము నే వ్రాసిన కబ్బమున నెరసులు పెక్కులు పొసంగు టెఱింగియు నా తల్లి బాసయగు తెనుఁగునందు కతలల్లవలెనను మించిన కుతుకమున వ్రాయఁదొరకొంటి

చంద్రున కిచ్చెడి నూలుపోగు వలెనే ఆంధ్ర వాణికి నే నొసఁగు చిన్ని కాన్కయని సహృదయులు దీని గ్రహింప వేడెద మధుపంబుల మాడ్కి రసజ్ఞులు ఇమ్మగు దానినే గ్రహింపఁగలరని నాయాశయము ఇదియే భాషాభిమానులగు వారు నా కొసంగఁగల తోడ్పాటును బ్రోత్సాహమును అట్టివారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడ

ఇట్లు

విధేయుడు

జమ్మలమడుగు
ది 12 12 1925

**కలవటాల జయరామారావు**

# రేనాటి వీరుఁడు

## మొదటి ప్రకరణము

### రాజ భక్తి

ఔరా! జనులు విరామము లేక పరుగెత్తుటకుఁ గారణమేమై యుండును? ఆ యువతీలలామలు భీత మనస్కులై గడగడ వడంకుటకు హేతువేమి? బాలురు భయముచే దిక్కు దోఁచక బోరుమని రోదనము చేయుటకు గతంబేమైయుండును? అక్కడ రహస్యము లాడుటకును మఱియొకచోట దాఁగుటకును ఇక్కడ గుసగుస లాడుటకును మూలకారణ మేమైయుండును?

పిలిచిన పలుకకుండ వెడలు బాలికలను బట్టి చెంపలు వాయించి తీసికొని వెళ్ళి గృహములలో వేయు పడతులును తప్పించుకొని యేమిటో చూడవలయునని పరుగిడుచున్న బాలకులను కష్టము చేతఁ బట్టి యింటిలోని గదులలో వేస తాళము వేయు పురుషులును అబ్బో! నేఁడు బయటకు వెళ్ళిన బ్రతుకఁగలమా యని తమకుఁ దామె యనుకొను వారును ఏమియుఁ దోఁచక యూరక పరుగెత్తిడివారును దడదడలలో నొకరి నొకరు దాఁకుచుండఁ గ్రిందఁబడి లేచి పరుగిడువారును గడ్డములఁ బగులఁ గొట్టుకొన్న వారును పండ్లు విరుగఁ గొట్టి కొనినవారును ముక్కులనుండి రక్తము ప్రవహించు వారును యిఁక ముందేలాటి భయంకర కృత్యము జరుగునో గాని చూచెడి వారికిపుడు వీఱొయొక పోరొనరించు నటులుండె

అక్కటకటా! పాపమా విరామము లేక పరుగెత్తువారి భయమును మాన్పు నంతటి ధీశాలులెవరున్నారు? ఆ భీత మనస్కులైన యువతీ లలామలకు ధైర్యముఁ జెప్పువారెవరు? భయముచే దిక్కుతోచక భోరుమని రోదనముఁ జేయు బాలుర నోదార్చు పుణ్యశీలులెవరు? ఆ భీకరారావముల విని క్యావుమని యేడ్చు చంటి బిడ్డల గతిని విచారించు వారెవరును లేరే!

వ్యాపారార్థము చనుదెంచిన యన్యదేశ వాసులు వారి చర్యలఁ జూచి యనేకులను వారి వింతచర్యలకుఁ గారణమడిగి యొకరి వలనగాని తగిన ప్రత్యుత్తరము బడయక వారు సహితము ఏమి విపత్తు రానున్నదో యని భయముచేఁ బరుగెత్తి తమ

విడిది కేగి పురవాసుల మాడ్కి బయటికి రాకుండిరి పదునెనిమిది వత్సరముల నూనూగు మీసముల వారును గోటికి మీసమందు యువకులును తామింకను మంచి చెడ్డలను దెలియని వారై యేమి జరుగునో చూతమను నుత్సాహమున గృహముల పైకెక్కి తమ గ్రామము చుట్టు ప్రక్కల చూపుమేర యేమి జరుగునో చూడవలయునని అందఱొక చోట అత్యుత్సాహముతో నుండిరి వారి తల్లిదండ్రులు వారిని నయభయములఁ బిలుచుచు దూషించుచు వారక్కడికి రానందున కుయ్యో మొఱ్ఱో యని యేడ్చుచుండిరి ఆ యేడ్పును వినఁజాలక కొందఱు అబ్బా! ఏమి వీరియాగడము? అని క్రిందికిఁ బోవుచుండిరి కొందఱు మన్ను మిన్ను దెలియని వయసు వారు తావచ్చటనే యుండి జరుగనున్న దానిని చూచి భయంకర కృత్యమైయున్న గృహములలో దాఁగ వచ్చునని కూర్చుండి యుండిరి భయమనున దెఱుఁగని బాలికాబాలకులు వారితల్లులతో అమ్మా! మమ్ముఁ గూడ బయటికి వెళ్ళి చూడనియ్యవే యని బ్రతిమాలుచు నామె అయ్యో! మీరు పోగూడదు బయటికి వెళ్ళిన మిమ్ములఁ జంపివేతు రని భయపెట్టినను నమ్మక తల్లి యసత్యము చెప్పినదని తండ్రిని సమీపించి నాన్నా! మనము వెలుపలి కేగి యీ వింతను జూచి వత్తము రమ్మ ని పిల్చుచు తండ్రి కూడ వారిని నివారింప ఆ భయమేమిటో చెప్పిన దాక విడువమని బలవంత పెట్టుచుండిరి అందులకు తండ్రి నాయనా! యీ దినమెవరో మన యూరికరుదెంచి కచ్చేరిని ధనాగారములను ధనికుల గృహములను దోచుకొని యనేకులను చంపుదురని యెవరో వదంతిని గల్పించియున్నారు ఇందలి సత్యాసత్యములు ఏరికిని దెలియవు మేము కూడ నిక్కమనియే నమ్మి యున్నాము కనుక నేఁడు బయటికిఁ బోరా దని చెప్పుచుండెను అందులకు వారు నిజమును దెలిసి కొనక యెందుల కిట్లు భయపడవలయును? నిజమో కాదో చూచి వత్తము ర మ్మనుచున్న బాలకులను వారి తల్లిదండ్రులు కోపముతో రెండు దెబ్బలువేసి చేతులకును గాళ్ళకును త్రాటిచేఁ గట్టి యొక మూల ద్రోయుచుండ పాపమా బాలకులు గట్టిగ నేడ్చుచుఁ బడియుండిరి ఈ బాలకులకు మాత్రమీ వదంతిఁ దెలియఁ జెప్పిరి కాని పాపము! క్రొత్తగ వచ్చి యీ వింతసంగతిని గూర్చి మొదటఁ బ్రశ్నించిన యీ యన్యదేశవాసులకుఁ జెప్పువారు లేనందున తాము దాఁగిన విడిదిలో నెవ్వరైన నచ్చటి కేతెంచి తగిన వార్తనుఁ జెప్పుదురేమోయని యువ్విళ్ళూరు చుండిరి గాని అంతటి పుణ్యపురుషుఁడొకఁడేని వారి కడకు రా సాహసింపడయ్యె ఆ పురవాసుల వింత చర్యల కాశ్చర్య మానసులైవారు తమ గదులలలో కూపస్థ మండూకముల వలె దాఁగి యుండిరి సూర్యోదయమునకు ముందటి నుండియె యీ విపత్తును గూర్చి జనులు భీతిచే

దాఁగి యుండిరి ఇప్పటికి సుమారు పగలు పండ్రెండు గంటలై యున్నను వారు మాత్రము సూర్యరశ్మియైనను సోకకుండ గవాక్షముల సయితము బంధించి లోపల మాటాడుటకు గూడ వెఱచి నిశ్శబ్దముగ నుండిరి గృహముల పై నుండిన వారు మాత్రము అన్నపానాదులనైన నాసింపక చుట్టుప్రక్కల కనుచూపు దూరమున నేమేమి జరుగునో వాటిని జాగ్రత్తగ నవలోకించుచుండిరి

అటులుండక కచేరిలో పాహరా యుండిన రక్షక భటుఁడు టంగ్‌టంగ్ మని పండ్రెండు గంటలు కొట్టెను గ్రామమంతయు నిశ్శబ్దముగ నున్నందున ప్రతి వారికిని గంటల శబ్దము వినబడి యుండుననియే మా నమ్మకము గ్రామ వాసులందఱు గడగడ వడంకు చుండ ఇంక కచేరిలో నుండు సర్కారుద్యోగస్థులను గురించి చెప్పఁ బనిలేదు వారంతగ భీతిల్లక పోయినను రక్షక భటులను జాగ్రత్తగ నుండుడని యుత్తర్వు చేసి యా భయంకర వార్తను గూర్చి యాలోచించుచుఁ గూర్చుండి యుండిరి రక్షక భటులును వారి పైయధికారులును తమ ప్రాణముల కేయపాయము తటస్థించునో యనియు నేఁడైన భయంకర కృత్యము జరిగిన తామే ముందంజ వేయవలసి వచ్చునే యనియు నా గండము గడచిన మఱునాడె రాజీనామా నిచ్చి భూమి దున్నుకొని జీవించెదము కాని పోలీసు పని చేయమని ప్రక్కనున్న వారితోఁ జెప్పుకొనుచు ఒడలు కంపమొంద దేహమున రక్తము ప్రవహింపక నిలచి యుండె కాబోలు తమ ముఖములు తెల్లఁబడి యుండ మృత్యుదేవత కాహుతి కాబోయెడి వారివలె నుండిరి తహసీలుదారుఁడును అతని క్రింది యుద్యోగస్థులును చిన్న ముఖములఁ జేసికొని యేమియుఁ దోఁచక తమ కార్యముల నాపి యూరకఁగూర్చుండి యుండిరి

ఇటులుండ గృహములపై నున్న యువకులలో నొకఁడు తక్కిన వారి నవలోకించి అదిగో చూడుఁడు ! కొందఱు మనుష్యులు పరుగెత్తి వచ్చుచున్నట్లున్నది ఆ దుమ్ము రేగుటనుఁ జూడుఁడు ఇందఱని లెక్కించుటకే వీలుగాకున్నది అని యనెను అందఱును జూచిరి మనుష్యులేమొ వచ్చుచుండిరి కాని యెందు నిమిత్త మే తెంచుచుండిరో వారి సంఖ్య యేమో తెలిసికొనుటకు సాధ్యము కాకుండెను అంతలో వారు పురిని సమీపించిరి ఇంతవఱకా యువకులు ధైర్యమూనియే నిలచి యుండిరి ఇప్పుడా వచ్చువారు బాగుగ గాన్పించు చుండిరి వీరిలో నొకరు వారి సంఖ్య సుమారు మూడువంద లుండునని చెప్పెను

అటుల వారు మాటాడుచుండగనే వారు మఱికొంత దరికే తెంచిరి అంతట యువకులతో నొకఁడు అదిగో చూడుఁడు ! జనమధ్యమున నొక పల్లకిని మోసికొని

వచ్చు చున్నారు అబ్బా! ఆ పల్లకిలో నుండు యాకృతిని జూడుఁడు ఎంత భయంకరముగ నున్నాడు ఔరా! ముఖమెంత భయంకరముగ నున్నది రక్తమువలె నెఱ్ఱగాఁ బ్రకాశించుచున్నది కన్నుల నుండి యగ్ని కణములఁ గురిపించుచున్నాడే! అయ్యో! చూచుటకే భయమగుచున్నది నా యొడలు కంప మొందుచున్నది ఔరా! మీసముల రీవిని జూడుఁడెంత లావుగనున్నవో! అవి మనబోటి వారి చేతుల కబ్బునా! మనలో కొందఱు మీసము మీద నిమ్మకాయను నిలువఁబెట్టుదు మందురే! ఇతని మీసముల రీతిని జూచిన వారి గర్వ మేమగునో కదా! అదిగో యతని తలగుడ్డను జూడుఁడెంత చక్కఁగ జుట్టియున్నాడో! అన్నలారా! చూడుఁడు బాగుగఁ జూడుడు కుడిచేత ఎస్తోలొకటి యున్నది ఎడమ చేత డాలొక దానిని బట్టియున్నాడు ప్రక్కన పొడుగాటి కరవాలమున్నది అతఁడు కూర్చుండు రీతిని గనుఁడు అతని ముఖ లక్షణములఁ బరికించుడు ఆహా! ఆ నరసింహమూర్తియే సాక్షాత్కరించి నటులున్నదే! ఆ మహానుభావుఁడెందులకు వచ్చును? అతని భక్తుఁడు ప్రహ్లాదు డిచట లేడే! అతఁడు లేకున్నను అంతటి పుణ్యపురుషుఁడైన జన్మించుటకు తగిన భూమి కాదే మనది! ఇంకెవ్వఁడై యుండును? అన్నన్నా! మీసముల దిద్దుచున్నాడు చూడుడు అదిగో! చేతిని మనయూరువంక విసరుచున్నాడు అబ్బో! మన కొంపలు కూలినవి మన కాపద మూడినది మనమింక బ్రతుకుట దుర్లభము అయ్యో! పురమును సమీపించిరి రండు పోయి దాఁగుదము మన రంగనాయకులే మనల రక్షించుదాత! యని యందఱును భీతిచే దిగి యిండ్లలో దూరి నిశ్శబ్దముగ నుండి వచ్చెడివారిని గూర్చి లోపల తమవారికిఁ జెప్పిరి ఆ యువకులు గృహములలో దాఁగి సుమారు పదునైదు నిముసములయ్యెనో లేదో కాని పురవీధులలో కోబలీ! కోబలీ! ★ యను శబ్దములు విననయ్యెను ఆ భీకరారవముల విని తల్లికడ నుండు పసిబిడ్డలు క్యావ్ మని నోకెపెట్టున రోదనము గావించిరి ఆ శబ్దము బయటికి వినఁబడు నేమోయని తల్లి వెంటనే బిడ్డనోటికి స్తనము నందిచ్చి తొడ నల్లాడించుచుండెను అంతట ఎల్లలూరకుండ తక్కిన వారందఱు తమకే విపత్తు రాకున్న రంగనాయకులకు పొంగలి నర్పింతు మనియు ఆంజనేయులకు ఆకుపూజలఁగట్టింతు మనియు మ్రొక్కులిడుచుండ శూద్రులు తల్లీ! సుంకులమ్మా! నీకు గండదీప మెత్తెద ననియు జోడు గొఱ్ఱియల బలియిత్తు ననియు పెద్దమ్మకు పోతును విడతు ననియు మ్రొక్కులిడుకొనుచుండిరి

★ *పాలి చల్లునపుడును జాతరలలోను చివరకు ఆధునికములగు కొట్లాటలలోనూ కోబలీ! రణబలీ! అను శబ్దములను వాడుదురు*

కొంతసేపటి కా శబ్దము బొత్తిగ తగ్గక పోయినను కొంత దూరమున నఱచు చుండినట్లు వినఁబడు చుండెను గృహములోని వారికి కొంత గుండెల చప్పుడు తగ్గఁదొడగెను ఆ యోధు లందఱును కచేరి దరిఁజేరిరి వారి యఱపులను వారి భీకరారవములను చేతలలో మెఱయు ఖడ్గములను ఈటెలను పల్లకిలోనున్న వీర పురుషా గ్రేసరుని యాకారమును జూచిన తోడనే యెక్కడివా రక్కడ పలాయనులైరి రక్షక భటాధికారు లెక్కడి కేగిరో యెప్పుడా స్థలమును విడచిరో యెవరికిని తెలియ దాయెను సర్వాధికారియగు తహసీలుదారుఁడెచ్చట నుండెనోఁ అతనికే దెలియకుండ మనకెట్లుల దెలియును? అంతట వారు పల్లకిని దించిరి అందుండిన దీర్ఘకాయుఁడు దడాలున వెలుపలి కేతెంచి తన దీర్ఘకరవాలమును ఎడమవైపున నడుమునకుఁ దగిలించుకొని యెడమ చేతి డాలుతో కుడిచేత ఎస్తోలుతో కచేరీలో దుమికి లోపలి కేగెను అతని వెంట యోధు లందఱును కచేరిని చుట్టుకొనిరి ఆ వీరాగ్రేసరుఁడు కచేరి నంతయు వెదకి వాఁడెచ్చటి కేగెను? ఎంత వెదకినను కానరాకున్నాడు అని తల యూచుచు ననియెను దేవా! మేముకూడ వెదకితిమి గాని కచేరి యంతయు నిర్మానుష్యమై యున్న దని మిగిలినవారు నుడివిరి

అంతట నాభీకరాకారుఁడు బొక్కసము వంక బిరబిర పోవుచుండగా ఎవరక్కడ? యిచటికి రాకూడదు? అనుశబ్దము వినఁబడెను అతఁడటులనె నిలువఁబడి ఎవఁడవురా నీవు? ఇక్కడనున్నావు! అని ప్రశ్నించెను అందులకతఁడు ఎవరైన నీకేమి? నీవీ గదిలోనికి రాకు మనియెను ఆ యోధాగ్రేసరుఁడు ఓయీ నీ యుద్యోగమేమి? నీ జాతియేది? పేరుతోఁ గూడ చెప్పుము నే వెళ్లెద ననఁగా ఆ యువకుఁడు అయ్యా! నేనీ ధనాగారమునకు కావలియుండు వాఁడను కులమున బొందిలివాడను పేరు హరిసింగు అని చెప్పుచు ఇఁక మీదారినిబొండు అనియెను

యోధు ఓయీ! నీకు సర్కారు నుండి మాసమునకు వేతన మెంత వచ్చుచున్నది?

హరి వీరాగ్రేసరా! మీరెవరో తెలిసికొన వలెనని నాయంతరాత్మ ప్రేరేపించు చున్నది దయయుంచి మీ నామమును బేర్కొనెదరా?

యోధు నా పేరుతో నీకుఁబనిలేదు నా ప్రశ్నకు జవాబివ్వుము

హరి అయ్యా! నాకు నెలకు పదునైదు రూపాయల వేతన మిచ్చుచున్నారు

యోధు ఓరి ఎచ్చివాడా! పదునైదు రూపాయలేమి చాలును? ఈ ధనాగారము నా వశము కానున్నది నీ కిచ్చయొడమి నంత ధనమును మూటఁగట్టికొని

పాఱిపొమ్ము నాచే మృత్యుదేవతకు బలి యొనర్ప వలసిన వాఁడెచ్చటనొ దాఁగి యున్నాడు వానిని వెదుకవలసినపని యున్నది

హరి యోధాగ్రేసర చక్రవర్తీ! నాకు ధనాగారమును కాపాడుమని యుత్తరువిచ్చి యున్నారు దాని ననుసరించి నడుచుకొని తీరవలసి యున్నది నీ స్వాధీనము చేయుమని దొరతనమువారినుండి వ్రాత మూలకముగా నుత్తరవును దీసికొని రమ్ము నీ స్వాధీనము చేయుదును ఊరక నీ కర్పింపు మనిన నీ జన్మమున చేయఁజాలను

యోధు నీవు నా స్వాధీనము చేయనక్కఱలేదు నేనే చేసికొనగలను నీవు కోరినంత ధనమును తీసికొని పాఱిపొమ్ము ఏల యూరక మృతినొందెదవు?

హరి అయ్యా! నీవు ధీరమానసు వయ్యు పిఱికి వానికిఁజెప్పు మాటలను జెప్పు చున్నావు నీ ధైర్యము నాకు బాగుగఁ దెలిసినది పోలీసు అధికారులును తహశీలుదారును పరుగిడినటుల నన్ను పరుగిడమనెదవా? అట్లొనరించిన నే రాజద్రోహిని కానా?

యోధు ఓరీ! పై యధికారులకే లేని రాజభక్తి నీకెందులకు? నా మాట వినుము చెడిపోకుము

హరి వారు ప్రాణములపై తీపిచేఁ బరుగిడిరి నే నట్టివాడను గాను ప్రభుత్వము వారి యుప్పు దినుచున్నాను వారి యాజ్ఞమీఱఁజాలను

యోధు హరిసింగ్! నిజముగ నీ మేలుఁగోరి చెప్పుచున్నాడను అభము శుభము లెఱుంగని వాడవు నిన్ను వధించుటకు చేతులాడవు పారిపొమ్ము ప్రాణ సంరక్షణముఁ జేసికొని నీ తల్లిదండ్రులకు సేవచేయుచుండుము

హరి అయ్యా! మీ రేమైన ననుఁడు నేనిందుండి పరుగిడఁజాలను

యోధు ఓరీ! యెంత వినయముగఁ జెప్పినను వినవా? ఇదే నీ ప్రాణములఁ గాచుకొమ్ము!

హరి ఓరీ! కానిమ్ము నీ ప్రాణములఁ దీయక విడుచువాఁడ ననుకొంటివా? యని యొఱనుండి కత్తిదూసెను

యోధు ఓరీ చచ్చితివి! అని తన పిస్తోలును వాని వక్షమునకు గురిపెట్టెను పెట్టిన వెంటనే ఢాంమ్ ఢాంమ్ అని రెండు శబ్దములు వినవాయెను ఆ యువకుఁడు హరి హరీ! యని నేల కొరిగెను

## రెండవ ప్రకరణము:

# చాకల వీథిన హత్య

అంతట నా వీరాగ్రేసరుఁడు తన యాప్తులలో నొకని చేరఁబిలచి యా మృత్యు కళేబరమును జాగ్రత్త చేయుమనఁగా చిత్తగించి యతఁడచ్చటనే కావలి యుండెను. కొందఱిని తాము చూచిన కాగితములను పుస్తకములను నొకచోట ప్రోగు చేయుఁడనఁగా చిన్న చిన్న ముక్కలను సహితముఁ బోకుండఁ దెచ్చి యొక చోటఁ జేర్చిరి. అంత కచేరిలో నుండిన మట్టి తైలపు డబ్బాను కాగితములపైఁ జల్లి నిప్పంటించిరి. లోపల నుండు వస్తువుల నన్నింటిని బగుల గొట్టి యగ్నిహోత్రుని కాహుతిఁ గావించిరి. అగ్నిజ్వాల లెగయుచుండ వీరి కేకలను సంతోషమును గూర్చి యెట్లుండునో మీరే యోచించుకొనుఁడు.

మఱల వారంద ఱొక చోటఁ జేరిరి. ఆ వీరుఁడు మాత్రము భీకరాకారుఁడై హిరణ్య కశ్యపుని బరిమార్చిన నరసింహమూర్తిని బోలి తనంతకు దానె తలయూచుచు నూరివంక చేయాడించి మేనాలోఁ గూర్చుండి యుండెను. బోయలు మేనాను పురమధ్యమునకుఁ గొంపోయిరి. మొదటి యంగరక్షకుఁడు కొందఱి యనుచరులతో బొక్కసమునందుండు ద్రవ్యమును మోయించుకొని మరికొంద ఱూరక వచ్చుచున్నను వారికియ్యక తానొక పెట్టెను మోసికొని వచ్చుచుండెను, ఎవ్వరైన తమచేతి కిమ్మనిన నీయకుండెను. అటుల వారు వీథివెంట కేకలు వేయుచు పరుగెత్తి వచ్చి రంగనాయకుల యాలయముఁజొచ్చిరి. అచ్చట నిర్మానుష్యమై యుండెను. అర్చకు లాలయము తలుపుల బంధించి భీతిచే లోపల దాఁగి యుండిరి. అపుడా యోధవర్యుఁడు వినయముతో ''స్వామీ! కవాటముఁ దీయుఁడు. మిమ్ముల నేనేమియుఁ జేయను. భగవంతుని దర్శించి హారతి గైకొని పోయెదను. అటులఁ జేయరేని దేవుని దర్శించ వలెనన్న నన్నిచ్చట ఆటంక పఱచు వారెవరును లేరు. తలుపులను బ్రద్దలు జేసి దేవుని దర్శించి మిమ్ముల బలిఁజేసెదను'' అని గంభీరముగ పల్కికిన, రంగనాయకులే తమ్ము కాపాడునని ధైర్యమూనినవారై తలుపులఁదీసిరి. ఆ ధీరోత్తముఁడు సాష్టాంగ దండ ప్రణామము గావించి హారతి యిమ్మనియెను. ఆ విప్రులు చెప్పవలసిన మంత్రములఁ జెప్పి హారతిగైకొనుమనిరి. అతఁడు హారతిగైకొనుటయే గాక తన రెండు కరములకు వచ్చినన్ని రూపాయల హారతి పళ్ళెరమునఁ బోయఁగా ఆ బ్రాహ్మణులు సంతోషిత స్వాంతులైరి.

పిమ్మట వా రాయాలయమును విడిచి పురవీధులఁ బ్రవేశించిరి తలుపు లన్నియు బంధింపఁబడి గృహములన్నియు నిశ్శబ్దముగానుండెను ఆ భీకరాకారుఁడు వా డెచ్చట దాఁగి యున్నాడో వెదకుఁడు అనెను తక్కినవారు వీధులంతటను మూల మూలకు వెళ్ళి వెదకుచుండిరి గాని ప్రయోజనము లేకపోయను అంతట వారు వీధులన్నిటి బాగుగ శోధించి చాకల వీధిని బ్రవేశించి పోవుచుండిరి సుమారప్పుడు మధ్యాహ్నము రెండు గంటలు మించెను అప్పుడా వీధిన ప్రోగు చేయన పత్తిపుల్లల మండె తనంతటఁ దానె చిన్నగ యెగిరి నట్లగుపడెను ఇది యేమి వింతయని ఆ యోధుఁడు కొంతసేపచ్చటనే నిలచి పరీక్షించుచు ఏమది! ఆశ్చర్యముగా నున్నది! వాయువు సహాతము వీచుట లేదు ఇది తనంతకు దానె యెగురు చున్నది అని యనుకొనుచు తన భృత్యులకు దానిని బరీక్షింపుఁడని యాజ్ఞ యొసఁగెను వారు వెంటనే దానిని చెల్లాచెదరు చేయఁగా అందుండి గడగడ వడకుచు ఒకానొక మనుష్యుఁడు దాఁగి యుండెను పాపమతఁడెంత భీతిల్లెవో కాని లేకున్న నా పత్తిపుల్లలమండె లోపల నుండిన యతనితో పాటు ఊఁగుట వింతవార్త కాదా! అచ్చట దాఁగి యున్న వ్యక్తి చేతుల జోడించి దీన భావముఁ జూపుచు నోట మాటరాక నిలిచి యుండగా నా వీరవర్యుఁడు తన కరవాలమున అతని తల వేఱుజేసెను మొదలు నఱికిని తరువుంబోలి యా మొండెము క్రిందికొరిగెను తన హాతుడుండ అతనికి కనుసన్న జేసి ముందు నడచు చుండ తక్కిన వారతనిని వెంబడించిరి మఱల నా గుంపు నుండి కోబలీ కోబలీ యను శబ్దములు మిన్నుముట్టుచుండె బోయలు పల్లకిని మోయుచుండ నా నరసింహుని మించు నా వీరపురుషుఁడు లోపలఁ గూర్చుండి యుండెను పల్లకి కిరు ప్రక్కలను తన ప్రియమిత్రులు అంగరక్షకులుగా నుండి చెఱియొక ప్రక్కన పెట్టెలను మోసికొని వెళ్ళుచుండిరి అక్కడి నుండి వారు యీశాన్య మూల నుండు త్రోవను బట్టి పోఁదొడఁగిరి కొంతదూరమేగువఱకె చీఁకటిపడెను ఎమ్మట యెచటికేగిరో తెలియదయ్యె

ఆ యోధాగ్రేసరుని ఫలానా వాఁడని నిర్ణయించుటకు మాకే సంశయముగా నుండ మా పాఠకుల సంశయమును దీర్చుటెట్లు?



## మూఁడవ ప్రకరణము

# నాటక శాల

వైశాఖ మాసము అందునను కృష్ణపక్షము దినాధిపతి పశ్చిమాంబుధిని మందగమనమున దాఁగిన తోడనె నిశామణి దర్శన మీయకఁ గొంత యాలస్యమొనరించి నందున నాఁడు విదియయై యుండువని నిర్ణయింపఁబడెను పురవాసులందఱు భోజనము చేయునప్పటికి జాబిల్లి రాకను దెల్పుచుండెనో యన తారకలు ఎక్కువ ప్రకాశముతో వెలుంగుచుండెను తాంబూలము వేసికొని జనులు వెలుపలికి వచ్చుటకు ప్రయత్ని చుచుండ నిక దడవొనరించిన తమ సేవకులచే చేతి లాంతరులను బట్టించుకొని పోదురనియుఁ అటు చేసిన తన కవమానము తటస్థించు ననియు శీతకరుఁడు తన సుందర వదనమును తటాలున గనపఱచిన మోహపరవశులై యున్న కులటాంగనలు తనను బ్రతుక నీయరను భయమున కాఁబోలు నవమాసములు నిండిన మందగమన మాడ్కి బయలు వెడలుచుండెను

ఆ వేళకు జనులు గుంపులు గుంపులుగ బయలుదేరి పోవుచు ఎన్ని గంటలైనదో తెలియదయ్యె ప్రారంభించి యుందురేమొ యని యొకరితో నొక రనుకొనుచుండినందున నాఁడేదైన నొక నాటక ప్రదర్శన ముండి యుండుననియు అందులకెల్లరును బోవుచుండిరనియుఁ దెలిసికొన వీలుగలిగెను వా రా నాటకశాలను సమీపించిరి దానిని శాశ్వతముగ నుండునటుల ఱాతి కట్టడముతోఁ గట్టక వెదురు బద్దలతో నల్లిన తడికల తోడఁ గప్పియుండిరి రంగస్థలము మాత్రము బోదగడ్డితోఁ గప్పఁబడి యుండెను అప్పుడపుడు వర్షమునకుఁ దడిసి చెడిపోవు చుండిన మరమ్మతు చేయించుచుండిరి ఆ నాటకశాల యుత్తర దక్షిణముగా నిర్మింపఁ బడియుండెను తూర్పున స్త్రీలు ప్రవేశించుటకును పశ్చిమమున పురుషులే తెంచుటకును రెండు ద్వారము లేర్పరుపఁబడి యుండెను దక్షిణపు దిశను సహితమొక చిన్న ద్వారముండి యుండెను కాని యది నాటకసమాజకులకై యేర్పరుపఁబడి యుండెను ఆ కాలమున దానిచుట్టు నుండిన కట్టడములను గుఱించి చెప్పుటకంటె ప్రస్తుతము మనకట్టెదుటఁ గనంబడు హర్మ్యముల యునికిని బొగడిన నా యూరిపేరు మా పాఠకులకు ప్రత్యేకముగ మేము చెప్పకుండగనె తెలిసికొనఁగలరు

ఇప్పుడా ప్రదేశమునకు బ్రాగ్దిశన కొంత దూరమున పురపారిశుద్ధ్య సంఘము వారిచే నేర్పరుపఁబడిన పాఠశాల యొకటి వెలయుచున్నది దక్షిణమున కలెక్టరు

కార్యస్థానము నిర్మింపబడి త్రోవనుఁ బోయెడి నూతన పురుషుల దృష్టులను తనవంక కీడ్చుకొనుచున్నది పశ్చిమమున మిక్కిలి బలమై పొడుగాటి కుడ్యముల గలిగిన కారాగారమును నగర రక్షకభటాధికారి కార్యనిర్వాహకుని కట్టడమును దాని సమీపమున అష్టదిశలను జూపునట్టి యెనిమిది నీటిగొట్టములఁ గలిగి వలయాకారముగనున్న ఱాతి కట్టడ మొకటియున్నది ఉత్తరమున నొక ప్రక్క మాత్రము ఇటుకచేఁ గట్టబడిన గృహములు కలిగిన రాజబాట యున్నది ఈ నూతన నిర్మితమగు కట్టడములు తక్క పూర్వికులచే నిర్మింపఁబడిన కట్టడ మొకటేనియుఁ గాన్పింపకున్నది పాఠకులారా! తొందరలో మఱచితిమి పురాతనపు ఱాతిపనివారిచే నిర్మింపఁబడి వారి నేర్పరి తనమును జాటుచున్న యొక బురుజున్నది ఆ బురుజు ప్రక్కనే మనము చూచెడి నాటక మందిరము నిర్మింపఁబడి యుండెను మా పాఠకమహాశయులప్పుడా పురనామము కడప యే యని పై నుదహరింపఁబడిన గుర్తుల వలన తెలిసికొని మాపైనున్న భారమును తగ్గింపఁ గలిగి యుందురు (ఈ కథ జరుగునాటికి కోవెలకుంట్ల తాలూకా కడప జిల్లాలోనిదే)

ఇప్పటివలె వీధికొక నాటక సమాజముండక యరుదుగ నున్నందున నిదే సమయమని ప్రేక్షకులు మెండుగనేతెంచుచుండ చోటు దొరకుట దుర్లభమై యుండె అప్పటికి సుమారు తొమ్మిది గంటలు కావచ్చెను నాటక ప్రదర్శకులు పేరుపొందిన వారైనందున చుట్టుప్రక్కల నుండు కుగ్రామవాసులు సహిత మేతెంచి యుండిరి వారు ప్రదర్శించు తారా శశాంక విజయము కన్నుల పండువుగా నుండుననియు నాఁడు సర్కారుద్యోగస్థులు గూడ వచ్చెదరనియు జనులనుకొనుచుండ తారాప్రియుఁడు తన చరిత్రము నాడుచున్నారను సంతసమున గాఁబోలు తన ప్రకాశమును ఎక్కువగ ప్రసరింపఁ జేయుచుండెను అంతలో జిల్లాయధికారి భార్యాసమేతుండై బండిలోఁ గూర్చుండి నాటకమును జూడవచ్చెను వారు కుర్చీలపైఁ గూర్చుండిన తోడనె తెరలో మొదటిగంట వాయించిరి

కడప తురకలు దుర్మార్గులనియు నాటక శాలయం దనేక దౌర్జన్యములఁ జేసి నాటకశాలపై ఱాలనురువ్వి యనేక విధముల నవమాన పఱతురను వదంతి సత్యమని యిప్పటి వారి చర్యలను బట్టి యూహింప నగును ఎందులకన పెద్దవారి గుణములు ఎన్నవారి కలవడుట సహజమే కదా! ఆనాటి సభ్యుల యదృష్టమేమోకాని నాటకము మాత్ర మేలాటి చిక్కులకు లోను గాకుండి ప్రారంభింపఁబడెను అంతలో జిల్లా రక్షక భటాధిపతి వచ్చెను అతఁడు వచ్చిన తోడనె కట్టెరును అతని పత్నియు

అతనితో కరస్పర్శనమును గావించి కూర్చుండ నియమించిరి అతఁడు నా దొరసాని ప్రక్కన గూర్చుండెను మొదటినుండియుఁ జూచుచున్న మిమ్ముల నడిగిన యామెను కల్టెక్టరు భార్య యందురేమో కాని వెనుక నేతెంచిన క్రొత్తవారి నడిగిన తగిన జవాబియ్యఁ జాలరనియే మా నమ్మకము ఆ దొరసానిని వర్ణించుట కొంతకష్టముగ నున్నది ఆమెను చంద్ర బింబమునకుఁ బోల్పఁ జూచితిమి కాని చంద్రునకుండు మచ్చ యామెకు లేక తెల్లగ నున్నందున క్రొత్త సున్నపు కుండకు (బోల్పవలసి వచ్చెను పాఠకులు మన్నింతురు గాక!

ఆమె పాదములకుఁగూడ తెల్లని బూడ్సులను వేసుకొని కంఠమునుండి మోకాళ్ళ వఱకు తెల్లని పావడ మాత్రము దొడగి కంటియద్దముల జోడును తలపై వెడల్పగు బుట్టటోపిని బెట్టికొని యుండెను అట్టివారు బజారునఁ బోవునపుడు సుడిగాలి వీచిన ప్రమాదము గదా! స్త్రీలకు మానమే కదా ప్రాణము! మానమునకై ప్రాణముల గోల్పోయిన యువతీ లలామ లుండ వీరు పెనుగాలి వీచిన పైకెగయు పావడ లేల గట్టుదురో తెలియకున్నదే! పాప మా దొరసాని స్త్రీల కేర్పరుపఁబడిన ప్రత్యేకస్థలమున గూర్చుండి యుండిన మనమీ విషయమై యింత చర్చించి యుండము కదా! అబ్బో! గొప్ప పొరపాటు పడితిమి దొరసానులు మన హిందూయువతుల దరికి రాకుండ నున్నప్పుడే వారి యలవాటులను గ్రహించుచున్నారు ఇఁక వారితోఁ గూడ దగ్గఱఁ గూర్చుండి యుండిన నెన్నడో మనవారు దొరసానులుగ మాఱియుందురు మనము కూడ వారి కొఱకై దొరలము కావలసి వచ్చి యుండునేమో యని చెప్పుటకు మాకు సిగ్గగుచున్నది

నాయనలారా! ఆ నాటకశాల యిపుడేమైనదని ప్రశ్నింపకుఁడు ఆ నాటక మందిరమును ఆ ప్రేక్షకులును ఇప్పటివారికి సరితూఁగునా? నగిషీ పని చేసిన యుడుపులును వింత వింతల పరదాలును గ్యాసు దీపములును అప్పటివారు కలనైన జూచిరో లేదో దొర టోపీల వారును చేతి బెత్తముల వారును నోటి చుట్టలవారును స్త్రీల కేర్పరుపబడిన ప్రత్యేకస్థలమున గూర్చుండ నియమించిన అర్ధాంగి యనుపించు కొనదని భార్యను ప్రక్కన గూర్చుండఁ బెట్టికొను పురుషులను ఆకాలమున నుండి యుండరు గడచిన యుగమున నొక యర్ధనారీశ్వరుఁడే యుండెను మన కలియుగముననో యర్ధనారీశ్వరులకు లెక్కయే లేదు ఇఁక జాఱుకొప్పులవారిని వ్రేలాడు జడలవారిని కంటిసుర్మాలవారిని సులోచనములవారిని జాకెట్ల జాణలను ఫేసు పౌడర్ల ప్రౌఢలను జపాను సిల్కు పైటల జవరాంద్రను చేతి గడియారముల

చపలాక్షులను పావడలఁ గట్టిన పడతులను స్లిప్పరు ధరించిన చిగురు బోడులను ఒక చేత పుస్తకమును మఱియొక చేత గొడుగును బట్టి కంటి సైగల చాలును చాలును నాయనలారా! వారి చర్యలను వ్రాయుటకు మాకు మనసొప్పకున్నది రామ! రామ! అంతటి నుండియైన నాటక శాలలో నిట్టివారిని జూడకుందుము గాక!

నాటకము మొదటి యంకము ముగియువఱకే పంద్రెండు గంటలు కావచ్చెను ఇంతలో ప్రవేశద్వారము కడ నొక రక్షకభటుఁ డేతెంచి టిక్కెట్లు వసూలు చేయునతనితో తనకు కలెక్టరుగారితో మాటలాడవలసిన పని యున్నదనియు తానా యూరికిప్పుడే వచ్చి యున్నందున తనయొద్ద టిక్కెట్టు లేదు గనుక తన్నాటంక పఱుపవద్దనియుఁ జెప్పెను అందులకతడుఁ సమ్మతించి కలెక్టరు పేరు చెప్పినందున నాటక శాలలోఁ బ్రవేశపెట్టెను అతఁడతి వేగముగ కలెక్టరును సమీపించి సలామొనరించి చేతికొక లకోటా నిచ్చెను కలెక్టరు సహిత మాలసింపక దానిని చింపి లోపలనుండు కాగితమును చదువుకొని ప్రక్కనున్న పోలీసు సూపరింటెండెంటునకు తన వెంట రమ్మని సన్న చేసి తన సహభాగినితోఁ గూడ చటాలున లేచి వెళ్ళెను జనులందఱు నివ్వెరపడి చూచుచుండ ముగ్గురును శకటము నెక్కి నిముసములో కలెక్టరు బంగళా చేరిరి పాఠకులారా! మనకింక నాటకముతోఁ బనిలేదు కలెక్టరుగారికి వచ్చిన కాగితమేమిటో కనుగొనుటకై మనముగూడ బంగళాకు త్వరితముగ వెళ్ళుదము లేకున్న వారు మాటాడుకొను మాటలను విను యదృష్టము లభించునో లభింపదో! వారేగి చాల తడవైయున్నది మనము కూడ వెళ్ళుదము

వారు బంగళా చేరిన తోడనె గృహమధ్యమున వేసియుండు బల్లదగ్గఱఁ గూర్చుండిరి ఆ బల్ల మీద దేదీప్యమానముగ నొకగాజు దీపము వెలుఁగు చుండెను కలెక్టరు జేబులో నుండు లకోటా యందలి కాగితమును దీసి సూపరింటెండెంటును వినుమని యిటుల చదువఁదొడఁగెను

మహారాజ రాజశ్రీ కడపజిల్లా కలెక్టరు దొరవారి సన్నిధికి

దేవరా!

నిన్నటి దినమున మాయూరి కెవ్వరో వచ్చి సర్కారువారి బొక్కసమును కొల్లగొట్టుటయే గాక ధనికులయిండ్లను దోచుకొని యనేకుల ప్రాణములఁ దీయుదురని వదంతి గలిగినందున మేము భీతిచే నుదయము మొదలు రాత్రివఱకు వేసిన తలుపులఁ దీసిన వారముకాము పగలు పంద్రెండు గంటల వేళ కొక కోలాహలము

వినఁబడియె మేము భీతిచే వెలుపలికి రానందున వారెవరైనది తెలుపఁజాలము మఱునాఁడు బయటికేతెంచితిమి కచ్చేరి ముంగిటను చాలక వీధినను రెండు తల వేఱుచేసిన కళేబరములున్నవి శిరస్సు లేనందున వారిని గుర్తింప వీలులేదు సర్కారుద్యోగస్థులెల్లరును పాఱిపోయిరి గ్రామమంతయు భీతిచే గడగడ వడఁకు చున్నది మీ రిచటి కేతెంచి హంతకులను శిక్షించిననే కాని లేకున్న బ్రతుకుట దుర్లభము ఆలస్యము చేయకుడు ఉన్న సంగతిఁ దెల్పినారము

ఇట్లు

కోవెలకుంట్ల — తమ సేవకుఁడు గ్రామమునసబు

కాగితమును చదివి సూపరింటెండెంటు వైపు చూచెను అతఁడు ఆశ్చర్యమును గనపఱచెను అంతట కలెక్టరు మిత్రమా! ఆ దోపిడిగాంద్రను హంతకులను మనము కనుగొనవలయును కదా! వారసంఖ్యాకులైన కష్టము కనుక ముందు కొందఱిని సిపాయులను పంపుఁడని పైవారికి వ్రాసెదను అంతవఱకు మన మిచట నూరకుండ రాదు తక్షణ మచటికేగవలయును అక్కడి చర్యలఁజూచి తర్వాత నీకు సహాయముగ నీ క్రింది యుద్యోగస్థులఁ దీసికొని వారినిఁ బట్టవలయునన సూపరింటెండెంటు మంచిదటులనె చేయుదము మన మాలస్యము చేయక అచ్చటి కేగి శవములు పడియుండిన చోటులఁ బరీక్షించి తర్వాత హంతకులను బట్టి కొందము ఇంకొక మాట మఱచితిని హంతకుల జాడఁ దెలిసి కొనవలెనన్న అచట ప్రఖ్యాతిం గాంచిన వారెవరైన నుండిన వారితో స్నేహముఁ జేసికొని మనకు సహాయముఁ జేయఁ బ్రార్థించుట మంచిదని తోఁచుచున్నదనఁగా కలెక్టరు నిజము బలికితివి పూర్వము నుండియు జమీందారులుగా నుండి కాలవశమున దానిని గోల్పోయిన నొసము చెంచుమల్ల జయరామారెడ్డి వంశీకుఁడగు నరసింహారెడ్డి యను నతఁడు ఉయ్యాల వాడలో నున్నాఁడు అతఁడు ధైర్యశాలియేగాక అక్కడి సంగతులన్నియు చక్కఁగఁ దెలిసికొన గలఁడు అతఁడు మన దొరతనము వారివలన తవర్జీని గైగొను చుండెను ఇటీవల తవర్జీని ఆపి వేసినటుల ప్రభుత్వము వారుత్తర్వును పంపయున్నారు అతఁడు మిక్కిలి ధనవంతుడైనందున తవర్జీ కాంచుచువాఁడు కాడు అతఁడు మనకు మిక్కిలి సహాయపడ గలఁడు ఆ సమీపముననే అవుకు సంస్థానమున్నది అతఁడొక సామంత ప్రభువు గౌరవనీయుఁడు అతఁడు కూడఁ దన యోపిన కొలఁది మనకు మేలుఁ జేయును ఇంకను పాళెగాంద్రు కొందఱున్నారు వారిని సహ విచారింతము నీవు ప్రయాణామై ఉదయముననే రమ్ము అని చెప్ప సూపరింటెండెంటు సరియని వెళ్ళెను

## నాల్గవ ప్రకరణము

# పూర్వ చరిత్ర

పదమూడవ శతాబ్దమున ఓరుగల్లును గణపతిదేవ మహారాజు పాలించు చుండెను ఈ పట్టణమునే కొందఱు ఏకశిలానగరమని యిపుడు ఎలచుచున్నారు కడప మండలమున సహితమొక యేకశిలానగరమున్నది దీని నిపుడు ఒంటిమెట్టయని ఎలుచుట వాడుకయై యున్నది ఈ పుణ్యస్థలముననె తొల్లి బమ్మెర పోతనామాత్యుఁడు మహాప్రబంధమగు శ్రీమదాంధ్ర భాగవతమును రచించి శ్రీ కోదండ రామస్వామి కర్పితముఁ జేసెను గణపతి మహారాజు పాలించినది కడప మండలమున నుండు ఒంటి మెట్టయను నామమునఁ బరంగు ఏకశిలానగరమును గాదనియు ఓరుగల్లను ఏకశిలా నగరము ననియు పాఠకులు తెలసికొనవలయును

గణపతిదేవ మహారాజు ఓరుగల్లును పాలించి పుత్రసంతతి లేక మరణించి నందున ఆయన భార్య రుద్రమదేవి సింహాసనము నధిష్ఠించెను ఈమె తన ప్రజల వలన మిగులఁ బ్రేమింపఁ బడుచుండెనని మొర్కొపోలో యను ఇటలీ ప్రయాణీకుఁడు వ్రాసియున్నాడు ఈమె యిరువది యెనిమిది వత్సరములు రాజ్యపాలన మొనరించి కుమార్తె పుత్రుఁడగు ప్రతాప వీరరుద్ర మహాదేవు నకు రాజ్యభారము నొసఁగి స్వర్గము నందున్న తన భర్తను జేరెను ఈయననే ప్రతాప రుద్రుఁడని కూడ ఎలుచుచుండిరి ఇతఁడు చక్కఁగ రాజ్యపాలన మొనరించి ప్రజాహితుఁడై గొప్ప ఖ్యాతి వహించెను ఢిల్లీ పాదుషాయగు టోగ్లాకు చక్రవర్తి దీనిని సహింపఁజాలక దండెత్తి వచ్చి 1329వ సంవత్సరమున రణరంగమున నతని నోడించి కారాగారబద్ధునిఁ జేసి ఢిల్లీ పట్టణమునకుఁ గొంపోయెను ఈ చరిత్ర నింతటితో నాపి మనకథకు సంబంధించిన చరిత్రకుఁ బోదము

ప్రతాపరుద్రుని ఢిల్లీకిఁ దీసికొని వెళ్ళిన పిమ్మట అతని ధనాగారమును కురువంశమున జనించిన హరిహర రాయలు బుక్కరాయలు అనువారు కాపాడు చుండిరనియు వారిని గూడ బంధితులఁ జేసి తీసికొని పోగా సుల్తానేలనో వారిని క్షమించి కర్నాటక రాజ్యమున కొన్ని భూములను కొంతసైన్యమునిచ్చి పొమ్మనగా వారటులనే వచ్చి ఆనెగొందిలో రాజ్యముఁజేసి తరువాత సమీపముననుండు అరణ్యములలో వేఁటకేగి విద్యారణ్య స్వాములవారిని దర్శించి వారి యాజ్ఞాను

సారము ఆనెగొందికి కొంత దూరమున విద్యానగర మను పేర శాలివాహనశక 1258 సంవత్సరమునకు సరియగు ధాత సంవత్సర వైశాఖశుక్లపంచమి నాఁడొక పట్టణమును స్థాపించిరి ఈ విద్యానగరమునె మనమిపుడు విజయనగర మని పిలుచు చున్నాము హరిహర బుక్కరాయలు దండయాత్రవెడలి నపుడు గండికోట మొదలు కంభము వరకు నుండిన ప్రదేశముల నన్నింటిని తమ స్వాధీనము జేసికొని సామంత ప్రభువుల నియమించి వారిచేఁ గప్పములఁ గొనుచుండిరి ముండ్లపాడు గ్రిద్దలూరు నొసము మొదలగు ప్రదేశములకు చెంచుమల్ల యను వంశము వారిని నియమించి యుండిరి

పదునైదవ శతాబ్దమున హరిహర బుక్కరాయల వారిచే నిర్మింపఁబడి శూరా గ్రేసరులకు పుట్టినిల్లయి తురుష్క చక్రవర్తులకు ప్రక్కలోని బల్లెమై విద్యాసంపదల యందు ప్రపంచమున నీడులేనిదై అష్టదిగ్గజములని పేరొందిన అల్లసాని పెద్దన ముక్కు తిమ్మన మాదయగారి మల్లన అయ్యలరాజు రామభద్రుడు ధూర్జటి పింగళి సూరన రామరాజ భూషణుఁడు తెనాలి రామకృష్ణ కవులను తన యాస్థానమందు కలిగి ఆంధ్ర భోజుడని ప్రఖ్యాతి వహించిన శ్రీ కృష్ణదేవరాయల వారిచే పాలింపఁబడి పశ్చిమ ఖండపు వారిచేతను పూర్వఖండ వాసుల చేతను వేనోళ్ళఁ బొగడ్తగాంచి మూఁడు శతాబ్దములు దేదీప్యమానముగ వెలుగొంది కడకు తురకల పాలఁబడి శిథిలమైన విజయనగరమును గాంచిన నెంతటి వజ్రహృదయుఁడైనను గంటఁ దడిఁబెట్టక మానునా? నిక్కపు భారతీయుఁడు కన్నులార జూచి సహించునా? ఎప్పుడు విజయనగర సామ్రాజ్యము తురకల పాలాయెనో వారి సామంత ప్రభువులు సహితము వారికి లోబడక తప్పదాయెను మనకధకు సంబంధించిన ముండ్లపాడు గ్రిద్దలూరు మొదలగు ప్రదేశములు హైదరాబాదు నవాబగు కుతుబ్ షాహీకి లోఁబడెను

అతడు 1709వ సంవత్సరమున గ్రిద్దలూరు పాలకులుగా నుండిన గోపాలరెడ్డి కృష్ణారెడ్డి గారివి కొన్ని గ్రామములను తాను స్వాధీన పఱచుకొని మఱల వారు దాదాఖానుకు సహాయముఁ జేసిరని తెలసికొని వారి గ్రామముల వారికిచ్చి వారిచే ప్రతి సంవత్సరము 12229 పగోడాలను కప్పముగా గొనుచుండెను తర్వాత వారిద్దరు పుత్ర సంతతి లేకనె గతించిరి 1749వ సంవత్సరమున వారివంశమునకు సంబంధించిన రంగారెడ్డి వచ్చి ముండ్లపాడు గ్రిద్దలూరు సమీపమున నొక కోటఁగట్టి క్రొత్తకోట యని పేరుఁబెట్టెను అతని తర్వాత అతని పుత్రుడు రామారెడ్డి యను

నతఁడు 1763వ సంవత్సరమున జమీందారాయెను రామారెడ్డి దివానుగా నుండిన కేశవరెడ్డి కొన్ని యితర గ్రామములను పట్టుకొనఁ బ్రయత్నింపగా కడప నవాబగు హలీఖాను వచ్చి కేశవరెడ్డిని ఖైదీగాఁ దీసికొనిపోయి సిద్ధవటము జైలులో వేసి రామారెడ్డిని జమీందారు పదవినుండి తొలగించి నొసం తాలూకు మాత్రము అతని కుమారుఁడగు రంగారెడ్డి కొసఁగెను

అటుఎమ్మటు 1779వ సంవత్సరమున రంగారెడ్డి అన్న కుమారుఁడగు జయరామారెడ్డి ముండ్లపాడు గ్రిద్దలూరు వద్దనొక రాణా నేర్పరచుకొని గుత్తినుండి హైదరుచే పంపబడిన నెతడ్ఖానుచే యుద్ధము చేసి పాఱిపోయెను 1782వ సంవత్సరమున డిశంబరు నెలలో హైదరు మృతినొందినపుడు కంభం మొదలగు ప్రదేశములు ఆంగ్లేయుల స్వాధీన మయ్యెను అప్పుడు జయరామారెడ్డి వంశమువారు క్రొత్తకోట జేరి తమదనిరి కాని టిప్పూసుల్తాను సేనాధిపతి యగు ఉమరుద్దీన్‌ఖాన్ క్రొత్తకోటను స్వాధీన పఱుచుకొని వెళ్ళెను అప్పుడు 1792వ సంవత్సరమున సంధి జరిగినపుడు చలిచలమల చిదంబరమను నతఁడు వచ్చి క్రొత్తకోట మొదలగు స్థలములను వశపఱుచుకొనెను అతని తర్వాత జయరామారెడ్డియు అతని పుత్రుఁడు నరసింహారెడ్డియు జమీందారులుగా నుండిరి గాని నరసింహారెడ్డి పైకము చక్కగ చెల్లింపనందున క్యాంబెల్ అను నతడు 1800 సంవత్సరములో గుత్తికి ఖైదీగాఁ దీసికొని వెళ్ళెను అప్పటినుండి ఆ సంతతివారికి ప్రతిమాసమునకు తవర్జీని మాత్రమిచ్చు చుండిరి ఆ తవర్జీ 1847వ సంవత్సరము వఱకు నెలకు పదునొకండు రూపాయల వంతున నుయ్యాలవాడలో నున్న జయరామారెడ్డి మనమఁడగు నరసింహారెడ్డి కిచ్చు చుండిరి వెనుకటి ప్రకరణమున కడప కల్లెక్టరు పోలీసు సూపరింటెండెంటు మాటాడు కొనినది యితని సహాయముఁ గోరుటకేనని మా పాఠకులు తెలిసి కొందురు గాక!

మొదటి నుండియు వీరి చారిత్రమును వ్రాసి విసుగుజనింపఁ జేసితిమని పాఠకమహాశయు లనుకొని యుండవచ్చును ఈ వంశీకులు మా జన్మస్థలమునకు మిక్కిలి సమీపమున నుండి యున్నందున మాకుఁ దెలిసిన దానిని విపులముగ వ్రాయక పోయిన ద్రోహము గావించిన వారమగుదుమేమోయను భీతిచే వ్రాయక తప్పనది కాదు



## అయిదవ ప్రకరణము

# సహాయము గోరుట

కడప నుండి కలెక్టరు సూపరింటెండెంటుతోఁ గూడ ప్రయాణ సన్నాహుఁడై బయలుదేరు నప్పటికే సుమారుదయము పదిగంటలైనందున సాయంకాలమగు తఱికి ముత్యాలపాడును జేరి వారి రాక నచటనున్న పాళెగాని కెఱింగించిరి అతఁడు వారిని మిగుల గౌరవించి భోజన సదుపాయముల జరపెను కలెక్ట రతనిని కోవెలకుంట్ల దోఁపిడిని గూర్చి ప్రశ్నించెను గాని ఆ పాళెగాడు తనకేదియుఁ దెలియదనియు తానుఁగూడ అపరాధులకై తగిన ప్రయత్నముఁ జేయుచున్నాననియుఁ జెప్పగా మంచిదని ఆ రాత్రి నిలువక చంద్రోదయమైన తోడనే బయలుదేరి కోవెలకుంట్ల నుదయమూరు గంటలకుఁ జేరిరి వారు వెంటనే కచేరికి వెళ్ళి అచట బడియున్న మొండెమును గనిరి కొంతసేపా శవమును పరీక్షించి కలెక్టరు సూపరింటెండెంటుతో నిట్లనెను

కలెక్టరు మిత్రమా! చూచితివా అందఱివలెఁ బరుగెత్తి పోక చోరులతోఁ బోరి వారిచే సంహరింపబడి యున్నాఁడు ఇతని దేహము నందలి యవయవములఁ జూడ నిరువది వత్సరములకంటె నెక్కువ లేని యువకుని వలెఁ గాన్పించుచున్నాఁడు ఆహా! ఇతఁడెవరో గుర్తించుటకు శిరము లేకపోయెనే! ఇట్టి ధైర్యోత్తముని గన్న తల్లిదండ్రులీతని జూచిన బ్రతుకఁగలరా?

సూప అవును ఇతడు ధైర్యముతోఁ బోరఁ బ్రయత్నించెనని యీతని కరము నందుండెడి ఖడ్గమే చాటుచున్నది ఇతఁడు సామాన్యుల చేతిలోఁ జచ్చి యుండడు ఇతనిని బరిమార్చినవాఁడు ప్రఖ్యాతి గాంచినవాఁడై యుండవలెను ఇతఁడు ఖడ్గముచేఁ జచ్చినవాఁడు కాడు

కలెక్టరు అదెటులఁ దెలిసికొంటివి?

సూప అతని చొక్కాయని దీసి చూడుము ఎవరో పిస్తోలుతోఁ గాల్చియున్నారు ఇతనిఁ జంపిన దీ ప్రదేశమున గాదు చచ్చిన చోటు వేఱు కళేబరమును నిచ్చటికిఁదెచ్చి యితరులు గుర్తింపకుండుటకై శిరస్సును ఖండించి తీసికొని వెళ్ళియున్నారు

కలెక్టరు అయిన నీ దారుణ కృత్యము జరిగిన చోటుఁ గనుగొందము రమ్ము

అని వెదకుచు బొక్కసమున కేతెంచి చూడఁగా గదియంతయు రక్తమయమై గోడలకు గొట్టములతోఁ జిమ్మినట్లు రక్తబిందువులు నిండి యుండెను గదియంతయు

ఈఁగలమయమై అడుగిడుటకే అసహ్యముగ నుండెను అప్పుడు వారు విధిలేక లోపలి కేగి పరీక్షించి వృత్తినొందిన యువకుఁడు తప్పక బొక్కసమునకుఁ గావలి యుండువాఁడని యెంచి పేరుఁ దెలిసికొన వలయునని రికార్డు గదికేగ యందొక చింఎరి కాగితము గూడ లేకుండెను ఇదేమి విపరీతమని కచేరి వెనుక భాగమునఁ జూడ కాగితములన్నియు బూడిద రూపమును గైకొని యుండెను సూపరింటెండెంటు కల్లెక్టరును పిలిచికొని మఱల శవమును బరీక్షింపదొడంగెను ఎంత పరీక్షించినను ప్రయోజనము లేదయ్యెను తర్వాత తమవెంట వచ్చిన రక్షకభటు నొకని నచటఁ గాపుంచి తక్కిన భటులతోఁగూడ చాకలి వీధికేగిరి అచటఁ గూడ నొక తలతెగిన పీనుగు పడియుండెను సూపరింటెండెంటు చూచి ఇతని తల ఖడ్గముచే ఖండింపబడినది అయినను తలలేనిది వీరిని ఫలానావారని నిర్ణయింప వీలుపడదు మనుష్యుల రూపు దొరకిన యీ హత్యలకు కారణ మారయఁగలము కనుక ముందు రెండు శిరస్సులను కనిపెట్టవలయును ఈ పురవాసుల నడిగి తెలసికొందమన్న నొక్కరును లేక తమబంధువుల దగ్గఱికి పాఱిపోయి యున్నారు అనగా కల్లెక్టరు ముందు మనము శిరముల గనుగొనవలెను అంతవఱకీ కళేబరములను చెడకుండ జాగ్రత్త పెట్టవలెను కనుక తక్షణమే బండిపై వేసి కడప యౌషధశాలకుఁ బంపు నటుల నేర్పాటు గావించెదను అని యొక భటునిచే బండిలో రెండుశవములను వేసికొని కడపకుఁ గొనిపొమ్మని వారు శిరాన్వేషణమునకుఁదగిన సహాయము జేయు వారికై యోచించి కడకు ఉయ్యాలవాడలో నున్న నరసింహారెడ్డి దగ్గఱకు పోఁదలచి వారి రాక నెఱిఁగించుటకై ముందొక భటుని బంపిరి

నరసింహారెడ్డి కడకు భటుడేగి కల్లెక్టరు మొదలగువారి రాక నెఱిఁగించిన తోడనే యిరువుర రప్పించి చెఱియొక లేఖనిచ్చి వారికి కొన్ని సంగతులను చెవిలో జెప్పుగా చిత్తమని వారేగిరి అతఁడంతట మంగళ వాద్యములతోడను డప్పులతోడను ఎదురేగి కలెక్టరును తక్కిన వారిని పురప్రవేశము గావించి ముందుగనే వారికొఱకేర్పరుపఁ బడిన చావడిలోఁ బ్రవేశ పెట్టెను ఆ దొరలకు కోడిపెట్టలను గ్రుడ్లను సారాబుడ్లను వలసినన్ని బంపు చుండినందున వారు మిక్కిలి సంతసించి రెడ్డిగారిని మిగులఁ గొనియాడి దినమంతయు ముచ్చటలాడుచునే కాలము గడపిరి

ఆ రాత్రి భోజనా నంతరమున వారు రెడ్డిగారితో మాటాడుచు కల్లెక్టరిట్లనెను నరసింహారెడ్డి! నిన్ను జూచిన చాల సంతసమగుచున్నది నీయట్టివారీ ప్రభుత్వమున నుండబట్టి కదా అల్లరులు జరుగకుండ నుండుట పాపము ఇపుడు పూర్వకాలము నుండి యిచ్చు చుండిన తవర్జి నాపివేసిరి నాశక్తి కొలఁది పోరాడి తవర్జీని మఱల

నికిప్పించుటకుఁ బ్రయత్నించెద అందులకే దొరతనము వారికి బుద్ధి వచ్చునటుల కోవెలకుంట్లనెవరో మొదలంటనాశన మొనరించిరి వారిని పట్టుభారము మా తలపైఁ బడినది అందు నిమిత్తమై నీ సహాయమును గోరి యిట కేతెంచితి మనుచుండ నరసింహారెడ్డి సర్కారు వారికి నేనేలాటి యపరాధ మొనరించి యుండలేదు నా తవర్జీ నేల నిలిపిరో తెలియకున్నది నా యదృష్టము బాగుండిన మీబోటివారి సహాయము వలన నా తవర్జీ నాకు రావచ్చును కోవెలకుంట్లను కొల్లఁగొట్టిన సంగతి నాకుఁ గూడ మిగుల భీతిఁగొల్పుచున్నది సర్కారువారి నెదిరించిన ధీశాలురు మాబోంట్ల నిక నిదురఁ బోనిత్తురా? అంతటి ధైర్యశాలు లెవరై యుందురా యని యోచించుచున్నాను గాని నాకదియు స్ఫురించకున్నది అయినను మనమెల్లరును గలసి దోషులను గనుఁగొన బ్రయత్నింతము నా యోపిన కొలఁది సహాయముఁ జేయఁ బ్రయత్నింతు ననఁగా సూపరింటెండెంటు అంతటి దౌర్జన్యముఁ జేయఁగల ధీశాలులెవరైన నుండిన వారిపేరులను బేర్కొనుము వారిని బట్టికొన్న నన్నియుఁ బయలుఁ బడు ననఁగా నరసింహారెడ్డి యించుక యోచించి దేవరా! ఇచట కొందఱు ప్రఖ్యాతి వహించిన మా కులపు రేనాఁటి రెడ్డి ప్రముఖులున్నారు గాని వారిట్టి కార్యములఁజేయ సాహసింపరు వారెంతసేపున్నను తమలో తాము పోట్లాడుట నా భూమిలో నొకశంటు నీ భూమిలో కలసినదని లేనిపోని కలహముల బెంచికొని తలల బ్రద్దల జేసికొని ధన వ్యయము చేసికొనట ఒకరియాస్తి నొకరికి రావలయునని లేని బంధుత్వమును గల్పించుకొని తప్పుడు పత్రముల సృష్టన గావించి నిదురించు వారి తలపై పెనుఱాలను వేసి హతము గావించుచు త్రోవన నొంటరిగా బోవుచున్న పదుగురు జేరి పొడిచి చంపుట విసమును బెట్టించుట మోసముచే పగతుని రప్పించి కుత్తుకను గోసివేయుట మూత దీసిన పాతరపై నల్లని మంచమును వేసి దానిపై కంబళము నొక దానిని వేసి పగతునికి స్నేహభావము జూపి కూర్చుండ నియమించి కూర్చున్నవెంటనె పాతరలో బడిన వానిపై మూతవేసి నిండు ప్రాణములను దీయుట కటకటా! వారి పాపపు కృత్యములఁ జెప్ప మనసు రాదు వారట్టి ధైర్యశాలులేగాని ఒకరితో నొకరు కలసి హోరాహోరిన బోరొనరించి రణరంగమున పగతుని గూల్చియో లేకగూలియో వీర స్వర్గము నలంకరించి కీర్తి దెచ్చువారు కారు కనుక వారిట్టి సాహస కృత్యమొనరించి యుందురనిన కలలోని వార్త వారటుల లేని కలహములఁ బెంచికొని యేల దుర్మరణము పాలుగావలయునో యెంత యోచించినను తోఁచుట లేదు వారైకమత్యము వహించి తమలోఁ దాము పోరుట ఎన్నఁడాపుదురో యానాఁడే మా దేశము మొదట ఔన్నత్యము వహించును గాని లేకున్న నింతకంటె హీనదశకు

రాకతప్పదు కనుక నింతటి నుండియైన మా రెడ్డి సోదరులు సంఘీభావము గలిగి సంఘ దేశ సేవలఁ జేయుదురు గాక!

అనునంతలో సూపరింటెండెంటు ప్రఖ్యాతిఁగాంచిన వారెవరును గాన్పించుట లేదా అనఁగా నిచటికిరువది మైళ్ళ దూరమున నొకు సంస్థానమున్నది అచట నంద్యాల నారాయణరాజుగారున్నారు వారు మిక్కిలి ధైర్యశాలురు విద్యానగరమను పేరఁ బరఁగు విజయనగరమును స్థాపించిన హరిహర బుక్కరాయల వంశీకులు వీరి పూర్వీకులు కృష్ణదేవరాయలు గజపతితోఁ బోరొనరించు నపుడు కదనమున సహాయము జేసి తమ సహజ ధైర్యమును జాటియున్నారు అట్టి వారు చేయవలసిన కార్యములు కాని మాబోటి వారిట్టి ధీరకార్యమునుఁ జేయ కలలోనైన నెంతురా? అయినను వారికిఁ గూడఁ బ్రస్తుతము కోవెలకుంట్లపై దాడివెడలు నంతటి బలములేదే! అనెను

పాఠక మహాశయులారా! అట్టి ప్రఖ్యాతిగాంచి కృష్ణదేవరాయలకుఁ జేయూత నొసంగిన ఔకు నంద్యాలవారి వంశమిపుడెట్టి దుస్థితిలో నున్నదో చూచితిరా? ప్రజలను తమ బిడ్డలవలెఁ గాపాడుచు శరణన్న పగతుల రక్షించుచు దేవ బ్రాహ్మణులకు భూముల నిచ్చుచు తమ యాస్థానమున కవి పుంగవుల సన్మానించుచు భాషాభివృద్ధికై పాటుపడిన శ్రీ నంద్యాలవంశము వారి కిట్టి స్థితి రాజెల్లనే? వీరి వంశము వారు కవులను పోషించి రనుటకు ఎంగళి సూరనామాత్యునిచే రచింపఁబడి శ్రీ నంద్యాల నరసింహ కృష్ణ భూపతికిఁ గృతి నొసంగఁ బడిన కళాపూర్ణోదయమే వేయివిధములఁ జాటుచుండ మేమేల మఱల వ్రాయవలయును? ఇప్పటికి సహితము దొరతనము వారిచే తవర్జీ సహాత మియ్యఁబడక నిరాకరింప బడినను తమ సహజ గౌరవమును ఉదారత్వమును బోనాడఁజాలకఁ దానెంత బీదస్థితిలో నున్నను అతిధులకుఁ బెట్టక తాను భుజింపనొల్లని శ్రీ నంద్యాల వీరరాఘవరాజుగారున్నారు వారి కష్టదశను మేమపుడపుడు చూచు చుందుముగాన నిచట వ్రాయబోవ మా లేఖిని కదలకపోయెను ప్రభుత్వము వారిపుడైన వారికిఁదగిన సహాయమొనరించి తమకీర్తిని స్థిరపఱచు కొందురుగాక!

నరసింహారెడ్డి నోట పైమాట వెడలిన తోడనే కల్లెక్టరు నిజము అతఁడేమైన నిందు పాల్గొని యుండును అతనిని గూడ పరీక్షించి యనుమానమున్న బంధితుని గావించి నాకడ కనుపు మని సూపరిండెంటు గారి కధికారమిచ్చి తాను రాచకార్యముల విచారింప వలయునని కడపకు ప్రయాణమై వెడలెను

ఆఱవ ప్రకరణము

# నిరపరాధులు

మఱునాఁడు సూపరింటెండెంటు జమ్మలమడుగులో నుండు డిప్యూటీ సూపరింటెండెంటునకును ప్రొద్దుటూరునందుండు సర్కిల్ యిన్‌స్పెక్టరునకును కొందఱి రక్షక భటులతోఁ గూడఁ దక్షిణము బయలుదేరి రావలయునని కబురంపెను వారుఁగూడ మఱునాఁడె తగినవారితోఁ గూడ సూపరింటెండెంటును గలిసికొనిరి సూపరింటెండెంటుగారి వలన వారు చేయవలసిన కర్తవ్యమును గుఱించి తెలిసికొని తమకీ కార్యమున చావు తప్పదనియు తామాచరించిన యధర్మముల ప్రతిఫల మిప్పు డనుభవింపక తీరదనియు బ్రహ్మవ్రాత కడ్డుగలదా యని సూపరింటెండెంటు ఆనతి ననుసరించి పోవుటకు సంసిద్ధులై యుండిరి

చోరుల పాలఁబడిన కోవెలకుంట్లకు పదునైదు మైళ్ళ దూరముననున్న ఔకు సంస్థానమును విజయనగర పాలకుల వలన ప్రాగ్దిశన గండికోట పశ్చిమమున గుత్తి ఉత్తరమున నంద్యాల దక్షిణమున తాడిపర్తి మొదలగు ప్రదేశములకు లోనగు భూమిని సర్వజాగీరుగ నొసంగబడినందున నచట నొక కోట నేర్పఱచుకొని నంద్యాల శ్రీ రామరాజాగారు పాలించుచుండిరి వీరు ఇరువది యేడు సంవత్సరములు రాజ్యముఁ జేసి 1430 సం॥ స్వర్గస్థులైరి శ్రీ రామరాజాగారికి నల్లతిమ్మరాజు ఎఱ్ఱతిమ్మరాజు తిరునాధరాజు అప్పలరాజు ఓబుళపతిరాజు అను నైదుగురు పుత్రులుండిరి శ్రీ రామరాజాగారి మరణానంతరము నల్లతిమ్మరాజు రాజ్యమునకు వచ్చెను ఇప్పుడు ఔకునకు దక్షిణముగా నుండు గొప్ప తటాకమును గట్టించినది నల్లతిమ్మరాజాగారే ఈ దానశీలుఁడే పూర్వము దేవబ్రాహ్మణులకు చెఱువు క్రింద భూముల దానమొసఁగిరి ఆ రాజు వలన భూములఁ బడసిన విప్రసంతతి వారే యిప్పుడా గ్రామమున ధనరాసులపైఁ గూర్చుండి బీదస్థితి యందున్న నల్లతిమ్మరాజు గారి సంతతి వాఁడగు శ్రీవీర రాఘవరాజాగారిని పలుకరింపనైన పలుకరింపకున్నారు కదా! ఆ బ్రాహ్మణుల నేమనవలయు? వీరి పెద్దలే యిప్పుడుండిన రాజుగారి దుస్థితిని జూచి మరల వారి భూముల వారికియ్యక పోయియుందురా? ఔరా! ఉదర ముబ్బునట్లు భుజించి యింటి సోపాతిన్నెలపైఁ గూర్చుండి చీట్లాడుచు సంతోషితస్వాంతులై పకపక నవ్వుచుందురే కాని జీర్ణించిన కోటలో కాపురముండు శ్రీ వీరరాఘవరాజాగారితో మాటాడనైన మాటాడకున్నారు గదా! సంస్కృతపారశాల చాకల గాడిదల పాలైయున్నదే!

వేదాధ్యయనమునకు మాఱు వేశ్యలగానాధ్యయనమే యెక్కువాయెనే! మంత్రముల నెన్నడో మఱచితిరే! త్రికాలములయందు పూర్తిగ సంధ్యావందన మాచరించక పోయినను కేశవా నారాయణా మాధవా యని మూడు సారులు ఉదకమునైనఁ బీల్చరే! ఉదకమునకు మాఱు ముప్రొద్దులను పొగచుట్టలఁ బీల్చుచున్నారులెండు తద్దినములఁ బెట్టించువారు తక్కువై కానరాకున్నారే! సమంత్రకంబుగ వివాహములఁ జేయించు విప్రుల దియ్యఁబెట్టి వెదకినను దొరకుటరుదె పండితాగ్రేసరుల కునికిపట్టగు ఔకు బ్రాహ్మణుల సంతతి యెంతటి ప్రఖ్యాతిబడసినది! అయ్యలారా! పూర్వపు భూసురుల పటిమను మెచ్చిగదా యారాజులు దానమొసంగిరి! మీరుఁగూడ అంతటి పేరుగలవారైనగదా వాటి ననుభవింప వలసినది! మఱల మీ పూర్వాచారముల నాచరణలోనికిఁదెండు మీ ధనధాన్యములు శాశ్వతము గావు మీ కంటె వేయిరెట్లు ధనధాన్యములఁ గలిగిన (శ్రీ)వీరరాఘవరాజుగారు కాలవశమున బీదదశయందుండ మీ దొక లెక్కయా? ఇంకను నిద్రావస్థలో నుండకుడు మేల్కొనుఁడు మేల్కొనుఁడు! చదువరులారా! మీరుఁగూడ నంద్యాల వంశమువారి దుస్థితికై వగచుచున్నారా? వగచిన నేమి చేయఁగలము? ఇఁక మన కథవంక మరలుఁడు

నల్లతిమ్మరాజు పిదప మఱికొందరు ఔకును పాలించు చుండిరి కాని మన చరిత్ర జరుగునాటికి సంవత్సరమునకు 27 000 రూపాయలఁ జెల్లించుచు నంద్యాల నారాయణరాజుగా రేలుచుండిరి ఈ సమయముననే వీరి జ్ఞాతి వర్గములోఁ జేరిన నంద్యాల వేంకటరామరాజుగారు తన తమ్ముని భార్యకు జబ్బుగా నున్నందున చూచి పోవుటకై చిట్టివేలు నుండి వచ్చియుండిరి రాక రాక విచ్చేసిన తన యన్నగారితో కొంతసేపు కులాసాగా మాటాడవలెనని మధ్యాహ్నము పండ్రెండు గంటల వేళ భోజనా నంతరము తాంబూలు వేసికొనుచు తమ నగరులో గుర్చీలపైఁ గూర్చుండి యిటు మాటాడఁ దొడఁగిరి

నారా — అన్నా! మీ కుటుంబము నందెల్లరును సుఖముగా జీవించుచున్నారు కదా?

వేంకట — ఉండినంతలో సుఖముగ జీవించుచున్నాము ప్రభుత్వము వారివలన నెలకు పదమూడు రూపాయలు తవర్జీ వచ్చుచున్నది ఆస్వల్ప మొత్తముతోను మఱికొన్ని భూముల సహాయము వల్లను జీవించుచున్నాము

నారా — తవర్జీ నెక్కువ చేయుఁడని ప్రభుత్వము వారిని కోరరాదా?

వేంకట — సోదరా! వారెక్కువ చేయవద్దుకాని యుండిన దానిని తగ్గించకుండిన మేలని నాకుఁ దోఁచుచున్నది

నారా అన్నా! మనవారి దుస్థితిఁ దలఁచు కొనిన నాకు దు ఖము కలుగును ఒకరిని పాలించు మనమిపుడొకరికి లోనై యుండవలసి వచ్చెను ఇఁక మీఁదట మనవంటి వారి కలియుగమున బ్రతుకుట కష్టము

వేంకట తమ్ముఁడా! నీవు మాతో సరిపోల్చు కొనుట సరికాదు నీవు మాకంటె నెన్నో విధముల మేలుకదా?

నారా అన్నా! కాలమీరీతిగనె యుండునా? ఈ ప్రభుత్వము వారిక్రింద నాలాగే పరిపాలనమును జేయు భాగ్యము నాకున్నదో లేదో!

వేంకట నీవేమి తప్పుఁ జేయలేదు కదా?

నారా నేనేయపరాధమును గావించి యుండలేదు ఇటీవల నెవరో కోవెలకుంట్ల ధనాగారమును కొల్లగొట్టి యున్నారట ఇపుడు సర్కారు వారు చోరులను బట్టుటకై వెదకుచున్నారు కాని వారెవరైన నేరము తమపైకి రాకుండఁ జేసికొనుటకు మనపై బెట్టిన మనమేమి చేయఁగలము?

వేంకట అంతటి యన్యాయమునకు సర్కారువారు పాల్పడుదురా? న్యాయా న్యాయములను బరిశీలింపరా? అటులఁ జేయుటకు మహమ్మదీయ పాలనము గాదుకదా?

నారా ఏమి చెప్పుటకును వీలులేదు నేడుదయము నుండి దుశ్శకునము లగుచున్నవి

అనునంతలో దుశ్శకునముల ఫల మనుభవింపు మని రక్షకభటులును వారిపై యధికారులును వచ్చి వారిని బంధించిరి

నారా అయ్యా! మే మేమి చేసినారము? మా హస్తముల కేల గొలుసులను తగిలించిరి? మీరెవరు?

సూప నేను పోలీసు సూపరింటెండెంటును వీరిద్దరు నా క్రింది యుద్యోగస్థులు ఇతఁడు జమ్మలమడుగు నందుండు డిప్యూటీ సూపరింటెండెంటు అతఁడు ప్రొద్దుటూరు సర్కిల్ యిన్‌స్పెక్టరు కోవెలకుంట్ల దోపిడీకి మీరే కారణమై యుందురని మిమ్ములఁబట్టితిమి

వేంకట అయ్యా! నేను చిట్టివేలినుండి నేఁడే యీ నా తమ్మునిఁ జూచుటకు వచ్చి యున్నాను మేము నిరపరాధులము నిరపరాధుల బంధించుట న్యాయేతరము

సర్కిల్ అవును బహు న్యాయశీలుఁడవు నీవు దోపిడీ చేయుటలో నీ తమ్మునికి సహాయముఁ జేయుటకై చిట్టివేలునుండి వచ్చియుందువు మిమ్ముల విడువఁజాలము

నారా మీరు పోలీసు ఉద్యోగస్థులైన నగుదురుగాక! మమ్మ బంధితులఁ గావించి నంతటనే మేము భయపడు వారముగాము మేము నిర్దోషులమని యిఁక ముందు మీకే తెలియఁ గలదు మాకు శిక్ష విధింపఁజాలరు మీరు నిజమగు దోషులను కనుగొనఁన లేనందులకై చాలఁ జింతిల్లుచున్నాను మీకీ యున్నత పదవి యెటు లొసఁగిరో నాకు వింతగ నున్నయది ఈ ప్రభుత్వమున నిట్టి యన్యాయమున కొడిగట్టు నధికారులున్నారని నేడుగదా తెలసికొంటిమి! మా బోఁటి నిరపరాధుల నింకెందఱిని బాధించు చున్నారో కదా! మీ నడవడికలు ప్రభుత్వము వారికిఁ దెలిసిన మిమ్ముల వెంటనే పదభ్రష్టులఁ గావింపక విడతురా?

సర్కిల్ ఓరీ! ఏల ప్రల్లనము లాడెదవు? నీ పండ్లూడగొట్టెదను చూడుము!

నారా (కోపముతో) ఓరీ! నన్నెవ్వరుగా భావించితివి? మమ్మింతకంటె యవమాన పఱుపఁజాలవు మేమిక బ్రతుకుట కంటె మరణము నొందుట శ్రేయస్కరము నిరపరాధులమయ్యు అపరాధుల మని యనిపించు కొని మరణించిన నిఁక ముందు మావారికిఁ గూడ నవమానకరముగా నుండును మా నిర్దోషత్వము బయలు పడిన నీ తల నెందు దాచికొనెదవో నేఁ జూడకుందునా? సామాన్య జనులపై లేని నేరములఁ గల్పించి ద్రవ్యమును లాగినటుల మా యొద్ద జేయఁ జూచెదవా? నీ బెదరింపుల కదరెద మనుకొంటివా? నీ ధైర్యసాహసములు మాకుఁ దెలియని వనుకొంటివా? నన్నపరాధి యని దూషింతువా? నీ యట్టి దోషుల నేనెందరిని శిక్షించి యుందునో కదా? ఇది మా కాలము కాదు కానిమ్ము నన్నుఁ దీసికొని పోవుటయేఁ గాక బంధువునివలె వచ్చిన నా సోదరుని గూడ దోషిని గావించితిరి మమ్మురి దీయుంచుట కంటె నెక్కువఁ జేయఁజాలరుగదా! మీ యిచ్చ వచ్చినటులఁ జేయుఁడనెను

అందులకు సర్కిల్ యిన్స్పెక్ట రాతనినిఁ గోపమునఁ గొట్టబోయి పై యధికారికి వెఱచి యూరకుండెను అంతట సూపరింటెండెంటు

అయ్యా! మిమ్ముల నిర్దోషులని కలెక్టరు విడచిన మా యభ్యంతర

మేమియు లేదు అవశ్యమురండు అని రక్షకభటులకు వారిరువురిని బండిలోఁ గూర్చుండఁ బెట్టికొని కడప కేగవునఁగా వారటులనే గొంపోయిరి

ఎమ్మట సూపరింటెండెంటు తక్కిన వారితో మిత్రులారా! వీరు దోషులని స్థిరపరచుటకు హేతువు గానరాదు నిర్దోషులనియే నాకుఁ దోఁచినది కాని కాదని ధైర్యముగఁ జెప్పజాలకున్నాను అయినను మన మూరకుండరాదు అపరాధులకై యింకను వెదుక వలసి యున్నది అదియుఁగాక కలెక్టరు శవముల యొక్క రెండు తలలను గనిపెట్టుమని యానతిచ్చి యున్నాడు అదియుఁగూడ మన తలపై నున్నది కనుక మీరా తలలను వెదకి తేవలయును ఇప్పుడు దోషులుగా నెన్నఁబడిన వారు నిర్దోషులని నా యంతరాత్మ ప్రేరేపించుచున్నది దోషవేత్తైయుండును మీరు మొదట శిరములను గనిపెట్టి తీరవలయును తర్వాత అపరాధి తనంతట తానే బయటఁ బడును అనగా శిరాన్వేషణమునకు ప్రచ్ఛన్న వేషములతోఁ బోదమనియు రెండు దినముల కొకసారి యిద్దఱొకచోటఁ గలియవలె ననుకొని వెళ్ళిరి



## ఏడవ ప్రకరణము

# బాటసారి

దత్త మండలమున వైశాఖ మాసమున నుండు నట్టి యెండ మఱియొకచోట నుండదనుట కేలాటి సంశయ ముండదు అందునను కడప కర్నూలు జిల్లాల యందుండు ఎండను గుఱించి యెంతయో వ్రాయుట కంటె చేవ చింత మొద్దులను గాల్చిన నిప్పులపై నడచిన నెంత చల్లగ నుండునో అటులుండునని నిర్భయముగ వ్రాయ సాహసించెదము మలమలమాఁడు వేఁడి మంగలమునకుఁ దీసిపోని యా రేగటి భూమిపై సుమారు మూడంగుళముల యెత్తుండు పాదరక్షల వేసికొని యొక క్రోసు దూరము నడచిన వేఱొక జత మార్చి వేసికొన వలసి వచ్చునని వ్రాయుట గూడ నతిశయోక్తి గానేరదు అటులుండినను రేనాఁటి వారు మాత్రము పాదరక్షల వేసికొను పాపమునఁబోరు బహుశ వారికి ప్రథమము నుండి యలవాటై యున్నందున కష్టముఁ దోఁచదని యూహింపనగు ప్రయాణము చేయువారు నీటిని తమవెంటఁ గొని

పోవలసినదే! ఎందులకన నొక యూరు విడచిన మఱియొక గ్రామముఁ జేరువఱకు నీటి బొట్టు దొరకుట దుస్తరము ఎచ్చటనైన నూయి గన్పట్టిన దానిలో నీరుండదు అదృష్టవశమున నీరుండిన ఎటులైనను రెండువందల మెటికలదిగి లోపలికిఁ బోవలసి యుండును లోనికేగిన వానితో పైనున్న వాఁడు మాటాడవలయునన్న పదిమారులు గొంతెత్తి ఎలచిన నొకసారి ఓ యనును అదికూడ ఒక్కొక్కసారి వినఁబడవచ్చును లేక పోవచ్చును అట్టి ప్రదేశములలో కాపురముండు వారిని గూర్చి మేము వ్రాసి విసుగు జనింపజేయుట బాగుండదు పాఠకులే యోచింతురు గాక!

అట్టి యెండలో సుమారు ముప్పది వత్సరముల యీడుగల యొక దీర్ఘకాయుఁడు చిన్న మూటను భుజమునఁ దగిలించుకొని నడచుచుండెను అతఁడొక తెల్లని యంగవస్త్రమును గట్టికొని యొక పొట్టియంగీని దొడగి పైన నొక ధవళాంబరమును గప్పుకొని యుండెను కుడిచేత నాలుగడుగుల పొడవుగల కఱ్ఱనొక దానిని గలిగి యుండెను అతఁడు దూరప్రయాణము జేసెనో లేక యెన్నడీ ప్రదేశముల యందు తిరిగియుండలేదో కాకున్న నతని యంగీ చెమ్మటచేఁ దడయు టెందులకు? అతఁడొక్కొక్కతరి పదియడుగులు పరుగెత్తి దడాలున పై గుడ్డ పాదముల క్రింద వేసుకొనుచున్నందున పాపము పాదరక్షల మఱచి వచ్చెనని గ్రహింపనగు ఆ పురుషుని పొట్లఁజూడ నతఁడు రేనాఁటి వాఁడు కాడనియు నెచ్చటి నుండియో తెలియక యీ మార్గమునకు వచ్చెననియు సుకుమారి యనియుఁ దెలిసికొనుటకు వీలు గలిగెను

అతఁడారీతి దారి సాగించుచు విసుకు జనించినప్పుడు ఔరా! యొకరి క్రింద సేవకావృత్తిఁ జేయుచున్నందున గదా యిట్టి యిడుముల పాలుగావలసి వచ్చెను! జానెడు పొట్టను బోషించుకొనుటకై యీ చావు చావవలసివచ్చె నేను వచ్చిన కార్యమును నెఱవేర్చుకొని పోకపోతినా మఱునాఁడె నా పదవినుండి తొలగింతురు తర్వాత కుడువఁ గూడును కట్టుటకు బట్టయు లేక చావవలసి వచ్చును చేయునది సేవకావృత్తియై నను న్యాయమార్గముననో అన్యాయమార్గముననో ధనమును గడించుచుంటిని ఇపుడీ యనివార్యమగు కార్యభారము నాతలపైఁ బడెను దీనిని నేను నెఱవేర్పఁగలనా నెఱవేర్చుట యటుండ జీవములతోడనైన నుండగలనా? రెండు దినములనుండి ఎంత ప్రయాస పడినను నా కింతేని గుట్టు బయలు పడకున్నదే ఏమైనకానిమ్ము సమీపమున నొక యూరు గాన్పించు చున్నది అచటకేగి యలసటఁదీర్చుకొందు నని తిన్నగ నడచి యాపల్లియుఁ జేరె

పల్లెటూరులందు సాధారణముగా ఊరివెలుపల వేపచెట్లను వేసి వాటిక్రింద ఱాతి తిన్నెలను గట్టియుందురు అవి మార్గమునఁ బోవు వారికి మిక్కిలి యుపయోగ కరముగ నుండును కొన్ని తావుల క్రొత్త బానలలో మంచి నీరు పోసి ప్రయాణీకుల కొఱకుఁ బెట్టి యుందురు మన బాటసారి వచ్చి చేరిన చోట కొన్ని వృక్షములును వాటి క్రింద ఱాతి యరుగులును నున్నందున పాప మతఁడు వచ్చిన తోడనె వాటిపైఁ గూరుచుండి హోయి హోయి యనెను అచట ప్రయాణీకులకై యుదకముతో నింపిన మట్టిపాత్రములు లేకుండెను గాని సమీపముననే సురపూరిత భాండరాజిచే నొప్పారు కల్లు దుకాణ మొకటి కనుపట్టెను అతఁడా దుకాణము వంకఁ జూచుచుండ

పాట

కల్లంటె కల్లురా – ఈఁత కల్లె కల్లురా
కల్లుకంటెను శ్రేష్ఠమైనది – కలియుగమ్మున లేదురా ||క||
కల్లు దాగి నోడురా – కైలాసము జేరురా
చంటయ్య కల్లు దాగితె – చావు మనకు రాదురా – ||క||

అని పాటఁబాడి ముగించునంతలో వేఱొకఁడు

ఆ వె కుక్క గోవు కాదు – కుందేలు పులిగాదు
దోమ గజము గాదు – దొడ్డదైన
లోభి దాత గాఁడు – లోకముల్ దిరిగిన
విశ్వదాభిరామ – యెసికలో తామ –

అనుచు నిలిచి చేతుల నాడించుచు వేమన యోగీంద్రుని పద్యమునకు మాఱు పద్యమును రచించి ఆశుకవి యయ్యెను ఇంకొకఁడు ఏమయ్యా! నీ కల్లు బో కల్లు ఎంతతాగినా కైపేగాదు అని తూగుచు మఱి రెండు ముంతల సురాపానముఁ జేసి దబాలున క్రిందఁబడగా ముక్కున దెబ్బ తగిలి బుడబుడ రక్తము కాఱఁ దొడఁగెను మఱియొకఁడు వానికి మేలు జేయువాని వలె వచ్చి దబాలున వానిపైఁబడగా మఱియొకఁడు ఓరీ! కాఁబట్టి వానిమీద పడెదవా? యని యొక గ్రుద్దు గ్రుద్దగా వాఁడు లేచిన తోడనే యిరువురి కొకగొప్ప పోరు జరిగెను కొందఱు మిక్కుటముగ త్రావి నేలపైఁబడి దొర్లాడుచుండిరి ఔరా ! చేతనుండు కాసులఁ బోఁగొట్టుకొని యపరి శుద్ధమైన చోట దొర్లుటకు వారెందుల కంగీకరింతులో కదా! ఔరా! భారతీయుల తెలివి లేమికై యేమి జేయవలయును? కల్లు దుకాణములు మొదఁలంటుగా కాలిపోవు

వఱకు భారతీయులకు సుఖజీవనము లేదుగదా! ఆ విధముగ దొర్లు వారిని తరుచాయన నుండు మన బాటసారి చూచి జాలి నొందుచుండ మఱియొక బాటసారి వచ్చి యింకొక వృక్షము క్రిందఁ గూర్చుండెను అతఁడు నల్లగ నుండి మోకాళ్ళ వఱకొక చల్లడముఁ దొడఁగి పైన దుప్పటిని మాత్రము గప్పుకొని యుండుటయే గాక తలపై పెద్ద ముతక రుమాలును ధరించి చేత బలమైన దుడ్డుకఱ్ఱను గలిగి యుండెను అతని వయస్సు సుమారు నలువది యేండ్లుండి యుండవచ్చునని చూచి నంతటనే గ్రహింపనగు అచటఁ గూర్చుండి తన మీదిపంచెన గట్టియుండు మూటను విప్పి పైకమును దీసికొని మఱియొక కాగితమును తలగుడ్డలోఁ గట్టి యెండ వేడిమికి తాళఁ జాలక దగ్గఱనుండిన కల్లు దుకాణమున కేగి తనివిదీరఁ గ్రోలి ప్రయాణము సాగించు చుండ మన మొదటి బాటసారి యతని వెనుక తన ప్రయాణము సాగింపఁ దొడఁగెను

ఆ మోటు మానిసి మైలుదూరమటులనే తూఁగుచు నడిచి చెట్టుక్రింద బడిపోయెను కొంతసేపటికి మొదటి బాటసారి యచటి కరుదెంచి వాని స్థితికిఁ జింతించుచు గట్టిగఁ బిలిచి ప్రత్యుత్తర మీయకుండటఁ జూచి వాఁడు ప్రథమమున చెట్టు క్రింద రుమాలులో దాఁచిన కాగితమేమిటో చూడనెంచి దానినిగైకొని చూచి బిరబిర చెట్టు చాటునకేగి తన జేబులో నుండు గాగితమును దీసి తన సీసపు కడ్డీతో వ్రాసి యొక కాగితమును మఱల తలగుడ్డలో గట్టి రెండవ దానిని తనయొద్ద భద్రపఱచి వృక్షము నారోహించి జరగు దానిని చక్కఁగ గమనించుచుండెను క్రిందఁబడిన సురాపాని తర్వాత సుమారు రెండుగంటలకు లేవగలిగెను అప్పటికి సుమారు నాలుగు గంటలు కావచ్చెను అప్పుడతఁడు లేచి తన యవివేకతకు వగచి రుమాలున నుండు కాగిత మున్నదో లేదో యని మూటను పలుమారు త్రిప్పి త్రిప్పి చూచి లోపల కాగిత ముండుట గని మఱల తన ప్రయాణమును సాగింప మొదలిడెను వాఁడు కొంత దూరమేగిన తర్వాత మన బాటసారి వృక్షమునుడిగ్గి నడువ మొదలిడెను రాను రాను మన బాటసారి ముందున్న బాటసారిని సమీపించెను సూర్యభగవానుఁడు మెల్లగ పశ్చిమాంబుధినిడాఁగెను ఆ యిరువురు కొంతసేపటికి కలిసికొని మాటాడుకొనుచు ఆకుమళ్ళను జేరిరి

చెన్నకేశవస్వామి దేవాలయము ఆకుమళ్ళకు ముందటి భాగముననే యున్నది ఆ కోవెల సమీపముననే యెఱుకలవాండ్రు గుడిసెల వేసికొని యుండుట వాడుకయై యున్నది మనకు చిరపరిచితులగు బాటసారు లిరువురును గుడిసెలను సమీపించిరి అంతట సురాపానము జేసిన మోటు మానిసి యచట నుండు వానితో ఓరీ! గోసాయి

వెంకన్న యుండునదెక్కడ? అని ప్రశ్నింపగా వాఁడు కొంత దూరమున నుండెడు కుటీరము నొకదానిని జూపఁగా వారిద్దఱొకటిగా జేరి యచటికేగిరి గోసాయి వెంకన్న మోటువానితో నాతో నీకేమి పనియున్న దనగా వాఁడు నీకొక జాబును దెచ్చితి ననుచు దానిని దీయుట కనుమాన పడుచుండుట మన మొదటి బాటసారి చూచి తన కూరిలో పనియున్నదని పోయి మఱల వచ్చి వారేమి మాటాడుకొందురో వినవలయునని కుటీరము వెనుక దాఁగి యుండెను

గో వెం ఆ యుత్తరమేది? ఇఁటు తెమ్ము!

మోటు ఇఁదిగో! అని కాగితమును దీస యిచ్చుటకు సంశయించుచు నిచ్చెను

గో వెం ఏమి యనుమానించుచున్నావు?

మోటు ఎవరైన చూతురేమో యని భీతి గలిగెను

గో వెం ఇంతకు ముందెవరైనఁ జూచిరా?

మోటు ఏమయ్యా! అట్లనెదవు ప్రాణము పోయిన పోవుగాక నీకు దప్ప నితరుల కిత్తునా?

గో వెం (జాబును విప్ప చూచి) ఇఁది నీ చేతి కిచ్చునపుడిటులనే యుండినదా

మోటు అవును

గో వెం నొసమున కెవరైన పోయి యున్నారా?

మోటు నా తమ్ముఁడే వెళ్ళి యున్నాఁడు

గో వెం అటులైన రేపు రాత్రి కతఁడు రాఁగలఁడు కదా?

మోటు అంతోసేపెందులకు? రేపు మధ్యాహ్నమునకుఁ దప్పక రాగలఁడు

గో వెం అతఁడు పగలు రాఁడు రాత్రికిటు చేర రావచ్చును

మోటు ఏమో నాకుఁ దెలియదు

గో వెం సరి ఇఁక నీవు వెళ్ళుము నీకు భోజనమెచట?

మోటు నాకు రొట్టె యున్నది దానిని భుజించి కొంతసేపు నిదురించి నెల పొడచిన తోడనే యూరికి పోదును

గో వెం సరి పొమ్ము జాగ్రత్తగా బొమ్ము

అంతట కుటీరము వెనుక నుండిన మనుజుఁడు దడాలున లేచి కొంత దూరమేగి తన యొద్ద నుండిన స్వల్పాహారమును భుజించుట కెవరి గృహము కడకైనఁ

బోదమని పోబోయిఁ మఱల వెనుకకుఁ దిరిగి బిరబిర ఆకుమళ్ళకు దక్షిణమున నుండు కుంట దరికేగి తాఁదెచ్చిన యాహారమును భుజించి నీరంబులఁ గ్రోలి పరుండుటకు చోటు నెవరి నడుగుటకు సంశయించి యించుక యోచించి చెన్న కేశవస్వామి యాలయమునకు వచ్చి యెవరికిఁ గాన్పింపకుండ చీకటిలో బండపైఁ బరుండెను ఆ గుడిలో సన్నని యాముదపు దీప ముండ తనయొద్ద నున్న కాగితమును బాగుగఁ చదువనెంచి దాని దగ్గఱకు తిన్నగ వెళ్ళి కాగితమును విప్పి మనసులో చదువుకొనఁ దొడఁగెను

నా

అ ధి      పరా ధులను      కొనుటకై యప      పరి

కులను      యున్నారు మాఱు      లతో      తిరుగుచు

రాధుల      ఱినో బాధించి      గృహ      పాలు      చున్నారు

మనపై      నము లే      నటించు      ఇంతవఱ

యన్మై      బాధిం      వారు      చేయ      ఆ      లను

బ      వలెను మీరు      నా      జేర రా      ను

ఆ జాబుపై నా యను నక్కర మొకటి యుండెను అతఁడెంతోసేపో యోచించెను గాని ప్రయోజనము లేక పోయెను దీపము నార్పి పరుండి యిటు లాలోచింపఁదొడఁగెను ఈ యర్థమును చూడ నిందేదియో గొప్ప రహస్యముండి నటులఁ దోఁచుచున్నది తక్కినది నాకు లభించు టెటుల? అది లేక యీ రహస్యమును భేదించుట సాధ్యము కాదే! దైవమా! యెంత యోచించినను తగిన యుపాయము స్ఫురింపకున్నది కదా! ఈ గోసాయి వెంకన్న సహాతము వానినేమియుఁ బ్రశ్నింపలేదు తక్కిన కాగితము కూడ వాని యొద్దనే యుండి యుండునా? లేదు అతని దగ్గఱ లేదు గోసాయి వెంకన్న కాగితముఁ జూచిన తోడనే నొసమున కెవరైన వెళ్లియున్నారా? యని ప్రశ్నించెను అదెటులఁ దెలిసికొనెను తెలిసెను కాగితముపై నా యను వర్ణమొకటి యున్నది అది వారి సంకేతాక్షరమై యుండనోపు నా యనగా నొసమని గ్రహించవలసి యున్నది రేపటి రాత్రికి రాఁగలఁడని నుడివెను అచ్చటి నుండి యీ రహస్యము దెలసిన వారెవరైన వచ్చునటులున్నది కానిమ్ము ప్రయత్నించెద అని యోచించుచు నిదురించెను



## ఎనిమిదవ ప్రకరణము

# ఒడ్డె ఓబన్న

ఎంతసేపు కన్నుల మూసికొని పరుండినను నిదురయను మాట లేదు పలువిధముల యాలోచనలు కలుగుచుండెను అతఁడా యాలయమునుండి యొక్కొక మాఱు దడాలున పోఁబోయి మఱల నింగిపై దృష్టి నిలిపి యోచించి లోపలికేగి యథా స్థానమున నొతికలఁ బరుండి సుమారొకగంటసేపటికి నిదుర పట్టెను కానోపు సన్నగ గుఱక పెట్ట దొడంగెను పాపమతఁడెవరో యెందుల కింతటి పాట్లకు లోనగు చుండెనో యెంతటి ఘనకార్యమును సాధించెడి భారమును తన తలపై నిడుకొనెనో ముందేమి చేయనెంచెనో యెట్టి కార్యమునైన తెలిసికొనగలుగు మా లేఖిని సహా యేమియుఁ దోఁచక తన వేగమును తగ్గించుకొనెను ఆ బాటసారి తాను బోవలసిన బాటఁ బట్టి పోక లేని గొడవ తన మూపున వేసికొన్న ఫలమనుభవింపక పోవునా? అంతటి యధిక ప్రసంగ మతని కెందులకని మనము మన సాహసింపఁబూనెదము కాని యతనిపని యతఁడు మానడని చేయు చేష్టలచేఁ దెలియ నగును

కొంతసేపటి కాతని పెద్దగుఱక యతని గాఢ నిద్రావస్థనుఁ జాటఁ దొడఁగెను అతడింక త్వరలో మేల్కొన నట్లగపడలేదు రాత్రి మూడు గంటలు మించెను ఆహా! నిద్ర సుఖమెఱుఁగదు కదా! లేకున్న నతఁడా కటిక నేలపై నీ రీతి నిదురించుటకు గతంబేమి? నాలుగు గంటలాయెను ఎవరో తట్టి లేపినటుల తటాలున లేచి వెలుపలఁ జూచెను ఇంకేమున్నది? రైతులు భుజమున నొక నుదక పాత్రమును బెట్టికొని కుడిహస్తమున ముల్లుగట్టెతో వృషభముల నదలించుచు సేద్యముఁ జేయుటకుఁ బొలవముల కేగుచుండిరి జనులెక్కువగఁ దిరుగకుండినను ఒకరిద్దఱు మాత్రమప్పుడప్పుడు వచ్చుచు బోవుచుండిరి గుడిలోనున్న బాటసారి యేమో భీతిలిన వాని భంగి ముసుగు వేసికొని తన చిన్న మూటను చంక నిడుకొని గునగున తన్నెవరెఱుఁగ కుండ గ్రామమును వీడిపోయెను

అతఁడొక మైలేగెనో లేదో కాని తూర్పుకొండ యెక్కుబారి దినమణి రాక నెఱింగించుచుండెను అతఁడు మాత్రము ప్రయాణము నాపక నడచుచు సుంకేసుల యను పల్లె వెలుపల నుండు బావిగట్టున నుండెడి జువ్విచెట్టు క్రిందఁ గూర్చుండెను దివాకరుఁ డెంత నిర్దయుఁడో బయటి కేతెంచినది మొదలు అగ్ని వర్షముఁ గురిపించు చుండెను నీడన గూర్చుండి అబ్బా! నేఁడెటులఁ బ్రయాణము సాగించవలయును?

గతదినంబున నన్ను మాడ్చి మసిఁజేసినది చాలక మఱల నేఁడు సహా తన వేఁడి బాణములచే నన్నలయింపఁ బూనుకొనెనే! ఇతని దాడి కోర్వఁజాలక పక్షులెందో దాఁగి యున్నవి కొండలయండనుండు మృగసంచయంబులు త్రాగ నీరులేక తపించుచు నీరంబులేయని భ్రమజెంది మృగతృష్ణలకుఁ బరుగెత్తుచున్నవే! నే నిచట లేకుండిన నీ బావికేతెంచి కడుపార నీటిని ద్రాగి పోయి యుండునేమో! నే నీ యాతపమున నెందేఁగఁగలను? తల్లి గర్భమునుండి ధరణిపైఁ బడినది మొదలిట్టి యెండలో నొక క్షణమైన నడచి యుండలేదు గదా! నే నిచ్చట నుండి వెడలిన గమ్య స్థానము జేరఁగలుగుదునా? ఇచ్చటినుండి వెళ్ళిన మరణము తప్పదు కనుక వేఁడిమి తగ్గ వఱకొక యడుగైన నిడనోప దైవకృప నాయందున్న నేఁ జేయ బూనిన కర్జము తప్పకనెఱవేరును అని యందున్న తంగేడు పుడకనొక దానిని విఱచి దంతధావనముఁ జేసికొనుచు నూతిలోదిగి ముఖప్రక్షాళనముఁ జేసికొని మూటలో నుండు ఆహారమును భుజించి చల్లగనుండు నీటిని తనివిఁదీర గ్రోలి చల్లని మందమారుతము వీచుచున్నందున చెట్టుక్రింద నుండు చలువఱాతిపైఁ బండుకొని నిదురించెను

చండభానుని ప్రకాశము ప్రజర్విల్లు కొలఁది భూరుహము క్రింద నిద్రాపరవశుఁడై యున్న పాంధుని నిద్ర మిక్కుటమగుచుండెను మధ్యాహ్నము మీఱిన తోడనే దినాధిపతి పశ్చిమ సముద్రమున దాఁగుటకై మెల్లమెల్లగ దిగుచుండెను గాని యతని నిదుర తగ్గుట లేదు సుమారు నాలుగు గంటలు మీఱు వఱకు సూర్యుఁడు పడమటికి దిగుచు నతఁడు నిదురించుటను సహింపఁజాలక తన వేఁడి కిరణములను తరుశాఖా మధ్యము నుండి ముఖముపైఁ బడునటులఁ జేసెను ఛీ! యీ సూర్యుఁడు బ్రతుక నిచ్చుటలేదు ఏమి ఈతని దౌర్జన్యము! ఆ రాహుకేతువు లొకేసారి వచ్చి దిగమ్రింగిన బాగుండును వారు సహిత మా చల్లని ప్రభువగు శీతకరునిపైఁ బగ సాధించుట కంటె నీ దివాకరుని పొగరడంచ గూడదా? వారికిఁ గూడ భయమే కాఁబోలు! దుర్మార్గుల కందఱును భీతిల్లువారే! ఏమి వగచిన నేమి ప్రయోజనము! ఇపుడొకింత వేఁడి తగ్గినటు లున్నది నా ప్రయాణము సాగించుట మేలు అని కూపమున దిగి నీటిచేఁ గన్నులఁ దుడిచికొని యుదకపానముఁ జేసి పైకెక్కి చుట్టు ప్రక్కలఁ గనుచూపు దూరమున తన దృష్టిని బాఱఁజేసెను దూరమున నుండి యొక మనుజుఁడు వచ్చుటఁ గాంచి మహీరుహము చాటునకేగి చూచుచుండ వచ్చెడి వాఁడు సహితము తన వంకకె వచ్చు నటులుండ ఆతని కంటఁ బడుట యుచితము గాదని వృక్షము నారోహించి గుబురుగ నుండు చోటఁ గూర్చుండి చూచుచుండెను

ఆ మానిసి బావి గట్టుఁ జేరెను అతఁడు మోకాళ్ళవఱకొక ముతుక ధోవతిని గట్టికొని చొక్కాఁ గూడ ధరింపక ముతుక గుడ్డను గప్పుకొని యుండి తలపై రుమాలును మాత్రము బెట్టికొని యుండెను చేతియందొక యినుపకట్లను వేసిన దండము నొకదానిని గలిగి యుండెను అతఁడా బావిగట్టుఁ జేరిన తోడనే తలగుడ్డను పంచను తీసి కట్టెకుఁ గట్టిన మూటను విప్పి చుట్టు ప్రక్కల మనుష్యులు లేకుండుటఁ గని నూతిలో దిగి కాలు సేతులఁ గడిగికొని మూటపై నీటిచేఁ దట్టి విప్పి యందున్న జొన్నన్నమును మెటికపైఁ గూర్చుండి తినుచుండుట వృక్షాగ్రము నందున్న యతఁడు చూచి మెల్లగ వృక్షమును దిగి బావిగట్టున నుండు గుడ్డలను సమీపించి రుమాలును పరీక్షించెను గాని యందేమియు లేదయ్యె అందున్న వసనము నెత్తగా మూట కనఁబడెను దాని నతి త్వరితముగ విప్పి యందున్న కాగితమును దీసికొని చెట్టుచాటున కేగి జేబులోనుండు కాగితమును దీసి వేఱొక జేబులో వెదుకగా పాపము సీసపు కడ్డీ కానరాదయ్యె అదెచ్చటనో పడిపోయెను మూడు మాఱులు పటపట తలకు గొట్టుకొని యేమియుఁ దోఁచక దిక్కులఁ జూడఁ దొడఁగెను అంతలో మఱల జేబులోఁ జేయివైచి యింకొక కాగితమును దీసి విప్పి రెంటిని చదివి కానిమ్మని తలయూచుచు మఱల తాను దెచ్చిన కాగితమును ఆ వస్త్రమునన్నే గట్టి తాను బిరబిరఁ బోయి దూరము నుండిన ఈఁదాడు చాటునఁ గూరుచుండి యితరుల కంటఁ బడకుండ పొంచి పొంచి చూడఁ దొడఁగెను

బావియం దున్నవాఁడు తన యన్నమును దిని గుడ్డను బాగుగా విదిల్చి గట్టుపై కేతెంచి వస్త్రము తాను వేసి నటుల లేకుండుటఁ జూచి చేతనుండు గుడ్డను విసరివేసి మూట నటుద్రిప్పి చూచి చుట్టు ప్రక్కలను వృక్షము పైనను వెదకి చేయివిదల్చుకొనుచు మఱల నుత్తరీయము కడకేతెంచి మూటను విప్పి అందున్న కాగితమును బాగుగ పరిశీలించి సరియని తలయూచి సంతోషముతోఁ జెట్టుక్రింద బండపైఁ గూర్చుండెను అప్పటికి సుమారైదు గంటలు కావచ్చెను గాని యతఁడేలొకో ప్రయాణమును సాగింప డాయెను సూర్యభగవానుఁడు తన విశ్రమస్థానము నలంకరింపఁ బోవుచు చెట్టుక్రింద నుండిన మనుజుని కూడ పొమ్మనెను కాఁబోలు అతఁడు కూడ ప్రయాణముఁ జేయుటకు బ్రయత్నించి చేతికఱ్ఱను దీసికొని బయలుదేరెను అరచేతిలోని గీతలు కాన్పింప కుండు నంతటి చీకటి పడినతోడనే ఈఁదాడు చాటుననున్న మనబాటసారి ముందేగు వానిని వెంబడించెను

ఒకరి వెనుక నొకరు ప్రయాణము చేయుచుండిరి మన మొదటి పరిచయుఁడు చాల దూరము నడువలేదు కనుక వడి వడిగ నడిచి ఆకుమళ్ళ దగ్గఱకు

వచ్చువఱకు రెండవ వానిని సమీపించెను అప్పటికి సుమారెనిమిది గంటలు కావచ్చెను ముందు నడిచెడి వాఁడు చక్కఁగ గోసాయి వెంకన్న కుటీరమునకుఁ బోవుటఁ గని వెనుకవచ్చు నతఁడు నిన్నటిరాత్రి గూర్చుండిన కసవు దిబ్బలోఁ గూర్చుండఁగా లోపలినుండి కొన్ని మాటలు వినఁబడ చెవియొగ్గి వినుచుండెను

గో వెం ఓబాన్నా! నీకుఁ గుశలమే కదా?

ఓబన్న నేఁటి వఱకు క్షేమముగనే యున్నాను

గో వెం నీకు వచ్చిన కాగితము నిటు దెమ్ము

ఓబన్న ఇదిగో!

గో వెం (దీపపు వెలుగున బాగుగఁ జూచి) ఏమోయీ! నాకు వచ్చిన దానిని సీసపు ఖడ్డీతో వ్రాసియున్నారు ఇది యింకుతో వ్రాయబడియున్నది ఇందులకు కారణమేమై యుండును?

ఓబన్న ఏదో మోసము జరిగినది నీ కాగితమును గొనితెచ్చు నాతడెంతో అజాగ్రత్తగ నుండ మన విరోధులపహరించి వాఁడు కనుఁగొనునేమో యని దానికి బదులు దీనిని వ్రాసి యుంచినారు

గో వెం ఇపుడేమి చేయవలయును? దాని వలన మనకే విపత్తు రానున్నదో కదా!

ఓబన్న ఏల భయపడెదవు? వారికి లభించిన దానివలన నేలాటి యర్థము కాదు నాదగ్గఱ నుండునది వారలకు దొరకబోదు

గో వెం చూడుము మన నాయకుఁడెంత జాగరూకుఁడై యున్నాడో! అపరాధులను కనుఁగొన వలయునని సర్కారు వారపరాధ పరిశోధకులను నియమించి యున్నారఁట వారు మనచుట్టు ప్రక్కల నున్న పల్లెలలో మాఱు వేసములతోఁ దిరుగుచున్నటు లున్నది మనము మిక్కిలి జాగ్రత్తతో మెలంగవలయును సరి యిఁక భోజనమునకుఁ బోదము అని లేచిరి దిబ్బలోఁ గూర్చుండిన మానిసి యిఁక అచట నుండుట మర్యాద కాదనియు వారు వెలుపలికి వచ్చిన తప్పక గుడిసెకు బలియొనర్తురనియు భయముచే బిరబిర యితరుల కంటఁబడకుండ ముందటి కుంట కడ కేగి తనయొద్ద మిగిలిన రెండు గోధుమ రొట్టెలను దిని నీరుఁ ద్రావి నిన్నటి గుడికి వెళ్ళి పరుండెను



## తొమ్మిదవ ప్రకరణము:

# కుటీర దహనము

కేశవాలయమున నుండు నల్లజాతిపై మీఁది యంబరమును బఱచుకొని పరుండెను. నిదుర కంటికి రాదాయె; నిముసమొక దినయాయెను. పరిపరి విధముల యాలోచనలు దట్టుచున్నందున లేచి కూర్చుండెను. అంతలో మఱల బరుండి ''ఏమి వీరి చతురత! ఔరా! యీగోసాయి వెంకన్న సామాన్యుఁడు కాడే! నిక్కపు సన్యాసియని యీ పురజనులను మోసపుచ్చి యెన్ని మాయలఁ జేయుచున్నాఁడు. వీని చర్యఁ జూడ వీడొక ఘనకార్యమున నిమగ్నుఁడై దానినుండి కలుగు ఆపదల నుండి బయల్పడుటకుఁ బ్రయత్న మొనరించుచున్నవాఁడు. ఆ లేఖలో వ్రాసిన దాని వలన నాకర్థమైనదే కాని నా చేతికందదయ్యె. దానిని బడయుటెట్లు? అది లేకపోయిన నా పలుకుల యందెవ్వరికిని విశ్వాసము జనింప నేరదు. కార్యము నెరవేర్చు కొని పోక పోతినా, నా సుఖజీవనము జీర్ణమై భిక్షాధికారిని కావలసి వచ్చును. వారి దగ్గఱ నున్న లేఖ దొరకినను దానిని వ్రాసిన వారెవరో వారికిఁ దప్ప అన్యులకుఁ దెలియదేఁ? వీరు సామాన్యులు కారు. వీరిని బట్టుట కెందఱు ప్రాణములఁగోలు పోవలయునో! కేశవా! నన్ను మాత్రము దరిఁ జేర్పుము'' అని పైకి చూచుచు దీర్ఘాలోచనాయత్తచిత్తుఁడై యుండెను. ఏమా యాలోచనము? ఎంత కాలము వేచి యున్నను నంతము లేకున్నది. పాప మతనిని సావకాశముగ యోచించుకొననిండు. మన మింకొక చోటును వీక్షింపఁ బోదము.

సుమారు రాత్రి రెండు గంటలు కావచ్చెను. ఇంతవఱకు నిశాక్రాంత ప్రపంచము నంతయు చీఁకటితోఁ గప్పి, చోరులకు సంతసమును, విటుల కానందమును, ప్రయాణికులకు చింతయు, నొనగూర్చు చుండె. అంతలో విరోచనుఁడు తన చల్లని ప్రకాశమును భూమిపై ప్రసరింపఁ జేయ యంధతమసం బెప్పుడో తలదాచుకొనియెను. గుడిసెలో నిదురించుచుండిన గోసాయి వెంకన్న చివుక్కున లేచి కూర్చుండి, ప్రక్కన బరుండిన ఒడ్డె ఓబయ్యను తట్టి లేపఁబోయెను కాని, నిద్రా పరవశుఁడై యున్న ఒడ్డె ఓబయ్య పలుక కుండెను. అందులకు వెంకన్న గట్టిగాఁ దట్టి బిగ్గరగాఁ బిలచెను. ఓబయ్య భయపడిన వాని భంగిలేచి కూర్చుండెను. ఆ శబ్దము వలన గుడిలో నాలోచనా నిమగ్నుఁడై యున్న బాటసారి కూడ లేచి వచ్చి గుడిసె ప్రక్కన గూర్చుండెను. గోసాయి వెంకన్న ప్రక్కనుండిన పొగగొట్టమును దీసికొని, పొగాకును వేసి, చకుముకి రాతిపై దూది పెట్టి, యినుప ముక్కతో గొట్టి

నిప్పును జేసి చుట్టను బీల్చి ఓబయ్యకు సహిత మియ్యగా అతఁడు కూడ దానిని బీల్చు చుండెను

గో వెం ఏమోయి! నిదుర మత్తు పోయినదా?

ఓబయ్య ఆహా! పోయినది

గో వెం ఇక ప్రయాణము జేయుదువా?

ఓబయ్య ఇంకెంత ప్రొద్దున్నది?

గో వెం ఎంతయో ఎక్కడిది? ఇఁక మూడుగంటల ప్రొద్దైనను లేదు ఇపుడు ప్రయాణము జేయుటే శ్రేయస్కరము ఈ చల్లని వెన్నెలలో దారి బహు బాగుగ సాగింప వచ్చును అదియుఁగాక చాలదూరము నిన్నెవరును గుర్తింప కుండనే పోఁగలవు

ఓబయ్య సరి ఇఁక నేవెళ్ళెదను

గో వెం మంచిది దారిలో జాగ్రత్త

ఓబయ్య ఆ కాగితమును జాగ్రత్త పఱచితివా? లేక నిప్పుపుట్టెలోఁ బెట్టి మూలనే వేసితివా?

గో వెం ఉదయమే భద్ర పఱచెదను లెమ్ము ఇపుడచటనే యున్నది

ఓబయ్య నే నేగద విశేషము లుండిన తెలుపుచుండుము

గో వెం అటులనే కానిమ్ము నీవిపుడు మీ యూరికి పోదువా? లేక ఆయనతో మాటాడుటకు ఆ యూరికేగెదవా?

ఓబయ్య చక్కగ మా యూరికే పోదును

గో వెం ఆ స్థలమును గూడ పరీక్షించి వెడలిన బాగుండును

ఓబయ్య ఏ స్థలమును?

గో వెం ఏ స్థలమా! నీవీ లోకమున నుండినట్లగపడలేదే!

ఓబయ్య ఆ సరి సరి పోయెదను లెమ్ము

గో వెం జాగ్రత్త ఎవరైన పరికించిన ప్రాణములు దక్కవు

ఓబయ్య నాకుఁ దెలియదా యేమి?

గో వెం వెళ్ళుము నేనుకూడ నూరిబయిటికి వచ్చెద పద అని మాటాడు కొనుచు వెళ్ళిరి

గుడిసె వెనుకఁ గూర్చుండిన మనుజుఁడంతయు వినెను కాగితము నగ్గిపెట్టెలో వేసి మూలను వేసి యున్నాఁడఁట ఆకాగితమును వెదకుటెట్లు? దీపము వెలిగించిన ప్రకాశమును జూచి నన్నుఁ గనుగొందురు గ్రహచారము చాలక చిక్కిన తప్పక నన్నంత మొందింతురు కానిమ్మిటులఁ జేసెదనని దడాలున గుడిసెలో దూరి అచట చాపపైఁ బడియున్న చెకుముకి ఱాతిని దూదిని ఇనుపముక్కను దీసికొని మఱల ముందటి స్థలమునకు వచ్చెను వాటి సహాయముచే కొంచెమగ్ని రగుల్కొను నటులఁజేసి గుడిసె క్రిందటి భాగమున నొక మూలనుండి గుడిసెఁజొచ్చి వాటిని యథాస్థానమున బడవేసి దేవాలయమున దాఁగెను గొసాయివెంకన్న తిరిగి వచ్చి చాపపై బరుండి నిదుర పోఁ దొడఁగెను

కొంత సేపటికి వెంకన్న కుటీర మొకప్రక్క నిప్పురగుల్కొని మంటలెగసెను అది వృద్ధియగుట గాంచి గుడిలో నుండు నతఁడాతురపాటుతో బరుగిడి వచ్చి అయ్యా! కొంప తగుల్పడి పోయెను ఇంకను నిద్రించు చున్నారేమి? లెండు లెండు అని బాటసారి బిగ్గరగ నడుగగా వెంకన్న యదరి పడిలేచి అయ్యో! కొంప కాలిపోవుచున్నదే! ఏ దుర్మార్గుఁడీ పాపకార్యమున కొడిగట్టికొనెనోగదా! ఆ పాపిచండాలాధమునకు నే నే యెగ్గొనరించితిని? అని నిలువఁబడి దూఱుచుండ ప్రక్కనుండు నతఁడు ఏమయ్యా! నీకు ఎచ్చి తలకెక్కినటులున్నదే! ఆతనిని దూఱుచు నిలిచిన కాలుట యాగునను కొంటివా? పొమ్ము! మంటలఁ జల్లార్చుట కెవరనైనఁ దోడ్కొని రమ్ము నేను క్రొత్తవాఁడను నేఁ బిలచిననెవరును రారు నీవేతెంచు లోపల నేను గుడిసెలో నుండు వస్తువులను బయటికిఁ దెచ్చి కాపాడెద ననగా దిక్కుతోచనందున వెంకన్న యితరుల కొఱకై పరుగెత్తెను ఇతఁడు ధైర్యమూని గుడిసెలో దూరి మూలనుండిన యగ్గిపెట్టె వెలుతురులో బాగుగఁ గనఁబడుచున్నందున దానిని దీసికొని భద్రపఱచి కొన్ని యితర వస్తువులను వస్త్రములను వెలుపల వేసి నిలిచియుండెను అంతలో వెంకన్న పరుగిడుచు వచ్చెను అప్పటికే తాటియాకులచే నిర్మింపఁబడిన యాకుటీరము భస్మమై యుండెను గోసాయి చింతించుచు విధిలేక యూరకుండెను ప్రక్కనుండిన పురుషుఁడు ఏమయ్యా! నీ నిద్ర నిర్మూలమై పోనూ! వ్యర్థముగ నీయగ్నిలో బడి దహింపఁబడు చుంటివే! ఇఁక నేమైనఁ జేసికొమ్ము తెల్లవారుచున్నది మాయూరికి నేఁ బోవలయు నని చెప్పి వెడలెను



## పదవ ప్రకరణము

# మాయల ఫకీరు

కల్వటాల కడప మండలములో నుండెడి యొక చిన్న గ్రామము అందు నాలుగు బ్రాహ్మణుల గృహములును వానికంటె రెండెక్కువగా వైశ్యమందిరములును సుమారు రెండువందల శూద్రయిండ్లు నుండెను ఆ యూరికి బ్రాగ్దిశను దాదాపు రెండువందల బోయవారు నివసించుచుందురు వారు పేరునకు మాత్రము కట్టెలమ్ము కొనియు పశువుల మేపియు పొలములలో కూలిఁ జేసికొనియు జీవింతురను మాటయే గాని వారి జీవనోపాయము చోరత్వముపై నాధారపడి యుండెను చోర శిఖామణులకు పుట్టినిల్లేది యనిన తొలుత నాపురిని జూపి పిదప తక్కిన స్థలములను జూపవలసి యుండును కల్వాటాలకు చుట్టు పదిపండ్రెండు మైళ్ళదూరముననే దోపిడి జరిగినను ఆ యూరి బోయలు తప్ప వేరుండరని ప్రతిగ్రామవాసులకు దెలిసియుండియు వారిని ధైర్యముతో నడుగుట కానిశిక్షించుటకాని చేయరైరి ఎవరైన ధైర్యమూని అట్టి పనికి దొరకొనిరా వారు ప్రాణముతో నుండుట కల్ల ఆ దుర్మార్గులను సర్కారువారు సహితము శిక్షింపఁజాలకుండిరి వారేమి చేయఁగలరు? ఎవరైన చోరులను బట్టి తమ చెంతకుఁ గొని వచ్చిన దాము పట్టినటుల పట్టీలో వ్రాసికొందురే కాని సహజముగ శ్రమ ప్రయత్నముఁజేసి తాము బట్టుట కల్ల ఎవరైన పోలీసు అధికారులు వచ్చిన వారిని నిముసములో తమ వలలో వేసికొను ఉపాయ మొకటి వారెఱిఁగి యుండిరి అందువలన వారేలాటి భయము నెఱుఁగక దొంగతనముఁ జేయుచు సుఖజీవనము చేయుచుండిరి

మన చరిత్రకు మూల కారణమగు కోవెలకుంట్ల దోపిడికిని ఆ బోయవారికిని ఏమైన సంబంధముండి తీరునని సర్కారు వారి కనుమానము కలిగెను కలెక్టరు వెంటనే సూపరింటెండెంటుకు నా విషయమై వ్రాయఁగా అతఁడు డిప్యూటీ సూపరింటెండెంటుకును సర్కిల్ యిన్‌స్పెక్టరునకును రహస్యముగా వెళ్ళి వారిని పరిశీలింపుమని యాజ్ఞాపించి యుండెను

ఆ కాలపు కల్వటాల పురవాసులు ఇప్పటి వారివలెగాక ధర్మాత్ములను పేరుఁ బడసి యుండినందున ఆ యూరికి బిచ్చగాండ్రును పకీరులును విశేషముగ వచ్చు చుండిరి మన కథ జరుగునప్పటి కొక ఫకీరు ఆ గ్రామమునందు చావడిలో నివసించు చుండెను అతడుబిచ్చ మెత్తుటను జూడ మిగుల వింతగనుండెను కల్వటాల గ్రామమున

మాత్ర మతఁడు బిచ్చమెత్తుచుండఁగా జూచిన వారు లేరు చుట్టు ప్రక్కల గ్రామముల కేగి యాచించు చుండెనేమో యని తోఁచెడిని ఒకనాటి ప్రాత కాలమున బిచ్చమెత్తుటకు నొసమున కేగుదమని నిశ్చయించుకొని యుండెను అక్కడ నుండి నొసమున కేగదలుచుఁకొన్న కొండదారినే బోవలయును బండి బాట కూడ నున్నది కాని మిక్కిలి చుట్టు తిరిగి పోవలసి యున్నందున కాలినడకను బోవు వారీ కొండ మార్గముననే వెళ్ళుచుండిరి మన ఫకీరుసాబు కా త్రోవ తెలియనందున నెవరైన తోడు దొరకుదురేమోయని దారిప్రక్కనుండు చావడిలోఁ గూర్చుండి యుండెను ఉదయము సుమారు పదిగంటలవేళ కొక మానిసి మోకాళ్ళవఱకు కొక ముతుక యంగవస్త్రమును గట్టి చొక్కాకు బదులు పంచను వేసుకొని తలగుడ్డను ధరించి దక్షిణ హస్తమున బలమైన వేణుదండమును బట్టికొని బిరబిరఁబోవుచు దూర ప్రయాణముఁ జేసెను కాఁబోలు అలసినవాఁడై చావడి దగ్గఱకు వచ్చి పాదరక్షలను క్రింద విడచి చావడిలోఁ గూర్చుండి పొగాకు సహితముగా తాంబూలమును వేసికొను చుండెను అతనిని మన ఫకీరు చూచి యిట్లు మాటాడింపఁ దొడఁగెను

ఫకీరు మహరాజ్! తమదేయూరు?

పురు సాయబూ! మాది నొసము దగ్గఱనుండు పల్లె

ఫకీరు మీరు నొసమును దాటి పోవలయును కదా?

పురు అవును

ఫకీరు అయ్యా! నేను నొసమునకుఁ బోవలయునని ప్రయాణమై దారి దెలియ కెవరైన వెళ్ళుదురేమోయని కాచుకొని యున్నాను మీ వెంట వచ్చెదను మీరిక్కడ యే యూరికి వెళ్ళి యుంటిరి?

పురు ఔకున కేగి యుంటిని

ఫకీరు అక్కడ బంధువు లున్నారేమో కదా!

పురు అవును నేను వివాహమాడిన దక్కడనే ఫకీర్ సాబ్! నీకు నొసమున నేమి పనియున్నది?

ఫకీరు మాకేమి పని కావలయును బిక్షమెత్తికొనుట కేగెదను

పురు సరి ప్రొద్దుపోవును పోదము రమ్ము అనగా ఫకీరతనిని వెంబడించెను పదునొకండు గంటల వేళకు వారు నయనాలప్ప తిప్ప కడకు వచ్చి బావిలో నీళ్ళను ద్రాగి గట్టుపై వృక్షము క్రింద నీడలోఁ గూర్చుండిరి

ఫకీరుసాహెబూ! నేను కొంతసేపాగి వచ్చెదను పాపము ప్రొద్దుపోవును నీవు ముందుకు వెళ్ళుము ఇక్కడికి నొసమెంతయో లేదు ఆ గుట్టపై కెక్కిన నీ కగపడును

ఫకీరు నేను గూడ కొంతసేపుందును లెండు ఇరువురము కలిసియే పోదము అంతలో నేమాలస్యమగును?

పురు (తనలో) వీనిని నావెంట ఎందులకు రమ్మంటిని? వీడుండిన నా పని నెఱవేఱదే! కానిమ్ము ఇచట నా పాదరక్షలను కావలయునని విడచి కొంతదూరమేగి వానిని మఱచిన వానివలె నటించి అతనికి దారి చూపి నేను తిరిగి వచ్చి నా కార్యమును నెరవేర్చుకొందును అని యనుకొనుచుండ ఫకీరు కని అతడెందులకో యోచించుచున్నాడనియు ఇందేదో రహస్యమున్నదని భావించి దానిని గనిపెట్టవలయునని తీర్మానించు కొనెను ఆ పురుషుఁడు లేచి ఫకీరు సాబూ! లెమ్ము పోదము అనగా ఫకీ రతనివెంట బయలుదేరెను పురుషుఁడర మైలు నడచిన తోడనే తటాలున నిలిచి చూపుడు వ్రేలిని విదిలించి నోట బెట్టికొని సాయబూ! పాదరక్షలను బావిగట్టున మఱచి వచ్చితిని అదే నీ కగపడు చున్నదే నొసము ఇదే దారిన పొమ్ము నేనేగి వాటిని దీసికొని నిన్ను గలసి కొందును నీవు నావెంట రానక్కఱలేదు పాపమిప్పుడే ప్రొద్దు మించినది నీవు కూడ రాగోరుదవేని నీ యిష్ట మనెను అందులకా ఫకీరు తానుగూడ వచ్చెదననబోయి తాను వెంబడించిన నతఁడూరక పాదరక్షల దీసికొని వచ్చుననియు అతనికి దెలియకుండ వెంబడింప వలెనని యనుకొని అయ్యా! అంత దూరము నేనేల రావలయును నేనే తిన్నగ బోవు చుండెదను నీవేగి పాదరక్షల దీసికొనిరమ్ము అనగా మంచిదని నూతి కడకేగెను ఫకీరు తాను నొసమునకేగు వానివలె నటించి వేఱొక దారిన యాతని ననుసరించి వెళ్ళుచుండెను

అతఁడు కూపమును సమీపించి తన కాలిజోడు వేసికొని చుట్టుప్రక్కల తన దృష్టిని బాఱించి చక్కగ శివాలయము వంక పోఁదొడగెను అతనిని కనిపెట్టి యున్న ఫకీరు సహాత మతని వెంట దగిలెను అతఁడు దేవస్థానమును సమీపించి చెప్పులను విడచి చేతి కట్టెను ఱాతి స్థంభమున కానించి తలగుడ్డను దీసి ఈశ్వరునకు నమస్కరించి లోపలికేగి పదునైదు నిముసములకు మఱల వెలుపలికి వచ్చి

పాదరక్షలఁ దొడగి కఱ్ఱను దీసికొని దారిని సాగింప మొదలిడెను ఫకీరు సాయబతని కంటఁబడిన ముప్పుతప్పదని కొండలో బడి వేఱొక మార్గమున బోయి నొసమున జేరి చావడిలో నుండెను పురుషుఁడు మాత్రము సరియగు దారిఁబట్టి కొంతసేపటికి తాను గూడ నొసమునే చేరెను



## పదునొకండవ ప్రకరణము

## శివాలయము

ప్రతి సంవత్సరము భాద్రపద మాసారంభము నుండి కార్తీక మాసాంత్యము వఱకు నితర దేశములయందేయో కాని దత్తమండలమున మాత్ర మెక్కడలేని రోగము లుండుట వాడుకయ్యె యున్నది అందునను రేనాఁటి సీమలో ప్రజలందఱును జ్వరపీడితులై ఆ మాసములను దూఱుచుందురు రేనాటివారా జ్వరములకు ఔషధ సేవన మొనరింపక కార్తీక మాసమునందలి సోమవారములలో నొక వారమున వన భోజనమునకు వెళ్ళిన జ్వరములు నశించునను నొక దృఢాభిప్రాయముఁగలవారై యటులనే చేయుచుందురు కొందఱు సమీపముల నుండు పుణ్యక్షేత్రముల కేగి యందున్న దేవుని పూజించి భోజన సహాత మచ్చుటనే చేసి స్వామి కార్యము స్వకార్యము గూడ ముగించుకొని వచ్చు చుందురు రేనాఁటి సీమవారికి సమీపమున ప్రఖ్యాతి గాంచిన దివ్య క్షేత్రములు లేనందున వారందఱు కార్తీక మాసమున కడ సోమవారము నాఁడు నయనాలప్ప తిప్పకు వచ్చెడి వాడుకయ్యె యున్నందున నాఁడచ్చట గొప్ప తిరునాళ్ళ జరుగుచుండును

చుట్టుప్రక్కలనైదారు మైళ్ళ దూరము నుండి జనులు గుంపులు గుంపులుగ వచ్చి అందున్న నూతిలో స్నాన మొనరించి ఈశ్వరారాధనముఁ గావించి నారికేళమును సమర్పించి అచటఁబచనముఁగావించిన పదార్థములను భుజించి రాత్రి కొక్కరేనియు నిలువక తమగ్రామముల కేగుచుందురు ఎంతటి రోగపీడితుఁడైనను నాఁడానూతిలో జలకమాడకమానఁడు ఆ బావిలో స్నానముజేసిన తమ పాపమంతయు నశించునని వారి నమ్మిక వారనుకొని నట్లే యానూతియందు స్నాన మొనరించిన వారికి వ్యాధి కుదురుచుండెను అందువలన నా దివ్య క్షేత్రము ఖ్యాతి చాల దూరము వఱకు వ్యాపించి యున్నది కార్తీక మాసాంతమున వచ్చెడి యిందు వారమున దప్ప నితర సమయము లందా ప్రదేశమున నొక పిట్టయైన నుండదు ఆ

రాత్రియే యెచ్చటి వారచ్చటి కేగుచుండ నితర సమయము లందెవరుండ సాహసింతురు?

అందొక్క యీశ్వరాలయమును ఒక్కొక్క పాషాణమొక్కొక కొండవలెఁ బొడగట్టు శిలలును పెక్కులున్నవి అందొక యపారవారమగు శిలనుండి యాదిన మాదిన మనక నీటిధార వెలువడుచుండును దేవాలయమునకు దక్షిణమున నొక గది యున్నది ఆ గదిలో లెక్కకు మిక్కుటంబైన విభూతి పండ్లున్నవి వాని నెవరైన నపహరించుటకు వీలున్నది కాని ఆ కార్యమొనరించిన వారెవ్వరును లేరు ఎందులకన దొంగిలింప వలెనను తలంపున వాటిని స్పృశించిన వాని కర మా విభూతి పండ్ల కంటుకొని యూడి రాకుండునని పెద్దలు చెప్పుచున్నందున నా కార్యమునకెవ్వరును బూనకుండిరి

ఆ స్థలమున కొక దినము ఫకీరుసాబు వచ్చెను అతఁడు వచ్చి ప్రవేశ ద్వారమునకుఁ దాళము లేకుండుటఁ జూచి ఎందులకు బీగము వేయలేదు? బహుశ నిర్జన ప్రదేశమైనందున జనులెవ్వరును రారని ముందరి తలుపు నోరవేసి యుందురు అని తలుపుఁ దెఱచి లోపలఁ బ్రవేశించెను గర్భగుడికి మాత్రమొక పెద్ద యిత్తడి తాళమును వేసి యుండిరి అందొక ప్రక్క కొన్ని వాహనము లుండెను గవాక్షము లేవియు లేనందున ఆలయమంతయు అంధకార బంధురంబై యుండెను అందేమున్నదో పరిశోధింత మన్న ముందేమున్నదో తెలియరాదు బీగము ఇత్తడితోఁ జేయఁబడి యున్నందున కొంచెముగఁ గనఁబడు చుండెను అతని కేమియుఁ దోఁచక సాయంకాల మాఱుగంటల వఱకచ్చటనే దిక్కు తోఁచక కూర్చుండి యుండి యిఁక చీఁకటి బడిన దుష్ట మృగములచే బాధ తప్పునది కాదని గృహోన్ముఖుఁడై వెలుపలికి రా బ్రయత్నించు చుండ ఢాం ఢాం అని రెండు శబ్దములు సమీపమున వినఁబడి నందున వెంటనే వాటిని తుపాకి శబ్దములుగ భావించి యెవరో వచ్చుచున్నారనియుఁ దనకు నేటితో ప్రాణములపై ఆస వదలెననియుఁ పరుగెత్తినఁ జూచి తుపాకితోఁ గూల్తురనియు నేమియుఁ దోఁచక తికమికలై కానిమ్మని మూలనుండిన వాహనముల మఱుఁగున దాగెను దాఁగిన నిముసమునకే కొందఱు పురుషులే తెంచినట్లాతఁడు గ్రహించెను వారి మాటల శబ్దమును బట్టి ముగ్గురైయుందురని తెలసికొని వారిలో నొకని మాటల సవ్వడి సింహగర్జనమువలె నుండుటెఱిఁగి భీతిచే వడఁకుచు మఱింత చాటునకేగి చూచుచుండెను ఇతఁడు వారికగు పడలేదు వారతని కగుపడలేదు గాని వారిమాటలు మాత్ర మతనికి వినఁబడుచుండెను

మొదటి : ఎవరు తలుపుదీసి యున్నారు?

రెండ : ఎవరికి తెలియును?

మూడ : నిన్నటి సంజకడ మనమే తలుపు వేయుటకు మఱచియున్నాము కాఁబోలు! పోనీ యిపుడేమి పుట్టి మునిగినది?

మొదటి : అటుకాదు. మనమీ ద్వారమునకు సహితము తాళమును వేయవలసినదే. ఇటులనే కన్నులు మూసుకొని యున్న మన ప్రాణముల మీదకే రాఁగలదు.

మూడ : ఇఁక రెండు దినములే గదా! తర్వాత వానిని నాశన మొనరింతుము. మన కిచ్చటికి రావలసిన పనియే లేదు.

మొదటి : ''ఎన్ని దినములైన కానిమ్ము. తాళము వేసియే తీరవలయును. ఓయీ! నీ వేగి వంకపండు సుబ్బిసెట్టి యంగడిలో నా పేర బీగమును దీసికొని రమ్ము. నీవు వచ్చు వఱ కిందేయుందుము.''

అనఁగా వారిలో నొకఁడు సరియని వెళ్ళెను. ఎవరేగినది వారికిఁ దప్ప నితరులకుఁ దెలియదు. మూలనుండిన ఫకీరుకు మాటలు వినఁబడుట తప్ప మనుజులుఁ గనఁబడకుండిరి. చక్కఁగ పరీక్షింతమన్న కనుగొందురేమో యని భయమగు చుండ కుయ్యకఁ గూర్చుండి యుండ మఱల మాటాడఁ దొడఁగిరి.

మొదట : ఓయీ! నీవిందే యుండి యెవరైన వత్తురేమో చూచుచుండుము. నే లోపల దిగి వానిని జూచి వత్తును.

రెండ : సరి పొమ్ము.

అనగా అతఁడొక మూలకేగి ఱాతిని జరిపి లోపలఁజొచ్చి మఱల పదునైదు నిముసములకు బయటికి వచ్చి ఱాతిని యథాస్థానమునకు జరిపి రెండవ వానితో నిట్లనెను.

మొదట : బాగుగానే యున్నవి.

రెండ : చెడి వాసన గొట్టలేదు కదా? వాసన బట్టిన గుట్టు బయటఁబడును. అటులైన నేఁడే భస్మము జేయుదము.

మొదట : లేదు. లేదు. దుర్గంధమను మాటయే లేదు. భయపడకుము.

రెండ : అటులైన సరే.

మొదట : ఓయీ! నీ కుటీరమును గాల్చిన దెవరైనది నీకుఁ తెలియనే తెలియదా?

రెండ : తెలిసిన వానిని మననిత్తునా?

మొదట ప్రాణాపాయము గలుగలేదు లెమ్ము అట్టిగుడిసెల వేయి వేసికొన వచ్చును

రెండ ప్రాణాపాయము లేదు కాని ప్రాణమున కంటె నెక్కువగా దాచి యుండెడి వస్తువొకటి యగ్నిహోత్రుని పాలైయున్నది

మొదటి అదేలాటిది?

రెండ నీవు పంపిన లేఖ

మొదటి పోనిమ్ము దానితో పనిలేదు కదా!

రెండ అవును

అని మాటాడుకొనుచుఁ దాళమున కేగిన వాడింకను రాలేదేయని యనుకొను చుండ ఆ మాటలను విని దాఁగి యుండిన ఫకీరు మిక్కిలి భయపడసాగెను అంతలో తాళమున కేగినవాఁడు రానే వచ్చెను అందఱును లేచి రేపేవేళ కందఱిచటఁ జేరవలె ననుకొనుచు తలుపునకు బీగము వేసికొని వెళ్ళిరి



## పంద్రెండవ ప్రకరణము

## లవణ భాండములు

తలుపులను బంధించి బీగమును వేసికొని వారేగిన తోడనే లోపలఁబొంచి యుండిన మన ఫకీరు లేచి వాహనముల మధ్యనుండి యీవల కరుదెంచెను అతని గుండియలు వ్రక్కలై పోయినవి దేహమంతయు స్వేదమయమై ధరించిన యంబరము లన్నియు దడిసి నీరు గాఱుచుండెను అతఁడు మూలనఁ గూర్చుండి యుండుటయే గాక వారెక్కడ కనుఁగొని ప్రాణముల గొందురో యని భీతిచే గడగడ వడఁకుచుండి నందున దేహమంతయు చెమ్మటచేఁ దడిసియుండెను వారేగిన కొంతసేపటికి ధైర్యమూని తడిసిన గుడ్డ లారుచుండ క్రిందఁ గూర్చుండి యాలోచింపఁ దొడఁగెను

అకటా! నే నిందుండి తప్పించుకొని పోవుట కుపాయములేదే! నా మందబుద్ధి కేమని విచారింపవలయు? మొదటఁ బ్రవేశించు నపుడే తలుపుల మూసియుండిన వారి కనుమానము దట్టి యుండదు కదా! ఇంతటి కార్యము జరుగవలసి యుండ నా కాబుద్ధి యెటుల జనించును? రేపటి దినము వారు వచ్చి తలుపులఁ దీయువఱకు

నేఁ దప్పించుకొని పోవుట కుపాయము లేదే! వారు వచ్చిననేఁ బాఱి పోవుచుండ నూరక జూచుచుందురా? కల్ల! ఆ మాట కల్ల! నాకు మరణము తప్పదు అయ్యో! నా భార్యా పుత్రు లెంత విలపింతురో కదా! వారికీ సంగతి దెల్పువారెవరు? నా భార్య ప్రాయమున చిన్నది కదా! దాని గతియేమి కావలయును? పసిబిడ్డలను గాపాడువారెవరు? మరణ శాసనమైన వ్రాసియుండిన బాగుండెడిదే! కానిమ్ము మరణించిన పిదప భార్యయెవరు? పుత్రులెవరు? బ్రతుకవలసిన ప్రాప్తియున్న వీరేమి చేయఁగలరు? ఇంత కంటె ఘోర విపత్తుల నుండి దప్పించుకొనిన వారెందఱు లేరు! ఇప్పటికి రాత్రి యేడుగంటలు కావచ్చినది అబ్బా! యీ రాత్రి గడపుటయే గాక రేపటి పగలంతయు నిందే గడపవలసి యున్నది తినుట కాహారము లేకున్నను త్రాగుటకు గ్రుక్కెడు నీరైనను దొరకదే! పీల్చుటకు మంచి గాలికూడ వచ్చుటకొక చిన్న గవాక్షమైనను లేకున్నది తలుపుల కుండిన సన్నని రంధ్రముల నుండి వచ్చెడి వాయువు తప్ప వేరేమియు లేదుకదా! ఇరువది రెండు గంటల కాలము వాయువును భక్షించి జీవింప వలఙ యున్నది ఆ దుర్మార్గులిందే వస్తువో దాఁచి యుండినట్లున్నది ఇచట దురవస్థల పాలగుచున్నందులకు వారు గుప్త పఱచిన వస్తువేదియో కనుఁగొన వలయును ఏదెటులున్నను రేపేవేళకు నా ప్రాణము లుండవు నేనేల భయపడవలెనని యనుకొనుచు కూర్చుండిన వాఁడు మెల్లగ లేచి చుట్టు ప్రక్కలఁ దారాడఁ దొడఁగెను

గోడ యెచ్చట నున్నదో స్థంభము లెందున్నవో యెచట గుంటయో మిట్ట యెచ్చటనో తెలసి కొనుటకు వీలుపడదయ్యె పరాత్పరుఁడు ప్రపంచమునందున్న చీఁకటి నంతయు నొకేసారి దీసికొని వచ్చి గుడిని నింపునటుల రేవెలఁది కాజ్ఞాపించెను గాఁబోలు! లేకున్న నంత వుబ్బుగానుండు టెందులకు? ఆ ఫకీరుఁ డా నిశియందొకానొక యంధుని బోలె తారాడుచు గర్భగుడి ద్వారము చెంతఁజేరి దానికుండిన బీగమును దడివి చూచి తీయవలను పడదని తెలిసికొని ప్రక్కన రెండు ప్రక్కల వరుసగా దీపములఁబెట్టెడి గూండ్లుండుట దేవాలయముల పద్ధతి యనియు నందేమైన నగ్గి పుల్లలుంచి యుందురేమోయని చేతులతోఁ దాకి చూడఁగా ప్రతిగూటియం దొక్కొక్క మట్టి దీపపు ప్రతిమయు నందించుక యాముదమును నుండెను వ్రేళ్ళు కంటుకొనిన యాముదమును గోడకు రాచి మూలన వారు జరిపిన బండ యేమో చూతమని అచటికేగెను అందొక చదరపు ఱాయియుండ దాని నెత్తి గోడ కానించి కాలితోఁ దాకుటకు పాదమిడ అదిలోనికి బోవుట చూచి దడాలున కాలును పైకిలాగి కూర్చుండి యాలోచింపఁ దొడఁగెను

ఔరా! యిందేదియో గుహయుండినటులున్నది లోపలికేగుదునా? లోపల నేమున్నదో ప్రవేశించుటకు మెటికలేమైన నున్నవో లేవో? లేకున్నఁ నింతకు ముందాఁతడు దిగుటెట్లు? వెలుపలనే యీ తీరున చీఁకటి గ్రమ్ముకొనియుండ లోపల బ్రవేశించిన కనఁబడున దేమున్నది? అందేమైన ప్రాణాపాయమగు వస్తువేదైన నుండిన నెట్లు? ఏమి నా ప్రాణములపై ఆశ! రేపెట్టులను మృతినొందుట నిక్కమని తెలిసికొనియు భయఁపడనేల? చనిపోయెడి వారికి సముద్రము మోఁకాటి లోఁతఁట! నే నింకెదులకు భయపడవలయును? అని మెల్లగ లోనికి కాలిడెను ఆ పాదమున కొక మెటిక తగులగా గట్టిగ మోపి చూచి రెండవ పాదమిడెను ఇటులనే మెల్లగ సోపానముల ద్వారా క్రిందికిఁ బోవుచుండెను సుమారైదారు గజముల లోతు దిగెను ఆ మార్గమొక మనుష్యుఁడేగుట కెంత కావలయునో అంతయె యుండెను కాని యిరువురు ఒకేసారి వెళ్ళుటకు సాధ్యపడకుండె అతఁడు కొంతదూర మేగునప్పటికి చదరపు నేల కాళ్ళకు దగిలెను అదియొక గదివలె నుండుట తెలిసికొని నేలపై చేతితోఁ దాఁకగా ఒక గుండ్రని పాషాణము తగిలెను దానిని బాగుగ పరీక్షించి శివలింగముగా భావించి మూలల వెదకఁ దొడగెను మొదటి రెండు మూలలయందును నేమియు లేకుండెను గాని తక్కిన మూలల యందొక్కొక మృణ్మయపాత్ర యుండెను వానిపై మూఁతను మూసి యుండిరి అతఁడా మూఁతలఁ దీసి చేతితోఁ దాఁకి చూడఁగా నిండుగ లవణముండెను

ఫకీరుసాబు ఆ యుప్పును క్రిందఁ బోయుటకుఁ బ్రయత్నించి మఱల వారు పరీక్షించిన యథావిధిగ లేకున్న చిక్కు తటస్థించు ననియుఁ దీసికొన్న వాని నిచట లేకుండఁ జేయ వలెననియు భావించి అపుడటులఁ జేయుటకు వెలుపలి కేగ తగు నుపాయము లేదనియు మఱల ముందటి వలెనే మూత లిడి తిన్నగ పైకెక్కి వచ్చి మరల ఱాతిని మూసి గుడి మధ్యమునఁ బై వస్త్రమును బఱచి నిదురింపవలెనని పరుండెను

నిదుర బొత్తిగ రాదాయె ఎప్పుడెవరు వత్తురో యే వేళ కే విపత్తు రానున్నదో యను భయమొక వంక బాధించుచుండ నెట్టి ధీరోత్తమునికైనను నిదుర పట్టఁగలదా? అదియుఁ గాక పాపమతనికి ఆహారము లేకుండటయే గాక త్రాగుటకు నీరు కూడ లేకపోయెను అట్టివేళ నిదుర రా సాహసించునా? అతఁడు తాను చేయఁ బూనిన కార్యముపై తన బుద్ధి నంతయు నుపయోగించుచుండెనే గాని యాకలి దప్పులకై విచారింప కుండె అతఁడు పట్టిన దీక్షను జూడ తన కార్యమును నెఱవేర్చుకొను ననియేఁ దోఁచెడిని కడ కేగతిఁబట్టునో చూతము

## పదమూడవ ప్రకరణము

# పునర్జన్మము

పాప మారాత్రి నాలుగు గంటలకు నిద్రాదేవి తన ప్రభావము నంతయుఁ జూపి ఫకీరు సాబును తన కాహుతి జేసికొనెను అతఁడటుల నిదురించి లేచు నప్పటికి దేవస్థానము నందు గడచిన రాత్రి యంతటి చీఁకటి లేక కొన్ని వస్తువులతనికి గోచర మగుచుండెను ఇన్ని గంటలై యుండునని యూహించుటకుఁ గూడ వలనుపడదయ్యె ఒక్కొకపుడు పక్షుల కలకలారవములు వినఁబడుచున్నందున నపుడది రాత్రి గాక పగలే మైయున్నదని యూహించెను అతఁడు మొదలే భీతిచే గడగడ వడకుచుండ కఱవులో నధిక మాసమనన్నట్లు అకలి బాధ యెక్కువాయెను ఆ ఫకీరు హా! దైవమా! నాకిదే కారాగృహమయ్యెనే! నే నెందఱిని దౌర్జన్యముగ నిరపరాధులను కారాగారముల పాలుఁ జేసి గాసిపెట్టితినో! ఆ పాపఫల మిప్పు డనుభవించుచున్నాను నే నిచ్చట నుండి ప్రాణములతో దాటి పోవుట కలలోని వార్త వగచిననేమి ప్రయోజనము? అనుభవింపక తప్పదు ఇచటి నుండి తప్పించుకొని పోఁగలిగితినా పునర్జన్మ మెత్తినటులే? ఈశ్వరుఁడే నన్ను రక్షించు గాక!

సీ॥ భూతాత్మ భూతేశ – భూత భావన రూప
దేవ మహాదేవ – దేవ వంద్య
యీ లోకములకెల్ల – నీశ్వరుండవు నీవ
బంధ మోక్షములకు – బ్రభుఁడ వీవ
యార్త శరణ్యుండ – వగు గురుండవు నిన్నుఁ
గోరి భజింతురు – కుశలమతులు
సకల సృష్టి స్థితి – సంహార కర్తవై
బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ – బరఁగు దీవు

ఆ వె॥ పరమ గుహ్యమయిన – బ్రహ్మంబు సదసత్త
మంబు నీవ శక్తి – మయుఁడ వీవ
శబ్ద యోని వీవ – జగదంత రాత్మవు
నీవ ప్రాణ మరయ – నిఖిలమునకు

కం॥ నీ యంద సంభవించును
నీయంద వసించియుండు - నిఖిల జగములున్
నీ యంద లయముఁ బొందును
నీ యుదరము సర్వభూత - నిలయము రుద్రా!

కం॥ కొందఱు గలఁడందరు నినుఁ
గొందఱు లేఁడందు రతుఁడు - గుణి గాడనుచుం
గొందఱు గలఁడని లేఁడని
కొందల మందుదురు నిన్నుఁ - గూర్చి మహేశా !

ఆ వె ॥ మూఁడుమూర్తులకును - మూడు లోకములకు
మూఁడు కాలములకు - మూల మగుచు
భేదమగుచుఁ దుదిన - భేదమై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ - ఫాలనయన ! (భాగవతము)

అని కన్నులు మూసికొని కరముల జోడించి దేవుని కభిముఖముగాఁ గూర్చుండి దైవధ్యానము జేయుచుండ ధాం మ్మను శబ్దము వినఁబడెను అందుల కాతఁడు భీతిచే దైవచింతన మాని ఏమది అప్పుడే సాయంకాలము కావచ్చినదా? ఔరా! నిద్రాదేవి ప్రభావము! వారిప్పుడే వచ్చుచున్నారు తప్పించుకొనుటకుఁ బ్రయత్నించెద అని ముందటి స్థలమున నిశ్శబ్దముగ దాఁగిన వాడయ్యెను

పాఠక మహాశయులారా! అతఁడు మహమ్మదీయుఁడయ్యు ఈశ్వరుని ధ్యానించుటఁ జూడ అతఁడిప్పుడు మా దేవుఁడు వేఱే మీ దేవుఁడు వేఱే మీ దేవుఁని కంటె మా దేవుఁడెక్కువయని లేని పోని కలహములఁ బెట్టుకొని తగవులాడు తురుష్కుల వలెగాక భూమిపై జన్మించిన జీవులందఱికి ఒకఁడే దేవుఁడను నిజమైన యభిప్రాయము గల కబీరువంటి ఫకీరని తోచుచున్నదిగాని మఱల అతఁడు నిజమైన ఫకీరగునో లేక ఆ వేసమును ధరించిన హిందువో అను సంశయము కూడ కలుగు చున్నది అతఁడు మహావిపత్తులోఁ దగుల్కొన్నందున అవ్యస్తముగ పలుభంగుల మాటాడు మాటలవలన నతఁడిట్టి వాడని నిర్ణయింపఁ జాలము నిదానించిన అన్నియు బయటఁబడును లెండు!

ఫకీరు దాఁగిన నిముసమునకే తలుపులఁదీయు ధ్వని కర్ణగోచరమయ్యెను వారు తలుపులు దీసి లోపలికేతెంచి రేపటి దిన మీ వేళకు మనమిచ్చుటికి వచ్చెడి

కార్యము ముగియును గదా! ఇంతవఱకు మనలనెవ్వరును కనుఁగొనలేదు మన యదృష్టము బాగుండిన నేవరేమి చేయఁగలరు? ముగ్గురము లోపల కేగుదము ద్వారమును వేసి రమ్ము అనఁగా వారిలో నొకఁడు తలుపు మూసి వచ్చెను అంతట వారు గుహాద్వారమునుఁ దెఱచి యొకరి వెనుక నొకరు లోపలఁ బ్రవేశించిరి మూలనున్న ఫకీరు యిదే సమయమని మెల్లగ ద్వారమును దీసి వెలుపలి కేగి యధావిధిగ తలుపుల బంధించి బీగమును బాగుగ దిలకించి దేవా! బ్రతికితిరా! యని కాలికి బుద్ధి చెప్పెను పాప మా ఫకీరు పునర్జన్మ మెత్తినట్టే కదా! తదుపరి పదునైదు నిముసములలో లోపలి కేగిన మువ్వురును బయటి కేతించి తలుపు వేసికొని వెళ్ళిరి

మన ఫకీరు నొసమును జేరి దుకాణమున ఆతురతతో ఫలాహారమును జేసి వంకపండు సుబ్బిసెట్టి గారి దుకాణమెచ్చట నున్నదో విచారించుకొని యచటికేగి సెట్టిగారితో సెట్టిగారు! మీ యొద్ద మంచి బీగములున్నవా? అని యడిగెను

సెట్టి అయ్యా! మీదే దేశము?

ఫకీరు ఇపుడు మాటాడుటకు వీలుపడదు ముందొక బీగము నిచ్చి పంపుము తర్వాత వచ్చి నీవు వలదను వఱకు మాటాడెదను ఇపుడే చీఁకటి పడినది

సెట్టి ఫకీరు సాబ్‌జీ! ఇంత తొందరఁ జేసెనదెట్లు? లోపలికేగి తెచ్చెదను ఇంచుక గూర్చుండుము అని లోపలికేగి కొన్ని తాళముల దెచ్చెను

ఫకీరు బీగములను నిదానించి బాగుగా చూచి యొక దానిని దీసికొని సెట్టిగారూ! ఇట్టి బీగమునకు దగిన చెవి మీ కడనుండునా?

సెట్టి ఏమది? బీగము కావలయునని చెప్పి యిపుడు చెవి మాత్రమడిగెదవు? ఇట్టి బీగము లనేకములు నాయొద్దనున్నవి నిన్నటి దినమున గూడ తీసికొని వెళ్ళియున్నారు నీకు చెవిమాత్రమెందులకు? నాకేమొ యనుమానముగ నున్నది బాబూ! నేనియ్యఁజాల

ఫకీరు నిన్నటి దినము తీసికొని వెళ్ళిన వారి పేరు తెలియునా?

సెట్టి ఏమయ్యా! ఇటులఁ బ్రశ్నించెదవు? పేర్లతో మాకేమి పనియున్నది? ఒక వేళదెలిసినను చెప్పవచ్చునా? చెప్పిన మా పరువు దక్కునా? ఫకీరు సాబూ! మా కెక్కడనైన నుప్పు పుట్టవలెననుకొంటివా లేదా?

ఫకీరు (తనలో) ఇతనితో వృధా కాలయాపన మొనరించుట సరి కాదు (ప్రకాశముగ) సెట్టిగారు! తాళము వెల ఎంత?

సెట్టి అదే కావలయునా? లేక దానికంటె మేలైనవి కావలయునా? వానిని జూపమందువా?

ఫకీరు నా కేదియు వలదు ముందు దీనివెల నెఱిఁగింపుము

సెట్టి ఏమి సాయబూ! తొందరగా నున్నావు నీకెక్కువఁ జెప్పుట లేదు రెండు రూపాయల టంక మగును

ఫకీరు రెండు రూప్యములనగా తెలియును టంకమన నెంత?

సెట్టి అది తెలియదా అయిదణాల ఆరు పైసలు

ఫకీరు ఇదిగో! తీసికొనుము అని డబ్బిచ్చి పోయెను

చూచితిరా! సెట్టిగారి యుక్తి అతనికి టంకమన నెంతయో దెలియదని తోఁచిన తోడనే రెండు పైసలెక్కువఁ జెప్పి తీసికొనెను ఔరా! తెలియని వారికడ ప్రతి వర్తకుఁడిటులనేఁ జేయును గాఁబోలు! ఇంత మోసము చేయుట వలననే వారికడ ధనము విరివిగాఁ జేరుట అతని పాపపుణ్యము లతనికే యుండును మన ఫకీరెచటి కేగునో చూతము

అచ్చటి నుండి మఱియొక చిన్న బీడీల యంగడి కేగి యగ్గిపెట్టెను గొని దారిలోఁ బోవుచు నొక యింట కొంత దూది నిప్పించుకొని ఫకీరుసాబు పోఁదొడఁగెను ఇప్పటికి రాత్రి సుమారేడు గంటలు మించియుండెను అతఁడా చీఁకటిలో నయనాలప్ప తిప్ప దిశగా నడువజొచ్చెను దాదాపు తొమ్మిది గంటల కాలమున కాతఁడు దేవాలయపు ముంగిటఁ జేరి తన యొద్ద నుండు తాళపు చెవిని బీగము లోపలఁ జేర్చి త్రిప్పెను ఏమాశ్చర్యము? వెంటనే బీగమూడి వచ్చెను

ఫకీరు లోపలి కేగి మఱల తలుపు నోరగా వేసి నిప్పుపుడకను వెలిగించి గర్భగుడి ద్వారము ప్రక్క గోడ కుండిన గూళ్ళ శ్రేణిని బరీక్షింప కొన్ని మట్టి ప్రమిదలును వాటియందించుక యాముదమును నుండెను దీపపు ప్రమిదల యందుండు నాముదము నంతయు నొకదానిలోఁ జేర్చి తన యొద్ద నుండిన దూదితో వత్తిని జేసి తడిపి దీపమును వెలిగించెను దీపమును చేతఁబట్టుకొని మూల కేగి ముందటి జాతిని జరిపి లోపల దిగెను లోపలి కేగి మట్టి పాత్రములపై నుండిన మూతను దీసి కొంచెము కొంచమే లవణమును దీయుచుండ తన హస్తమునకేదియో తగులగా చూతమని దీపపుఁ వెలుతురున జూచి అబ్బా యని క్రిందఁబడెను చేతియందున్న దీపపుఁ బ్రమిద యెప్పుడో క్రింద దొర్లగా నాముద మంతయు

భూమిపాలై దీప మారిపోయెను అతఁడు మఱల లేచిన వాడై ఉప్పును మఱల కుండలకు నింప మూతవేసి ఒక దానిపై నొకటి పెట్టి తన వస్త్రముచే గట్టిగ బిగించి తిన్నగ పైకిఁ దీసికొని వచ్చెను మునుపటి రీతి మఱల గుహద్వారము మూసి వెలుపలి కేతెంచి యధారీతి తలుపునకు బీగము వేసి ఈశ్వరాలయమునకు ఉత్తర దిశగాఁ బోఁదొడఁగెను



## పదునాల్గవ ప్రకరణము

# శీర్షద్వయము

ఉదయ మెనిమిది గంటల సమయమున కోవెలకుంట్ల తాలూకా కార్యస్థానమున నొకగదిలో సర్కిల్ యిన్స్పెక్టరు బల్ల దగ్గఱ నుండిన కుర్చీ కానుకొని గూర్చుండి యుండెను అతఁడు నోటిలో సిగిరెట్టును బెట్టి బీల్చుచు నేమో యాలోచించు చుండి రెండవ సారి బీల్వ నుద్యమించు నప్పటి కా సిగరెట్టు కాలి బూడిద యగుచుండెను తన యాలోచన ముందు ముగించుట గాని లేక సిగరెట్టును బీల్చుట ప్రథమమునఁ జేయుట గాని యతని మనస్సునకు దట్టి యుండిన అన్ని సిగరెట్లు వృధా కాలిపోయియుండవు అతఁడింకను రెండు కార్యముల నొకే పర్యాయము జేయుట మానఁడయ్యె ఆ రెండు కార్యములను విభజించి యుండిన నతని కేదియుఁ దలకెక్కి యుండదని కాల్చెడి సిగరెట్ల వలనను పెక్కు సిగరెట్లఁ గాల్చుచుండెనని క్రింద బడియున్న బూడిద రాశి వలనను దెలిసికొననయ్యె చుట్టలఁ గాల్చు వారికిని నస్యమును బీల్చువారికిని నిది యొక పెద్దలోటు సమయమున కది లేకపోయిన వారి బుద్ధి బుగ్గియై పోవును

ఈ చెడు అలవాటు పెద్దవారిలో మిక్కుటముగ నున్నది ఎప్పుడు పెద్దవారి కుండునో వెంటనే పిన్నవయసు గలవారలకు సహిత ముండకపోదు దీనికి పెద్దలే కదా కారణభూతులు! ఈ రీతిగనే పిన్న వయస్కులలో నుండు దుర్గుణముల కన్నిఁటికి నుత్తర వాదులు పెద్దవారమని విఱ్ఱవీగు వారనుట కేలాటి సందియము లేక నిర్భయముగ నిరసించుట వలన దోషముండునా? ఉండును గొప్ప దోషముండును వారు చేయు పనులన్నిటికి సరియని ప్రత్తిగింజలను దిను బసవన్న రీతి తలయూచిన బాగుండును గాని తప్పులనెత్తి చూపిన తలపైఁ దన్నుట కుద్యమింతురు లోకుల

దూషణలకు లొంగక సాహసించి సంఘదురాచారముల నెత్తిచూఁపనవాఁడు కవిగాక తక్కినవాఁడు కవి యగునా? సాంఘిక దౌర్జన్యముల నిర్భీతిమై నెత్తి చూపెడి కవిశ్రేష్ఠులు తక్కువై యున్నందున కదా మన సంఘము లిటుల దినదినమునకు క్షీణించి పోవుచుండుట! ఇతర మతములలో నెవరయిన సంఘమున కపకీర్తిఁ దెచ్చిన తక్కిన వారు వెంటనే విమర్శించి ఖడించుచుందురే! అట్టి యాచారము మతము లన్నిఁటికంటె నుత్తమమగు హిందూమతముననే కదా లేకున్నది? అందులకే హిందూమతమన్న నితర మతముల వారికి చవుకయ్యె పోయినది వందల కొలఁది హిందువులు క్రైస్తవులైరి కాని క్రైస్తవులలో నొకఁడైనను హిందూమతమున తన కాలిడెనా? హిందువులలో గొందరు మహమ్మదీయులై రహీం నామ మిడుకొనిరి కాని మహమ్మదీయుఁ డొకఁడైనను రామ నామ మిడుకొనెనా? అటులన్న మహమ్మదీయులను క్రీస్తులను హిందూమతమున జేర్చుకొమ్మని మేమనము అటులఁ జేయువారి నడ్డగించుటలో మేము మొదటివారమై యుందుము పవిత్రమగు హిందూమతావలంబకు లితర మతములలోఁ జేరకుండ నుండునట్టుల మెలంగినఁ జాలును అటులగాక సంఘ నాయకులమని పేరిడుకొన్న శాస్త్రులవారును ఆచార్ల వారును దీక్షితుల వారును సంఘ దురాచారముల నెత్తిచూఁపన వారిని నిందించక తగు ప్రోత్సాహ మొసంగి సంఘ విమర్శకుల సంఖ్య నెక్కుడు చేయుదురు గాక!

ఎవరైన నొక రొక యాచార్యుల కడకేగి ఆచార్యుల వారూ! మీరేల నస్యము వేసికొందురు? అది నేత్రములకు చెడుగుఁ గూర్చునని వైద్యశాస్త్రము లోకవంక ఘోషించుచుండ మీరు వినలేదా? యనిన ఆచార్యులవారు వెంటనే వానిని దూషింప దొడఁగుదురు అడిగిన వాఁడు లేచిన దినము మంచి దాయెనా ఆయన వెంటనే నవ్వుచు నీకేమి తెలియునురా? నస్యం వశ్యకరం సదా రుచికరం అని తన తప్పును సవరించుకొనును ఇఁక సిగరెట్లను బీల్చు పెద్దల నడిగినచో వెంటనే ఓరీ! నీకేమి తెలియునురా?

క॥ బుగబుగ మని పొగ లెగయఁగ
నగణితముగ నాజ్యధార లాహుతి కాఁగా
నిగమాది మంత్ర యుతముగఁ
బొగ ద్రాగని వాఁడు దున్నపోతై పుట్టుౘ'' (చాటుపద్య మణిమంజరి)

- అని జెప్పుచు పూర్వమొకప్పుడు నారదుఁడు విష్ణువు కడ కేగి

క॥ మీరును బొంగ దాగుదురా
వారిజభవ! వామదేవ! వైకుంఠ! హరీ!
ఓరీ నారద! వినురా
యీరేడు జగంబులకును నిది ముఖ్యమురా!'' (చాటుపద్య మణిమంజరి)

అని చెప్పియున్నాడనియుఁ జెప్పుచుండ అయ్యా! ఒకరు పీల్చిన దానిని మఱియొకరు నోటిలోఁబెట్టికొని పీల్తురే! ఎంగిలి లేదా? అని యడిగిన నతఁడు వెంటనే యాలోచింపక

క॥ ''పొగ్రక్రోవికి సతి మోవికి
నగణితముగ నూరబావి కమృతంబునకున్
దగ నుచ్ఛిష్టత లేదని
ఖగవాహను తోడఁ గాలకంఠుఁడు పల్కెన్ (చాటుపద్య మణిమంజరి)

అను పద్యమును జెప్పి తన తప్పును సమర్థించుకొనును ఈ రీతి ప్రత్యుత్తర మొసఁగి దురాచారముల నభివృద్ధిఁ జేయువారే గాని తగ్గింపఁ దలపెట్టువారరుదు పాపము! వారేల భీతిల వలయునో దెలియుట లేదు వారి తలఁదఱుగుదు రను భయమున నూరకుందురు కాఁబోలు! మే మట్టివారిలోఁ జేరఁజాలము సంఘ దౌష్ట్యములను ఇతర దురాచారములను నిర్భయముగ విమర్శింపఁ గంకణముఁ గట్టి గొంటిమి సంఘవిషయములఁ జర్చించు గ్రంధము నొకదానిని రచించి యాంధ్ర దేశమునఁ బడవైచి నందునను దాని నందఱుఁ బఠించి యుందురను నమ్మకము చేతను ప్రస్తుతము విపులముగ వ్రాయుట మానితిమి అందులకు సోదరులు మన్నింతురుగాక! ఇప్పటికే చాల ఆలస్యమైనది కుర్చీపైఁ గూర్చుండి సిగరెట్టును బీల్చు సర్కిలిన్స్పెక్టరు వంక మరలుఁడు

అతఁడు ధూమపాన మొనరించుచు ఇరువుర మొకసారియే కార్య సాధనమునకు బయలు వెడలితిమి నేను మాత్రము కొంతవఱకు సాధించుకొనియే వచ్చితిని ఈ మాత్రమైనను జేయకుండిన ప్రభుత్వము వారెన్నఁడో గృహమున కనిపి యందురు అతఁడెచ్చటికేగెనో? ఎందున్నవాడో? ఏ విపత్తునకు లోనయ్యెనో? తెలియ రాదు నాకుఁ జూడ అతఁడే కార్యమును గాని సాధింప లేడనియే తోఁచెడిని అధికారమున నతఁ డెక్కువైనను కార్యముల పట్ల క్రింది యుద్యోగస్థులమగు మేమే కదా యెక్కువ? వారూరక పైనఁ గూర్చుండి మమ్ముల నేడ్పించి మేము సాధించిన

పనులను తాము చేసినటుల వ్రాసికొని బహుమానములఁ బొందుట పై యుద్యోగముల కెక్కుటయే గాక వారేమి చేయఁగలరు? అతఁడడవులలో నుండు ఎఱుకల వారికి తాను లంచములఁ దీసి గడించిన ధనరాశిలోఁ గొంత యొసఁగి దొంగలమని యొప్పుకొనునట్లు చేసి రక్షక భటాధికారి కార్యస్థానమునకు వారిని బంధించి తెచ్చి వారు దొంగిలించు చుండ బట్టి తెచ్చితినని జెప్పి వారిచే దొంగలమే యని యొప్పించి కదా ఆ యుద్యోగమును సంపాదించె! పాపమా యెఱుకలవారు ధనాపేక్షచే తమ కుటుంబము సుఖముగ జీవింప వచ్చుననియు కారాగృహమునందున్న నొక యాఱు మాసములే గదా యనియుఁ దలఁచి యొప్పుకొనుచుండిరి అతని దిట్టతన మిప్పుడు కదా తెలియును అని యనుకొను చుండ డిప్యూటీ సూపరింటెండెంటు గారొక మనుష్యునిచే నొక గోతమును మోయించుకొని సమీపమున వచ్చుచుండెను

అతనిని జూచి సర్కిలినస్పెక్టరు బల్లపై నుండిన యగ్గిపెట్టెను జేబులో నిడుకొని లేచి వందనము లర్పించి కరస్పర్శనమును గావించి ప్రక్కనుండిన కుర్చీపై సూపరింటెండెంటు గారు కూర్చుండ తాను గూడ తన కుర్చీపైఁ గూర్చుండెను

డి సూ  మిత్రమా! నీ వేగిన కార్యమేమాయె?

స యి  ఏమియు కాలేదు అది దుర్ఘటముగ నున్నది

డి సూ  కొంతవఱకైన నెఱవేఱలేదా?

స యి  లేదు

డి సూ  అబ్బా! యీ కార్యము మిక్కిలి కష్టముగా నున్నది ఇన్ని దినములీ పోలీసు శాఖలో పనిచేయుచున్నాము గాని యిట్టి దెన్నఁడును దటస్థించి యుండలేదు జిల్లా సూపరింటెండెంటుగారు కార్యభారము మనపై నిడి తా నచట గూర్చుండియున్నాఁడు ఇచట మనమే కదా చావవలసినది! ఈ కార్యమున మనము గట్టెక్కుటయన కలలోని వార్తయగునేమో!

స యి  (చిఱునవ్వుతో) మీరేమాత్రము పనిచేసితిరి?

డి సూ  చేయుటకే మున్నది! మీరేమి నగుచున్నారు?

స యి  నవ్వక యేమి చేయుమందురు? దుఃఖించిన కార్య సాధనమగునా? కాదు

డి సూ  మీరేమైన సాధించితిరేమో అనుకొంటిని

స యి  అవును మీ రెంత సాధించితిరో నేనంత సాధించితిని

డి సూ నే సాధించిన మాత్రము మీరు సాధించితిరా?

స యి అవును

డి సూ ఏమి సాధించితరో చూపుడు?

స యి మీరు చేసినది చూచిన కదా నేఁ జూపుట!

డి సూ ఆ మూటను విప్పి చూడుము

సర్కిలినస్పెక్టరు మూటను విప్పి చూడ దానిలో రెండు కుండలుండెను వాటిలో నేమున్నదో చూతమని ఉప్పును క్రిందఁ బోసి అబ్బా యని క్రిందఁ బడెను భూమిపై రెండు మనుష్య శిరములు దొర్లుచుండెను

## పదునైదవ ప్రకరణము

# రహస్య లేఖలు

సర్కిలినస్పెక్టరు కొంతసేపటికి తెప్పరిల్లి లేచి డిప్యూటీ సూపరింటెండెంటు భుజముపై చేయివైచి కుర్చీపైఁ గూర్చుండి అయ్యా! యీ తలలెక్కడి వనెను

డి సూ నేను నీ వేగిన దినమె శిరస్సు వెదకుట కేగితిని కొన్ని కష్టములు గలిగెను కాని కడకు లభించెను

స యి ఎచ్చట నుండెను?

డి సూ ఇచ్చటికి పదునైదు మైళ్ళ దూరమున నుండు కొండలో దేవాలయమున

స యి అక్కడికి నీ వెటులఁ బోఁగలిగితివి?

డి సూ దేవుఁడే ఎలుచుకొని పోయెను నేను ఫకీరు వేసము ధరించి యీ కార్యమును నెఱవేర్చుకొని వచ్చితి ననుచు నయనాలప్ప తిప్పయందుండు ఈశ్వరాలయమున జరిగిన దంతయు విశదపరచెను

స యి అటులైన నీ తలలెవరివై యుండును?

డి సూ ఆ దినము కడపకుఁ బంపిన మొండెములవే య్యెయుండు నని తలఁచెద

స యి వీటిని దాఁచిన వారిని కనుగొంటివా?

డి సూ అందులకే మిగులఁ గుందుచున్నాను వారా పాపి చీఁకటిలోఁ గనఁబడక పోయిరి

స యి అయిన నిప్పుడేమి మునిగినది? అపరాధుల లేఖలు నాకు లభించినవి చూడు మని జేబులోనుండు అగ్గిపెట్టెను దీసి యిచ్చెను అందున్న కాగితములఁ దీసి డిప్యూటీ సూపరింటెండెంటు చదువఁ దొడఁగెను

నా

అధి పరాధులను కొనుటకై యప పరి
కులను యున్నారు మాఱు లతో తిరుగుచు
రాధుల ఱినోబాధించి గృహ పాలు చున్నారు
మనపై నము లే నటించు ఇంతవఱ
యమై బాధిం వారు చేయ ఆ లను
బ వలెను మీరు నా జేర రా ను

ఈ రీతి చదివెను గాని యేమియుఁ దెలియక పోయెను అందున్న మఱియొక కాగితమును దీసికొనెను దానియందు కూడ అచ్చటచ్చట వ్రాయక విడిచి నందున చదువుదమని ప్రారంభించి చదువఁ దొఁడగెను

ఆ

కారుల బట్టు రాధ శోధ
నియమించి వేసము వారు నిరప
నెంద కారా ముల గావించు ననుమా
కుండ చున్నాను కా విష నన్ను చుటకు
ప్రయత్నము లేదు వస్తువు రీక్షింప
త్వరలో దగ్గఱకు వలయు

అర్థము కానందున రెండు కాగితములను ముందిడుకొని కలిపి చదువ నిటులుండెను

అధికారు లపరాధులను బట్టుకొనుటకై యపరాధ పరిశోధకులను నియమించి యున్నారు మాఱువేసములతో వారు తిరుగుచు నిరపరాధుల నెందఱినో బాధించి కారాగృహములపాలుఁ గావించుచున్నారు మనపై ననుమానము లేకుండ నటించుచున్నాను ఇంతవఱ కా విషయమై నన్ను బాధించుటకు వారు ప్రయత్నము చేయలేదు ఆ వస్తువులను బరీక్షింపవలయును మీరు త్వరలో నా దగ్గఱకుఁ జేర రావలయును

అని చదివి నగుమొముఖముతోఁ దలయూచుచు మూఁడవలేఖను జదివి మిత్రమా! యీ శిరముల తప్పక వారే ఖండించియుందురు ఇందొకటి తహసీలు దారునిదై యున్నదనుట కేలాటి సంశయము లేదు ఔరా! వాఁడెంతటి ఘనకార్యమును

జేయ సాహసించెను! సర్కారు వారితో విరోధమును సంపాదించుకొనెనా? ఇఁక బ్రతుకఁ గలఁడా? మిత్రమా! నిజమున నతఁడు మిగుల గుణవంతుడు. ఈ తహసీలుదారుఁ డెంత యవివేకియన వచ్చును! ఆతనిని దూషింప వచ్చునా? అందులకే తగిన శాస్తియైనది. అధికార గర్వమున కన్నుగానక కానిమాట లాడియున్నందున గదా అకాలమరణ మాసన్నమగుట! ఇట్టివానిని జూచుచు నింకను కొందఱధికారులు తామే గొప్పయని క్రిందివారిని కడు హేయముగాఁ జూచుటయే గాక, నోటికి వచ్చి నటుల దూషింతురు. అట్టి వారి కిట్టివారు తమ కరవాలపు రుచిఁ జూపుచునే యుందురు. ఇప్పటికైనను వారి యధికార గర్వమును మాని, అందఱియెడ సోదరభావము గలిగి, మంచివారనిపించుకొని జీవింతురు గాక! మిత్రమా! అపరాధులు తేలిరి. ఈ సంగతి కల్లెక్టరు గారగు కాకరేన్ దొరగారికిని, జిల్లా సూపరింటెండెంటు గారికిని దెలుపుచు, శిరములను వారి కంపుదము. మఱచితిని. ఈ లేఖలు నీకెట్లులభించె'' ననఁగా సర్కిలినస్పెక్టరు తాను బాటసారిగా బయలుదేరి కడకు ఆకుమళ్ళలో గోసాయి వెంకన్న కుటీరమును గాల్చి యతనికి మేలుచేయు వానివలె నటించి, మూల బడవేసిన జాబులందు అగ్గిపెట్టెను దెచ్చిన దంతయు విశదపఱచెను. అందులకు డిప్యూటీ సూపరింటెండెంటు హర్షాంబుధి నోలలాడుచు ''మిత్రరత్నమా! అపరాధుల పేరులను శిరములను గనుగొంటిమి. ఇఁక వారిని బంధితులం జేయు పని కూడ మన తలపైననే యున్నది. ఇది మిక్కిలి కష్టతరమగు కార్యము. ఈ ప్రయత్నమున నొకవేళ మనమే మృత్యుముఖమునఁ బడ వచ్చును. చావుకు భయపడిన పనినుండి తొలగింతురు. కనుకనెట్లులైనను వారిని బట్టియే తీరవలయును. ఏమరుపాటున నుండినపుడు వారిపైఁ బడవలయును గాని, తన జనులతో నుండినపుడు వెళ్ళిన మనల నూరక బలిఁగొందురు.'' అనగా సర్కిలినస్పెక్టరు కొందఱిని పోలీసులను దీసికొని పోదమనెను. అందులకు సూపరింటెండెం టెక్కువ పోలీసు వారిని దీసికొని పోరాదు. మన మిరువురమును నలుగురు రక్షక భటులును జేరి వారిపై కేగుదము. ఈ సంగతి యితరులకుఁ దెలియరాదు. నేఁడే శిరములను కడప కనుపుద మనుకొనిరి.



## పదునాఱవ ప్రకరణము

# అపరాధులు

రేనాఁటి సీమలో నుండు గ్రామములలో ఉయ్యాలవాడ మిక్కిలి ప్రసిద్ధిఁ గాంచినది ధనవంతుల కునికిపట్టై వీరాగ్రేసరులకుఁబుట్టినిల్లై ఆచారపరులైన భూసురుల కాలవాలమై యుక్తిపరులగు కోమటివారికి జన్మభూమియై త్రిదశల యందు సారవంతమగు నల్లరేగడి భూములును పశ్చిమమున ఆ కాల మీ కాలమనక జలముచే నొప్పియుండు కుందునదిని గల్గి ధనరాసులపైఁ గూర్చుండి భూస్వాములను సార్థక నామమునఁ బరఁగు రెడ్లతోఁ జెన్నొందు చుండెడిది ఆ ప్రాంతముల నుండు భూములలో జొన్న ప్రత్తి వేరుసెనగ పుష్కలముగ ఫలించుటయే గాక తక్కిన ధాన్యములు గూడ ఫలించు చున్నందున ఫలమును ఇతరులకు నెక్కువ ధరతో నమ్మి ధనమును ప్రోగుఁజేయుచుఁ గావలసినంత కంటె నెక్కుడు బంగారమును గూర్చు చుండిరి వారికి బంగార మనిన చింతపండుతో సమమని వ్రాసిన నతిశయోక్తి కాదనియే మా భావము

అంతటి ధనవంతులైనను ఈ కాలపు స్వల్ప వేతనము గడించి రెండు వేళలను కాల మతిక్రమింపకుండ కాఫీ దుకాణముల కేగి స్వల్పాహారమని చెప్పుచు భుజించి అప్పుఁజేసి వచ్చిన వేతనము చాలనందున భార్యపై నుండు నగలనమ్మి యప్పు దీర్చుచు అవికూడ జాలక పోయిన మిగిలిన యప్పు దీర్పలేక ఒకరిపై నొకరు రోజా మనుష్య లేతెంచు చుండ నవమానమును సహింపఁ జాలక యితర పట్టణములకు బదలాయించుకొని మిత్రులకు సహితము జెప్పకుండ వేకువ జాముననె లేచిపోవు కొందఱి తాలూక కచ్చేరి గుమాస్తాల వలెఁ గాక తాము కష్టపడి పండించిన జొన్నన్నమునే దినుచు కాలము గడపుచుండిరి రేనాఁటి వారి యాహారమును గుఱించి యొకానొక కవి యిటుల వర్ణించెను

క    జొన్నకలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్నపిసరు – జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగ రేనాఁటి సీమ – ప్రజలకు నెల్లన్ (శ్రీనాధుఁడు)

అంతటి ధనవంతులే అట్టి యాహారమును భుజించుచుండ స్వల్ప వేతనము గడించు వారలు కాఫీ యంగడులఁ జొచ్చి చాకల వారిచే శుద్ధిఁ జేసిన పాత్రములతోఁ

గాఫీ పానమొనర్చి కులభ్రష్టులగు టెందులకో అప్పుల పాలై చెడిపోవు టెందులకో తెలియకున్నది ఇది కాఫీ దుకాణము లిడిన వారి దోసమా లేక వాని కడకేగు వారి దొసగా యని విమర్శింపఁ దొడఁగిన రెండవ వారిదే తప్పని తేలుచున్నది రేనాటి సీమ వారికి నింకొక గొప్ప పేరుఁగూడ కలిగినది అదేమన ఖూనీ చేయువారను పెద్ద నామధేయ మొకటి వచ్చెను ఆ పేరూరక వచ్చినదే కాని వారు గుణవంతులని మా వారిని మేము పొగడిన అతిశయోక్తియే గాక పక్షపాతము గలవారమను పేరుఁగూడ సంపాదించు కొనవలసి వచ్చును గనుక వారాలాటి వారేయని వ్రాయక తప్పదు ఖూనీ యనిన వారికి భయమిసుమంతేని లేదు కటికవాఁడు నిర్భీతిమై మేకల తలఁదఱుగు నటుల వీరు మనుష్యుల తలలఁ దఱుగుచుందురు వారు పోరఁజొచ్చిన నేదో యొక ప్రక్క కొందఱు నీల్గు వఱకు చాలింపరు ఒక పీనుఁగు పడిన తర్వాత పోరుమన్నను పోరరు ఒక రురిశిక్షఁ జెప్పింప వలెననియు మఱియొకరు విడుదలఁ జేయించుకొన వలెననియుఁ బట్టుపట్టి న్యాయాధిపతులకు న్యాయవాదులకు పోలీసు వారికి దోసిళ్ళ కొలఁది ధనమును వెచ్చించి రెండు ప్రక్కల లక్షాధికారులుగా నుండిన వారు భిక్షాధికారు లగుచుండిరి అందువలన వారి యొద్ద ధనము వర్తకుల యొద్ద నుండు నటులఁ జాల కాలముండకుండెను

ఉయ్యాలవాడలో నుండు రెడ్లు ఇట్టి వారెయైనను వారిలో మంచి గుణశాలి యొకఁడుండెను అతనికి రూపవతియగు పరస్త్రీ కనఁబడిన పశుతుల్యుఁడగునను మచ్చ యొకటి తప్ప తక్కిన మంచి గుణములన్నియు నుండెను అతని ధార్మికత్వమును గూర్చి హిందూదేశమున వినని వారుండరని చెప్ప సాహసించెదము కలియుగమున మచ్చలేని వారుండుటరుదు గనుక మన ధర్మశీలుఁడగు బుడ్డా వేంగళరెడ్డిగారి కుండెడి యా మచ్చనంతగా బాటింపరాదు అబ్బా! మా యంతరాత్మ యొప్పుకున్నది! అది మనుష్యులకుండు మచ్చలలో నెల్ల కడు నీచమైనదని పురాణము లెత్తి చూపుచుండ అంతరాత్మ యంగీకరించునా?

అట్టి ఉయ్యాలవాడలో మన చరిత్ర జరుగునాటికి నొసము జమీందారు జయరామారెడ్డి వంశీకుఁడగు నరసింహారెడ్డి నెలకు పదునొకండు రూపాయల ప్రభుత్వము వారి వలన తవర్జీ గై కొనుచుండెను అతఁడొక నాఁడు తన భవనము నందలి రహస్య గృహమున తన యిరువురి మిత్రులతోఁ గూడఁ గూర్చుండి చిన్న ముఖము చేసికొని మిత్రులారా! నిన్న మీరు రారను కారణముచేత నా స్థలమున కేగి వాటిని నాశనము జేతమని పరీక్షింప అయ్యో! నోరాడకున్నది మాయమై

పోయినవి అని విచారించుచుండ హితు లాశ్చర్యమానసులై ఏమి విపరీతము జరిగినది! దాని ఫలితమెటులఁ బరిణమించునో కదా! యని యనునంతలో
ఇదిగో ఈ తీరున పరిణమించినది అని యిరువురి రక్షక భటులతోఁ గూడ డిప్యూటీ సూపరింటెండెంటు సర్కిలినస్పెక్టరు వారి యెదుటఁ బ్రత్యక్షమైరి వచ్చిన వారిని జూచి నరసింహారెడ్డి ఏమి? యింత త్వరితముగ వచ్చితిరి? అనెను

డి సూ మిమ్ములఁ బట్టి తీసికొని పోవుటకు

న రెడ్డి మమ్ములనా! మే మేమి చేసితిమి?

డి సూ మీ రేమియుఁ జేయలేదా?

న రెడ్డి లేదు

డి సూ కోవెలకుంట్ల ధనాగారమును దోఁచినది మీరు కాదా?

న రెడ్డి కాదు

డి సూ తహశీలుదారునిది యింకొకరిది తల మీరు నఱుకలేదా?

న రెడ్డి లేదు మేమని మీ కెవరుఁజెప్పిరి?

డి సూ ఎవ్వరైన మాకుఁ జెప్పవలయునా? అందందు విడచి వ్రాసిన యీ రెండు లేఖలు నీవు వ్రాసినవి కావా?

న రెడ్డి కావు మీ కెచట దొరకినవి?

స యి ఈ మీ గోసాయి వెంకన్న గుడిసెనుండి నేనే తెచ్చితిని అని తానొనరించిన దంతయు విశదీకరించుచుండఁగ ప్రక్కనుండిన గోసాయి వెంకన్న ముఖము రక్తహీనమై యుండెను

న రెడ్డి వానిని బట్టి కోవెలకుంట్లను మేమే దోచితిమని యెటుల నిర్ణయించితిరి?

డి సూ అవును మీరే! ఇది సత్యము

న రెడ్డి కల్ల కానివారెవరో యామందు దోషారోపణముఁజేయుటకు ఈ లేఖలను వ్రాసి వెంకన్న గుడిసెలో వేసియుందురు

డి సూ వేసి యుండిన నవి యగ్గిపెట్టెలో నెటులుండును?

గో వెం అగ్గిపెట్టెలోఁ బెట్టియే వేసి యుండవచ్చును

స యి అగ్గిపెట్టెతోఁ గూడ వేసిరా? ఈ వడ్డె ఓబయ్యతో కూడ మాటాడుచు నీవు వేయ నేఁజూడలేదని తలఁచితివా? అని యనఁగా వడ్డె ఓబయ్య దిక్కులఁ జూడసాగెను

న రెడ్డి ఆ లేఖల వలన మేమెట్లు దోషులమైతిమి?
డి సూ ఆ లేఖల రెంటిని జదివిన మీరు దోషులని నిర్ణయింప వచ్చును
న రెడ్డి మేము దోషులము కాము
డి సూ బందిపోటు దొంగలగుదురు కదా
న రెడ్డి దొంగలను శిక్షించువారము
డి సూ అటులైన హంతకులగుదురు
న రెడ్డి హంతకుల మగుటకు మేమెవరిని సంహరించితిమి?
డి సూ తహశీలుదారును మఱియొకరిని
న రెడ్డి తహశీలుదారును బరిమార్చుటకు మా కతఁడు పగవాఁడు కాడే?
డి సూ నీ కతఁడు ఎజముగ పగవాఁడే
న రెడ్డి కాదు
డి సూ నీవు కాదనిన మేము నమ్మెదుమా?
న రెడ్డి నమ్మకున్న నతఁడు మా పగతుఁడని నిరూపింపుఁడు
డి సూ నిరూపించుటకే వచ్చితిమి నిన్ను ఖైదీగా గూడఁ బట్టుకొని పోఁగలము
న రెడ్డి వట్టి భీతికొలుపు మాటలకు నేను భయపడువాఁడను కాను మొదట నిర్ధారణ గావింపుడు
డి సూ కావించెదను వినుము అని తన జేబునుండి యొక కాగితమును దీసి యిటులఁ జదువఁ దొడఁగెను

ఉయ్యాలవాడ

గోసాయి వెంకన్నకు

పూర్వము నుండి ప్రతినెలకు వచ్చెడి తవర్జీ పదునొకండు రూపాయలకు నేఁడు తహశీల్దారు నొద్దకు కోవెలకుంట్లకు మనుష్యుని బంపి యుంటిని అందుకు తహశీల్దారు తవర్జీ నియ్యకుండుటయేగాక నన్ను నీచముగ దూషించి యున్నాడఁట తవర్జీని సర్కారు వారు తీసి వేసి యున్నారను సంగతి తెలియనాయెను తీసివేసినఁ దీసి వేయుదురు గాక! నేను దానిపై నాధరపడియుండలేదు కదా? ప్రతినెలకు వారిచ్చెడి పైకము నన్నియ్యమనిన వారి కియ్యఁగలను నేను దానికై వారిని జులిమి జేసి యడిగిన వాడను గాను తీసివేసినారని చెప్పియుండిన నే నూరకుండక పోతినా? నిష్కారణముగ నన్ననేక దుర్భాషలనాడి యున్నాఁడఁట వానిని నేనిచట వ్రాయఁజాలను ఆ

దూషణలఁబడి యీ ప్రపంచమున బ్రతికి మావారి కపకీర్తిఁ దెచ్చుటకంటె ప్రాణములఁ బాయుటయే శ్రేయస్కరము గదా! జన్మించిన దాదిగ ఇతరులతో మాట పడని నాకు నేఁడు మచ్చ కలిగినది ఆ మచ్చఁగలిగించిన తహశీల్దారు శిరమును క్రింద దొర్లు నటుల నఱుకనిదె నేను నిద్రింపఁజాలను ఈ సమయమునకుఁ దగినట్లె ప్రభుత్వము వారు గ్రామనౌకర్ల యీనాములను తగ్గించి కొందఱిని పనినుండి తొలగించి యున్నారు వారు గూడ మనకు సహాయము రానున్నారు మూఁడు రోజులలోఁ గోవెలకుంట్లపై దాడివెడల నున్నాము వడ్డె ఓబయ్య కూడ వచ్చి యున్నాడు నీవు కూడ తప్పక రావలయును ఆలస్యము చేయకుము

ఇట్లు
నరసింహారెడ్డి

అని లేఖను చదివి ముగించు వఱకె నరసింహారెడ్డి తన మిత్రులకు సైగఁజేసెను కాఁబోలు ఏమరు పాటున వారికిఁ దెలియకుండ మమ్ముల మీరు బట్టుకొనఁ జాలరు మీ ప్రాణములఁ గాపాడుకొనుఁడు అని వారి కన్నుల కగపడకుండ చీఁకటిలో నదృశ్యులై పోయిరి

అంతట డిప్యూటీ సూపరింటెండెంటు తక్కినవారును అయ్యో! వచ్చిన తోడనె కాళ్ళకుఁ జేతులకు శృంఖలములఁ దగిలించి యుండిన బాగుండునే! ఇపుడేమి చేయవలయును? ఈ కారు చీకటిలో నెచ్చటికేగి యుందురో కదా! అని యనుకొనుచు రక్షక భటులతో నా సంగతి కడప కల్కెక్టరు గారికి బంపి వారిని బట్టుట కింకను కొందఱిని సహాయము పంపుమనియు సిపాయిలకు పైవారికి వ్రాయు మనియు వ్రాసి నరసింహారెడ్డిని బట్టుటకు తగిన ప్రయత్నము చేయుట కేగిరి



## పదునేడవ ప్రకరణము

# బంధ విముక్తి

ఇదివఱకు శిరశ్శూన్యమగు రెండు కళేబరములను కడప కల్కెక్టరు గారు వైద్యాలయమున నుంచి డాక్టరుగారితో చెడిపోకుండు నటుల భద్రపఱుచుమని కట్టడి చేసి యుండ అతఁడటులనే జాగరూకుఁడై మెలంగుచు వానిని తన ప్రాణములఁ

బోలె కాపాడుచుండె అధికారుల యాజ్ఞ మెడ మీది కత్తిగదా! మండలాధికారి డిప్యూటీ సూపరింటెండెంటును సర్కిల్ యినస్పెక్టరును తలలను వెదకి పంపుడని యాజ్ఞ ప్రసాదించి యిప్పటివఱకు చాల ప్రొద్దులైనది కాని తలలటుండ వారి జాడయె తెలియనందులకు నేమైరో యని చింతించుటకుమాఱు వారిని కనబడిన తోడనే నిలువునకు మ్రింగి వేయునంతటి కోపాతి రేకము గలవాఁడై యుండెను కల్క్టెరొకనాఁడు శవము లెట్లున్నవో యని పరీక్షించుటకు వైద్యశాలకేగి డాక్టరుగారూ! మొండెము లేమైనవి? అని ప్రశ్నించెను

డాక్టరు అచ్చటనే యుంచినాను
కల్క్టెరు ఇటీవల వాటిని జూడలేదా?
డాక్టరు చూచితిని
కల్క్టెరు ఎన్నిసారులు? ఒక్కసారియే కదా?
డాక్టరు కాదు అనేక పర్యాయములు చూచితిని
కల్క్టెరు చెడిపోయినవి కాఁబోలు
డాక్టరు లేదు
కల్క్టెరు ఎప్పటి వఱకు చెడలేదు?
డాక్టరు నేఁటి వఱకు
కల్క్టెరు మంచిది జాగ్రత్తగ మెలంగ వలయు
డాక్టరు అయ్యా! ఇప్పటికే చాలరోజులైనవి ఇఁక రెండు రోజుల కంటె నెక్కువ యుండవని తోచెడిది
కల్క్టెరు అట్టులనిన నెట్లు? కాపాడు భారము వైద్యశాఖ వారగు మీపై నున్నది అది మాకు సాధ్యము కాదు వాటిని గాపాడుచున్నారా? లేదా? యని పరిశీలించెడి యధికారము మాత్రము మా కొసఁగి యున్నారు కాపాడనిచోఁ గలుగు ఫలమనుభవించెదవు
డాక్టరు అయ్యా! నేను దేవుఁడనా? ప్రాణము లేని వెన్నిదినములు బాగుగ నుండగలవు? వైద్యశాస్త్రములలో నియమించిన కాలము మీఱిన చెడక మానవు అంత వఱకు శాస్త్రముల ప్రకారము జేయవలసిన పనులను జేసి ప్రయోగింప వలసిన క్రియలను ప్రయోగించి కాపాడితిని ఇఁకరెండు దినముల కంటె నెక్కువ రోజు లుండవు ముందుగనె మీకు నివేదించు చున్నాను

కలెక్టరు దానికి నీవేమి చేయగలవు? నే నేమి చేయగలను? పైవారినుండి మాట రాగలదని చెప్పితిని ఇరువురకు మాట రాకుండ మెలంగవలయును

డాక్టరు కాదండీ! శిరముల జాడ యింతవఱకు తెలియకుండుటకు గతంబేమి?

కలెక్టరు వాటికొఱకు అనేకవిధముల ప్రయత్నములఁ జేయించుటయే గాక స్వయముగ నేను గూడ వెదుకుచున్నాను గాని ఫలమింతయేని గానరాకున్నది

డాక్టరు వాని యాశ వదలవలయునదే!

కలెక్టరు వదలుటెట్లు? ఇంకను వెదుకుచునే యున్నారు

డాక్టరు ఎన్నిదినములు? ఇఁక రెండు రోజులు దాటిన దొరకియు ప్రయోజనము లేదు కదా?

కలెక్టరు కానిమ్ము ఎటులగునో చూతము

డాక్టరు ఆ శిరములతోఁ బనియేమున్నది?

కలెక్టరు అబ్బా! అవి లేకున్న సంహరింప బడిన వారి పేరెటుల దెలియును? అని యనుచుండ దవ్వునను యిరువురు రక్షకభటులొక మూటని గొని వచ్చుచుండ రక్షక భటులు క్రొత్తవారైనందున వారి వంక వేగిర పాటుతో జూచుచుండ వారును సమీపించి నమస్కారము జేసి కాగితము నొసఁగి మూటను విప్పి రెండు శిరములను జూపిరి అప్పుడు కలెక్టరును డాక్టరును సంతోషముతో వారిని సాయంకాలము రమ్మని సేవకునిచే తలలను మోయించుకొని గదిలోనికి వెళ్ళిరి

కలెక్టరు డాక్టరుగారూ! ఆ కళేబరములను దీసికొని రండు అతికించి చూతము

డాక్టరు చిత్తము అని శవములను దెప్పించి యందున్న తెల్లజాతి బల్లపై బెట్టించి తలలను వాటికిఁ గూర్చగా కలెక్టరు బాగుగఁ బరీక్షించి వాఱిలో నొకఁడు తహసీలుదారుఁడనియు మఱియొకఁడు బొక్కసముకడ నుండు హరిసింగనియు నిర్ధారణఁ జేసి తనచేతి యందుండు కాగితమును జదివి

డాక్టరుగారూ హంతకులు గూడ ఫలానవారని తెలసి యున్నది వారు దొరికియుఁ దప్పించుకొని పోయిరట ఇఁక వారిని బట్టుట కడు సులభము నేఁడు కొందఱు సిపాయులను బంపుమని పైవారికి వ్రాసెదను ఇఁక నీ శవములను బూడ్పింపుము అని తానొక కాగితమును దీసికొని యేమో వ్రాసి సేవకునితో కారాగృహాధికారి కిమ్మని చెప్పి పంపెను

కారాగృహమునం దిరువురు కూర్చుండి, యేమొ మాటలాడుచు, అందొకఁడు ''సోదరా! ఆ పరంధాముఁడు దక్క మనలనెవరును యీ విపత్తునుండి దరిఁజేర్చువారు లేరు గదా! దైవమునకు మాఱు దైవమును, జనకునకు మాఱు జనకుఁడును నగు భూపాలుఁడు కావవలెనన్నఁ గావఁగలఁడు. కాని మనరాజెక్కడ నున్నాడో మనకె తెలియదయ్యె. అయ్యో! చక్రవర్తి న్యాయపాలనావిచక్షణుఁడు కానిచో క్రిందటి యధికారుల యాగడముల భరింప మానవ మాత్రుల కలవి యగునా? ముప్పొద్దుల దైవచింతన చేయుచు మనకుండిన దానిలో దినియో, తినకనో కాలము గడుపుచుండ, వరాల మూటను గోల్పోయిన వారి భంగి వెదకుచు వచ్చి మనల కారాగార బద్ధులను జేయుట న్యాయమని వారికిఁ దోఁచుట మన చెడుదినముల ప్రభావమో, లేక వారి యన్యాయ ప్రవర్తనమో, తెలియరాదు గదా? పాలకుఁడు ప్రజల మధ్య తిరుగుచు న్యాయాన్యాయములను పరికింపని రాజ్యము రామరాజ్యమనిపించు కొనదు గదా! లోగడ మన రాజులు ప్రచ్ఛన్న వేషములతోఁ బ్రజల మధ్య తిరుగుచు మంచి చెడ్డల నారయుచున్నందున గదా న్యాయపాలకు లనిపించుకొనిరి? నీ బోఁటి సామంత ప్రభువులు స్వేచ్ఛగ తమ చిన్ని రాజ్యములను బాలించు చుండిరి?

**క.** **రాజునకు ప్రజ శరీరము**
**రాజు ప్రజకు నాత్మ గాన - రాజుఁ బ్రజయుఁ**
**రాజోత్తమ యన్యోన్య వి**
**రాజితులై యుండవలయు - రక్షార్చనలన్.** **(భారతము)**

- అనెడి మాట లీ కాలమున కసత్యములు గావలసి వచ్చెగదా! అని వ్యసనముతో బలుకఁ బ్రక్కనుండు నతఁడు ''అన్నా! మన విధి యిటులుండ దుఃఖించినఁ బ్రయోజన మేమి? పూర్వమున మన మేరిని కారాగారములఁ గుందఁ జేసితిమో; లేకున్న మనకీ ప్రాప్తి యేలఁ గలుగును? ఒక శుకరాజమును ప్రేమమై పెంచు నపేక్షచేఁ బట్టి, కారా గృహమనిపించుకొనకున్నను దానిని బోలియుండు పంజరమున వేసి స్వేచ్ఛను మాన్పి యున్నందున గదా మునుపు రామదాసు గారు చెఱసాలలో గుందవలసి వచ్చెను? ఆ రీతి మన మెవరి నన్యాయముగ శిక్షించితిమొ యాఫల మనుభవించు చున్నాము. రాజుగాని మఱి న్యాయాధిపతికాని యన్యాయముగా శిక్షించిన తాను గూడ మఱియొక జన్మమున నట్టి శిక్షనే యనుభవింపకఁ దప్పదనుట నేఁడు స్వయముగ దెలిసికొనఁ గలిగితిమి. అన్నయ్యగారూ!

శా నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్ - నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతింజెందిన సంపదల్ నిలువనీ - గాఢంబుగా పోఁగనీ
పూతంబప్పుడ పొందనీ నియతిమై - కానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్య పదంబు దప్పరు గదా - నిత్యంబు ధీరోత్తముల్ (భర్తృహరి)

కనుక నిపుడధైర్య పడుట వలన నేమి ప్రయోజనము? మనము న్యాయ ప్రవర్తనులమై యున్న మనపై మోపఁబడిన నేరము తనంతట తానె తప్పి పోఁగలదు మనము నిందితులము కాదను సంగతి లోక విదితము గదా! ఇపుడన్యాయముగ శిక్షించిన వారలే మనము నిర్దోషులమని యొప్పుకొని విముక్తులఁ జేయు కాలము రాకపోదు అప్పుడు గదా వారు తామాచరించిన దుష్కృత్యములకై పశ్చాత్తాప పడి మన్ననఁ గోరుట ఇపుడు రాకున్న నిక కొన్ని దినములకైన నట్టి కాలము రాకపోదు ఆ కాలమును సత్వరముగ ప్రసాదింపుమని రామదాసును విముక్తిని జేసిన శ్రీరామచంద్రుని భజింతము

సీ కరిరాజ వరద! నే - శరణు వేఁడినఁ గాని
కరుణ నీ మది నేలఁ - గలుగదయ్య
పద్మాక్ష! నా పాప - భరమింక నెందాఁక
విలపింప జేయునో - తెలుపవయ్య?
శ్రీనాథ! నిరతంబు - నీ నామ భజనంబుఁ
జేసిన ఫలమేమొ - చెప్పవయ్య?
ఇందిరా రమణ ! నే - నెంత పాతకినైన
నెందును నిను నమ్మి - యుందు నయ్య?

తే గీ ఏల? కృపగల్గదేల? నా-జాలిని విన
వేల? నా బాధలను జూడ - వేల? కోప
మేల? మాటాడవేల? నీ - కింతచలము
చాలు నా స్వామి రామ! న - న్నేలు కొనుము'' (రామదాసు)

అని దేవుని ప్రార్థించుచుండ సేవకుఁడొక కాగితమును గొనివచ్చి కారాగృహాధి కారికియ్య అతఁడు చదువుకొని బంధిఖానాను దెరచి నారాయణ రాజుగారూ! మిమ్ములను మీ యన్నగారగు వేంకట్రామరాజు గారిని నిర్దోషులనియు కారాగృహ విముక్తులఁ జేయుమనియు కలెక్టరుగా రాజ్ఞ ప్రసాదించి యున్నారు మీరు మీ గ్రామములకు వెడలవచ్చును అని కలెక్టరు గారి యుత్తర్వును జూపి బంధ విముక్తులఁ జేసెను

## పదునెనిమిదవ ప్రకరణము

# సంబంధము ముగియుట

నంద్యాల నారాయణరాజుగారు వేంకట్రామరాజుగారును కారాగృహము నుండి విముక్తులు గావింపఁబడిరి నారాయణరాజుగారు తమ యన్నగారిని కడప నుండియే చిట్టివేలునకుఁ బంపి తాను మాత్రము ఔకును జేరి యథావిధిగా కాలము గడపు చుండిరి నారాయణరాజుగారు సంవత్సర మొకటికి యిరువది యేడు వేల రూపాయల సర్కారు పేష్కస్తుఁ జెల్లించుచు ఔకును బాలించు చుండిరి వీరు 1907వ సంవత్సర మున స్వర్గము నలంకరించిరి తర్వాత వారి పుత్రులు తిమ్మరాజుగారు కిచ్చమరాజుగారు రాజ్యము చేయుచు కొన్ని సంవత్సరములకు రాజ్యమును గోల్పోయిరి రాజ్యము పోవుటకు సరియగు కారణము మాకు దెలియనందున వ్రాయజాలము వీరికి తర్వాత ఆ వంశము వారికి ప్రతి మాసమునకుఁ గొంత తవర్జీ వచ్చుచుండెను గాని కలికాల ప్రభావము వలననో ప్రభుత్వము వారి యనాదరణ వలననో లేక యిపుడు ఔకునందున్న నంద్యాల వీర రాఘవ రాజుగారి దినములు మంచివిగాకనో ఆ తవర్జీని గూడ నాఁపివేసి బీదస్థితి యందున్న వీరరాఘవరాజుగారిని చిక్కుల పాలు గావించిరి ఈశ్వరుఁడు వారికి మునుపటి యైశ్వర్యములఁ బ్రసాదించు గాత!

ఇఁక చిట్టివేలిలో నుండు తవర్జీదార్ నంద్యాల వేంకట్రామరాజు గారి పర్స్థితులఁ గొంత పరికింతము వారు చిట్టివేల్ చేరిన కొన్ని రోజులకె కడప కలెక్టరు గారి యొద్దనుండి ప్రతినెలకు వచ్చుచుండెడి తవర్జీ పదమూడు రూపాయల నియ్యకుండ ఆపుదల జేసినటుల ఉత్తర్వయిన దనియు కావలసియున్న బోర్డు వారి కపీలు జేసికొమ్మని యొక యుత్తర్వు వచ్చెను అందులకు వేంకట్రామరాజుగారు చాల చింతిల్లుచు నూరకుండుట పాడిగాదని బోర్డు వారికి క్రింది విధముగ వ్రాసి కొన్నట్లు తెలియు చున్నది

మహారాజ రాజశ్రీ రివిన్యూ బోర్డువారి సముఖానకు

కడప జిల్లా చిట్టివేల్ తాలూకా తవర్జీదారు నంద్యాల వేంకట్రామ రాజువారు సల్లాములు చేసి వ్రాసుకొన్న మనవి అర్జి యేమనగా

కుంపిణీ లాగాయతు నుంచి సదరు తాలూకాలో నెల ఒకటికి పదమూడు రూపాయల తవర్జీ అనుభవిస్తు సదరు తాలూకాన్ను మజరా ములక్కాయల పల్లెలోను

కాపురస్థులమై యుండి పరాభవ సంవత్సరం అనగా 1845వ సంవత్సరములో కోవెలకుంట్ల తాలూకా ఔకు అనే గ్రామంలో మా తమ్ములు వుండగా వారి భార్య కాయిలతో నున్నందున ఆ వర్తమానము మాకు తెలిఁ వారిని చూచే కొరకు మేము ఔక్కు పోయివుండగా ఆ సమయంలో ఉయ్యాలవాడ నరసింహారెడ్డి అనేవాడు సర్కారుకు యతిరాజై దిద్దునడుపుతూ వుండే సమయంలో ఔకు నారాయణ రాజు వారిమీద కలెక్టరు వారికి అనుమానము కలిగి వారిని కైదుకు చేర్చిన సమయములో నేనును అక్కడనే వున్నందున నన్ను కైదుకు చేర్చి కడపకు పంపించి నంతట కోర్టు దొరవారి విచారణ వల్ల తప్పితం సాబూతు కానందున మూడు సంవత్సరములు జామీను నిష్కర్ష చేయడంలో నారాయణ రాజుగారితో పాటు మాకు కులాసా చేసినారు ఆ లాగాయితి నాకు నడుస్తూవున్న తవర్జీ అనామత్తు చేసినందున జామీను మూడు వత్సరములు వెళ్ళించి కలెక్టరు కాకరేన్ దొరవారి తావుకు వచ్చి మన్వి చేయగా బోర్డు వారికి మీ సంగతి తెలుపుకో వలసినదని హుకుం యిస్తామని సెలవు యిచ్చినందున సముఖానకు అర్జీ వ్రాసుకున్నాను కలెక్టరు కాకరేన్ దొరవారి దావా వల్ల యింత దూరము అయినదే కాని లేకపోతే నిరపరాధిని చుట్టము పోగిగా చూడబోయి నందుకు కర్మవశాత్తు సంభవించినది మరొక వృత్తిగా జీవనము చేయవలసిన వారము కాము నేను నా భార్యలు యిద్దరు నాకుమారుడు కోడలు యిద్దరు కుమార్తెలు నా తమ్ముని భార్య ఆమెకు కుమార్తె యిక్కడ నన్ను నమ్మి చూపెట్టుకొన్న జనము ఈ యావజ్జనము యీ జీవనముతో బ్రతుకవలసినది గనుక ధర్మ ప్రభువులు పేదవాడనైన నా మీద అంత కరణ యుంచి నా జీవనము నాకు దయచేసి నన్ను సంరక్షణ చేయవలెనని కోరుతూ యున్నాను

చిట్టివేల్ ఇట్లు
26 11 1850 నంద్యాల వేంకట్రామరాజుగారు

ఈ రీతి వ్రాసికొన్న రివిన్యూ బోర్డు వారీ విధముగా బ్రత్యుత్తర మొసంగి యున్నారు

Entered No 2484 of 1850

From Nandyal Venkata Rama Raju Garu, Targedar of Chittivel in the Jilla of Cuddapah

(True Copy) 28 December 1850

కడప జిల్లా చిట్టివేల్ తవర్జీ దారుఁడైన నంద్యాల వేంకట్రామరాజుగారి యొద్దనుండి వచ్చిన అర్జిని దాఖల్‌చేసికొనిన అర్జీ నంబరు 2484 / 1850.
(By order)

Praying for the continuance of an allowance of Rs.13 per mensem, which was stopped from his having been falsely implicated in the out break of Narasimha Reddi of Uyyalavada.
(True Copy)

ఉయ్యాలవాడ నరసింహారెడ్డి గలభాలో అన్యాయముగ ముద్దాయని నిర్ణయించి మొదటినుండి వచ్చుచుండిన పదమూడు రూపాయల తవర్జీని మఱల నీయుడని ప్రార్థన.

ఈ తీరున కలెక్టరు వారు పైవారికి వ్రాసి పంపిరి. అందులకు ప్రభుత్వము వారిచ్చిన ఉత్తర్వు.

Under the order of Government dated 20th December 1847, the allowance of pension having been resumed; the Board cannot comply with his Prayer.

The Revenue Board office,
Fort St. George,
7th February, 1851.

గవర్నమెంటువారు పదునెనిమిది వందల నలువది యేడవ సంవత్సరము డిశంబరు నెల యిరువదవ తేది యిచ్చిన యుత్తర్వు ప్రకారము తవర్జీని రద్దు చేసి యున్నారు గనుక రివిన్యూ బోర్డువారు పై యుత్తర్వునే అంగీకరించిరి.

రివిన్యూ బోర్డు ఆఫీసు,
సెంట్ జార్జి కోట
7, ఫిబ్రవరి, 1851

ఈ తీరున జవాబొసంగి యున్నారు. ఔరా! చూచితిరా! ఎంతటి కఠిన హృదయుఁడైన నిట్టి జవాబొసంగ గలఁడా? నంద్యాల వేంకట్రామరాజుగారెంతటి బీదస్థితిలో నుండిరో! లేకున్న నంత దీనముగ వ్రాసికొని యుందురా? వారి వంశము వారు సహిత మొకప్పుడు ప్రజలను బాలించి యుండిన వారేకదా! అట్టి వానికి దీనదశ సంప్రాప్తమైనపుడు వారికి క్రొత్తగా నీయకున్నను అనాదిగా వచ్చుచుండెడి తవర్జీనైన నిచ్చి

యుండరాదా? పదమూఁడు రూపాయలే కదా! బజారున బోవునపుడు బిచ్చగాడు సామాన్యులగు మనల యాచించిన లేదనక శక్తికొలది ధర్మ మాచరింతుమే! ఇఁక సర్కారు వారికి పదమూఁడు రూపాయలన్న నెంత? వారొనరించు ననవసర వ్యయములకు జేయుదానిలో పాఠకులారా! ఇఁక నక్షర మిడిన రాజకీయ విషయములలో దాఁగిన వారమగుదుమను భీతిచే వ్రాయ సాహసింప మైతిమి ఎందులకన అదిమా పని కాదు ఆ సంగతులను విపులముగా చర్చించు వారు వేఱుగా నున్నారు పాపము! నంద్యాల వేంకట్రామరాజుగారి సంగతి ఎమ్మట నేమాయెనో తెలియనందులకుఁ జాల చింతిల్లుచున్నాము మన చరిత్రకును ఔకు నారాయణ రాజుగారికి చిట్టివేల్ వేంకట్రామరాజు కుండెడి సంబంధ మింతటితో ముగిసినది ఇఁక మన కధకు వీరి చారిత్ర మడ్డుపడదని మా పాఠకులు దెలసికొందురుగాక!



## పందొమ్మిదవ ప్రకరణము

## మోసము

డిప్యూటి సూపరింటెండెంటు గారు తన కార్యస్థానమున కేగిన సమయమున పగలు సుమారు రెండు గంటల వేళ నొక పురుషుఁడు ఎండ వేడిమికిఁ దాళఁజాలకనో లేక యెవ్వరైన గుర్తింపకుండుటకో తలపై నొక వస్త్రమును గప్పికొని బిరబిర డిప్యూటీ సూపరింటెండెంటు గారి యింటి గుమ్మము కడకేగి తలుపు తట్టి అమ్మా! అమ్మా! యని రెండు మాఱులు బిలచెను ఆ శబ్దమును విని లోపల నుండి సూపరిండెంటు గారి భార్య ఎవరండీ? యని పలుకుచు కవాటమును దెఱచెను వెలుపల నుండిన పురుషుఁడు వెంటనే అమ్మా! అయ్యగారికీ యుత్తరము నిండు అని తిరిగి బదులు మాటాడక త్వరితముగ వెడలఁదొడగెను ఆమె లేఖనుగొని యెవరు పంపిరో యడుగుదమని చూచు నంతలో వాడొకింత దూరమేగి యుండెను ఆమె జాబెవరు పంపిరో యడుగనైతినే యని జింతిల్లుచు వానిని ఎలుగెత్తి పిలుతుమాయని యెంచి మఱల నేదో యొక విధమగు సిగ్గామె నావరించి నందున పిలువకనే గృహములోని కేగెను ఇది కొందఱి యధికారుల భార్యలకుండు నైజగుణము తమ కార్యముల పట్ల సహిత మితరులతో మాటాడఁదలంపరు కార్యభంగమున్నకైన సహింతురు గాని తమ నోరు విప్పి మాటాడ నొల్లరు బహుశా పరులతో మాటాడిన

తమ శీలమును గురించి యితరు లనుమాన పడుదురని భయమున నటు చేతురు గాఁబోలు! తమయందేలాటి కళంకము లేకున్న నితరులకు వెఱవ నేల?

అట్లు భీతిల్లు వారు తమ హృదయమునే నమ్మజాలరని తోఁచెడిని ఆమె యా పురుషుని నొక మాఱుపిలిచి యుండిన వచ్చియుండును ఆ లేఖ నెవరు బంపిరో తెలిసికొని యుండవచ్చును గదా! వ్రాసిన వారు తమ పేరును లేఖలో వ్రాసియుండరా? ఏల యడుగవలెనని ప్రశ్నింతురేమో! ఒకవేళ లేఖఁకుడు జాబువ్రాసిన యతనికి చిర పరిచితుఁడై యుండిన తన పేరు వ్రాయుమాని యుండవచ్చును డిప్యూటీ సూపరింటెండెంటుగారింటికి వచ్చినపుడు ఆమె జాబిచ్చిన తోడనే ఎవరు బంపిరి? అని ప్రశ్నించిననేమి జవాబియ్యగలదు? అటులడుగుట ప్రతివారికి వాడుక గదా! డిప్యూటీ సూపరింటెండెంటు గారింకను గృహమునకు రాలేదు వచ్చిన తర్వాత భార్యాభర్తల సంభాషణ యెటుల జరుగునో విననగదా సర్వముఁ దెలియనగును

అంతట కొంతసేపటికి మూడు గంటలు కొట్టగా సూపరింటెండెంటు గారు ఫలాహారమునకై యింటి కరుదెంచిరి ఆయన వచ్చి తన గదిముంగిట బూడ్సులను విడిచి లోని కేగి కోటును దీసి గోడ కుండిన కొయ్యకుఁ దగిలించి కుర్చీపైఁ గూర్చుండు నంతలో అతని యర్ధాంగి లేఖను దీసికొని వచ్చి యెదుటనున్న మేజాపై నుంచి నిలువబడి ఏమండీ! నేఁడొకింత యాలస్యముగ వచ్చితిరి? అనెను

డి సూ (అందులకు ప్రత్యుత్తర మియ్యక) ఈ కమ్మ నెవరు బంపిరి?

భార్య ఎవరు బంపినది తెలియదు ఒక పురుషుఁడే తెంచి తమకీయుమని చెప్పిపోయెను

డి సూ ఎవరు పంపినది యడుగ లేదా?

భార్య అడుగుటకు ముందే కొంత దూరమరిగి యుండెను

డి సూ పిలిచిన రాక పోయెనా?

భార్య ఏమో గట్టిగ బిలువ నైతిని

డి సూ ఎందులకు?

భార్య ఏమోనండి! ఇప్పుడేమి మునిగి పోయినది? లోపల జూచిన వ్రాసినవారి పేరుండదా?

డి సూ ఉండినది లేనిది నీవు చూచితివా?

భార్య లేదు ఉండునను ఊహచేఁ జెప్పితిని

డి సూ   మంచి యూహ చూచెదను (అని లకోటాను చించి కాగితమును జూచి) అనుకొనినట్లే యైనది ఇందుపేరు వ్రాయలేదు ఎంత యవివేక మొనరించితివి!

భార్య   ఏమోనండి! క్షమించుఁడు

డి సూ   క్షమించక యేమి చేయవలయును! నిన్ను చించినను పేరు దెలియదుగదా? మేము చేయు కార్యములఁ బట్టి యూహించుకొన వలఎ యున్నది

భార్య   అయిన నందేమున్నదో చదువుఁడు

డి సూ   వినుము

ఓరీ! నీవు నన్ను బంధితుని జేయ నీ యనుచరులతోఁ గూడఁ బ్రయత్నించు చున్నావు అది వట్టి యాశయేగాని నీ చేతగాదు నా యిష్టము వచ్చిన చోట నిర్భయముగఁ జరింపఁగలను నా యెడ మీ యాటలు సాగిరావు జాగ్రత్తఁ గలిగి మీ ప్రాణములఁ గాపాడుకొనఁ బ్రయత్నింపుడు

ఇట్లు
మీ పాలిటి జముఁడు

అని చదివి ముగించు నంతలో అతని సహభాగిని నాధా! నాకు భయమగు చున్నది! ఎవరటుల వ్రాఎయున్నారు? అయ్యో! ఎవరికేమి చేఎతిరి? ఇదే నా గుండియలపైఁ జేయి వైచి చూడుఁడు! ఎంత గట్టిగ కొట్టుకొనుచున్నవో! మీరిఁక మీఁదట నిల్లుదాటి వెలుపలికిఁ బోరాదు

డి సూ   తరుణీ! నా యుద్యోగము వెలుపలికికేగకున్నజరుగదే! ఇంటిలోఁ గూర్చుండి మాటలతో బ్రొద్దుపుచ్చి యెపుడో వీలు దొరకినపుడు పనిజేయుటకు రివిన్యూశాఖ కాదుగదా?

భార్య   నాధా! నా మాట వినుఁడు మీ యుద్యోగము లేకున్న మానె మీ కుండిన యాస్తి మీ చదువునకే సరిపోయినను మా తండ్రినీ బ్రతిమాలి కొంత భూమిని సంపాదించెదను దానితో మన పొట్ట పూడదా? ఆ జాబు వ్రాఎన వాఁడు మిగుల దుర్మార్గుఁడుగా నున్నాఁడు మీ యుద్యోగమునకు రాజీనామా నిండు నా జనకు నింటికేగి స్వేచ్ఛగ బ్రతుకవచ్చును

డి సూ   అటుకాదు మా శాఖలో కోరినపుడు రాజీనామా నంగీకరింపరు అదియుఁగాక యిపుడొక అసాధ్యమగు నభియోగము తటస్థించినది అది

ముగియు వఱకు నన్ను విడువరు ఆ భారమంతయు నా తలపై నిడి యున్నారు ఈ లేఖకూడ దానికి సంబంధించిన వారు వ్రాసినదియే యై యుండునని తోఁచెడిని

ర్య ఆ జాబు తెచ్చిన వారి పేరుగాని పంపినవారి పేరుగాని దెలిసికొని యుండిన నెంత బాగుండెడిది! మిక్కిలి యపరాధము గావించితిని క్షమింపుడు ఇఁక మీఁదటనైన మెలకువఁ గలిగి యుందును

సూ నీ వడిగి యుండినను వాఁడు చెప్పి యుండడు వాని యాకారమును జూచిన గుర్తింపఁగలవా?

ర్య వాఁడొకింత సేపైన నాగక ముసుగు వేసికొని వెళ్ళియుండ నేనెట్లు గుర్తింపఁగలను? అంత మాత్రమాగి యుండిన పేరడిగి యుండనా?

సూ ఇఁక నీ పనులఁ జూచుకొన బొమ్ము అనగా నామె వెళ్ళెను డిప్యూటీ సూపరింటెండెంటుగారు తన గదిలోఁ గుర్చీకానుకొని మేజాపైకి పాదములఁ జాచి గోళ్ళను గొఱుకుచు నాలోచించి యాలోచించి

ఔరా! నే నిన్నిదినము లీ శాఖలోఁ బని చేసితిని కాని యిట్టి వింతలను జూచి యెఱుఁగను మా కీ భీతిగొలుపు లేఖలను వ్రాయు చున్నారే! మా శాఖపేరు విన్నంతటనే యెట్టి ధైర్యశాలియైనను భీతిల్లక మానఁడు వీరి ధైర్యమేమన వచ్చును! కడకిది యెటుల జరుగునో కాని యిపుడు మాత్రము మిక్కిలి కష్టమని తోఁచుచున్నది మా ప్రాణములఁ గాపాడుకొనుమని వ్రాసి యున్నాఁడు ఈ తరుణమున మా ప్రాణములు నిలుచుట యరుదు తెలివిలేక యీ శాఖలోఁ జేరితిని కాని ముందుగ నిటుల జరుగునని దెలిసి యుండిన నూరక యింటిలోఁ గూర్చుండి యుందును మా బోటి వారి కష్టములఁ జూచుచు ప్రస్తుతపు యువకులందఱుఁ దాము ప్రవేశ పరీక్షలో యడుగిడి నంతటనే పోలీసు శాఖలోఁ జేరుటకుఁ దగిన పన్నాగములఁ బన్నుచుందురు పిదప మా తీరుననే కష్టదు ఖముల పాలగుదురు వారికిట్టి సంగతులఁ దెలియఁజెప్పి మాన్పించు వారుండిన బాగుండెడిది ఏదెటులుండినను జాబువ్రాసిన వానిని బట్టవలయును గదా! వానిని మేము బట్టి బంధితుని జేతుమో లేక వాడే మమ్ములఁ బట్టి కట్టివేయునో అని యనుకొనుచుండ నెవరో వచ్చిన శబ్దము వినఁబడ గదిలో నుండి తొంగి చూచెను వెలుపలనుండి సర్కిలినస్పెక్టరు గారు వచ్చి నమస్కరింపగా లోనికిఁ దోడ్కొని పోయి యిటులనెను

డి సూ  ఎందు నిమిత్త మే తెంచితివి?

స ఇ  మీరు పిలువనంప నందున వచ్చితిని మఱల నిపు డిటు లనెదరేమి?

డి సూ  (ఆశ్చర్యమున) ఏమీ! నేను బిలువ నంపితినా? ఎవరు చెప్పిరి?

స ఇ  ఇంటిలో నేను ఫలాహారము చేయుచుండు తఱి నొకఁడు వచ్చి నన్ను మీరు బిలుచుచున్నారనియు తక్షణమే పొమ్మని చెప్పుమని నా భార్యతో జెప్పెనట అందువలన ఆలశ్యమొనరించిన మీరే మందురో యని వచ్చితిని

డి సూ  మిత్రమా! ఇది యసత్యము ఎవఁడో మనకు మోసము చేయుచున్నాడు ఇదిగో చూడుము అని జాబును జూపి జరిగినదంతయు విశద పరచి నీవు వచ్చిన తర్వాత వాడింట మఱియేమి మోసము జేసి యుండునో కనుఁగొన బొ మ్మనఁగా అతఁడు మంచిది విచారించి యింటికడ జాగ్రత్తగ నుండుమని మఱల వచ్చెద నని గృహమున కేగెను

అతఁడింటి కేగిన తోడనే యతని భార్య ఏమండీ! ఆ మనుష్యుఁడు పిస్తోలు తోటాల పెట్టె భద్రముగాఁదెచ్చి యిచ్చెనా? అని యడిగెను

స ఇ  (ముక్కుపై వ్రేలిడి) ఏమీ! పిస్తోలు ఎవరికిచ్చితివి? నేనియ్యమని చెప్పితినా?

భార్య  మీరేగిన పదునైదు నిముసములకు ముందటి మనిషి యేతెంచి అమ్మా! అయ్యగారు డిప్యూటీ సూపరింటెండెంటు వెంట నేదో కేసునకు వెళ్ళుచున్నారఁట పిస్తోలును తూటాలపెట్టెను ఇప్పించుకొని త్వరితముగ రమ్మనెనని చెప్పగా వాని కొసఁగితిని మీ కియ్యలేదా?

స ఇ  (తలకుఁ గొట్టుకొనుచు) ఎంత పని చేసితివే! కొంప కూలెనే! ఇఁక జైలు ప్రాప్తియే కానిమ్ము భగవంతుఁడున్నాడు ఆ దుర్మార్గుఁడెందఱిని మోసము జేయుచున్నాడు!

భార్య  ఏమి నాథా! అది మీ కందలేదా?

స ఇ  చోరునిచేతఁ బడినది రాగలదా?

భార్య  అయ్యో! ఎంత మోసము జరిగినది!

స ఇ  సరి ఇఁక మీఁదట జాగ్రత్తగ నుండుము నేను మఱల వచ్చెద

అని మఱల సూపరింటెండెంటు గారిని దర్శించుటకై వెళ్ళెను సూపరింటెండెంటుగా రా దినమున షికారు వెళ్ళుటకుగాని తన మిత్రులను గలిసికొని

సంతోషముగ చీట్లాడుటకు పురమందిరమునకు గాని వెళ్ళక యాలోచనా నిమగ్నుఁడై మునుపటి స్థలముననే గూర్చుండి యుండెను. సర్కిలినస్పెక్టరుగారు వచ్చి విషాదముతో జరిగిన సంగతి మనవి చేసికొని యీ నేరము తప్పిపోవుట కుపాయము చెప్పుఁడనెను. అందుల కాయన ప్రమాదమున జరిగిన దానికి నీవేమి చేయఁగలవు? పై వారికి వ్రాసి నీకేమియు మాటరాకుండ జేసెదను లెమ్మనెను. అందుల కతఁడు సంతోషించి తాను జేయవలసిన కర్తవ్యమును గూర్చి తెలుపు డనఁగా, జిల్లా సూపరింటెండెంటు నొద్ద నుండియు, కలెక్టరు గారి యొద్దనుండియు, అపరాధులను త్వరలో బట్టవలెనని యాజ్ఞయైనది గాన, నీవు వెంటనే తగిన ప్రయత్నముఁ జేయఁబొమ్మనఁగా, చిత్తమని వెళ్ళెను.



## ఇరువదవ ప్రకరణము:

# పట్టఁబోయి పట్టుబడుట

సంక్రాంతి పండుగ ప్రతి సంవత్సరము పుష్యమాసమున వచ్చుటెల్లరకుఁ దెలిసినదే. పండుగ పదునైదు రోజులుండగనే యెన్నడూడువని వీథులను జక్కఁగఁ జిమ్మించుట స్త్రీల పద్ధతియై యున్నది. కొందఱు యువతులు వేకువ జాముననే లేచి, తమ గుమ్మము కడ బాగుగ కసవు జిమ్మి, గోమయ మిళితమగు నుదకమును జల్లి, పంచలను బాగుగ నలికి, యెఱ్ఱమట్టిచేఁ బట్టెలఁదీర్చియు, ముగ్గుచే చిత్ర చిత్రమగు లతల నల్లి, పురుషులనుగాని మఱి పిల్లలనుగాని, యా ప్రదేశ మారువఱకుఁ ద్రొక్క కుండఁ గట్టి కట్టడిఁజేయుచుందురు. ప్రతి గుమ్మము కడ వివిధ వర్ణ పుష్పములఁ దెచ్చి పేఁడ యుండలను జెక్కి, అక్కడక్కడఁబెట్టి, కొంత ప్రొద్దెక్కిన తోడనే వాటిని దీసి యొక బుట్టలో వేసి భద్రపఱతురు. ఈ పువ్వులఁజెక్కు నుండలనే వారు ''గొబ్బిళ్ళు'' అని పిలుతురు. ఇఁక సాయంకాలమైన తోడనే, పదునైదు రోజులు, తమ యింటిలోని పనులను జాగ్రత్తగఁ జేసికొని, ఒకరి యింటి కొకరు పేరంటమున కేగుచుందురు. ఈ పేరంటములు సహితము ప్రత్యేకముగా గొబ్బి తట్టుటకై యేర్పఱచి నటులున్నది. పది పండ్రెండుగురు స్త్రీలు ప్రోగై, ఒక్క దీపపు సెమ్మెను మధ్యనుంచి, దాని చుట్టు పాటలఁబాడుచు, వింత వింత యాటల నాడుచు, నెగురు చుందురు. ఈ యలవాటెందులకు మన పూర్వులు వాడుక లోనికిఁ దెచ్చిరా యని యోచింప, స్త్రీలకు సాధారణముగ సాయం సమయముల పరిశ్రమ చేయుట కవకాశ

ముండదనియు నా పదునైదు రోజులైన వారి కీ విధముగ పరిశ్రమ గలిగించుట కీ పన్నుగడఁ బన్ని యుండ వచ్చుననియుఁ దోచుచున్నది ఆహా! పూర్వీకుల బుద్ధి చాతుర్య మేమన వచ్చును! హిందూమతమున నున్న యన్ని యాచారములకు గారణములఁ గల్పించి యున్నారు అన్ని యలవాటులకుఁ గారణములఁ జూపవచ్చును గాని యిచట మన కక్కఱ లేనందునను పాఠకులకు విసుగు జనించు నను సందేహమునను వ్రాయమైతిమి గ్రామములోని గరిత లందఱును నీతీరున ప్రతిదినమును గడపుచు పండుగ రోజున వారు సేకరించిన గొబ్బిళ్ళను దాలిఁబెట్టి యాసెగపై క్షీరాన్నమును వండి యితర వంటకములతోఁ గూడ దానిని భుజించి సంతృప్తిఁ జెందుట వాడుకయై యున్నది

సంక్రాంతి నాటి సాయంకాలమున నా యా యూళ్ళలో నుండు దేవునికి నుత్సవమును జేయుదురు ఆ దినము భగవంతుఁడు వేఁటాడ వెడలునని విగ్రహము నూరి బయటికిఁ దీసికొని పోదురు పొలములో దేవుని పీఠమును దింపి దేవుని యెదుట జనులందఱుఁ గూర్చుండెదరు అప్పుడు వేశ్యలు తమ నాట్యమును ప్రారంభించి గాన మాధుర్యము చేతను అభినయముల చేతను తమ స్నేహితుల నానందింపఁ జేయుదురు ఎదప కొందఱు పెద్దవారు లేచి యిఁక వేఁట ప్రారంభింత మనఁగా యువతులందఱు తమ వస్త్రముల నడిమికి బిగియించి సంసిద్ధులై యుండ అంతకు ముందె దెచ్చి బుట్టలో భద్ర పరచిన కుందేటిని బయట విడతురు అది యా గుంపును జూచి భీతిచేఁ బరుగెత్తగా వారందఱేకమై దాని వెంట నంటి కాలునొకఁడు తోక నొకఁడు నడుము నొకఁడు బట్టి దాని నిండు ప్రాణములఁ గొందురు అట్లు చనిపోయిన కుందేటిలో గ్రామ నౌకర్లకును పట్టిన వారికిని భాగములఁట ఇద్దఱు లేక ముగ్గురు ఒకటే సారి దానిపైఁబడి నేను ముందు బట్టితి నని యొకఁడనును కాదు కాదు నేను ముందు బట్టితి నని మఱి యొకఁడను ఈ తీరున వాదులాడి యావాదే పెద్దదై చిన్న చిన్న యుద్ధములు కూడ జరిగి కొన్ని చోట్ల ప్రాణములఁ గోల్పోవు చున్నారు సోదరులారా! చూచితిరా! ఎవరు వేఁటాడినది? దేవుఁడా లేక పురజనులా? ఇత్తెఱఁగెల్లఁ జూడ పురజనులే వేఁటాడుచున్నారుగాని దేవుఁడు తానుండిన పీఠము నుండి కదలుట లేదు కదా! ఆ పరంధాముని పేరుఁజెప్పి ఆ మృగము నిండు ప్రాణముల హరించుట సమంజసముగ నున్నదా? భగవంతుఁడు తాను వేఁటాడకున్న జరుగదని మొరఁబెట్టుకొనెనా? లేక మీరు దాని నా విధముగ సంహరింపనిదె పురప్రవేశము గావింపననెనా? ఆ దేవుఁడటులని

యుండిన ఆ నోరెరుగని ఆ నిరపాయకరమగు ఆ సొగసైన కుందేటిని జంపుటకంటె దేవునినే యూరి వెలుపటఁ బాఱవైచి వచ్చుట కడు శ్రేయస్కరమని గట్టిగఁ జెప్పఁగలము ఆ లోకనాయకుఁ డెన్నటికైన దానిని జంపుమని చెప్పునా? ఆయన మనవలెనే దానిని గూడ సృజించెను అతఁడా కుందేటికిని మనకును గూడ తండ్రివంటి వాఁడు తండ్రి తన బిడ్డలఁ జంప నిచ్చగించునా? లేదు లేదు! ఆయన పేరు జెప్పి కావలయునని దానిని మనము సంహరించి సంతోషమును బొందుచున్నాము నాయనలారా! వట్టి యనాచారములఁ జేసి పవిత్రమగు హిందూ మతమును హాస్యాస్పద మొనరించుచున్నాము హిందూమతము వేదమతమే! మతములన్నిటికి తల్లివంటిదే! అట్టి మతమునకా మనము కళంకమును దెచ్చి పెట్టుట? ఓ విప్రోత్తములారా! గ్రామాధికారులారా! ధర్మకర్తలారా! పూజారులారా! మా యందు దయయుంచి సంక్రాంతి పండుగనాఁడు దేవుని వేఁట నెపమున కుందేళ్ళను సంహరించు నాచారమును బోఁగొట్టి హిందూమతమున కుండు కళంకములలో నొక కళంకమును బాపి మతోద్ధారకులుకండు -ఈ కార్యమును నేటినుండియే ఆచరణ లోనికిఁ దేవలయును

సంక్రాంతి పదునైదు రోజులుండగనే స్త్రీలు గొబ్బిళ్ళు ఎంత పట్టుదలతోఁ బెట్టుచుందురో యా విధముననే రేనాటి రెడ్డి ప్రముఖులు కోడి పందెమును మిగుల పట్టుదలతోఁ జేయుచుందురు ఇతర సమయములలోఁ గూడ కోడి పందెములఁ జేయుదురు కాని పండుగ ముందటి దినముల వంటి పట్టుదలతోఁ జేయరు సాధారణముగ కోడి పందెములఁ బురివెలుపటనుండు వనములలోఁ జేయుదురు

కుక్కుట యుద్ధ భూమికిగా నేర్పఱచిన స్థలము వంక మరలుఁడు ఏమా సందడి! తప్పెట్లతోడను మేళముల తోడను కొమ్ముల తోడను కొందఱు బండ్లెక్కియు కొందఱు నడచియు కారుకోళ్ళను వంకపందు కుక్కుటములను డేగ బూడిదవన్నె పుంజులను నెమిలిరంగు ఎంగిళి పట్టెజుట్టు మయిలపుట్ట మిట్టు గూబ పిలుక జుట్టు అరజుట్టుఁ గల పలువిధములగు పుంజులను చంకన బెట్టుకొని కుక్కుట రణ రంగము నలంకరించు నరాధములఁ జూచిన సంతోషముగనే యుందురుగాని పాపమా! దీన వదనములతో నుండు కోడి పుంజులను జూచిన దుఃఖము కలుగును కదా!

అటులా స్థలము నలంకరించి తమ దాపుననే చెట్లక్రింద బెట్టియుండు కల్లంగడికిని సారా దుకాణమునకును బోయి మనసార ద్రావి కోడిని బట్టుకొని పందెము చేయ సంసిద్ధులగుదురు

కోళ్ళను విడుచు ప్రదేశమంతయు చక్కగ నూడ్చియుండి చుట్టు కొంత దూరమున పెద్ద మనుష్యులును పై పందెగాండ్రును గూర్చుండుటకై కంబళములఁ బఱచి యుందురు అంతట పుంజులుగలవారు తమ కోళ్ళను చంకనిడుకొని తాము వాని కలంకరించిన కాళ్ళబొద్దులను వెండి గజ్జెలను రావి రేకులను ఇతరులకు జూపించుచు వచ్చి యొకరి కోడి నొకరు రెండు కరముల పైకెత్తి చూచి పోరుఁ బెట్టుటకు సంసిద్ధులు కాగా పందెగాండ్రు ఈ కోడి గెలుచునని యొకఁడును కాదు కాదు ఆ కోడి గెలుచునని యొకఁడును పై పందెములఁ బెట్టుకొనుచుండ కోళ్ళను విడుచువారు తమ రుమాలలో బెట్టుకొని యుండిన కత్తుల పొదిని ఊడదీసి మంచికత్తులందీసి నూఱి వాటి కాళ్ళకుఁ గట్టి విడువఁబోవ ఆ పుంజులు క్షణకాలములో తమకు రానున్న చావును దలఁచుకొని తమ అయిష్టమును జూపఁగా వారు విడువక యొక దానిచే మఱియొక దానిని కరిపించి కోపము గలుగు నటులఁ జేసి విడువఁగా అవి రెండును గోపముచే నింట నా దుర్మార్గులచేఁ గత్తిపాలై యమకూపమున బడుఁటకన్న రణమొనరించి వీరస్వర్గము బొందవచ్చునని యొకదాని నొకటి దన్నుకొని మృతిజెంది వీర స్వర్గము నలంకరించును ఒకటే విడుపుకు మరణించిన యోడినవాఁడు గెలిచిన వాని మాటలకు సహింపలేకనో లేక తన కోడి ఒక్క తన్నుకే మృతి నొందెనని యవమానము చేతనో కోపము పేడెత్తి గెలిచిన వానిపైకిని ఆవైపు పుంజును విడచిన వాని మీఁదికిని విషలిప్తమగు కత్తి నుపయోగించితిరనియు మంత్రపు పసరు వేసితి రనియుఁ దగవు పెట్టుకొనఁగా గెలిచిన వానిప్రక్క వారును యోడిన వానివైపు వారును తారసిల్లి కోళ్ళవలె యుద్ధము జేసి మరణము నొందుచున్నారు

అంతట నచ్చట నుండిన నామ మాత్రపు పెద్దమనుష్యులు కొంత దూరము ననే చిత్తాట నక్కముష్టి యింకను పలువిధములగు జూదములు నాడెడి వారును వచ్చి పోరునాపగా మఱల ముందటివలె వాద్యములతోడ వారి నిలయముల కేగెదరు

నాయనలారా! చూచితిరా కోడి పందెము లెంతచేయుచున్నవో! ధనము పోవుటయెగాక మాన ప్రాణములఁ గోల్పోవు నటులఁ జేయుచున్నవే! పొరపాటు పడితిమి కోడిపందెము లేమి జేసినవి? మీరే కోడిపందెములఁ జేసి పుంజుల నకాల మృత్యువున కర్పించుటయేఁ గాక మీ ప్రాణముల సహితము గోల్పోవుచున్నారు చేతులారఁ బెంచిన పుంజులను జంప మీకెటుల బుద్ధి పొడమును? అటులఁ జేయుట కని పెంచినట్టి బిడ్డలఁ జంపు నట్టిది కదా! పుంజులను పందెములకుఁ దెచ్చునపుడు

వాడియుండిన వాటిముఖములనైన జూచి మాన మనసొప్పదా? కాలికి కత్తిఁగట్టు నపుడు విలవిలదన్ను కొనుచుండ బలవంతమున బిగబట్టి కట్టుటకు మీ కెటులఁ జేతులాడును? విడచునపు డవి పోరుటకు తమ యసమ్మతిని జూప కావలయునని కరిఎంచి పోరునటులఁ జేయుటకు మీ హృదయము లేమిటితోఁ జేయఁబడినవి? కత్తిపోటు దగిలి యెగుర లేకున్నఁ జేతితో నీరు ద్రాఎ మఱల నెగుర మనుటకు మీ యంతరాత్మ సమ్మతించెనా? ఛీ! మీ ముఖములఁ జూడరాదు మిమ్ముల గనిన నరకము ప్రాప్తించును మీ సంగతి మాటాడిన పాపము వెంటనంటును అధమాధములారా! పాప భూయిష్ఠులారా! నోరెరుఁగని పక్షి సంతతియై యెల్ల దినములందు మీ పనులను జేసికొనుటకు సరియైన కాలమును దెలిపి సర్వదా చెడని గడియారములై మీ గృహములలోని చెడ్డ పురుగలఁ దిని క్రిందఁ దిర్గాడు మీ బిడ్డలను గాపాడెడి ప్రాణదాతలైన పుంజులను కావలయునని జంపుట కంటె మీరే కత్తులఁ గట్టికొని పోరొనరించి మృతిజెందిన ఆ భారతమాత కొకింత భారమును తగ్గించిన వారగుదురే! మీరు బ్రతికియుండిన మా భరతఖండమున కున్నత దశరానేరదు నాయనలారా! మా యనుంగు సోదరులారా! మేము దూషించితిమని మా పైకి రాకుఁడు మీ సోదరులు మీకు చెఱుపు గలుగజేయు సంగతిని జెప్పుదురా? మే మెన్నటికిని మీకు కీడుగోరము మీ యభివృద్ధినే కోరుచున్నాము మీరు మమ్ము దూషించుటకు మాఱు కుక్కుట యుద్ధములఁజేయుట మానుఁడు అహింసాధర్మమును బూనుఁడు దేశోద్ధారకులు గండు త్రాగుడు నాఎవేయుఁడు జూదము లడుగంటు నటులఁ జేయుడు సంఘీభావమును వెల్లడి జేసి భారతీయు లేక భావమున మెలంగుచున్నారని యితరులకు దెలియ జేయుఁడు అక్కటా! యీ పాడు కోడిపందెములు మా దత్తమండలమున పూర్వము నుండియు లేకుండెనే! మావారికీ యలవాటు కొన్ని సంవత్సరములుగ నలవడి యున్నను ఇపుడు మానజాలకున్నారే! కోడి పందెమను మహామారిని ఉత్తర సర్కారులలోని వెలమదొరలును కమ్మ నాయకులును గొని తెచ్చి మావారికి నేర్పిరే! బొబ్బిలి విజయనగరము క్షీణదశకు వచ్చినందులకు కోడిపందెమే గదా మూల కారణము! గొప్ప గొప్ప జమీందారులె కుక్కుటయుద్ధమున నాశనమగుచుండ దత్తమండలము నందలి రెడ్డివీరులనెంత? పారక మహాశయులారా! మన చరిత్రను వదలి యీ సంగతులను జర్చించెద రేమని మమ్ముల నధిక్షేపింపకుఁడు మన చారిత్రమునకును కోడి పందెమునకును గొంత సంబంధ మున్నది ఏమన పైన వివరించిన పండుగరోజున ఉయ్యాలవాడలో నరసింహారెడ్డి కోడిపందెమును జేయించుచు తన ముఖ్య స్నేహితులగు ఒడ్డె ఓబయ్యను గోసాయి వెంకన్నను చెంతయొక

ప్రక్క నిడుకొని కంబళము పఱచిన మంచముపైఁ గూర్చుండి కోడిపందెమును మిగుల పట్టుదలతో చూచి యానందించుచుండెను

సాయంతనము సుమారాఱు గంటల వఱకుఁ గోడి పందెము జరుగుచుండెను ఆఱు గంటల వఱకు కొంతదూరమున నలువురు పోలీసు జవానులును వారిపై యధికారియు వచ్చునటు లగుపడియెను అది చూచి వారు పందెము నాపి యెప్పటివలె తమ మామూలును దీఁకొని పోదురని నిర్భయముగా నుండిరి అంతఁ గొంతసేపటికి వారు సమీపించిరి రక్షక భటాధికారి వారిని బట్టుకొమ్మని యాజ్ఞాపింపగా వారందఱు భయపడి అయ్యా! యెప్పటికంటె మీ మామూలెక్కువఁ జేసెదము ఊరక వచ్చిన దారిన బొండు అన్న పోలీసువారు నిలచి యుండిరి రక్షక భటాధికారి నరసింహారెడ్డిని సమీపించి ఓయీ! నీవిపుడెందేఁగఁ గలవు? నిన్ను బంధింపుమని డిప్యూటీ సూపరింటెండెంటుగారి యాజ్ఞ య్యైన దనగా నరసింహారెడ్డి అయ్యా! నన్ను బట్టుటకు నీచేతనగునా? నీవు సర్కిలినస్పెక్టరు వైనంతనే నాకు భయమనుకొంటివా? నీ చేతగాదు నీవు వెళ్ళి డిప్యూటీ సూపరింటెండెంటును బిలుచుకొని రమ్ము నీవేమైన నెక్కువ పోకడలకుఁ బోయిన ముప్పు వాటిల్లును నీకుఁ గావలసి యున్న వీరితో కొంత పైకమిప్పించెద ననగా సర్కిలినస్పెక్టరు నన్ను లంచము దీసికొమ్మనెదవా? అది సరిపడదు నిన్ను బట్టవలెనని ప్రతిదినము దిరుగుచుంటి ననుచుండ నీబోటి వారు మాయొద్ద వేలకువేలు లంచములఁ దీఁకొని పోయియుండ నీది లెక్కయా! మీ శాఖవారు న్యాయముగ బ్రతికిన ఈ కోడి పందెము లెన్నఁడో యడుగంటి యుండవా? దీని నెక్కువఁ జేయుటకు మీరే ముఖ్య కారణము అనగా సర్కిలినస్పెక్టరు పోలీసువారితో నతనిని ముందు బంధింపుఁడని బేడీలను చేతికిఁ దీఁకొని నరసింహారెడ్డిని సమీపించెను అతఁడది చూచి ప్రక్కనుండిన మనుష్యులకు కన్నుగీటగా కొబలీ యని యొక పెట్టున నఱచి యాయుధ పాణులై వారిని జుట్టుకొనిరి రక్షక భటులెప్పుడో పాఱిపోయి యెందో దాఁగిరి సర్కిలినస్పెక్టరు వారి మధ్య దొరకెను అతనిని బట్టుకొని బేడీలఁ దగిలించి ఇందే పడి చావుము నిన్ను గ్రామమునకుఁ గూడ రానియ్యము నిన్నటి దినమున మీ యింటినుండి మా యనుచరులలో నొకఁడగు ఒడ్డె ఓబయ్య తెచ్చిన నీ పిస్తోలుచే నిన్ను గాల్చిన నేమి జేయఁగలవు? చూడుము ఈ పిస్తోలును నీ భార్యను మోసపుచ్చి తెచ్చి యున్నాఁడు నీవును నీ యధికారులును జాగ్రత్తగ మెలంగు డని గ్రామమున కేగిరి

## ఇరువది యొకటవ ప్రకరణము:

# విముక్తుఁడగుట

తానొకటి దలఁచిన దైవమొకటి తలఁచునను మాట యెన్నటికైన బొల్లు పోవునా? అది సత్యమని మన సర్కిలినస్పెక్టరుగా రనుభవపూర్వకముగఁ దెలుపుచున్నారు. పాపము! నరసింహారెడ్డిని బంధితుని చేసి గొంపోవలయునని వచ్చి యతనిచేతనే బంధితుఁడాయెను. పురి వెలుపల దిక్కులేని చోట బంధితుని జేసి పోయిరి. మాటాడించు వారైన లేరు. గృహమున మెత్తని సెజ్జపై యించుకైన జాలిలేక, తన జవానులచేఁ బాదము లొత్తించుకొనుచు, వీవనచే విసరించుకొనుచు, ''హాయి హాయి'' యనుచు గుఱకలిడుచు నిద్రించు వా, డీ దినమున, కటికనేలపై మట్టిలో బడియుండవలసి వచ్చెగదా! చక్కగ కాళ్ళు జాచుకొనియైన బరుండుటకు వీలుగాకుండ సంకెళ్ళను దగిలించి పోయిరే. చేసిన పాపములలో నతి హేయమగు పాపము, తనవలెనె జన్మించి, మనుష్యుడనిపించుకొనిన వానితో, పాదము లొత్తించు కొనుటయేకదా! అందులకే కాఁబోలు తగినఫల మనుభవించుచున్నాడు. చేసిన పాపమునకు దండన, మృతి నొందిన పిదప, యముని యొద్ద ననుభవింతురని, మనవారు చెప్పుదురు. అది యే యుగముననో గాని, యీ యుగమున నమలులో లేదు. ఇది కలియుగము. ఇపుడు పాపము జేసిన యెడల, తత్ఫలము, తాను బ్రతికి యుండినపుడె యనుభవింపవలసి యున్నది. అటులనుభవించు వారిని, ప్రతి నిముసమును జూచుచునే యున్నాముగాని, పాపమొనరించినవెంటనే, కష్టముల ననుభవింప వలెనేయని భీతిల్లి, యూరకున్నామా? లేదు లేదు! ఎపుడైన, శ్మశానవైరాగ్యము జనించునపుడు, ఏమేమొ నీతిమాటలఁ జెప్పి, మఱల గొంత సేపటికి, మన త్రోవ మనము జూచుకొనుచున్నాము. మన బుద్ధికిని కుక్క బుద్ధికిని కొంచెమేనియు బేధమున్నదా? లేదు, లేదు! అది నిద్రనుండి లేచిన తోడనె, చెవుల విదలించుకొని, మఱల నెంగిలాకులకుఁ దారాడును. మన మింటికేగిన తోడనే, ''వాని ధనము మనకు వచ్చుటెట్లు? అతనిపై తప్పుడు పత్రమును సృష్టింతమా? వానియిల్లు దోపిడి చేయింతమా?'' యను నాలోచనలు గలుగును. కనుక, చేసిన పాప ఫలమిప్పుడే యనుభవింపవలెనే యని, న్యాయ ప్రవర్తనకు గడంగి, పుణ్యశీలు రనుపించుకొందము.

అంతట, రేనెలత, కోరికోరి ధరించిన నీలి పుట్టమును బోలి, చీఁకటులు నలు దిశలఁ గ్రమ్ముకొనెను. సర్కిలినస్పెక్టరందే పడియుండెను. తన వెంట వచ్చిన

పోలీసువారు సహా భీతిచేఁ బారిపోయి ఎందో దాఁగిరి ఆహా! ఆపదలు వచ్చినపుడు తన చుట్టములైన దరి జేరరనునది యిట్టిదేకదా! తన యానతిని జవదాటకుండ నుండవలసిన వారు చెప్పకనే యెందో దాఁగిరే! అతనికి సహాయము జేయు వారెవరు? అతఁడంతటి దుస్థితిలో నున్నను కొంచెమేనియు భీతిల్లిన వాఁడు కాడు కొంతసేపటులనే జూచి తన జేబునందుండు పోలీసు పీకను జూచెను దానిని దీసి కొనుటకు చేతులకు బేడీల దగిలించి యుండిరి తలనువంచి దానిని నోటఁబట్టికొని యొక విధముగ వాయించెను వెంటనే కొంత దూరము నుండి మూఁడుపీకల వాయించిరి అతఁడదే వంక జూచు చుండ నలుగురు పోలీసు వారు వచ్చి బేడీలను విడదీసిరి

స ఇ ఓరీ! అటుల పరుగెత్తితిరేల?

ఒ పో పరుగెత్తక యేమి చేయుమంటిరి?

స ఇ ఆ దుర్మార్గుని బంధించి వేయఁగూడదా?

మూ పో అయ్యా! అది సాధ్యమా? మేము పరుగెత్తకుండిన మాకును మీ గతియె వచ్చి యుండును గదా? అప్పుడు మనల బంధ విముక్తులఁజేయు వారు గూడ నుండక యిందే బడియుండవలసి వచ్చియుండును మేము పరుగెత్తినందుననే కదా మిమ్ముల విడిపించుటకు వీలు గలిగెను?

స ఇ అవును ఇపుడేమి చేయుదము?

రె పో ఈ సంగతి డిప్యుటీ సూపరింటెండెంటుగారికి నివేదింతము

స ఇ ఆయన వినిన నవ్వడా?

న పో ఎందులకు నవ్వును? ఇది మన శాఖ వారికి క్రొత్తయా? ప్రతివాడును అట్టి చిక్కులకు లోనై యుండక తప్పదు

రె పో ఇదేమండి! గత సంవత్సరమున మేము మీనాఫ్ ఆడుచుండిన వారిని బెదరింపగా మా తలబుట్టలు క్రిందఁ బడునట్లు కొట్టి యున్నారు డిప్యూటీ సూపరింటెండెంటుగా రెన్ని చోట్ల దెబ్బలు తిననిదె యీ యుద్యోగమునకు వచ్చిరా? మన తలవ్రాత యిటులుండ తప్పునా? ఈ శాఖలోఁ జేరుటయే తప్పు చేరిన అన్యాయము జేయకుండరు అందులకు తగిన ఫలమనుభవింపక తప్పదు

స ఇ కానిండు మాటలతో పనియేమి? త్వరగా డిప్యూటీ సూపరింటెండెంటు గారి కడకేగి కర్తవ్య మాలోచింతము అని యారాత్రి తమ నిలయములలో గడిపి తెల్లవారగనె సూపరింటెండెంటుగారి బసకు వెళ్ళిరి

డి.సూ. : మీ రేగిన కార్యమేమాయెను?

స.ఇ. : ఏమగును? అతడు సామాన్యులకు పట్టుబడు వాఁడు కాఁడు.

డి.సూ. : మీరకస్మాత్తుగ వారిపైఁ బడితిరా? లేక వారికి తెలియునట్లె బోతిరా?

స.ఇ. : వారికిఁ దెలియకుండు నటులనే బోయితిమి కాని, యెపుడు చూచిరో తెలియదు. అందరును పాఱిపోయి యెందో దాఁగిరి. పిమ్మట వారిని కనుగొనుటకే మాచేతగాక పోయెను.

చూచితిరా! సర్కిలినస్పెక్టరుగారెంత బొంకు బొంకిరో! తాను బడిన పాట్లు చెప్పుకొనిన అవమాన మగునని అదంతయు దాచెను. గొప్ప యధికారులే బొంకు చుండ, తక్కిన వారిదేమి లెక్క? ఆ శాఖలోఁ జేరిన వారు బొంకుట సహజము. బొంకని వారు దాని ఫల మనుభవించుచునే యుందురు.

డిప్యూటీ సూపరింటెండెంటుగారు పై పలుకుల నాలకించి, ''ఏమీ! మీ రింద రేగియు వానిని బట్ట జాలక పోతిరా? మీ రచటి కేగితిరో లేదో! పోలీసువారి కగుపడి మఱల దప్పించుకొని పోవువాఁడున్నాఁడా?'' - అని గద్దించి మాటాడెను. గొప్ప యధికారులు క్రింది నౌకరులపై తమ యధికార గర్వమునుఁ జూపుట యనున దిదియె కాఁబోలు. అందులకు సర్కిలినస్పెక్టరు ''అయ్యా! నా మాటలయం దించుకేని యసత్యము లేదు. ఈ సారి మీతో కూడ మేము వచ్చెదము, నరసింహారెడ్డి గారిని ఖైదీగాఁ బట్టి తెండు. మేము మా ప్రాణములను తెగించి పోరాడెదము'' అనగా ''సరి నేను మీకు వార్త నంపెదను. అప్పుడు తప్పక రావలయును. నేను కల్టెక్టరుగారికిని జిల్లా సూపరింటెండెంటుగారికిని వ్రాసి, యింక కొందఱిని రక్షకభటుల రప్పించెదను. కల్టెక్టరు గారు సైన్యమునకుఁ గూడ వ్రాసి యున్నారు. కొన్ని దినములలో రాగలదు. ఆ దుర్మార్గుని నెటులనైన నంత మొందింపవలయుననిన, సర్కారువారు చంపకుండ బట్టి తెమ్మనెదరు. వాఁడు ప్రాణములతో మన చేతఁబడునా? కానిమ్ము. ఎటులైనను వానిని బట్టి తీసికొని రావలయును. ఇన్ని దినము లీ శాఖలోఁ బని జేసినందులకు వానిని బట్టిననే కాని, లేకున్న కీర్తి కలుగదు. ఆ దుర్మార్గుఁడు నా కంట బడిన తప్పించుకొని పోవుట కల్ల. మీరు మీ బసకేగుడు'' అన సర్కిలినస్పెక్టరు గారును తక్కిన రక్షక భటులును తమ నిలయముల కేగిరి.



## ఇరువది రెండవ ప్రకరణము

# యుద్ధము

పుష్య మాఘ పాల్గుణ చైత్ర వైశాఖ మాసములలో దత్తమండలమున నుండు ప్రతి పల్లెయందును గ్రామ జాతరలఁ జేయుట వాడుకయై యున్నది కడప కర్నూలు మండలములలో ఈ వాడుక విశేషముగ నున్నది మన ప్రస్తుత చరిత్ర జరుగు కాలమున గ్రిద్దలూరు నందు నరసింహారెడ్డి గారి యాధిపత్యము క్రింద నొక గ్రామ జాతర జరుపు నటుల నేర్పాటు గావింప బడెను ఈ జాతరనే దేవర యని కూడ పిలతురు కృష్ణ పక్ష మధ్యమమున జాతర జరుగునటుల నేర్పాటుగావింపఁబడెనని పురమునఁజాటించిరి పురజనులందఱును తమ తమ బంధు మిత్రులకు జాతర ప్రారంభ దినమున కొక దినము ముందుగనె రమ్మని యాహ్వాన పత్రికలఁ బంపిరి తీరిక గలిగి యుండిన వారందఱు విచ్చేసి యుండిరి

గ్రామ జాతరలు పాప భూయిష్ఠములై యున్నవను సంగతి తెలియక సంతోషముతోఁజేయుచున్నారు గాన వాటిని గూర్చి యొక్కింత విపులముగ జర్చింపుమని మా లేఖిని త్వరితగతిఁ జూపినందున నాపఁజాలక యొక్కింత వ్రాయక తప్పదాయెను చదువరులు మన్నింతురుగాక!

గ్రామజాతరఁ జేయుట కేర్పరుప బడిన నాటి సాయంత్రము సుమారు ఏడు గంటల వేళ నొక పోతును దెత్తురు దానిని పగ్గములతోఁ గట్టి యిరుప్రక్కల మాలవారు గట్టిగ బట్టికొని యుందురు దాని శృంగములకు పసుపు కుంకుమను బూసి కొన్ని వేపమ్రాఁకుల మండలను గట్టి యుందురు మొదట మాదిగవారు తప్పెటలను తమ బలము కొలఁది వాయించుచుఁబోవుచుందురు వెంట కొమ్ముల వాయించువారును మేళము వాయించువారును ఆసాది వారును బోవు చుందురు అటుల వారు ప్రతి గృహమున కేగి ధాన్యమును బెట్టించుకొని ఆ ధాన్యము నమ్మిన ధనముతో కల్లుద్రాగి తూఁగుచు వీధులలోఁ బడియుందురు

అటు ఎమ్మట రాత్రి సుమారు పదిగంటలైన తొడనే గ్రామాధికారులును తక్కిన యూరి పెద్దలును బయలుదేరి చావడి కడ జేరుదురు అంత ఆయకట్టువారు తమ పరికరములతో బయలు దేరి వత్తురు వారందఱు దివిటీలను బట్టుకొని యీడిగవాని గృహమునకు కట్నమునకు అనగా సారాసీసాను దెచ్చుట కేగి తెచ్చిన

దానిని పురమధ్యమున పెద్దమ్మకై యేర్పఱుపఁ బడిన గుడిలో పాతి పెట్టుదురు. అంతట, వడ్లవాఁడొక రథమును జేసి పెట్టియుండ, అచటకేగి, దానిని దీసికొని, కుమ్మర వాని గృహమున కేగుదురు. అచట, వాడు, మంచి బంకమట్టిని దెచ్చి, తడిపి, దానిని పాదములతో మెత్తగఁద్రొక్కి, ముద్దఁజేసి, దానినొక బొమ్మగా జేయును. ఆ మట్టిబొమ్మయె పెద్దమ్మయఁట. ఆ బొమ్మను రథమునం దిడుకొని, యడుగడుగున కొక నిమ్మకాయను గోయుచు, కేకలు వేయుచు గొనివచ్చి, గుడిలోఁబెట్టుదురు. ఆ గుడిలో బెట్టిన వెంటనే యామెకు ప్రాణము వచ్చుటయేగాక, యెక్కడ లేని శక్తి వచ్చునఁట! అప్పుడామెకు బలి నొసఁగక పోయిన గ్రామమునంతయు నాశన మొనరించి, ప్రజల నందఱిని ఒకేసారి మ్రింగివేయునట! అందులకై వారు భీతిచే నొక పెద్ద మహిషమును బట్టి తెచ్చి, యెదుట బలవంతమున నఱుకుదురు. ఆ సమయమున పోతు అఱవరాదఁట! అఱచినఁ గీడు మూడునఁట! అందులకై దానిని ఖండించుట కేర్పరుపబడిన వారు, అఱవకుండఁ బరిమార్చ వలయునఁట! పూర్వ కాలమున నొక్క, నఱుకునకె దానితల వేరు జేసెడి వారుండి నందున, నఱువక ముందె తమ కార్యమును నెఱవేర్చుచుండిరి. అందువలన పెద్దమ్మ యెవరికని కీడొనరింప కుండెను. ఇపుడట్టి వారు లేరు గాని, ఒక యేటునకు గాకున్నను, పది యిరువది సారులకు నఱికెడి వారున్నారు. పోతుఁ నొప్పికి దాళలేక, యఱచుచునే యున్నదిగాని, పెద్దమ్మ మాత్రము ఏ కీడును జేయుట లేదు. అంతట దాని క్రొవ్వును దీసి, మూకుడులో వేసి, యొక వత్తితో దీపమును వెలిగించి, పోతు తలపైఁ బెట్టుదురు. దాని కన్నులకు, క్రొవ్వుపై నుండు బల్లిపొరవంటి తెల్లని చర్మము వంటి దానిని వేయుదురు. కుడికాలు నఱికి దాని నోటిలోఁ బెట్టుదురు. తర్వాత నొక దానివెనుక నొకటి వంతున, వేలకొలఁది గొఱ్ఱెలను మేకలను నఱికి, అమ్మవారి కర్పింతురు. పోతు తలపై దీపము బెట్టుటఁ కన్నులకు చర్మము వేయుట ,నోటిలో కాలిడుట మొదలైన వాటికి కారణ మడిగిన వారొక చిన్న కథను జెప్పుదురు. దానిని మా పాఠకులకు రెండు మాటలలోఁ జెప్పి ముగించెద.

ఒక బ్రాహ్మణుని కుమార్తెను జూచి యొక చండాలుఁడు మోహించెననియు, అటుల మోహించి బ్రాహ్మణుని వేసమున వచ్చి యామెను వివాహమాడెననియు, అటు పిమ్మట కొద్ది రోజులకు వాని మోసమును గనుగొని యా విప్రకులాంగన వానిని జూచి తాను పెద్దమ్మయై పుట్టుదననియు, వానిని దున్నపోతుగా పుట్టింతుననియు, తన యెదుట వాని తల నఱికి క్రొవ్వు దీపమును తలపైఁ బెట్టించి కాలిని నోటఁబెట్టింతుననియు శపించి మృతినొందెనని చెప్పుదురు. ఆ విప్రకాంతయే

పెద్దమ్మయట ఆ మాలవాఁడే మహిషమట ఇట్టి కథలను గల్పించుకొని ఘోర కృత్యముల నాచరించి పాపము నెక్కువఁ జేయుచున్నారు

ఇది యిటులుండ నంతకంటె వింత సంగతి యొకటిగలదు మరుసటి దినము పగలు పండ్రెండు గంటలు కొట్టిన పిమ్మట పురవాసులందఱు ప్రతి గృహము నుండి యొక్కొక్క బోనము అనగా నిండుగా వండిన కుండకు కుంకుమ పసుపు చుక్కలఁ బెట్టి యొక మేకను గొనితెచ్చి దానిని పెద్దమ్మ యెదుట వధించి బోనమును బగుల గొట్టి పోదురు ఈ బోనముల నర్పించువేళ మాది ముందురావలయునని యొకరును కాదు కాదు మాది ముందురావలెనని మఱియొకరును తగవులాడి కొందఱు ప్రాణముల సహితము గోల్పోవుచున్నారు ఇది యటులుండఁగనె యింకొక మ్రోల అచట చిందు వాయించ రాదని యొకఁడును వాయించి తీరవలయునని యొకఁడును వాదులాడి వాద్యములను బగులగొట్టి యొకరి నొకరు దన్నుకొని తలల బ్రద్దలు జేసికొని మడియుచుండుట నేటికిని చూడనగు

ఇన్ని పోరాటములు హత్యలు జరిగిన ఎదప సాయంకాల మైదు గంటల కమ్మవారిని యూరి వెలుపల విడచి వచ్చుటకు బయలు దేరుదురు అట్టి సమయమున నే మంగలదానికో యే చాకలవనితకో యే మాతంగ కన్యకకో యమ్మవారావేశమై వేప మండల చేతఁ బట్టికొని వేపాకును నమలుచు అమ్మవారి చుట్టు నెగురుచుండును ఆచార పరులెందఱో యుండ అమ్మవారు కోరి కోరి వారి కావేశమగుటఁజూడ నమ్మ తగినది కాదని తోచక మానదు తర్వాత జనులందఱు పొలిమేరఁ జేరిన తోడనె దీవెన బండా రొసగునపుడు ఆ సాదివాఁడు గ్రామాధికారులను వాని యిచ్చవచ్చిన భంగి దూషించునఁట అందులకు వారే మనరఁట దేవరనెపమున పైకము నిచ్చి వారిని బిలిపించి వారిచేఁ దిట్టించుకొనుట యెంత యవివేకమో చదువరులె గ్రహింతురు గాక! దుడ్డిచ్చి తేలు గుట్టించుకొనుట యన నిట్టిదే కాఁబోలు!

ఇన్ని దురాచారములకు మూల కారణములగు ఈ గ్రామజాతరలను ఏల చేయవలెనో తెలియరాకున్నది బోనముల నెపమునను వాద్యముల నెపమునను తగవులాడుటెందులకు? మేళము వాయించరాదని యొకఁడును గంటఁగొట్టరాదని యొకరును తగవులాడి ధనమునంతయు నాశన మొనరించుట కంటె గొప్ప బుద్ధి కలిగి యా ధనమును దోశోద్ధారణకో సంఘసేవకో వెచ్చించిన నెంత బాగుండునో యోచింపకున్నారు గదా! మనలో మనము తగవులాడి ధననాశన మొనరించిన మేలు

గలదా? ఆ తెలివి లేకుండుట వలననే మనమిటుల బానిసలకంటె హేయముగ జూడఁబడుట ఇప్పుడైనను తెలివిగలిగి బ్రతుకుచున్నామా యనుకొన్న నింకను ఆ మూఢత్వ పిశాచమును వదలకున్నాము ఇంతటి నుండియైన పల్లెలలో నుండు రెడ్డి ప్రముఖులు గ్రామజాతరల మాని పాపమును నశింపఁజేసి మనెదరు గాక!

ఇఁక గ్రామ జాతరుల చరిత్ర నింతటితో నాపి మన కథవంక మరలుదము గ్రిద్దలూరులో నరసింహారెడ్డి యిట్టి జాతరను జరిగించుచు కలహములు జరుగకుండ తాను జన మధ్యమున నొక ఖడ్గమునుగైకొని నిలిచి యుండెను ఇటులుండ జనులలో నేదో యొక శబ్దము వినఁబడెను అందఱును నిశ్శబ్దముతో తిరిగి చూడ కొంత దూరమున కొందరు సర్కారువారు వచ్చుచుండిరి వారెవరన డిప్యూటీ సూపరింటెండెంటు సర్కిలినస్పెక్టరు కంభం తహశీలుదారును వారి వెనుక లెఫ్టినెంటు వాట్సన్ ఆధిపత్యము క్రింద కొంత సైన్యమును వచ్చుచుండిరి వారిని జూచి నరసింహారెడ్డి తన యోధులను ఆయుధపాణులై రమ్మని సందేశమంపెను ఐదు నిముసములలో సుమారు రెండువందల బోయలు తక్కిన జాతివారు ఆయుధములతో కోబలీ యని దూకిరి సైన్యమును వీరును కలిసి యుద్ధము చేయ మొదలిడిరి ఇరువైపులను జనులు నీల్గుచుండిరి కంభం తహశీలుదారుఁడు నరసింహారెడ్డిని సమీపించ నతని తలను వేఱుజేసి పరుగెత్త మొదలిడెను అతని వెంట నతని యనుచరులు గూడ పరుగెత్తిరి వారిని విడువక సర్కారువారు వెంబడించిరి



## ఇరువది మూడవ ప్రకరణము

# మిత్రుల మరణము

నరసింహారెడ్డి కంభం తహశీలుదారు నంతమొందించి యెవరికిఁ దెలియకుండ తన మిత్రులగు ఒడ్డె వోబయ్యను గోసాయి వెంకన్నను వెంటఁబెట్టుకొని నల్లమల యడవులలోఁ దాగెను అతని సైన్యమంతయుఁ జెల్లా చెదురై యొక్కొక్క రొక్కొక చోట దాఁగిరి సర్కారువారు మాత్రము వారి కొఱకై యడవులన్నియు వెదకుచునే యుండిరి వారు అడవిలో వేణుపొదలయందె గూర్చుండి యిటుల మాటాడుకొన దొడఁగిరి

నరసింహ ఓయీ! వెంకన్నా! యిపుడేమి చేయుదము? సర్కారువారు మనల విడువరని తలఁచెద

వెంకన్న అయ్యా! రోటిలో తలఁదూర్చి రోకటిపోటునకు వెరువ దీరునా? విడువక పోయిన నేమి చేయఁగలరు? మనల బట్టి చంపఁగలరు మన కాయువు దీరినపుడేమి చేయఁగలము? ఎచట దాఁగినను చావుతప్పదు

ఓబయ్య రాచపీనుగ తోడులేక పోనట్లు మనల జంపువఱకు వారిలో కొందఱిని మనము కడతేర్చక వదలుదుమా?

నరసింహ వారితోఁ బోరుటకు మనకు తగిన సైన్యము లేదు మనవారందఱుఁ బాఱి పోయిరి మన ముగ్గురమంత సైన్యముతో బోరఁగలమా?

ఓబయ్య అటులైన కానన సీమలకేగి మాఱు వేసములతో జరింతము

వెంకన్న అది కానిపని ఎక్కడికేగినను మనల కనుఁగొనక మానరు

నరసింహా వెంకన్నా! ఇపుడు సైన్యమెంత దూరమున వచ్చుచున్నదో నీయంజన ప్రభావము వలనఁ జెప్పఁగలవా?

వెంకన్న చెప్పఁగలను ఈ యడవులలో అందులకు కావలసిన యాకులు గూడ దొరకును అయినను మనకొక చిక్కు కలదు అందులకొక యాముదపు దీపము కావలయును చూచుటకు ఎల్లికన్నుల వానికై వెదుకఁ బనిలేదు మన ఓబయ్య గలఁడు ఇపుడు దీపము మాత్రము కావలయును ఎచట దొరకఁగలదు?

నరసింహా అది యిచట దొరకుట దుర్లభమే!

ఓబయ్య ఏల భయపడెదరు? ఇచటికి అహోబిలము దగ్గఱ అచటి కేగిన గుడిలో నిరంతరము ఆముదపు దీపము వెలుగుచుండును

నరసింహా అవును బహు చక్కగ యోచించితివి పోదము రండు

అని యందఱును అహోబిలము గుడి దగ్గఱకు వచ్చి చేరిరి గోసాయి వెంకన్న పొదలలోనికేగి కొన్ని యాకులను దీసికొని వచ్చి పసరుఁ జేయు చుండెను ఓబయ్య నరసింహారెడ్డి కలిసి గుడి తలుపులఁ దీసి లోపల దీపమును సరిచేయు నంతలో వెంకన్న పసరు దీసికొని వచ్చెను ఓబయ్యను దీపము నెదుట గూర్చుండఁబెట్టి యెడమ చేతిలో పసరును రాచి కన్నార్పకుండఁ జూచుచు నడిగిన దానికి జవాబీయు మనగా సరియని చక్కగఁ జూచుచుండెను

వెంకన్న ఇపుడేమైనఁ గనఁబడుచున్నదా?

ఓబయ్య సముద్రము కనఁబడుచున్నది

వెంకన్న బాగుగఁ జూడుము ఇంకేమైన గనఁబడుచున్నదా?

ఓబయ్య నడి సముద్రమున తెల్లని గుండ్రమైన వస్తువు కనఁబడుచున్నది

వెంకన్న అటులనె నిదానించి చూడుము ఇపుడేమైనది?

ఓబయ్య అది నా వంకకు వచ్చుచున్నది

వెంకన్న ఇపుడేమైనది?

ఓబయ్య అది పగిలిపోయెను

వెంకన్న తర్వాత?

ఓబయ్య ఒక పడవ వచ్చుచున్నది

వెంకన్న పడవలో ఎవరున్నారు?

ఓబయ్య నరసింహస్వామిని బోలు విగ్రహమున్నది

వెంకన్న నీ మనసులో నమస్కరించి సైన్య మెంత దూరమున నున్నదో చూపుమనుము

ఓబయ్య అడిగితిని

వెంకన్న ఇపుడేమైనది?

ఓబయ్య అంతయు మాయమైనది అడవి మాత్రము కనఁబడుచున్నది

వెంకన్న అడవిలోనెవరైన నున్నారా?

ఓబయ్య అదిగో సైన్యము డిప్యూటీ సూపరింటెండెంటు సైన్యముతోఁ గూడ మనల సమీపించుచున్నాడు అదిగో వచ్చిరి

అంతట వెంకన్న తటాలున చేతిని ద్రిప్ప ఓబయ్య కన్నులను మూసి మఱలఁ దెఱచి యిఁక మనమిచట నుండరాదు అని చెప్పబోవు నంతలో సమీపమున శబ్దము వినఁబడెను అది విని వెంకన్న మనము పరుగెత్తుదము రండు అనెను అందులకు ఓబయ్య ముగ్గురము పరుగెత్తుట మంచిది గాదు ముసుగు వేసికొని మన మిరువురము పరుగెత్తుదము నరసింహారెడ్డి దేవుని వెనుక దాఁగి యుండును పరుగెత్తెడి మనలఁ జూచి మన యిరువురిలో నొకరు నరసింహారెడ్డి యని యెంచి

వారు మనల వెంబడింతురు వెంబడించిన పిదప నరసింహారెడ్డి మఱల వెనుకకు పరుగెత్తి యెచటనైన దాఁగును అని చెప్పెను అందుల కందఱును సమ్మతించిరి నరసింహారెడ్డి విగ్రహము వెనుక దాఁగెను తక్కిన యిరువురును ముసుగు వేసికొని వారు చూచుచుండఁగనె చెట్ల చాటునఁబడి పరుగెత్తఁ దొడఁగిరి వారిని జూచి సైన్యమంతయు నరసింహారెడ్డియె పరుగెత్తుచున్నాడని వెంబడించి యరమైలు పరుగెత్తు వఱకె వారిరువురిని సమీపించి తుపాకులతో గాల్చిరి వారిరువురును మొదలు నఱికిన తరువులఁ బోలి నేలఁగూలిరి వారిని డిప్యూటీ సూపరింటెండెంటు పరీక్షించి నరసింహారెడ్డి లేనందున నివ్వెర పాటునఁ జూచు చుండెను

నరసింహారెడ్డి కొఱకై వారిరువురును తమ ప్రాణములనర్పించిరి మిత్రులన్న వీరుగాక వేఱుగలరా? ఈ సంగతి నరసింహారెడ్డి వినిన ఎంత దు ఖించునో వ్రాయ వీలుపడదు



## ఇరువది నాల్గవ ప్రకరణము

## ఉరి

సైన్యము వారిని వెంబడించిన తోడనె నరసింహారెడ్డి మఱల వెనుకకుఁ బరుగెత్తి దూరమున నొక పొదలోఁ గూర్చుండి యిటుల వితర్కింపఁ దొడఁగెను నాకు రెండు తుపాకి శబ్దములు వినఁబడెను ఆ దుర్మార్గులు నా మిత్రుల వెంట నంటి వారి నంత మొందించి యుందురా? ఔరా! మా కెట్టి దశ వచ్చెను! నా కింక మరణము తప్పదు నేను మఱల గ్రిద్దలూరి కేగితినా నాకొఱ కచట భటులు కాచుకొని యుందురు ఉయ్యాలవాడకుఁ బోదమనుకొనిన వారచట మాత్రము లేకుండనుందురా? ఏమైనగాని ఉయ్యాలవాడకు సమీపమున నేను గట్టించిన రహస్య కుడ్యములలో దాఁగి యుండెద అచటికిని వచ్చిన మఱియొక చోటికిఁ బరుగెత్తెద అని తీర్మానించుకొని చీఁకటి పడువఱ కందే యుండ రాత్రి ప్రయాణముఁ జేసెను

అచట సర్కారువారు నరసింహారెడ్డి లేకుండుట గని మఱల దేవాలయమున నేమైన నుండునని వచ్చి చూచి అచట లేకుండుట గని ముత్యాలపాటిలో నేమైన నుండునని యచటి కేగి విచారించిరి అచ్చటి వారు తమ

గ్రామమునకు రాలేదనిరి పిదప వారు నొసమునకు వచ్చి యతని బంధుగుల గృహములను వెదకిరి గాని కనఁబడడయ్యె అచటి దేవాలయములోను బిలములోను చూచిరి గాని ప్రయోజనవుు లేదయ్యె ఉయ్యాలవాడకేగి చూడ నిష్ప్రయోజనమయ్యె వారంతట నరసింహారెడ్డిచే నిర్మింపబడినగోడలలో జూతమని బయలుదేరి వచ్చుచుండిరి

ఈ నరసింహారెడ్డిగోడలనునవి యిప్పటికి మునుపటి వలె యున్నత దశలో లేకపోయినను శిధిలమై యున్నవనియు నిప్పటికిని చూడవచ్చుననియు మా పాఠకులకుఁ దెలుపుటకు మే మెంతయో సంతసించుచున్నాము అచ్చట భూమి మిక్కిలి సారవంతమై యొప్పుటయె గాక అపుడపుడు జనులకు బంగారము మాడలు మొదలైనవి దొరకుట తటస్థించుచున్నది

సైన్యము వచ్చు జాడలు నరసింహారెడ్డి తన గోడలలో నుండి కనుఁగొనెను వారు సమీపించిరి, ఇఁక ప్రయోజనము లేదని వారు చూచుచుండగనే గోడల దుమికి పేరుసోముల వైపు పరుగెత్తి పోయెను అతఁడు పరుగెత్తి ఆల్వకొండలో తన బంధువుల కడకేగ వారు గృహమున జొరనీయక నిరాకరించిరి అతఁడు తన విధిని దూఱుచు నచటికి సమీపమున నుండు జగన్నాధస్వామి గుట్టపై నుండు ఆలయమున దాఁగెను సర్కారు సైన్యము గూడ పేరుసోములను దాటివచ్చి యచటచట వెదకుచు జగన్నాధుని నిశ్శబ్దమ్ముగ ముట్టడించిరి కొందఱు భటులతో డిప్యూటీ సూపరింటెండెంటు కొండపైకెక్కి యాలయమును జూచెను నరసింహారెడ్డి చేత ఖడ్గమును ధరించి లోపలఁ గూర్చుండి యుండెను అతని దరికేగుట కెవరికి చేత గాక పోయెను దూరమున నుండి తుపాకితో గాల్తమన్న వారికి నరసింహారెడ్డిని గాల్చి చంపుటకు నాజ్ఞనియ్యలేదు కడకు వారు చేయునదేదియు లేక అయ్యా! నరసింహారెడ్డిగారూ! మిమ్ముల మేమేమియుఁ జేయము మీరు మా వెంట కోవెలకుంట్లకు రండు అని వేడుకొనగా నరసింహారెడ్డి నేను రాను మీరు నన్ను గాల్చవచ్చును అని తన చేతనున్న ఖడ్గమును వారి యెదుట బాఱవైచెను అంతట డిప్యూటీ సూపరింటెండెంటు ముందా కత్తిని దీసికొని కొందఱు అనుచరులతోఁ గూడఁ బోయి యతనిని బంధించి తీసికొని కోవెలకుంట్లకు వచ్చెను

వారు కోవెలకుంట్లఁ జేరునప్పటికి సుమారుదయము పదిగంటలై యుండెను కచ్చేరిలో కలెక్టరు కూర్చొని యుండగా నరసింహారెడ్డిని పిలుచుకొని

పోయిరి. కలెక్టరు నరసింహారెడ్డిని చూచి, యేమియుఁ బ్రశ్నింపకనే, యురిదీయుట కాజ్ఞ యొసఁగెను. - ఆహా! యెట్టివాని కెట్టి దశ వచ్చెను! జమీందారు లనిపించుకొని, దుష్టులను శిక్షించి, గుణవంతుల నిరంతరముఁ గాపాడి, న్యాయపాలకులను బిరుదు వహించిన, జయరామారెడ్డి వంశమున జన్మించి, చెప్పినమాట కెదురాడువారు లేకుండ బ్రతికిన మన వీరాగ్రేసరుని, సుమారు రెండు గంటల వేళ - ఉ- రి- తీ- సి- రి. అతని యాత్మకు శాంతి యగుఁగాక!

-: ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః: -

సీ॥ నడుము డాపలనున్న యడిదంబుఁ జేఁబూని
శిరములు పై కెగఁజిమ్మి చిమ్మి
మొలనున్న పిడిబాకు వలనొప్ప ధరియించి
కుత్తుక క్రోవులం గోసికోసి
కడిమిఁ మూపుననున్న గండ్రగొడ్డలి దాల్చి
కరములు పాదముల్ నఱికినఱికి
తురగంబుపై భద్రపఱచిన బల్లెంబుఁ
గొని, వడిఁ బొమ్ములం గ్రుమ్మి క్రుమ్మి

గీ॥ దక్షవాటీ భయాన కోద్దండ మూర్తి
వీరభద్రుని యపరావతారమనఁగఁ
జండతేజుండు, రెడ్డివీరుండు, సమర
తలము పీనుఁగు పెంటగా సలుపఁదొడఁగె ॥

ఉ॥ ప్రాకట విక్రమక్రమ పరంతపుఁ డాతఁడు హుంకరించుచుం
బైకొని, కేలనున్న కరవాలునకుం క్షణమేని విశ్రమం
బీక, రణోర్వియెల్లఁ జరియించుచు నొక్కనిఁగూడ జాఱిపో
నీక వధింపఁజొచ్చె, రిపుబృందము పాలిటి కాలమృత్యువై ॥

- శ్రీ పాణ్యం నరసరామయ్య
("స్వాతంత్ర్య వీరుఁడు" పద్యకావ్యము నుండి)

## అనుబంధము – III

### 'రాయలసీమ దానకర్ణుడు'

# శ్రీ బుడ్డా వేంగళరెడ్డి జీవిత చరిత్ర

### (ద్విపద కావ్యము)

**రచన: క॥ బందుమియ్య**

ఈ ద్విపద కావ్యము యొక్క కాగితపు వ్రాతప్రతి నాకు 1965 డిసెంబరు నెలలో కర్నూలు జిల్లా కోవెలకుంట్ల తాలూకా రూపనగుడి గ్రామములో లభించినది. అది తోక పుస్తకము; పేడ కాగితములు; గుడ్డ అట్టతో కుట్టబడినది. అందు 87 కాగితములులున్నవి. అనగా 174 పుటలున్నవి. ఈ వ్రాతప్రతి వెడల్పు 17 సెం.మీ; పొడవు 21.5 సెం.మీ. ఈ వ్రాతప్రతిలో మొదటి 12 ఖాళీ పుటలున్నవి. అట్లే చివరి 50 ఖాళీ పుటలున్నవి. మధ్యలో 87 కాగితములలో అనగా 174 పుటలలో ఈ ద్విపద కావ్యము వ్రాయబడియున్నది. వ్రాత ప్రతి రెండవ అట్టలో ఈ విధముగా వ్రాసియున్నది; ''68-69 పుటలు పోయినవి. (పొరపాటు వ్రాతచే పొరటలు చించబడెను). ఎన్నికకు మాత్రమే..... వ్రాత వగైరాలు పొరపాటు లేదు''. రచయిత ఈ వ్రాతప్రతిలో రెండు పుటలకు ఒక సంఖ్య వేసినాడు. అందువలన ఆయన 'పుటలు' అనిన 'కాగితములు' అని అర్థము. ''68,69 పుటలు'' అనగా రెండు కాగితములు లేక నాలుగు పుటలు పోయినవి. అందువలన ఈ వ్రాతప్రతి 85 కాగితములలో అనగా 170 పుటలలో వ్రాయబడినదని చెప్పవలెను.

వ్రాత ప్రతి ప్రారంభములోని ఖాళీపుటలలో మొదటి పుటలో ఒక వ్యక్తి పెన్సిలుతో ఈ క్రింది విధముగా వ్రాసియున్నాడు. (ఇది బందుమియ్య వ్రాసిన వ్రాత కాదు. తరువాతి కాలములో ఈ కావ్యమును ముద్రించుటకై చేసిన ప్రయత్నములలో 1953లో ''రాజేంద్రం వెంకోబాచార్లు'' వ్రాసిన వ్రాత).

''30-8-1953. ఈ పుస్తకమును అచ్చు ఆఫీసులో చూపించి ముద్రణ ఛార్జిని వుయ్యాలవాడ బుడ్డా దస్తగిరి రెడ్డిగారికి తెలియజేయవలెను. హంగామి అయిన వెంటనే ముద్రణకు ప్రయత్నించుటకు నేను తగు సహాయము చేస్తూ యున్నాను.

రాజేంద్రం వెంకోబాచార్లు సంతజూటూరు గ్రామం నంద్యాల తాలూకు బండి ఆత్మకూరు పోస్టు

ఈ వ్రాతప్రతి రెండవపుటలో బుడ్డా వేంగళరెడ్డిగారి భార్యలను గురించి యిట్లున్నది

| | |
|---|---|
| మేనమామ పోచా వెంకటరెడ్డి కూతురు వెంకటమ్మ | 1 |
| మేనత్త పల్లె సుబ్బమ్మ ( భర్త పల్లె నాగిరెడ్డి) కూతురు నాగమ్మ | 1 |
| తరిగోపుల చన్నమ్మ | 1 |
| | 3 భార్యలు |

ఈ వ్రాతప్రతిలో కావ్యశీర్షిక లేదు పై శీర్షికను నేనుంచితిని ఒక్కొక్క ప్రకరణమున కొకపేరు కవి పెట్టినాడు కాని ఐదవ ప్రకరణమునకు కావ్యములో పేరు లేకపోయినను కవి వ్రాసిన ఒక చిన్న చీటిలో ఈశ్వర సాన్నిధ్యము అను పేరున్నది ఇందలి ఐదుప్రకరణముల పేర్లు వరుసగా పండిత ఎఱుగాలి భుజభూషణ (భుజబంధు) ధాత ఈశ్వర సాన్నిధ్య ప్రకరణములు మూడవప్రకరణ ప్రారంభములో దానిపేరు భుజభూషణ ప్రకరణము అని వ్రాసిన కవి ఆ ప్రకరణాంతములో దానిని భుజబంధు ప్రకరణము అనినాడు దీనిని బాజుబందు అను అచ్చతెనుగు పదమునుండి కవి కల్పించి యుండవచ్చును భుజబంధు అనుట కన్న భుజభంధ అనుట యుక్తము

ఈ ద్విపద కావ్యము ప్రబంధ ధోరణిలో చక్కని శైలిలో అద్భుతమును రసపూర్ణమును అగు వర్ణనలతో చదువరులను మిక్కిలి ఆనంద పరచుననుటలో ఏమియును సందేహము లేదు దీని రచయిత బందుమియ్య ముస్లిములలో వెనుకబడిన కులమునకు చెందినవాడు (దూదేకుల కులము దీనినే పింజారీ కులము అనియు బిలుతురు) బందుమియ్య యింటి పేరు తెలియుట లేదు ఈ కావ్యమునకు పీఠికా ప్రాయముగా వ్రాసిన ఒక చిన్న చీటిలో క॥ బందుమియ్యా అని సంతకము చేసినాడు క అనగా కమాల్ కావచ్చును ఏలన కావ్యావతారికలో తాను ముక్కమళ్ళ గ్రామ వాసి ననియు షేక్ వంశము వాని ననియు తన తాత కమాల్ మహమ్మద్ అనియు నాయనమ్మ శిలారమ్మ అనియు తండ్రి సాబను సాహేబు అనియు

వ్రాసికొనినాడు బందుమియ్య గురువు పేరు పెగ్రాజప్పకవి అని కూడ తెలియు చున్నది ఈ కవి ఉపాధ్యాయుడుగా జీవించెననియు బుడ్డా వేంగళరెడ్డిగారి సమకాలికుడనియు రేనాటిసీమలోని పెద్దలు చెప్పుచున్నారు బందుమియ్య గొప్ప భక్తుడనియు లోకజ్ఞుడనియు ఈ కావ్యము నిరూపించుచున్నది

ఈ ద్విపద కావ్యమునకు శ్రోత కావ్యరచనకు ప్రేరేపించిన దాత రాయసపు కరణము ఈయన పేరు కావ్యావతారికలో లేదు పేరు దగ్గర చుక్కలు పెట్టబడి యున్నవి రాయసపు కరణము యాఖ్యాన్వయ సత్య చరితుఁడు అని యున్నది రెండవ ప్రకరణము ప్రారంభములో కూడ ఇట్టి చుక్కలేయున్నవి మూడవ ప్రకరణ ప్రారంభములో మాత్రము కరణము కొండయాఖ్యాన్వయ వినుము అని యున్నది దీనికి కొండయ్య అను పేరుగల వంశమునకు చెందినవాడా! వినుము అని అర్థము కాని కవి ఉద్దేశము కొండయ్య అనుపేరుగలవాడా! అని మాత్రమే తన తాతను గురించి చెప్పినప్పుడు కూడ ఇట్లే వ్రాసినాడు వరకవహాల్ హోమ్మదాన్వయ సూత్రతుండు కవి భావములో అన్వయ శబ్దమునకు పేరు అని అర్థము కాబట్టి ఈ కావ్యశ్రోత కరణము కొండయ్య అని భావింపవచ్చును బందుమియ్య మంచి కవియేకాని పండితుడు మాత్రము కాడు అనేక భాషాదోషములు పదదోషములు వ్యాకరణదోషములు ఛందోదోషములు ఈ కావ్యము నిండుగా నున్నవి నా శక్తికొలది వానిని సవరించినాను యతిస్థానములో వచ్చిన శిష్టేతర శబ్దములను మాత్రము అట్లే ఉంచినాను సొప్నము (స్వప్నము) ఒచ్చు (వచ్చు) వకటి (ఒకటి) వకరు (ఒకరు) చెటుల (చటుల) చెరితము (చరితము) ఆసీస్సు (ఆశీస్సు) వంటెద్దు (ఒంటెద్దు) అనేటి (అనెడి) ఎలమలు (వెలమలు) ఇవ్వు (ఈయు) పరవుపకారము (పరోపకారము) మొదలైనవి వైరి సమాసములు కూడ ఈ కవి రచనలో ఎక్కువగా నున్నవి ఉదా॥ బీదనివహము సంద్రగంభీరుడు శైవసాములు బత్తిప్రభావ విస్తారబీదలు హిందుతానము పుణ్యసామి ఆప్తబందుగులు దివ్యజాలు మొదలైనవి

ఈ కావ్యములో అర్ధబిందువులను శకటరేపలను కవి పాటించలేదు కాని నేను ఈ రెండింటిని ఉంచినాను గ్రాంధికభాషలో ప్రాచీనపద్ధతిలో సాగిన కావ్యములలో ఇవి లేనియెడల కొన్నిచోట్ల అర్థము సరిగా అవగాహనకాదు వాక్యనిర్మాణము తప్పుటకును అవకాశమున్నది

ఈ వ్రాతప్రతి మధ్యలో బందుమియ్య స్వహస్తముతో వ్రాసిన ఒక చిన్న చీటీ ఉన్నది అది ఈ కావ్యమునకు పీరికాప్రాయముగా నుండుటచే దానిని యధాతధముగా దిగువ నిచ్చుచున్నాను

అయ్యలారా!

ఏను ఒక్క ముఖ్యదినంబున మహోల్లాస చిత్తుండనై మధ్యహ్నంబున నిజ యిష్టాది బంధుజన సహితంబుగా భోజనంబు లాచరించి తా దినంబు రాతిరి శరత్కాల పూర్ణిమ చంద్రుని వేడుకలను నిండు వెన్నెల బయట పరుండి చంద్రుని వేడుక కన్నుల గాంచుచు ఆనంద చిత్తుండనై యున్నంత

ఇష్టదేవతల ప్రార్థించి ఆదిమ కవుల నుతించి భావి కవులను బ్రస్తుతించి యిలువేల్పు పాదద్వయంబు లాత్మలో ధ్యానానంద హృదయుండనై సుఖసుప్తునున్న ఎడ

(భగవద్భక్తులను మహాత్ములు) సర్వజ్ఞుని కత్యంత ప్రియులనియు సర్వం సహా దివ్యదృష్టిచే నెఱుంగుదురనియు నిజభక్తుల కభయంబిచ్చెదరనియు సర్వజన శ్రావ్యంబై యున్నయంది (అట్టి పుణ్యనికరంబున కాంయిలువేల్పు) మహాశ్వేతమయంబగు హయమ్మును ఎక్కి సాక్షాత్కరించుటయు వారి కేను నమస్కరించి పూజించి ప్రార్థించగా ఆనందించి (వత్సా) స్వర్లోకమ్మున ఇంద్రుని ప్రశ్నలకు నారదండిట్లు లనియె

దాతృత్వే తారకే జ్యోత్స్నా ధాత్రీమండల దృశ్యతి ధాత్రిలో నెందరెంత ధర్ములుందురో అన్ని తార లంత ప్రకాశముండును అని యిట్టి దాతృత్వ చరితమ్ము శక్రునకుఁ దెల్పె అట్టి కథ నీ రీతిగ రచియింపుమని నాకు నుపదేశించి మేల్కొల్పి అదృశ్యుఁడయ్యె

మఱునాడరుణోదయంబగు నంతలో ఏను నిత్యకృత్యంబులు దీర్చికొని యుండిన ఎడ (ఆ వలయువారు పిలుపించి ప్రశ్నింపగా) రెడ్డి జీవిత చరిత్రము నాకన్న విన్న దాద్యంతంబంతయు తేటతెలుఁగున ఎల్లరుల కెల్లడిగా నుల్లంబు రంజిల్ల ఈ దాత జీవితచరితము రచియించితిని

ఓ అనఘులారా! ఈ యంతరన్వయ కల్పనల లోపములొదవిన తెసికులు దిద్దెదరని వేవేలు కుర్ణీలు ఆచరించుచున్నాడను -

విధేయుడు
కః బందుమియ్య"

ఈ కవి ముస్లిమగుటచే కాబోలు, సందర్భమేమియు లేకపోయినను నాల్గవ ప్రకరణము చివర మైసూరును పాలించిన హైదరాలీని, టిప్పుసుల్తానును విశేషముగా వర్ణించినాడు.

– తంగిరాల

అనుక్రమణిక



సువర్ణ పతకం

బుడ్డా వెంగళరెడ్డిగారికి విక్టోరియా మహారాణి బహూకరించిన బంగారు పతకం

# శ్రీ బుడ్డా వేంగళరెడ్డి చరిత్ర
## (ద్విపద కావ్యము)

## మొదటి ప్రకరణము – పండిత ప్రకరణము

### ఇష్టదేవతా ప్రార్థన

శ్రీకర ! సన్ముని చిత్తాబ్జ భృంగ !
ప్రాకట భక్త స్వభావాంతరంగ !
(ప్రాకట భవ తమ పటల పతంగ !)
కమలాప్త కోటి సంకాశ ! చిద్రూప !
విమల వేదాంత కోవిద హృత్కలాప !
సకల చరాచర చయ పరిపూర్ణ !
అకలంక మానస ! ఆద్యంత రహిత !
పంచభూతాది ప్రపంచ స్వరూప !
అంచిత సర్వకాలాంతాయ నామ !
అండ పిండాది బ్రహ్మాండంబులందు
నిండి వెలింగెడి నిశ్చలభావ !
నేత్రంబులకు మధ్య నిడుపగు నాసి-
కా త్రిసుషుమ్నంబుకడ పీఠమునను
వేయి సూర్యుల భంగి వెలయు చిత్కళలఁ
బాయక చూపట్టు పరమ నిధాన !
అమల ప్రభావ ! అవ్యయ భేద రహిత !
అమిత దయాపూర్ణ ! ఆర్త శరణ్య !
అని నిరామయు నిత్యు నాత్మ స్వరూపు
అనఘుఁ దాఁ బరమాత్ముఁడగు నప్రమేయు
ప్రణవ నాద స్వరూపా ! యని మదిని-
ప్రణమిల్లి పరమేశు పాదపద్మములఁ

గొనియాడి మత్కృతి కొఱంత గాకుండ
మునుకొని చేతులు మొగిచియు నాదు
ఇలువేల్పు దస్తగిరీశ్వరు మదిని
దలంచి మహమ్మదు దయఁ గొనియాడి
ఆదిమ కవులకు హస్తముల్ మోడ్చి
మోదంబు తోడుత మ్రొక్కి సేవించి
భావి కవులకు నెల్ల భక్తిచే నొదిఁగి
కావింతు నొక పుణ్యకథయని యిప్పు-
డే కథ నేఁ జేయ నిలను సూవ్రతులు
ప్రాకటంబుగ సదా పరియింతురొక్కొ
ఏ కథ నేఁ జేయ నిహపరంబనెడి
లోకంబునకు శుభశ్లోక మౌనొక్కొ

## స్వప్నములో కవికి మహమ్మదు ప్రవక్త ప్రత్యక్షమగుట

అనుచు యోచించి నా యాత్మరంగమున
ఘనమగు నీ పుణ్యకథఁ జేయఁ బూని
వ్రాయఁగ నొక పుణ్య రాతిరి యందుఁ
బాయక నిజ యిష్ట బంధు మిత్రాది-
శతముతో సురస రసాన్నముల్ గుడిచి
సిత వసనము లూని శ్రీ గంధ మంది
కమ్మని తావియౌ కమ్మ కప్పురపు
తాంబూలమునుఁ జేసి తగుశయ్య మేనుఁ
జేర్చి శరదృతు చంద్రు వేడుకలఁ
జర్చించుచుఘన హర్షాంబుధిలోన
మంతనమ్మున మహమ్మదు పాదపద్మ-
చింతనామృతము రుచ్యముఁ జూచిచూచి
సుఖనిద్ర నుండ నా స్వప్నంబు నందు
అఖిల లోకములు విహారమ్ము సేయ-

నెంచి నా యిలువేల్పు నిగనిగ మెఱయు
మించులోయన తన మేలైన హరిత-
వసన దీధితులు నల్వంకలఁ బర్వ
పసఁగల్గు పుష్పక స్ఫటిక హారాళి
మిసమిస ద్యుతులు మిఱుమిట్లుఁ గొల్ప
కుసుమ సుగంధ సంకుమదంపు తావు-
లను ముప్పిరి నీదు లీలలఁ దేలియాడి
అనిలుండు నీ వార్త నవనిఁ జాటింప -
వచ్చెనోయన గంధవహుఁడయ్యు భువిని
హెచ్చువాసనలఁ జయ్యేనఁ బర్వఁజేసె
పొసఁగిన మణిగణ భూషణద్యుతుల
నసమాన జవసత్వ మతి చతురత్వ-
గతి మతి శబ్దసంగతిఁ గుల్కునట్టి
అతి శ్వేతమగు మహాహయముఁ దా నెక్కి-
గగనంబునుండి నిక్కముగ భూస్థలికి
దిగివచ్చు సంపూర్ణ ద్విజరాజు మాడ్కి-
కరుణాకటాక్ష వీక్షణలన డాయ
సరభసమ్మున వచ్చి సాక్షాత్కరించ
సరగున నిటువచ్చు సామి కే నెదుర
బిరబిర చని మ్రొక్కి ప్రీతిఁ దోడ్తెచ్చి
ఉచితాసనమునఁ గూర్చుండఁగాఁ జేసి
ప్రచురత వారి సత్క్రమత పూజించి
ఆ దివ్యపురుషు పాదాబ్జంబు లేను
మోదంబుతోఁ బట్టి మ్రొక్కగా నాదు
శిరము నిమిరి నీకు శ్రేయస్కరమ్ము
దొరకొను లెమ్మంచుఁ దుది నొక్క పుణ్య-
కథ విను మున్నె నాకమున నారదుఁడు
శతమన్యునకు నెట్లు చెప్పె నీ పటుల
క్షితి జను లభినుతిఁ జేయఁగా నిట్టి
కథ రచియించి సద్ఘనకీర్తిఁ బొందు-

మని యుపదేశ మొయ్యనఁ దెల్పి లెమ్ము
అని నను మేల్కొల్పి అదృశ్యుఁడయ్యె

## సూర్యోదయ వర్ణన

అంత కన్నులు విచ్చి నలుదెస లరయ
నంతలో పూర్వదిక్కాంత ముక్కఱను
మురియుచు నుండెడి ముత్తెమోయనఁగ
గురుతగు తూర్పు వేకువచుక్క తోఁచె
కుసుమశరుని బారికోడి యింద్రుండు
వసుధ గౌతమికినై వలఁచి ఆ జాతి-
వాఁడైన శత్రు గెల్వఁగ దశాననుఁడు
దాడికినై బిట్టు దండెత్తి పోవు
తెఱఁగు విన్ప్రోలికిఁ దెలుపంగ నెంచి
బిరబిర ఱెక్క చప్పటు లప్పళించి
దిక్కులు తెలివందఁ దెగితెగి పెక్కు-
కుక్కుటములు మేలుకొనఁ గూయసాగె
మలయ గుబ్బలి జాఱి మఱి వడిఁదేఱి
అల చుట్టుమలఁ దూఱి యటు బారుఁదీరి
సారసంబుల నొంది సారసల్ జెంది
ధీరత చెలువంది ధృతి తన్విఁబొంది
అల్లిన లతకూన లాది క్రొవ్విరుల
పల్లవ కొమ్మ సంపదలచేఁ బొదలు
పొదల నింపొదల పుప్పొదలఁ గదల్చి
మధువాను భృంగ సంభ్రమత లదల్చి
పలువిధంబుల పుష్పపటలి రాగములఁ
దలదాల్చి గొంపోవు తలలాంఛలొక్కొ
చెలువందె పుప్పొడి సిరిమచ్చ లెసఁగె
కలితమౌ శుకశారికల చంచరీక
కలకల నినద సంకలితమై చలిత
అల జవ్వనుల హృదయాబ్జాత వీధి

తులలేని చలువలఁ దోకొని కలయ
వలవ శీతల గంధవహుఁడు నేతెంచె
తెలనాయె తొలుదెస తిమిరముల్ విచ్చె
జలజముల్ విచ్చె నంచలు సంభ్రమించె
అట దినకరుఁ డుదయాద్రి పీఠమున
దిటవుగా పట్టాభితేజుఁడై యొప్పె

## రాయసపు కరణము కొండయ్య కావ్యమును వ్రాయుమని కవిని ప్రోత్సహించుట

అప్పుడే నిత్యకృత్యములెల్లఁ దీర్చి
ఒప్పద సమయంబు నొనగూడినంత
హితుఁడు ప్రపార సంహితమతుఁ డతుల-
మతిమంతుఁ డార్యసమ్మతుఁడు రాయసపు
కరణము కొండయాఖ్యాన్వయ సత్య
చరితుఁ డుద్యోగ సజ్జనుఁడు తా నిత్య-
కృత్యములను దీర్చికొని వచ్చి గ్రామ-
మాధ్యక్షతాది సమ్మతిఁగూడి నన్నుఁ
బిలిపించి గౌరవప్రీతి గూర్చుండఁ
బిలిచి ఓ కవి బందుమియ్య ! నా కిచ్చ-
కల దొకఁటని వినఁగా నిట్టులనియె
కలిగెను మదిని సత్కథలను వినఁగ
తొలి కవులెల్ల సాదృశ్య చారిత్ర-
ముల వ్రాసి కీర్తనమ్ములఁ బొందినారు
కనుగొన మీ రట్టి కథ వ్రాసి ధర్మ-
మనురక్తి గనుపట్టు నట్టిదౌ కథను
మఱిమఱి ఆంధ్ర శబ్దార్థంబులెల్ల
భరితమై వినఁగ సంభ్రమ ముప్పతిల్ల
వినగోరుచున్నాను వీనులుఁ దనియ
వినఁ జెప్పుమయ్య ! అవ్విధి బందుమియ్య !

అని గౌరవమున నయ్యెడను మర్యాద-
లనుజేసి రచట నెల్లరులును గూడి
పలికిరి నూతనప్రభు దాత చరిత-
ములఁ దెల్పుమన్న సమ్మోదత నాదు
(ములఁ దెల్పుమన్న తాంబూలంబులొంది)
ఇలువేల్పు తొలి నుపదేశించినట్టి
ఫల మహామహిమచే పలువురు మెచ్చ
పొలుపొంద నంద ఱింపుగ నాలకింప
కల్పన కథలేమి కల్పింపఁబడక
నేరుపు కొలదిగా నేఁ జేయు కృతికి
వారక దోస మేవలను రాకుండ
సరవి నాంధ్ర సుశబ్ద సన్నుతుల్ వెలయ
పరికింప యతిగణ ప్రాసంబులందు
పరఁగ నెక్కువ సంధి పదములు లేక
సరసజ్ఞులును గూడి సతతంబు నుడువ
వలనొప్ప నీ కథ వర్ణనఁ జేయఁ
దలఁచి యే ద్విపద నిర్ధారణఁ జేతు

## కవి వంశాభివర్ణనము

లలిత నా వంశాభిలక్షణ చంద్రుఁ
డిల ముక్కమల్ల కవీంద్రులలోన
సురుచిర మగునట్టి సున్నతు సభను
ధర నెన్న షేకింటి దయ నయశాలి
వర కమాల్ హొమ్మదాన్వయ సువ్రతుండు
అరయ నీతని భార్యయగు శిలారమ్మ
వరగర్భ జనితుండు వాసి మీఱగను
సరసుఁడు సాబను సాహేబు గల్గె
పాల మున్నీటి లోపల చందమామ
వాలాయముగఁబుట్టి వర్ధిల్లు నీతఁ

డజ్ఞాను లనియెడి యంధకారులకు
సుజ్ఞాన మనియెడి సూర్యబింబంబు
జ్ఞానమయుం డహంకార వర్జితుఁడు
దానధురీణుండు ధర్మవర్తనుఁడు
సాంఖ్యంబు లాదిగా సకల యోగముల
సంఖ్య లేమాఱక సాధించు ఘనుఁడు
అనఘుఁడౌ నాయన కాత్మనందనుఁడ
ఘన పెగ్రాజప్ప కవికి శిష్యుండ
బందుమియ్యను పేరఁ బరగిన వాఁడ
ముందు ధర్మాత్ముల ముచ్చట లెల్ల
కరమొప్ప సూచనగా నిందు కొన్ని
సిరులొల్క ధర్మముల్ జేర్చి చెప్పెదను

## దానము యొక్క గొప్పతనము

తలఁప నీ పృథ్వియందలి పెంపుఁజెంది
కల రన్నదాత లే కాలంబునందు
సహజంబుగా మఱి సకల సంపదల
వహియించు ముందట వారిలో నెన్న
ఆదిత్య చతురాననాది మహేశు-
లాదిని బలి కర్ణు లా హరిశ్చంద్ర
శిబి నల మాంధాతృ క్షితిపతు లెల్ల
ప్రబల షోడశ దాన పారీణులగుచు
నిహపర సత్కీర్తులెల్ల గైకొనుట
సహజంబు లనుటకు సకల పురాణ-
మితిహాసములు బల్కుటిది సాక్షి గాదె
శ్రుతులచే నిహపర కీర్తులు గలుఁగ
చాతుర్య కవిత రసజ్ఞతల్ మెఱయ
దాత పెంపును సొంపు దలఁపగావలయు
వర భేరిధ్వని వినవచ్చు యోజనము
ధర మేఘరవము ద్వాదశ యోజనములు

సతత దానరవంబు సచరాచరంబు
కృతులచే వెలయు నాకృతి యెట్టులనిన
వినవయ్య రెడ్డిజీవితమను చరిత
మనఘ ముల్లోకంబులందు లోపలను

## ఉయ్యాలవాడ పురవర్ణనము

కరమొప్ప మర్త్యలోకంబున మంచు-
గిరికి దక్షిణ జనాకీర్ణమై భరత-
ఖండంబు గలదు ఆ ఖండంబు తుదను
మండలాధిపులకు మంచి బిడారు
ధారుణి పురముల తలకట్టునాగ
నారూఢి మద్రాసునా నొప్పుచుండు
సకల శ్రేయంబుల సంపద లొసఁగు
ప్రకటితమగు చెన్నపట్టణమునకుఁ
గలవు జిల్లాలు శృంగారమైనట్టి
కలిమికి నెలవగు కర్నూలు జిల్ల-
కనురక్తి తాలూక లన్ని మిన్న
గొనబైన కోవెలకుంట్ల తాలూక
వఱపు రంజిలు రెడ్డివారి దేశంబు
గరిమ చెన్నొందిన గంగకు సాటి
స్థిర కుముద్వతి నదీ తీరంబునందు
తఱుచు చల్లని నీటితావుల దాని
కలుములచెలి తెలికన్నులోయనఁగ
కొలకుల కలువరేకులు విచ్చుదాని
కమలా నివాసంబుగా నొప్పుచుండి
కమలా నివాసంబుగా నొప్పుదాని
మకర కచ్చప శంఖ మహిమచే ధనదు
మకర కచ్చప శంఖ మహిమల దాని
నెలరాజు ఈ యేట నేర్చిన యాత
జలమను చల్లని జలములదాని



బుడ్డా వెంగళరెడ్డిగారి సమాధి- ఉయ్యాలవాడ



ఉగాది పండుగనాడు బుడ్డా వెంగళరెడ్డిగారి సమాధికి పూజ చేస్తున్న ఆయన వంశీకులు
-మునిమనుమలు శ్రీరాములురెడ్డి, విశ్వనాథరెడ్డి, వారి కుటుంబ సభ్యులు

చల్లని జలముల జలచర నికర
మల్లిబిల్లిగ దిరుగాడెడు దాని
స్మరుఁడు ఈ నదియొడ్డు సామీప్యమునను
శరపంచకమ్ము తా సమకూర్చెననగ
చెంగట పరిమళ చేమంతిపూల
మంగళప్రదమగు మల్లె తోటలును
కాంతి మించిన సూర్యకాంత పుష్పములు
వంతు కెక్కిన జాజివనములు మంచి
సంపంగి వనములు సరసి గేదంగి
సొంపైన మోదుగుల్ సురపొన్నగుత్తు
లింపు సుగంధంపు లేలకి లతల
సంపద లీనగా స్మరుని బలంబు
పెంపు వహించియు పెక్కుపుష్పముల
జొంపముల్ తేనియల్ సోనలై కురియ
సుధలూరు విరితేనె సొలపుగాఁ ద్రావి
మధుప ఝుంకృతినాద మహిమ శోభిల్ల
కలరవ పక్షిసంఘపు గరుజ్జనిత
చలిత వాయువు నీట చరియించి పుష్ప -
లతల నుయ్యేలలూగి లావణ్యతరుల
సతతమ్ము నెగబ్రాకి సరవి సుగంధ
పరిమళంబులఁ దోగి పయ్యెర పాప
విరుల తేనియల క్రొవ్విరి దుమారముల
సంపంగి పుష్ప కేసర తేనియలను
సొంపైన గేదంగి సుమ సౌరభముల
కలసియు కర్పూర గమిగుముల్ దాఁటి
వలపగు జాజి లవంగాది చెట్ల
కురువేరు పచ్చాది కొమ్మలనూపి
మరువంపు వనపుష్ప మంజరుల గడు
పఱచి ఉయ్యేలవాడ పట్టణ మెల్లెడల
విరివిగా పుప్పొడుల్ వెదచల్లగాను

గమ గమ గమయని కమ్మ వాసనల
గమకించి రేవగల్ గ్రమ్ముకొనంగ
విపుల సువాసనల్ వీచి తెమ్మెరలు
చపలత్వముగ కేళి సల్పుచునుండ
నాపుర మాదిగా నా చుట్టుపట్ల
ప్రాపుగానుండిన పల్లెల జనులు
వేఱె సుగంధ క్రొవ్విరులనుగాని
వేఱె చల్లనిగాలి వెదక రెవ్వారు
ఎల్లరకును మది నిష్టంబు దీర
చల్లగానుండు నా సామీప్యముననుు
ఘనసార ఖర్జూర కదళి కపిత్థ
పనస జంబూ ద్రాక్ష బదరి కామ్లాది
నారికేళాశోక నారంగ నింబ
పారిజాతక చూతఫలరస స్వాదు
లలిమి కోవెల చిల్క లమృతంబు లొల్కc
బలుకు చుండెడు వనప్రాంతంబులందుc
బరగె నుయ్యాలవాడ పట్టణంబనుచు
అరుదందc జెప్పcగా నంతయు వినుచు

## కరణము కొండయ్యగారి ప్రశ్నలు

నను కనుగొని కరణము కొండయాఖ్యుc
డనియె నిట్లనుచు ఊడాపురంబునకు
నెవరు? తద్వంశంబు నెద్ది? ఆద్యంత
మవసిత హృదయ సమ్మతిc దెల్పుమయ్య
తలిదండ్రు లన్నలు దమ్ములు వారి-
కులగోత్రనామముల్ కూరిమి భార్య
లెందఱు? పుత్రులు నేలీలమెలగె?
సందేహమునుదీర చవులూరగాను
ఘనమగు సత్కథాక్రమనెల్ల నాకు
వినcజెప్పవలయును విశదంబుగాను

అని పల్క కొండయాఖ్యాన్వయ సుగుణ!
వినవయ్య చెప్పెద విమల వాక్యముల

## పురవర్ణన – చతుర్వర్ణములు

అమరినవి దిటవు లాపురంబునకు
క్రమమొప్ప శత్రుభీకరమగు కోట
వాకిళుల్ కొత్తళాల్ వరుస దీర్ఘికలు
ప్రాకట మైనట్టి పరిఘుల నమరి
భట పరివారాశ్వ పరిగమిచేత
నటవిట గాయక నాచురంగులను
జేగీయమానమై సిరుల చెన్నొంది
బాగుగనుండు నప్పట్టణమునకు
రచ్చలు చావిళ్ళు రాజమార్గములు
గచ్చుటర్గులు మేలుకట్లు పందిళ్ళు
ధారుణి మఱి నెన్నఁదగిన బజార్లు
కోరిన వస్తువుల్ గొనుట కంగళ్ళు
కలిమికి వాసమై కనుపట్టు మేటి
బలవంతులిండ్లు వ్యాపారస్తులిండ్లు
రాకేందురుచిఁ గేరు రమ్యహర్మ్యములు
ప్రాకార గోపుర ప్రతిమల నమరి
దేవాలయంబు లుద్దీపితమయ్యు
లావణ్యమై మహారమ్యంబుగాను
సలలిత వైభవాస్పదమున కిరవు –
గలిగి యహర్నిశాకాల మవ్వీట
ప్రాపగు విద్యలపట్టు బ్రాహ్మణులు
నైపుణ్య మలరారు నట్టి కోవిదులు
వేదవేదాంగ ప్రవీణత మెఱసి
ఆది పురాణేతిహా సముల్ జదివి

యజనాది కర్మంబు లాశ్రమ నియతి
నిజ తపస్స్వాధ్యాయ నిష్ఠాగరిష్ఠు-
లచ్చటి రాజులు నాలంబటన్న
నిచ్చ భీతాహంబు నెఱుఁగ రేప్రొద్దు
శరణని వచ్చిన శత్రువునైన
కరుణచే రక్షింపగాఁ జూతు రవని
మఱియు నప్పురి మహమ్మదు మతస్థులును
గరిడి సాధన చేత కత్తులు జిమ్మి
కరముల రెండు సంకలియలు ద్రెంపి
చిఱుత కట్టెల సాము చేయువారలును
బల్లెపుసాములు బాణ విద్యలును
విల్లి త్రాడుల వెసవేయు సాధనము
మెడపట్లు చేపట్లు మెలపున క్రిందఁ
బడవైచు మల్లురు బహుమంది గలరు
అందు కొందఱు దైవధ్యానులై గురునిఁ
జెందఁగోరెడి భక్తిజనము లున్నారు
వైశ్యులు ధననాథు వైభవోన్నతులు
భాసిల్లు శూద్రులు బలరామ సములు
సూనబాణుని కంటె సొగసగు మగలు
మానినులును చందమామ పుత్రికలు
ఆ పురి వెలయాండ్రు నధిక సుందరులు
చూపుల మునికోటి స్రుక్కఁజేయుదురు
రూపింప గా వర్షఋతుకాలమునను
ప్రాపింప నెలకొక్కపారి వర్షించు
పెనుపైరులయ్యు దుర్భిక్షంబు లేక
జను లనాచారముల్ సలుప రేప్రొద్దు
ఈరీతి విభవంబు లింపొందుచుండ
ఆరూఢి ధనధాన్య మఖిల సంపదలు -
గలిగి వినోదమై కన్నులఁ జూడ
అలకాధిపతి పురంబన నొప్పుచుండె

## మజ్జరి ( బుడ్డా) వేంగళరెడ్డి జననము

ఆపురాధీశ్వరుఁ డతుల విక్రముఁడు
శ్రీపతిభక్తి భాసిలు సద్గుణుండు
మోటాటి కులజుఁ డమోఘ తుల్యుండు
కూటస్థమును చెరుకోళ్ళ గోత్రుండు
వరుస మజ్జరివారి వంశ క్షీరాబ్ధి
పరిపూర్ణసోముండు ప్రబల ధనాఢ్యుఁ
డైన నల్లపురెడ్డి కతని కిల్లాలు
మానిత సద్గుణ మణిగణ హారి
పతివ్రతాలంకార భవ్యవిచార
అతిపుణ్య సంశీల అనుపమ జ్ఞాన
సూనబాణుని మాత సుకృతవిఖ్యాత
మానిని అక్కమ్మ మహలక్ష్మి గర్భ-
మున నవమాస సంపూర్ణుఁడై పొదలి
ఘనతర శుభలగ్న కాలంబు నందుఁ
గలిగె సుపుత్రుండు కాంతకు నపుడు
కులమును వెలయంగ కులదీపకునకు
పురుడాదిగాగల పుణ్యముల్ దీర్చి
కరమొప్పుచుండ వేంగళరెడ్డియనుచు
పేరిడె నారెడ్డి ప్రియనందనునకు
ఊరి పుణ్యాంగనల్ ఉత్సవంబడర
చుట్టముల్ హాతులును సొంపున మంచి
పట్టువల్వలు మించు పసరు చన్కట్లు
పసగల్గు తలచుట్లు పచ్చనంగీలు
పసిబాలునకుఁ దొడ్గి పడఁతుకలెల్ల
మారునివంటి కుమారుఁ డటంచు
సారస నేత్రలు సారె ముద్దాడి
తలయంటి మఱి యామదపు వ్రేలుఁ గుడిఁప
లలనలు జోకొట్టి లాలియుఁ బాడి

నిదురలు బుచ్చిన నెలంతలకెల్ల
ముదమొప్ప భోజనములఁ దృప్తిఁజేసి
అగరు గంధము కుంకుమాది పూసరులు
తగనిచ్చి కర్పూర తాంబూలములను
ఇక్షు దండంబుల నియ్యా నా నీర-
జాక్షులు తమతమ స్థానముల్ జేర

## బ్రాహ్మణుఁడు జోస్యము చెప్పి జాతకము వ్రాయుట

ముదమొప్పఁ దనమది ముచ్చటల్ దెలియ
పదపడి నా రెడ్డి బ్రాహ్మణ సభను
తోడ్తెచ్చి మర్యాదఁ దృప్తిగాఁజేసి
పోడిమి మీఱ నేర్పున నిట్టులనియె
ఓ భూసురోత్తమ! ఓ పుణ్యచరిత!
ఓ భూరికరుణాబ్ధి! ఓ పండితేంద్ర!
వినవయ్య నేఁ జేయు విన్నప మొకటి
అనుపమ సుమనస్కులగు మీర లిపుడు
పదినెన్మ నూట నిర్వది రెండు ఏండ్ల
పదపడి చిత్రభాన్వత్సర జ్యేష్ఠఁ
బౌనరంగ ప్రథమ సంపూర్ణ కందాయ-
మున శ్రీ శు ఎతపక్షమున గురువార -
మవనిని సౌభాగ్యమను సుయోగమున
నవమి రోహిణి శుభ నక్షత్రమునను
రమణీయమైన కర్కాటక లగ్న
సమయాన నా పగల్ సలలిత వేళ
నా పూర్వకృతమున నాకు సంతాన
మీ పట్ల కృపఁజేసి యీశ్వరుం డొసఁగె
పాపని జాతక ఫలమును నాకు
రూపించి చెప్పు మారూఢంబుగాను

అనిన నల్లపురెడ్డి కా భూసురుండు
ఘనమగు జ్యోతిష గ్రంధ శోధనల
ననువగు శుభశ్లోకనముల బాలకుని
ఘనజాతకము వ్రాసి కరుణ నిట్లనియె
వినుము నల్లపురెడ్డి విశదంబుగాను
తనుకాంతిఁ గన్న నీతని సౌరుఁగన్న
లలిమీర జాతక లక్షణంబులను
గలదు శుభంబు వేంగళరెడ్డి పేర
సహజమై తగు శుభస్థాన రాసులను
గ్రహములు నిల్చె లగ్నముఁ జూడమాకు
ఇల నవగ్రహదోషమింతైన లేదు
తలఁపగా గురు శని దయవారలైరి
దివస వారము తారఁ దెలియ యోగంబు-
లవియెల్ల శుభకర మయియున్న వరయ
హల కులిశాబ్జముల్ హస్తపాదములఁ
గలవు నీ సుతుఁడు సద్ఘన యశస్కరుఁడు
యవ రేఖలాది చిహ్నాము లున్న వరయ-
నివియున్న ఫలముల నెన్నం గఁదరమె
యింతయే గాదును మ్మితని కంకణములు
కాంతల ముప్వురఁ గల్యాణ మగును
ముప్వుర సతులను మురిసి ముద్దాడి
మవ్వపు సంతాన మహిమ లేదాయె
పెండ్లిండ్లు దానముల్ ప్రేమను జేసి
యేండ్లు డెబ్బది మీద నెనిమిది బ్రతుకు
అతడు కేవల మనుజుఁడని యెన్నరాదు
అతఁడాది విష్ణువునంశోద్భవుండు
ఇతని చరిత్రంబు లిలమీఁదఁ గవులు
హితవొప్ప రచియింతు రిదియె నిశ్చయము
ఇతని సద్గుణములు నితని ధర్మంబు-
లితని యాచారంబు లివియన్ని వినుఁడు

పసర మజ్జరియిండ్ల వంశజుండైన
ఘనుఁడు వేంగళరెడ్డి కామాదివర్గ-
గుణి తిమిరార్కు- డకుంఠిత యశుఁడు
గణుతింప సద్గుణ గణ గరిష్ఠుండు
సకల శాస్త్రవినోది సజ్జన హితుఁడు
అకలంక చిత్తుఁ డహర్నిశాదులను
అత్యంత వ్రతశీలుఁ డాచారపరుఁడు
సత్యంబుఁదప్పని సౌఖ్యప్రదుండు
మునిజన పాలుండు మోక్ష సాధనుఁడు
అనయ మీశ్వరుచింతనానందపరుఁడు
అసమాన భాగవతాది విప్రాది
రసిక సంవాద సురక్షిత యశుఁడు
తలఁప నాత్మైక్యసంధాన సంపూర్ణ-
ఫలదుఁ డానందుండు పరమ సుజ్ఞాని
భావింప నుపనిషద్భాష్య ధర్మముల
నేవిధంబుల మది నేమఱకుండు
శిష్టార్థులను బ్రోఁచు చింతన పరుఁడు
నిష్ఠాగరిష్ఠుండు నిర్మలాత్మకుఁడు
బంధు చింతామణి పరమ సాత్వికుఁడు
సింధు గంభీరుఁ డాశ్రిత కల్పకంబు
అరయ నీ శుభలగ్నమందున్న ఫలము
కరమొప్ప వ్రాసి శ్రీకరమని యిచ్చె
అంత నల్లపురెడ్డి ఆ జాతకంబు
సంతసంబునఁ గొని జన్నిగట్టులకు
అనువందగా దండ మర్పణఁ జేసి
కొనుఁడని వారలకును సంతసమున
భక్ష్యభోజ్యాదులఁ బరితృప్తిఁజేసి
దక్షిణ లాదిగా దయమీఱ నిచ్చి
గొనబైన తొలుచూలి గోవుల నిచ్చి
మన మలరార సమ్మతి వీడుకొలిపె

## నల్లపురెడ్డి – అక్కమ్మ దంపతులకు ఇతర సంతానము కలుగుట

అంతనా యక్కమ యను పుణ్యవతికి
సంతతి తిమ్మమ సరస సుబ్బమ్మ
ఘనుఁడు ఈశ్వరరెడ్డి గలిగిరి వారు
దినదినంబుల యందు తేజరిల్లుచును
బాలార్కబింబముల్ పగిది వర్ధిల్లి
బాలురు పదియేండ్ల ప్రాయంబునకును
చదువులు సాములు సకల ధర్మములు
సదయులై నేర్చి రాచారాది విధులు
జనులెన్న సకల విలక్షణ విచక్షణులు
వినుత చారిత్రులు విమల మానసులు
ఘనమగు సత్యవ్రాగ్వత ధురంధరులు

## పురస్త్రీలు వేంగళరెడ్డి సౌందర్యమును ప్రశంసించుట

అను వంద వారిలో నతి పుణ్యశాలి
వేంగళరెడ్డి సాత్వీక గుణుండు
సంగతిగాఁ దన్ను సజ్జనుల్ గొలువ
వనవిహారంబుఁ బోవఁగ వీధులందు
వనితలు తమ యిండ్ల వాకిండ్ల నిల్చి
వయసు రూపము మది వర్ణనల్ జేసి
ప్రియ వాక్యముల మన ప్రీతి నిట్లనిరి
రమణిరో! వినవె నల్లపురెడ్డి పట్టి
కొమరు ప్రాయముఁజూడ కోరికలూరు
పొలతిరో! యీతని పుట్టువు నెన్న
నలకూబరునికన్న నతిరూపుడంద్రు
కలికిరో! స్మరుఁడు చక్కనివాడటంచు
నిల జను లనుకొందు రెఱుఁగ రెవ్వరును
వాతులార! మీ మది కెట్లున్నగాని
యితని కంటెను మరుం డెక్కుఁడు గాడు

తరుణి! యీతని బుద్ధి తలఁపగా లక్ష –
వరహాలు జేయునే వాల్గంటులార !
చందమామనుఁ బోలు చక్కని మోము
సుందరంబును కండ్లజూచినఁ జాలు
కలువ రేకులఁగేరు కన్నుల తీరు
పలువరుసయు వజ్రపంక్తుల నడఁచు
పదియాఱు వన్నియ పసిఁడి నడంచుఁ
గదవమ్మ ! యీతని ఘన మేనికాంతి
విపుల శిరంబును విపుల ఫాలంబు
విపుల యురస్థలం బెగువగు భుజము –
లాజాను బాహువుల్ హస్తపాదములు
రాజీవములఁ బోలు రాజీవనేత్రి!
నాగారి మధ్యము నాగారి నడయు
సాగర గంభీర సామ్యంబు గలదు
కలవారి సుతుడంచు గర్వమింతైన
ఎలనాగ వినలేదె యెవరితోనైన
దొరబిడ్డనని మాట దుడుకాడడమ్మ
పరకాంతలను మాతవలె నెంచునమ్మ
కలనైన పలికి బొంకని ముద్దులయ్య
వలపుల కుప్ప మవ్వపు తేనెలప్ప
ఏ నోము నోచెనో యీతని తల్లి
తా నోముపంటయై తగజన్మమెత్తె
కాకున్న నింత చక్కని రాచపుట్టు –
వీ కలికాలమం దెవరైనఁ గలరె

## పురములోని పురుషులు వేంగళరెడ్డి గుణములను ప్రశంసించుట:

అని పురకాంత లిట్లాడగా పురుషు –
లనువందగాను ఆయనఁ బొగడి రిట్లు:
ఘనుఁడు వేంగళరెడ్డి ఘనకార్యములను
జనలోక హితుఁడు సజ్జనలోక నుతుఁడు

అమిత ప్రతాపుఁడు హర్యక్ష బలుఁడు
కమనీయ గాత్రుండు ఘన భుజశాలి
కర్ణభూషిత మణిగణ ప్రకాశుండు
స్వర్ణరంజిత జరీచయ కిరీటుండు
భ్రాజిత కాంచనాంబర శోభితుండు
రాజిత మణిఘృణి రత్నాంగుళీయుఁ
డా మేరునగధీరుఁ డార్యసన్నుతుఁడు
ఈ మహామహనీయు నెన్నంగఁ దరమె
అని పురవాసు లిట్లాడుదు రనఘ!

## వేంగళరెడ్డి కథను చెప్పుమని సభవారు కవిని కోరుట

అని యేను ఇటుల నానందంబుఁ జెందఁ
బలికిన విని సభవార లిట్లనిరి
సలలిత మహామ వాచాలత చిత్ర –
కరమగు మీ వాక్యకలన సంతోష –
కరమయ్యె నీ కథ కర్ణముల్ దనియ
నానతియ్యుమటంచు నడిగెదనయ్య
మానక యీ కథ మఱి సెలవిండు
ధరమీద నతనికి ధనధాన్య మహిమ
లిరవొందఁ గలుగుట కిదియును మాకు
వినఁబల్కుమని పల్క విని కని నంత
ఘన కృపమీఱ సత్కథను జెప్పెదను
విను కొండయాఖ్యాత విశద మీ చరిత

## కథా ప్రారంభము

ఘనమైన యవ్వీటి గలవారికెల్ల
నొకటిరెం డావులు నుండు వారలకు
ప్రకటిత ధనదుని పదవిని గేరు

ధనధాన్యములు గల్గి దానధర్మములు
అనఘాత్ములైయుండు రది వినిపింతు
పెక్కావు లెద్దులు పెనుభూమిఁ గల్గి
రెక్కొన్న బలవంతు లెక్కింప నగునె
వినుమోయి కొండయ విశదమీ మాట
ఘనముగా వెలసి వేంగళరెడ్డి కపుడు
గురుతర వృషభాది గోవృద్ధిఁ గలిగి
ఎరు లొసంగెడు మంచి సేద్యంబు కతన
నవ నిధానముఁబోలు నవధాన్య పుట్లు
ప్రవిమలంబుగ వేల పరిమితిఁ గలిగి
సకల శ్రేయంబుల సకల సంపదల
సకల భాగ్యోన్నతి సన్నుతి కెక్కె
అల కుబేరపురంబు అన నొప్పుచుండె
ఎలమి నా పట్టణం బేలుచు నుండె
అంత నా వీటను అతిచిత్ర మలర
కాంతిచే మిక్కిలి కళల పెంపొంది
వంతుకెక్కిన పూర్ణవయసు రంజిల్లె

## తల్లిదండ్రులు వేంగళరెడ్డికి వివాహమును చేయ సంకల్పించుట, మేనమామ కూతురు వేంకటాంబను, మేనత్త కూతురు నాగమాంబను స్థిరపరచు కొనుట

ఇంతులచేఁ గాదె యిలను సత్కీర్తు -
లింతులచేఁగాదె యిష్టభోగములు
సంతానములు గల్గి సంతసపడుట
అని తన మదిలోన నటు వితర్కించి
తనతల్లి యాజ్ఞకుఁ దప్పక తాను

ఆరూఢి తా వివాహము నాత్మదలంచి
కూరిమి మీఱ నుంకువ లేమి లేక
తన మేనమామ సద్ధర్మపరుండు
ఘనుఁడగు పోచ వేంకటరెడ్డి ముద్దు -
తనయ సద్గుణగణస్థాన యైనట్టి
ఘననీలవేణి సత్కాంతిపూఁబోణి
చందనగంధి రాజత్కీరవాణి
యిందునిభానన యిభరాజ గమన
కనకపు బొమ్మ చక్కని ముద్దుగుమ్మ
వనితాలలామ సువ్రత వేంకటాంబ -
యను కన్నియకు సాటియౌననఁ దగిన
వనరుహ నేత్రి సద్వైభవోన్నతను
వరియింప మదిఁబూని వైఖరి మీఱ
నరనుతుండగు పల్లె నాగిరెడ్డికిని
సతి సుబ్బమాంబను సౌజన్య నిధికి
సుత నాగమాంబను సువ్రత గలదు
బంగరు బొమ్మ సంపగిపూల రెమ్మ
రంగలరారెడు రాయంచ గమన
కువలయదళ నేత్రి కోమల గాత్రి
భువిమించు పూఁబోణి భూరి కల్యాణి
కూరిమి మేనత్త కూతురుగాన
కోరి పెండిలిఁ జేసికొన నిశ్చయించి
యిరువుర సతులను ఇష్టంబుఁదీర
పరువడిగా మాట పల్కులుఁదనర
పిన్న పెద్దలు వచ్చి ప్రేమ నారెడ్డి
కన్నతల్లికిఁ దెల్పగా సంతసిల్లి
ముద్దుల సుతునకు మురిపెంపు సతుల
నిద్దఱఁ జేయుట నిది బాగటంచు
ఘనమగు తాంబూలక్రమ పండు పసుపు -
లనురక్తి గావించి నంత వేడుకను

ఆరూఢి తా వివాహము నాత్మఁదలఁచి
కూరిమి మీఱ నుంకువ లేమి లేక
తన మేనమామ సద్ధర్మపరుండు
ఘనుఁడగు పోచ వేంకటరెడ్డి ముద్దు -
తనయ సద్గుణగణస్థాన యైనట్టి
ఘననీలవేణి సత్కాంతిపూఁబోణి
చందనగంధి రాజత్కీరవాణి
యిందునిభానన యిభరాజ గమన
కనకపు బొమ్మ చక్కని ముద్దుగుమ్మ
వనితాలలామ సువ్రత వేంకటాంబ -
యను కన్నియకు సాటియౌనఁ దగిన
వనరుహ నేత్రి సద్వైభవోన్నతను
వరియింప మదిఁబూని వైఖరిమీఱ
నరనుతుండగు పల్లె నాగిరెడ్డికిని
సతి సుబ్బమాంబను సౌజన్య నిధికి
సుత నాగమాంబను సువ్రత గలదు
బంగరు బొమ్మ సంపగిపూల రెమ్మ
రంగలరారెడు రాయంచ గమన
కువలయదళ నేత్రి కోమల గాత్రి
భువిమించు పూఁబోణి భూరి కల్యాణి
కూరిమి మేనత్త కూతురుగాన
కోరి పెండిలిఁ జేసికొన నిశ్చయించి
యిరువుర సతులను ఇష్టంబుఁదీర
పరువడిగా మాట పల్కులుఁదనర
పిన్న పెద్దలు వచ్చి ప్రేమ నారెడ్డి
కన్నతల్లికిఁ దెల్పగా సంతసిల్లి
ముద్దుల సుతునకు మురిపెంపు సతుల
నిద్దఱఁ జేయుట నిది బాగటంచు
ఘనమగు తాంబూలక్రమ పండు పసుపు -
లనురక్తి గావించి నంత వేడుకను

చిత్తర్వు పటములఁ జేర్చి యందంద
అత్తరు గంధమ్ము లటుఁ జిలికించి
ఇచ్చమీఱఁగ పెండ్లియిండ్ల వాకిండ్ల
పచ్చ తోరణముల భాసిల్లఁజేసి

## ముత్తైదువలు వేంగళరెడ్డిని పెండ్లికుమారుని చేయుట

అత్తఱి మేళంబు లటు బోరుకొలుప
ముత్తైదువలు పెండ్లి మూహూర్తమునకు
వర వధూవరులకు వారి వారిండ్ల
అరుదంద పీటల యందుండఁ జేసి
హారతు లొసఁగుచు నతివ లందంద
పేరిమి చల్లని భృంగ తైలముల
తలలంటి వెంట్రుకల్ తగ సవరించి
వలపు గంధము మేన వలనుగాఁ బూసి
సలిలోష్ణధారల స్నానముల్ గఱపి
వలనొప్ప శృంగార వైఖరిఁజూడ
దివ్య జరీవస్త్ర దీధితుల్ నిగుడ
దివ్య గంధమ్ముల దివ్య పుష్పముల
పువ్వుబోణులు పెండ్లిపుత్రునిఁజేయ
మవ్వపు పెండ్లి కుమారుఁడై యుండె
హితులు సోదర పురోహితులును పుణ్య –
సతులును కన్నియల్ సంతసం బడర
సింధువునకు నదుల్ జేరెడు భాతి
బంధువులెల్ల సంభ్రమ మొప్పుచుండ
విరివిగా పెండ్లికి విచ్చేయగాను
మఱి పెండ్లిపెద్ద సమ్మతిమీఱ నెదుర
నెల్ల బంధువులకు నిలను మర్యాద –
లుల్లెడలను బట్టి యుత్సవం బలర
మసి బోనముల నిచ్చి మర్యాద లొసఁగి
పొసఁగ పెండ్లింట నింపుగఁజేర్చి సర్వ –

జన సమ్మతముగ భోజనములు జరిపి
మునుకొని తాంబూల మొసఁగి యా రేయి
తల్లి అక్కమగారు తగిన బంధుగులు
చెల్లెంద్రు పినతల్లి శేషమ్మగారు
బహుగ వివాహ సంబంధ కార్యములు
సహనతఁ జేసి హెచ్చిన పెండిలికిని
వచ్చిన ముత్తైదువల పేరుకొనుచు
మచ్చికతోడ సమ్మతి నిట్టులనియె
వినరమ్మ దిక్కులు వెల్లగాఁ దొడఁగె
మన మిట్టు లాలస్యమై యూరకుండు -
తటియె? ముహూర్తంబు తటియయ్యె లెమ్మ
త్వరపడి పనులు తొందర సేయుఁడనిన
అగునగు ననుచు ముత్తైదువ ల్లేచి
తొగల పూసరులు చెందొవల పూచెండ్లు
జిగిమించు కుంకుమ శ్రీగంధ మగరు
మగువలు వెండి తాంబాణంబులందు
గరిమ చేకొని శుభకరమని వీధు -
లరయుచు నిండ్ల మర్యాదలు జేసి
రారమ్మ! నలుగిడ రామలో! యనుచు
మీరలు మీరును మీరెల్ల గూడి
పిలువ లేదనక తప్పున యొప్పు గొనుఁడు
చెలి తొలి పొరపాటుచేఁ బిల్వమెచ్చు
నచ్చి నిచ్చలు దీర నవ్వార లెల్ల
ముచ్చట లలర నా ముద్దియ లపుడు
తడబడ వేగ ముత్తైదువల్ పెండ్లి -
కొడుకును పెండిలి కూతురులకును
కొమ్మలు కరశాఖ కోమల పల్ల -
వమ్ములొంచిన కమ్మవాసనల్ నూనె
తలలంటి రతివ లత్తటి రామలెల్ల
నలుగిడి రానందనమున పాటలను

కమలమ్ములను జలకమ్ము లాడించి
సుమసమ ధవళ వస్త్రముల ముప్పురను
ధరియింపఁ జేసి గంధమ్ములుఁ బూసి
కరముల బంగారు కడియముల్ సంది -
కడియముల్ పోగు లుంగరములుఁ దొడిగి
మెడలోన నవరత్న మేటియౌ పసుల
వర చంద్రహార మింపారగా వేసి
పురుడింప కుంకుమ బొట్లను బెట్టి
చిఱుత పంకిణి బాకు చేనుండ నిచ్చి
విరుల హారమ్ములు వేసి శృంగార -
వంతునిఁ జేసియు వలరాజ సదృశ -
వంతుడౌ నీతని వరరూప మొరులు
కనులఁజూచిన దృష్టిగలుగు నటంచు
మనమున యోచించి మరియాదతోడ
మంచుక్క చెక్కున మఱి బెట్టియున్న
మిసమిసయని కాంతి మెఱయుచునుండె
కర మొప్పుచుండ వేంగళరెడ్డి నిటుల
మఱియును పెండ్లికుమారునిఁ జేసి
పరువడి తోడ నబ్బాలికలకును
వరరూపుఁడగునట్టి వరుడబ్బె ననుచు

## ముత్తైదువలు వేంకటాంబను నాగమాంబను పెండ్లికూతుంద్రను చేయుట

వెలఁదులు చిఱునవ్వు వెలయించుకొనుచు
చెలువలకును తలల్ చిక్కుడలించి
తల దువ్వి కీల్‌జడల్ తగ సవరించి
పొలుపొంద జడలను పువ్వులు ముడిచి
సుమతైల గంధముల్ సొరిదిగా నలఁది
కమలాక్షులకు కండ్ల కాటుకల్ దీర్చి

కొమరొప్పు నుదుట కుంకుమ బొట్లమర్చి
ప్రమదలకును మేటి పచ్చలఁజేయు
చిఱుత నత్తులు మోవి చిందులుఁ ద్రొక్క
మురిపెంపు బేసరుల్ ముద్దులు గులుక
సొగసు చెక్కుల డాలు సొంపు వహింప
తగు ననిపించు ముత్యాల కమ్మలును
మేటి మురువులు పసిమించు ముయ్యండ్లు
వాటమౌ చిలుకలవంటి కమ్మలును
కత్తెర బావిరీల్ కాన్ బావిరీలు
మెత్తని బంగారు మేటి బుగండ్లు
పౌజుల కమ్మలు పల్లెర పూలు
ఓజగా చెవిసొమ్ము లొలత మెఱయ
అందమౌ బాజుబం దామీద పసిఁడి
సంది బొందియలకు సరస తాయెతులు
చామపూ ల్కడియము ల్జత కంకణములు
ప్రేమించు చాకట్లు పెంపుగా నుంచి
వెల హెచ్చుగలయట్టి వ్రేళ్ళుంగరములు
కలలఁ దేలెడు హస్త కమలంబు లొప్ప
కుందనంబునఁజేయు కుంకుమ బొట్టు –
లందమౌ నుదురులయందు వెలుంగ
జడసొరు మఱి సూర్యచంద్ర వంకలును
వడుపగు పనికుప్పె వన్నెలు నిగుడ
రేకిణి గేదఁగి రేకు పాపటలు
జోకతో శిరముల సొంపు దీపింప
గజ్జెల పట్టెడల్ గళహారములును
వజ్ర ముత్తెండాల పచ్చ దండలును
జోమాల దండలు సొబగు కంటియలు
ప్రేమించు సరిపెణల్ పెద్ద గంటియలు
గురుతర కప్పాణి గుండ్లపేరులును
పరిగెలు తీగెలు సహజమౌ కాంతి

పొలుపొంద గోదుమ పూసల సరము
వెలహెచ్చు చౌకడీల్ వెలయు నడ్డిగలు
తగు చిల్కతాళలు తారహారములు
సొగసు బన్నసరాలు సుముఖమై వెలుఁగ
గజ్జెల పావాలు కాళ్ల కడియములు
పజ్జ మెట్టియలు చేవల పిల్లెడలును
ఇదియాది తారాది ఎల్ల సొమ్ములను
ముదమొప్పఁదొడిగించి ముద్దుసుందరుల
సౌందర్యముల నెల్ల జనులు కన్గొనఁగ
చెందును కనుదృష్టి సిద్ధమటుంచు
చిక్కనౌ నొక్కొక చెక్కున మిసిమి
చిక్కని మఁబొట్టు జిగి గుల్కఁబెట్టి
మఱి వధూవరులకు మహిమ శోభిల్ల
సురుచిరమగు పూలసూసకములను
సిరిగుల్కు నుదుట బాసిక సూత్రములును
తెఱగొప్పఁగట్టి ముత్తైదువల్ వెంట
కమ్మవాసన నూనెఁ గలయఁ జల్లుచును
నెమ్మది దోడ్తెచ్చి నియతి నేమఱక
తిరముగా పెండ్లి వేదిక పీరలునిచి
వర వధూవరులను వరుస గూర్చుండ –
నియమించి ఐదువల్నివహంబు లెల్ల
ప్రియమగు హారతుల్ ప్రేమనొసంగి

## వేంగళరెడ్డి వివాహ వర్ణన

సిరియు భూదేవియు శృంగార లీల
వరుసతో శ్రీహరిన్ వరియించి నటుల
బూరుగల్ కంచుకొమ్ములు మేళములును
భోరున మ్రోవ నద్భుత నాద మెసఁగ
తమ్మట ధ్వనులును తార మృదంగ
మిమ్మైన నౌబతు లింపుగా మ్రోయ

భటులును గొనియాడ బ్రాహ్మణస్త్రీలు
పటుతరంబగు పెండ్లిపాటలుఁ బాడ
సంగతిగా వేశ్యజన సమూహమ్ము
సంగీత నృత్యముల్ సలుపుచునుండ
పలువిధ ధవళముల్ పాడి ఐదువలు
వలనొప్ప సేసలవ్వారిగాఁ జల్ల
స్థిరపుణ్య విప్రులాశీర్వాద మొసఁగ
విరిబోణి యైనట్టి వెంకటాంబకును
నారీశిరోమణి నాగమాంబకును
తారహారమ్ములు తగిన సొమ్ములను
పరమ సంతోష సంభరితాత్ములగుచు
తరళాయతాక్షుల తలిదండ్రు లపుడు
బిడ్డల నిద్దఱ ప్రేమ మీఱంగ
బుడ్డ వేంగళరెడ్డి భూరి ధర్మునకు
ధారఁబోసిరి పుష్పదామ గంధముల
చారుతరంబుగా సతుల నిద్దఱను
హస్త కంకణములు నారెడ్డి కట్టి
విస్తారముగ విప్రవితతి దీవింప
వెండి పళ్ళెరముల వెస తలంబ్రాలు
దండిగా దోస్లిళ్ల తగఁ బూని పూని
బాలికలకు శుభంబని తల నింప
బాలికల్ తలఁబ్రాలు పతి తల నింప
మంగళతర నాద మహామఁ జెలంగ
అంగనామణులగు నబ్బాలికలకు
ధారాళముగ రెడ్డి తాళులఁగట్టె
వారి కొంగుల ముడుల్ వరుసనె వైవ
దయమీఱ విప్రులు దగ్గఱఁ జేరి
బయల నరుంధతి బాగొప్పఁజూప
కనుగొంటిరే యని కడువడి నడుగ
కనుగొంటి మనుచు నక్కఱ దీరఁ బలుక

ఇలువేల్పునకు చేతులెత్తి మ్రొక్కించి
చెలువంద నగరునఁ జేరిన పిదప

## పెండ్లిలో విందు భోజనము

ఆరీతి పెండ్లిసొం పలరిన ఎదప
వారక పెండ్లికి వచ్చిన జనుల
భక్ష్యభోజ్యాది సత్పానీయ లేహ్య
భక్షణాదు లొసంగి పరితృప్తిఁజేసి
అమృతోపమానమౌ అన్నంబు లొసఁగ
ప్రముదిత హృదయులై భక్షించి యంత
చుట్టముల్ హితులును సొంపైన గదుల
పట్టె మంచంబుల పాన్పుల మీఁద
కోరిన పీటల కుర్చీలమీఁద
తీరైన ముప్పన్నె తివ్వాసులందు
వసియించి యుండిన వారికి నెదుట
రసిక విద్వాంసులు లక్షణ కవులు
కబ్బంబులను అలంకారార్థములను
తబ్బిబ్బులేక నత్తఱిఁ దెల్పువారు
ఆటలు పాటలు అభినయంబులను
పాటించి వేశ్యలు పాడుచునుండ
రసికులై విను బంధురాజికి నెల్ల
మిసిమి మామిడి పండ్లు మెచ్చ నిప్పించి
వెల హెచ్చుగలయట్టి వెండి గిన్నియల
పాలుపొంద జవ్వాది పునుగు గంధంబు
అత్తరు గంధంబు లగరాదిగాను
చిత్తముల్ వికసింప శీఘ్రంబె వారి –
కలరింపగాఁ జేసి యాప్త జనాళి –
కలరు సురటీలచే నట భటుల్ వీవ
శ్రమ జలంబులుఁ బాసి చల్లగానుండు
సమయంబునను బంధు సందోహమునకు

వెండి తట్టల నిండ విరివి పోకలును
దండి లవంగముల్ తముల పర్ణములు
జాపత్రి యేలకుల్ జాజికాయలును
ప్రాపున కర్పూర భాగంబు లనుప
విడియముల్ సేయుచు వేడ్కనా రెడ్లు
తడయక సభమెచ్చఁ దా మిట్లులనిరి

## బంధుగులు వేంగళరెడ్డి వివాహ వైభవమును ప్రశంసించుట

వినరయ్య! యిటువంటి విపులమౌ ధనపు
ఘన కాపుకులజులు గల రనేకులును
పరువడి ధనము సంపాదింప మనము
దొరలకు నివ్వమే దొడ్డ వైరముల
తురకు దొంగలకిచ్చి దోస బాసలను
వదలని పాపముల్ వడిఁగట్టి కట్టి
పుడమిని ద్రవ్యముల్ పోవఁజూచితిమి
గడన ద్రవ్యంబులుఁ గల్గినందులకు
అల స్వాతిచిన్కు ముత్యపు శుక్తిఁబడిన
ఇల నాణ్యముత్యమౌ టెఱుఁగరామీరు
మఱి శుక్తిఁదప్పి నిమ్మహిఁబడ్డ చిన్కు
కరి మ్రింగినట్టి వెల్గయు ఫలంబటుల
చెలఁగి పాత్ర మెఱింగి చేయు దానంబు
పొలుపొంద స్వర్గాది భోగంబు లిచ్చు
తడయక వినుఁడు నిత్తఱి మీరలెల్ల
గడన ద్రవ్యంబులు కల్గినందులకు
ఇహపర సత్కీర్తు లితనికే గాక
మహానెన్న సంపదల్ మనకున్న నేల?
ఇటువంటి సంగీత మిటువంటి నృత్య
మిటువంటి విద్యల నిపుడు చూచితిమి
చూపుల నెటులైనఁ జూడఁగావచ్చు
ఈ పాటి యావుల నియ్యఁగాగలమె?

అనుచు బందుగులెల్ల నా పెండ్లిసొంపు
కొనియాడుచుండిరి కోర్కెలు మీఱ
వరుస తోడుత నాగవలియైన పిదప
మరుసటి దినము క్రమ్మఱ బంధువులను
భోజనంబులఁ దృప్తిఁబొందించి మంచి
రాజిత జరిబులౌ రమ్య చేలములు
చెలువొంద నిచ్చియు సెలవుల నొసఁగి
పొలుపొంద కవి భట పుంజంబులకును
తనరార కట్నముల్ దయమీఱ నిచ్చి
మన మలరార సమ్మతి వీడుకొలిపి
కువలయ జనులెల్ల కోర్కెలఁదనియ
కువలయాక్షుల మది కోర్కెలుఁదనియ
కులసతీ ద్వయమును కోరి పెండ్లాడి
వలనొప్పగా మంచి వైభవం బలర
పొంకమౌ ఓర్పు నేర్పుల దర్పములను
వెంకటాంబనెడు దేవియు నాగమాంబ -
యనియెడు సతులతో ననుకూలముగను
కనక రత్నంబులు కలిసిన యటుల
ప్రేమాతిశయమున పెంపు దీపింప
కామితార్థంబులఁ గలకాలమెల్ల

## రెండవభార్య నాగమాంబ మరణించుట

సతులను నేలుచు సంతాన కాంక్ష -
లతులిత చతురత లఖిల ధర్మముల
సంతసంబున నుండ సతి నాగమాంబ
శాంత శమదమాది సద్గుణవ్రాత
అత్తల మఱఁదండ్ల కనుకూలముగను
అత్తరుణీమణి యైకమౌ హృదయ
పతియె దైవంబని భావించి మదిని
వ్రతములు సల్పు సువ్రత కొక్కనాఁడు

అతి తీక్షణజ్వరం బంటి వేధింప
బ్రతుకు దుర్లభమని పతి సెలవంది
ఆయాసమును దన కధికమై యుండ
కాయంబుపై ప్రేమ కడకుఁ బోఁద్రోచి
తలిదండ్రు లన్నలు తమ్ములు వదినె
కల బంధువులు నత్తగారాది జనులు
అత్తఱి దు ఖంబు లనుభవింపగను
చిత్త మీశ్వరుమీఁదఁ జేర్చి కన్మూసి
అవసానకాలమం దతిభక్తి తోడ
శివమంత్ర జపముఁ జేసిన ముక్తియనుచు
శివభక్తురాలిచే చెవిసోకియున్న
భవములఁబాపెడి భద్రమంత్రంబు
ఇంచుకసేపు కష్టించి యూహించి
పంచాక్షరీ మంత్ర పారాయణంబు
ఓన్నమ శివయని ఒకసారి నుడువ
ఓన్నమ శివయని వడి నుచ్చరింప
ఓన్నమ శివయని ఒడలి ప్రాణములు
క్రన్నన విడచియు కైలాసమునకు
పరమ సాయుజ్య సంపదఁ జేరె నెలఁత
అరయ పేరంటాలునా నొప్పుచుండె

## నాగమాంబ తల్లి సుబ్బమ్మ దు ఖించుట

అప్పుడాయమ తల్లి యన్నదమ్ములును
గుప్పు గుప్పున నెద గుద్దుక నేడ్చి
హో జగదీశ్వరా! హో పరంధామ!
హో జగదాధార! హో దైవరాయ!
అనుచు మూర్ఛిల్లి చయ్యనఁ దెలివంది
ఘనమైన దు ఖసాగరమున మునిఁగి
నా యమ్మ! నా కూన! నా ముద్దుబిడ్డ!
పోయితే విలుకా! హో! పోయెడివేళ

ఏమని దు ఖించి తేమిగోరితివో?
ఈ మహి నినుఁబాసి యేనెట్లునిల్తు?
ఇల జన్మమెత్త నీ కేయిల్లు లేక
ఎలమి నా గర్భమం దేల పుట్టితివి?
పుట్టినా కోర్కె లుప్పొంగగాఁ బెరిగి
పట్టిరో! ఎల్లగాఁ బలుకవే మమ్మ?
నీ చక్కదనమును నీ విలాసంబు
రాచకూతురి కైన రాదుగదమ్మ!
నీ మాట నీ బుద్ధి నీ యోర్పు తీర్పు
ఏమని తలఁతు నింకేమని పిలుతు?
పాలు వెన్నలుఁ బోసి భ్రమల నీకిఁ బెంచి
మేలు పుణ్యమటంచు మేనయల్లునకు
దారగా నిచ్చితి దయమీఱ బ్రహ్మ
వారక యిటువంటి వ్రాతల వ్రాసె
వనిత! నీవును పట్టువలువలుఁగట్టి
మనసు కింపైనట్టి మఱిసొమ్ముఁ బెట్టి
అరుదార నావద్ద కరుదెంచు వేళ
తరుణి నా కనుదృష్టి తాకు నీ కనుచు
సొలవ కెగాదిగఁ జూడ నే వెఱతు
అలివేణి! యింకెవ్వ రటు వచ్చువారు
కలికి నా కన్నుల కఱవెల్లదీర
పలుమాఱు నినుఁ జూచు భాగ్యంబు బోయె
ఏ జన్మమున పాపమేమి చేసితినో
ఆ జన్మ ఫల మిప్పు డనుభవం బాయెఁ
గాకున్న నింత చక్కని సుతన్ దేవుఁ -
డీకున్న నేమౌను? నిచ్చెఁబోనింత
మోసమ్ముఁ జేసె గోమున సాకినట్టి
ఆసలు పోయె నిరాశగా నాయె
చందురుఁబోలు నీ చక్కని మోము
కందెను నేటికి కళదప్పె నమ్మ!

బారెడంతేసి పైబడు నీదు కురులు
ధారుణిఁబడి కళఁ దప్పెఁగదమ్మ!
అనుచు కుమారిని యటు కౌగిలించు –
కొని శోక బాష్పముల్ కొలకుల రాల
మోము మోమునఁ జేర్చి మున్ను తాఁ జేయు
గోమైన మాటలు కొన్ని తలంచి
అతివ చక్కదనంబు లన్నియు నెంచి
సుత గుట్ట వలువలు సొమ్ములు దలఁచి
అత్యంత పతిభక్తి నఖిల శాస్త్రములు
సత్యవాక్యమ్ములు స్మరియించి యెంచి
పుత్రిశోకమ్మునఁ బొరలుటకంటె
పుత్రికామణి వెంటఁబోవుట మేలు
అనిపల్కుసుబ్బమ నపుడు నూరార్చి
జనులెల్ల నాగమ చయ్యన దహన –
మొనరించి క్రతు దినములుఁ జేసి రెడ్డి –

## వేంగళరెడ్డి భార్యకొఱకై బెంగపెట్టుకొనుట

మనమున దు ఖంబు మానకయున్న
పానీయముల మీఁది భ్రాంతియు మాని
దీనుని వలెను ఏ దిక్కు తోఁచకను
తనదేవి కన్నులఁ దాఁజూచినట్లు
కనుపడకుండిన కన్నీరు నించు,
ఒకమాటఁ దలఁచి వేఱొక మాటఁజెప్పు,
అకట! నే వెఱ్ఱినైతని మోమువంచు
ఒక పనిఁ దలఁచి వేఱొక పని చేసి
అకట నే మఱచితినని మది గుందు
ఇటువలె కొన్నాళ్ళు ఇలభ్రాంతిమాని
అటుబోక నిటురాక నాయాసపడుచు

కుటిల కుంతలి మీఁది కూరిమి మాని
పటుతరమైనట్టి పామరత్వమును
తన బుద్ధిబలమున తగఁబాఱఁద్రోలి
దినదినంబున మంచి తెలివి చూపట్టి

## పెద్దభార్య వేంకటాంబకు సంతానము లేకపోవుటచే వేంగళరెడ్డి చెన్నమ్మ అను మఱియొక కన్యను వివాహమాడుట

అంత వేంగళరెడ్డి యాలోచనముల
కొంత కాలంబునకును పెద్దభార్య
పంకజముఖియందు బాలబింబోష్ఠి
వేంకటాంబనెడు దేవికి సంతులేక
ధరనెన్న సద్గుణ ధాముడైనట్టి
గురుతరమగు తరిగోపుల యిండ్ల
ఉత్తమపురుషుండు ఉపకారపరుఁడు
చిత్తజాకారుండు చిర యశోధనుఁడు
రెడ్డిచంద్రుఁడు లక్ష్మిరెడ్డికి ముద్దు –
బిడ్డ చెన్నమదేవి బిసరుహనేత్రి
సోమసన్నిభముఖి సుందరగాత్రి
భామాలలామ నిర్భరపుణ్యసీమ
సరస సద్గుణ హార సత్యవిచార
వరవ్రతశీల పావనమైన బాల
కలదని పెద్దల ఘనముగాఁ బనుప
వలనొప్ప గోత్రముల్ వరుసలు నెన్న
సరిపడ పెద్దలు సమ్మతితోడ
పరువడితో పండు పసుపుల నొసఁగి
వరియింప మదిఁబూని వాంఛలుఁదీర
వరున రెండవ స్వయంవర మయ్యె రెడ్డి
సంతసంబున నుండ సతులిద్దఱకును
సంతానములు లేక చాల యోచించి

## సంతానార్థమై వేంగళరెడ్డి దంపతులు వివిధ వ్రతములు చేయుట – నోములు నోచుట – పూజలు సలుపుట

వరలక్ష్మి వ్రతము లుపాసపు నియతి
ధరణి పుట్టలకును తారు మ్రొక్కుచును
చెట్ల పెండ్లిండ్లను శివప్రదక్షిణలు
చేట్లచే బియ్యముల్ చీమలకొసఁగి
గౌరినోములు నోఁచి గాఢమౌబత్తి
భూరి దానము లిచ్చి భువిజనుల్ మెచ్చ
దంపతి పూజలు దైవ ప్రార్థనలు
ఇంపుగాఁ జేయుచు నిటు కొన్ని నాళ్ళు
విరివిగా సంతాన వృద్ధికై జనులు
గరిమ నే నోములు గావింతు రనుచు
సత్తీర్థ యాత్రల స్థలములు దిరిగి
ఉత్తమ పౌరుల కుపనయనాది
క్రతువులు పెండ్లిండ్ల క్రమముగాఁ జేసి
వ్రతముల ధనము సద్వ్యయము గావించె
తలఁచి షోడశ మహాదానంబు లెల్ల
వెలయ నిచ్చియు వేదవిధి పూజలొసఁగి
శివరాత్రు లేకాదశీ లుపవాస –
మవిరళ భక్తి శివార్పణల్ జేసి
భవ విమోచనమైన పారాయణములు
సవనంబు లాదిగా సరవిఁజేయించి
బ్రాహ్మణ జనులకు భక్ష్యభోజ్యములు
బ్రహ్మార్పణంబని పరితృప్తిఁజేసి
అనురక్తి భూరిదక్షిణలిచ్చి మ్రొక్కి
వినయ మార్గంబుల వినుతులుఁజేసి
భూసురావళి తర్లిపోవగా నితరు –
లాసచే తలఁచుగా నరుదెంచుచుండ

## జంగములను ఫకీరులను సేవించుట – వారికి దానములిచ్చుట

బసవన్న బత్తి ప్రభావ సంపన్న
భసితాంగ భూషిత భవ్యులకెల్ల
అసమానమగు జంగమార్పణలొసఁగి
పసిడి కానుకలిచ్చి పరితృప్తిఁజేసి
కావిపుట్టము పిడిగంటలు నిచ్చి
శైవసాముల కెల్ల శరణని మ్రొక్కి
తా యథాశక్తి నింతయొయంచు మనవిఁ
జేయుచు వారికి చేతులు మొగిచి
శరణన్న శివభక్తి జన సమూహమ్ము
కరుణ దీవించి శీఘ్రమ్మునఁ బోవ
సయ్యదింటి ఫకీరు సాహెబులకును
నెయ్యంబు తోడుత నిష్టాన్నమిచ్చి
పాగాలు శేర్వాణి పచ్చడంబులును
బాగుగా నిచ్చి సంభ్రమ మొప్పుచుండ
సరవి తోడ ఫకీరు సాహెబు లంత
ధరమీఁద మీ పేరుఁ దలఁచెద మనుచు
వరుస ఖురాన్ వేదవాక్య పద్ధతుల
తెలుఁగొప్ప రెడ్డిని దీవించి రిటుల
లలిత మీ జోదా సలామతుగాను
గలిగి ఖుదా బరకతు దేవె తుంకు
అనుచు దీవించెడి యా పెద్దలకును
ఘనమగు మన్ననల్ గావించి రెడ్డి
ఆదాబు బందగీలని వేఁడుకొన్న
సాధు జనావళి సంతసంబంద
కాషాయ వసనముల్ గప్పియు విగత –
దోషులై భవ రుజ దూరులైనట్టి
యోగుల కెల్లను యోగ్యత కొలఁది
త్యాగంబు లిచ్చు నిత్యానంద మొంద

అగ్నిశిఖాపత్ర మభినుల కిచ్చి
మగ్నతఁ బొందించి మఱి వారిఁ బనుచు

## ఇతరుల పిల్లలను లాలించుట – ఆఁకలితో ఉన్న విద్యార్థులకు అన్నవస్త్రము లిచ్చుట – ముసలివారికి, కుంటివారికి, గ్రుడ్డివారికి కురూపులకు ఒంటెద్దు బండ్లు చేయించి యిచ్చుట

తమకు బిడ్డలు లేమితనమునఁ బరుల –
తనయుల నెత్తి ముద్దాడి లాలించి
అత్తత్త మాటల నాడించి నవ్వి
అత్తరి బాలుర నందఱఁ బిలిచి
చవులూరు తియ్యని చక్కెరముద్ద –
లివి గొమ్మటంచును ఇచ్చి తాఁబనుచు
నాఁకొన్న విద్యార్థి కన్నవస్త్రములు
ఏ కొఱంతయు లేక యిచ్చియు వారి –
కక్షరాభ్యాసంబు లఖిల పాఠములు
లక్షణ లక్ష్యములను నీతిశాస్త్ర –
మమర నిఘంటువు లాంధ్ర శబ్దముల
సుమతులఁ గావించి సొంపుగా నేలు
కుంటి ముసళ్ళను గ్రుడ్డి కురూపు –
లొంటిగాఁ దిరుగుట లొడిబాటు లనుచు
వంటెద్దు బండ్లను వారికి నిచ్చి
వెంట నెవ్వరు లేక వెఱపింత లేక
సకల దేశంబుల సంచార మొదవ
అకలంకముగ వారి కాజ్ఞపత్రికల
లిఖియించి చేతివ్రాలిడి యంచె ననిన
సుఖలీలఁదిరిగి సంస్తుతిఁజేసిరంత

## వేంగళరెడ్డి అన్నదానవ్రతమును చేయ సంకల్పించుట

అన్నదానవ్రతం బాయన పూని
అన్నసత్రము లుంచి యాఁకొన్న జనుల –

కన్నోదకములచే నాపదల్ బాపి
మన్నన తోడుత మఱి బ్రోచుచుండ
సరసుల మెచ్చి విస్తారమౌ సభల
వరుస నాయన కీర్తి వర్ధిల్లుచుండ
సకల దేశముల సంస్థానంబులందు
సకల విద్యజ్ఞన సంఘంబులెల్ల
ధరణి నుయ్యాలవాడ ధర్మసంస్థాన -
పరుఁడు వేంగళరెడ్డి ప్రభువు సన్నిధికి
వచ్చు విద్వజ్జను ల్వారి దేశములు
అచ్చెరువందకుఁడది వినరయ్య!

## వివిధ ప్రాంతములనుండి సంగీత విద్వాంసులు ఉయ్యాలవాడకు వచ్చుట

గద్వాల సురపురి కర్నూలు కడప
విద్వాంసులును మఱి విజయనగరంబు
చెంజిదుర్గము కాశి చెన్నపట్టణము
కంచి బిజాపూరు కాశ్మీరపురము
తంజావురీ నెన్నఁదగు గోలుకొండ
గంజాము బొంబాయి ఘనమైన మధుర
కొడగు మైసూరును కొల్లాపురమ్ము
బడహోద పంజాబు బనగానిపురము
బందరు నెల్లూరు పాప్నాపురంబు
అందమౌ బొబ్బిలి యా సురతూరు
బంగాళ మూర్షదాబాదును దక్క
శృంగారమగు పునా శ్రీ నగరంబు
భరతపురంబును బాందాపురంబు
తిరుపతి చిత్తూరు తిరువానుకూరు
కోయముబత్తూరు కొచ్చి బళ్ళారి
గాయకవాడియు కాళహస్తియును

గుంటూరు బెజవాడ కూచిపురంబు
పెంటనెల్లియు గుత్తి పేపలిప్రోలు
బెంగుళూర్ రాచూరు పెనుగొండపురము
రంగైన షోలపూర్ రాయదుర్గంబు
ఔకు బురాన్పూరు ఔరంగబాదు
శ్రీకరమైనట్టి చిఱుతనపల్లి
శ్రీరంగపట్నంబు శిరువెళ్ళప్రోలు
కోరంగి పుదుకోట గుడిగండికోట
జంబులమడుఁగు విశాఖపురంబు
కుంభకోణమ్మును గోదావరియును
మంగుళూర్ రాయచూర్ మఱి కల్లికోట
వంగవోల్ కృష్ణ కావలి గూడలూరు
జగ్గయ్యపేట పజ్జన కాకినాడ
దుగ్గిలి గోళూరు దొడ్డ ధార్వాడ
తీరుపులకు సాల దృప్తి నంద్యాల
కోరికలకు పంట కోవెలకుంట్ల
ఇవియాదిగాఁ గల నిల గాయకులును
ప్రవిమలమగు వీణ పార విస్ఫురణ
సరిగమ పదనిస సంజ్ఞల తోడ
స్వరనాదగీత వర్సలు వర్ణములును
జావళు లందముల్ జతులును కృతులు
కేవల శృంగార కీర్తనల్ పాడ
ఘన రాగరసము శృంగారమై చెవుల
వినువారలకు చాల వేడుక లలర
సరస మద్దెల తాళ సంగీతములును
తఱచు ఫిడేలు చిత్తారు పాఠకులు
తానవర్ణంబులు తగిన గీతములు
గానముల్ మేటి శృంగారాష్టపదులు
భరతశాస్త్రార్థ సంపన్నత మెఱసి
పరువడి రంభను భ్రమయించునట్టి

వెలయాంధ్రు కొందఱు వేడుక లలర
పొలుపొందు నటుల నేర్పున దండమిడియు
నాయక నాయకీ నవ్యగానముల
గాయకుల్ మెచ్చ శృంగార వైఖరుల
వరుస భావనఁజేసి వలపులుఁ బుట్టి
పరికింప క్షేత్రయ్య పదము లాదిగను
అట గాణ లాది కర్ణాట నృత్యములు
పటుతర అభినయ ప్రౌఢిమల్ కనుచుఁ
జూడఁగా నవరస స్ఫూర్తిఁగస్పుట్టి
వేడుకల్ మీఱి యుర్విళ్ళూరుచుండ

## వేంగళరెడ్డి సంగీత విద్వాంసులను సత్కరించుట

ఘనమగు గాయక గణముల కెల్ల
ధన ధాన్యముల నిచ్చి తగినట్లుఁ బ్రోఁచు
రస ముప్పతిలు హాస్య రసకుల కెల్ల
బసచేసి జాతీయ భాషలు వినుచు
నవ్వుచు వారికి నాణ్యెంబు లొసఁగి
మవ్వపు మాటల మఱి వారిఁ బనుచు

## కవులు పండితులు సాహిత్యగోష్ఠి చేయుట – వేద పఠనము కావించుట – ధర్మ కథలు చెప్పుట – వేంగళరెడ్డి ఆ కవి పండితులను సత్కరించుట

అంత నా సత్కవు లమృత వాక్యముల
వింతయౌ పదపద్య వినతు లొనర్చి
ప్రవిమల చిత్రప్రబంధముల్ చదివి
కవితా చమత్కార కళ లుప్పతిలఁగ
లక్షణ లక్ష్య సులక్షణంబులను
ద్రాక్షాది పాకముల్ తగిన రీతులును

కబ్బముల్ రచియించు కవులకు నెల్ల
నిబ్బరంబగు దయ నిలిపి వారలకు
కడియముల్ పోగు లుంగరములు శాల్వ-
లడిగిన రీతిని అనువంద నిచ్చి
పాలపొంద గోదాన పుణ్యఫలంబు
కలుఁగుట చాలు నా కని మదినెంచి
పాడియావుల లేఁగ పసువుల నిచ్చి
పోడిమి మీఱ నేర్పున వారిఁబనుచు
సరస సల్లాప ప్రసంగ చాతుర్య
సరణి వాఙ్మధుర రసంబులు గురియ
విమల వాక్యమ్ములు వెలయఁగా నేర్చి
తమ తమ గ్రంథముల్ తమచేత వెలుఁగ
మాఘ కావ్యంబు కుమారసంభవము
మేఘసందేశంబు మేటి మురారి
రసమంజరీయంబు లలిత భారవియు
పసగల్గు రాఘవ పాండవీయంబు
తగు బిల్హణీయ ప్రతాపశాస్త్రంబు
జగతి మేటగు తర్కశాస్త్రంబు గాక
భారత చంపును భరత శాస్త్రంబు
ధారుణి కౌముదీ తగిన నైషధము
శృంగార రఘువంశ శ్రుతి ధర్మములును
రంగైన సాహిణుల్ రాజధర్మములు
నాటక కువలయానంద మాదిగను
పాటించి చదువ నేర్పరులైనవారు
జటిల శబ్దార్థ షట్శాస్త్రంబులెల్ల
స్ఫుటముగా నేర్చి భాసుర కీర్తి వెలయ
పటుతర సంస్కృత పారీణులైన
భటరాజ సమితికి బహుమాన మొసఁగి
వేద శాస్త్ర పురాణ వేత్తలు వచ్చి
మోదమ్ముతోడ నిమ్మగు ధర్మకథలు

వినుపించువారికి వెస ధనంబిచ్చి
ఘనముగాఁ బ్రోచియు గౌరవ మలర
కనక సుచేలముల్ కప్పియు వారి -
మన ముల్లసిల్ల నెమ్మది వీడుకొలుపు

## వేంగళరెడ్డి ఆంగ్లదొరలను సత్కరించుట

కలెకట ర్లాదిగాగల దొరల్ చేర
వలనొప్ప శృంగార వన మధ్యమునకు
బంగ్లాలఁజేర్చియు ప్రౌఢిమ మెఱయ
ఆంగ్లేయ భాషల నధిక సంప్రీతి
గారవంబున వారిఁగలసి మాటాడి
వారి సదాచార వర్తన లరసి
ఆరగించను మంచి యాహారములను
కూరిమితో నిచ్చి కోర్కె లేడేర్చి
సత్య వాక్యమ్ముల సద్గోష్ఠి సలిపి
అత్యంత కరుణచే నందఱఁ బనుచు
ఈ లీల తనుగన నేతెంచు జనుల
పాలించుటది ధర్మపద్ధతి యనెడు
పలుకు నెమ్మదియను పట్టున నిలిపి
పలికి బొంకక గలపాటి లేదనక
చేసిన దానముల్ వర్ధంబుగాను
వాసి గల్గగ శివార్పణమని పలుకు
వినవయ్య! ఈకథ విశదంబుగాను
మానకఁతెల్పితి మఱి జూచినంత
పరగ నీ పండిత ప్రకరణ మిలను
చిరకాలమును జన సేవ్యమౌగాక!

(పండిత ప్రకరణము సంపూర్ణము)

✿ ✿ ✿

## రెండవ ప్రకరణము - ఎఱగాలి ప్రకరణము

శ్రీకర! మునిజ నాశ్రిత కల్పకంబ!
ప్రాకట సాధు సామ్రాజ్యాంతరంగ!
పావన చరితుఁడౌ భగవంతు కలన
భావించి పండిత ప్రకరణంబైన -
తరువాత జరుగు వృత్తాంతంబు నాకు
కరతలామలకంబుగాఁజెప్పుమనిన
అరుదార కొండయా ఖ్యాన్వితునకును
ఎఱగాలి ప్రకరణం బెఱిఁగింపఁ బూని
వినుము సమధికశీల! విశదంబుగాను
ఘన యశస్కరుఁడు వేంగళరెడ్డి యనఁగ
అరయంగ గిరుల మేరచలంబు లీల
వరుసఁజుక్కలను గల్వలఱేని భాతి
ధర వనంబులను నందనవనంబటుల
ఇరవొంద సురలలో నింద్రుని భాతి
మృగములలోనను మృగరాజు రీతి
తగురాజులందు సీతాపతి వలెను
ధర దాన లోకభాంధవసుతు కరణి
గరిమ దాతలను వేంగళరెడ్డి యటుల
ధరను బ్రసిద్ధపు దాతయై యుండె
గరిమిడి నెఱగాలి గల ప్రకరణము

### ఎఱ్ఱగాలి కఱవు వచ్చుట - బళ్ళారి జిల్లాలో అనేక జనులు కఱవుచే బాధపడుట - గ్రామములను వీడి అడవులకు పోవుట

పదియు నెనమనూటపై నర్వదాఱు
విదిత వర్షము సరి వెలయుచున్నట్టి
వరుస క్రోధన క్షయ వత్సరంబులను
ఎఱగాలి నలుదెస లేతెంచి చుట్టి

రాత్రింబవళ్ళు నెట్టని గాలి పద్మ –
మిత్రు మండలము భూమియుఁదోఁపకుండ
తమముగా కెంధూళి ధరకు నేతెంచి
క్రమమున వచ్చి లోకమునెల్లఁ గప్పె
పడమర దేశముల్ బళ్ళారి జిల్ల
పుడమి వర్షము లేక భూమి శోషిల్లి
విత్తేమిఁబడకను వెస కర్వుదోఁచి
బత్తియంబులు లేక భంగమై జనులు
ఎక్కడఁ బోవుదు మీశ్వరా! యనుచు
తక్కక దైవంబు తగ వేడుకొనుచు
పామరత్వ మనేటి పాశబంధముల
వేమఱు తమయిండ్లు విడువంగలేక
అన్నంబు లేకను ఆపదల్ పడుచు
కన్నీరుఁబెట్టుచు గ్రామముల్ పాయ
సమకట్టి పసులను క్షణములోఁ దోలి
క్రమమున వాకిండ్లు గట్టి బిగించి
అడుగిడలేనట్టి ఆవులెద్దులను
మెడగర్చుకొని యేడ్చి మిగుల ముద్దాడి
యిన్నాళ్ళు పసులను ఏలి యీావఱకు
క్రన్నన పోఁద్రోలగావచ్చె నకటా!
మఱియునీ పశువుల మన్నన తోడ
కరమొప్ప దేవుడే కాపాడవలయు
కానక కానక కన్న పిల్లలను
కానలపాల్చేయఁగా వచ్చె ననుచు
మురిపెంపు సతులను ముద్దు బిడ్డలను
కరుణతోడుతఁ దమ్ముఁ గన్నవారలను
సకుటుంబ పరివార సహితంబుగాను
ప్రకటిత మాదవోన్ పరగణాల్ కివల
కాపులు బలిజలు కవడ గొల్లలును
బాపలు తురకలు పట్రకులంబు

బోయలు చెంచులు భోగపుకులము
నాయర్లు తొగటలు నంబి సాతాండ్లు
సాలెలు బెస్తలు చాకలి కులము
ఎలమలు కురుమలు ఎఱ్ఱగొల్లలును
మంగలికులమును మహారాష్ట్రజనులు
జంగముల్ కుర్నీలు జాండ్ర కులంబు
లింగ బలిజ కుమ్మరీలు పింజార్లు
పొంగి సముద్రంబు పొర్లిన యటుల
పలు తెగలై తూర్పు పంట లెటింగి
నిలువక యేతెంచు నివహంబులందు
గర్భిణీ వనితలు కాంతారములను
దుర్బలంబైన కాళ్ళు తొడఁబడ త్రోవ
దిక్కేమి లేకను దీనత్వమునను
ఎక్కడఁ బోఁజాల కేడ్చెడి సతులు
గూని కుంటి కురూపి గుడ్డి యనాథ
లాననంబులు వాడి యన్నమో యనుచు
బడలి త్రోవల వెన్కఁబడి నడ్వలేక
ఇడుములఁబడి చాల హింసలఁ బడెడు
వారలఁ గనుగొని వారి పుత్రులను
వారన్నదమ్ముల వారిబందుగుల
ఁదరకుఁడనుచు చయ్యన తల్లిదండ్రి –
కెదురుగాఁజనుదెంచి యటుపల్కిరంత

## అడవిలో నడువలేక అలసిపోయిన వృద్ధులను, తల్లిదండ్రులను వారి పుత్రులు ఓదార్చుట

మా యయ్య! మా యమ్మ! మా యవ్వలార!
యీాయెడ మిముఁగించి యేము పోవుదుమె ?
బాల్యమంచుల మమ్ము పాలించుటకును
శాల్యన్నమొసఁగి లెస్సగ సేవజేయు

తలిదండ్రి వార్ధక దశను నీ దేర్పఁ
గలదు పుణ్యంబు లోకమునందు నాకు
ఎల్ల దేవతలకు నెక్కువైయున్న
తల్లి యుండిన కాశితలము పోనేల?
తల్లిదండ్రిగురువు దైవం బటంచు
నెల్ల లోకంబువా రెఱిఁగియున్నారు
అనుచు నూరడ ఒల్కి యందుండ నిలిపి -
కొనుచు మెల్లన డస్సికొనుచును ముండ్ల -
దారుల యందును తల్లిదండ్రులను
గారవంబున వెంటఁగలయఁ బిల్చుచును
కొండల మందుచు ఘోర దుర్గముల
మందలై గుంపులై మది నుస్సురనుచు

## ఆఁకలి బాధకు తాళలేక స్త్రీలు అడవిలో ఆకులు అలములు తినుట

ఎండ గాలికి నోర్చి యెలనాఁగలెల్ల
కొండల మిడిగుండ్ల కోనలుఁ దిరిగి
ఒక రెండు పస్తులు నుండుచు నడవి
వికలులై తిరుగుచు వెఱఁగొంది కుంది
ఆఁకలి చేతను నలసి వర్తించి
ఆకులలమ్ములు దినియటు నుందుమనుచు
పల్లెరాకును బొద్ది పాలాకు పనస
ఉల్లి పల్లెరును ఊసరాకులును
నేలజీవాకును నీటిగోగ్లాకు
రేలాకు తుమ్మాకు రేగుకాయలును
ఎలిచికాయలు బలుసు కాయలు మేడి
పలువిధమైనట్టి ఫలములాదిగను
కూరలు కాయలు కూళ్ళుగా నమలి
మారవికార సన్మానముల్ మాని

దారుల యందును దరిదాపు లేక
కార డవుల యందుఁగల ముండ్లుఁ దాఁకి
పాదముల్ రక్తమేర్పడి నడ్వలేక
బాధలఁబడియు నిబ్బరములు వదలి
సారెకు నిలచి వేసరియుఁ గూర్చుండి
దూరంబు నడలేక దుఃఖించుచున్న
భార్యల పుత్రుల భర్తలు చూచి
ధైర్యముల్ దిగనాడి తగ నిట్టులనిరి

అడవిలో నడువలేక కష్టములు పడుచున్న భార్యాపుత్రు భర్తలు కర్మఫలమును గూర్చి చెప్పుట:

పాపిష్టి కఱవు నిప్పులముగా వచ్చి
కాపురంబులనెల్ల కకవికల్ చేసి
తల్లిదండ్రిని గృహధర్మిణి బాసి
వెళ్ళిపోయెదమనుచు విపరీత బుద్ధి
కలుగఁజేసెను శని కాఠిన్యుఁడగుచు
ఇల శనిరాజు కగ్గేమి చేసితిమొ
అరయ ఊతిలో కప్పు కాహార మిచ్చు
పరమాత్ముఁడున్నాఁడొ పరికింపలేడొ
బావులలో నీరు బంగార మాయె
ఏవంకఁ జూడ మేతేమియు లేక
గోవృషభంబులు కొల్లలై కొండ -
లావృతంబుగఁదిరిగి యల్లాడి పోయె
పామరత్వముచేత పాలించునట్టి
గ్రామీణ పశువులే గతిఁబోయెనింక
భావింపగా వన్యఫలముల మెసవు
జీవకోటులు నెట్లు జీవించు నొక్కొ?
కాపులు ధాన్యముల్ కణజముల్ చేర్చి
చూపులకైనను జూపింపరైరి

అటుగాన కొందఱు నాఁకటి కడలి
పటుధైర్యమున నీళ్ళబడి రనేకులును
పగలె యిండ్లకు దొంగబంటు లేతెంచి
దిగులొందఁ దోఁచిన దిక్కేమి లేదు
పల్లెల నుండిన బలవంతు లెల్ల
మెల్లనఁజేరిరి మేటి పట్నముల
ధనికులు లేనట్టి దారిద్రపూర
పనులేమి లేక మా పల్లియ లెల్ల
విడిచి వచ్చితిమింక విపిన భూములను
గడచి యేదేశంబు కనఁబోదు మింక
ఇలమీద జననంబు లెత్తుట కంటె
బలవంతులిండ్లను బానిసమేలు
కానిమ్ము ఇంతకు కారణభూతుఁ
డైనట్టి దేవు నేమనిన దోసంబు
ఏ జన్మమున నోము లేమి నోచితమొ
ఆ జన్మ ఫలమిప్పు డనుభవంబయ్యె
పదిలంబుగా మున్ను పరమేష్ఠి మనకు
నుదుట వ్రాసిన వ్రాత నులిమినఁ జెడునె?
ప్రాపింపఁగలుగు సంపద కుబ్బరాదు
ఆపద లొడవిన నడలంగ రాదు
పుట్టించువాఁడు తా పోషించు నంద్రు
పుట్టునో లేదంచు పొరలంగ నేల
ఆయు రన్నంబు ప్రయచ్ఛతి యనుచు
వ్రాయరే శ్రుతుల నెవ్వరికైన విను:డు
భువి జీవకోటికిఁ బోల్వ నేమిటికి?
రవిచంద్రులకు కేతు రాహుచే బాధ –
తప్పనే చేసిన తప్పులు నాఁడు
చెప్ప నేమున్నది చేయు కర్మములు
జీవ కోటికి నెల్ల సిద్ధంబు గాను
భావింప సుఖదు ఖ ఫలములు రెండు

వెన్నెల చీకటి విధమున మనకు
పన్నుగా నెప్పుడు ప్రాప్తమై యుండు
ఓడల బండ్లు బండ్లోడ లన్నటుల
కీడు మేలును పూర్వకృత మొచ్చుపోవు
అనుభవింపకపోదు అజునకునైన
మన మన నెంత నిమ్మహిరాజులందు
అరయ హరిశ్చంద్రు లా నలాధిపులు
పరమ పావనులైన పాండు నందనులు
పొసఁగ దేవాంశ సంభూతులై నీతి –
పసగల్గువారలే పాటులు బడిరి
వారికంటెను గొప్పవార లీ జగతి
ఈరేడు లోకాల నెవరైనఁ గలరె ?
అట్టి రాజులు భార్య లడవిని దించి
కట్టడి శనిచేయు కర్మముల్ వాసి
దైవ యోగమ్మునఁ దమవారిఁ గలసి
పావన చరితులై ప్రబలిరి మున్ను
తొల్లి చేసినయట్టి దోష ఫలమ్మ
లెల్ల బాధింపక యేల పోనిచ్చు?

**కఱవు బాధితులైన ప్రజలు రేనాటిసీమకు పోవు తలంపుతో 'యాడికి', 'బూర్గుల', 'తాటిపర్తి' గ్రామములను చేరుట:**

పరమేశ్వరుఁడు మన పాలిటఁగలుగ
ఇరవంద నన్నంబు లెటులైనఁగలుగు
నడి సంద్రమున బడ్డయట్టి పుడకైన
ఎడపక తీరంబు కేతేర కున్నె?
రేపు మాపనకను రేణ్ణాటి సీమ –
కోపికతోఁబోవ నౌక ప్రాపు గలుగు –
అని తమవారల నటు బిల్చుకొనుచుఁ
జనగ యాడికిపుర సామీప్యమునకు

మఱికొండఱును ఎఱ్ఱమల నెగబ్రాకి
కరమొప్ప బూర్గుల గ్రామంబునకును
అరుదార కొందఱు నటు బయల్ సేరి
పరువెత్తుచును తాటిపర్తికిఁ జేరఁ
జనునంత సూర్యుండు చరమాద్రి కేగె

## సాయం సంధ్యావర్ణన

కనుగొన నాకాశకాంత గ్రీవంబు
కలయఁబూసిన నెఱ్ఱ గంధమో యనఁగ
ఎలమి పడమర బయ లెఱ్ఱనై తోఁచె
పర్వత గుహల లోపలి దంతు లపుడు
ఉర్విపై మెండొడ్డెనో యనునటుల
ఘనమగు చీఁకటుల్ గప్పె నంబరము
ననఁగ నభోనల్లనగు గుడారమున
మణులు గూర్చిన రీతి మఱి చుక్కలమరె,
ఫణులు పుట్టలనుండి పాఱె దిక్కులకు
రజనీచర పతంగ రాజంబులెల్ల
కుజములఁబాసి దిక్కుల మేఁత కరిగె
తెరువాటుకాండ్రు రాతిరి భీతిలేక
తెరువులుఁ గాచుక ధీరులై యుండ

## పేదలు రాత్రివేళ యాడికి గ్రామమునకు పోయి అన్నమును యాచించుట

అట్టి రాతిరి వేళ నన్నమో యనుచు
గట్టిగా నార్చుచు గ్రామంబులందు
పట్టణంబుల నిండ్ల పంచలయందు
పట్టె డన్నానకు ప్రార్థనల్ జేసి

అన్నంబు కొందఱ కముకూల పడక
తిన్నగా యాడికి తెరువెళ్ళి చేరి
పురజనంబులు నిద్రపోయెడి వేళ
విరివిగా జనులెల్ల వీధులయందు
సందడింపగ లేచి సజ్జనులెల్ల
పొందుగా నా రాత్రి భోజనం బిడియు
ప్రాపు లేకను వెతల్ బడు బీదజనుల
ఆ పురవాసులు అపుడిట్లులనిరి

## యాడికి గ్రామప్రజలు ఆ పేదలనుగూర్చి ప్రశ్నించుట

ఓ బీదజనులార! ఓ పుణ్యులార!
ఈ బీదగ్రామంబు కేల వచ్చితిరి ?
ఏ దేశములవార లే జాతివార
లీ దేశమునకు మీరేల వచ్చితిరి?
కఱవునఁజెంది సంకటముల నొంది
అరుదెంచినట్లు మాయాత్మలఁ దోఁచె
ఒకయేటి కఱవుకు నూళ్ళెడఁబాఁ
వికలురై వచ్చుట వెఱ్ఱులు గారె!
కఱవు వచ్చినయంత కష్టమొందినను
తెరువులు బట్టి యీ తీరుగా మీరు
పరువెత్తుచును వచ్చి పరదేశములను
కొఱగాని యిండ్లను కూటికై నిలిచి
పలు గద్దరింపులు బడుటయే గాక
కలియైనఁబోసి యాఁకలి దీర్చువారు -
గలరె? యిక్కడ జనుల్ కఠినమానసులు
కలిమిఁగలిగిన వారు కడిఁదినువేళ
ప్రియముతో నన్నంబు పిడికెడుగాని
దయ నర్థి కిటనిచ్చు దాతలు లేరు
కడకు నెంగిలి చేయి కాకి ముంగలను
పుడమిపై విదిలించు పుణ్యులు లేరు

## ఒక నిరుపేద తమస్థితిగతులను గూర్చి యాడికి ప్రజలకు చెప్పుంట

అని పల్కి పురజను లందఱి తోడ
వినతుఁడై యొక బీద వివరించి పలికె
వినరయ్య! నేఁజేయు విన్నప మొకటి
ఘనమగు మా పాపకర్మ వేదనల
ముందు సంవత్సరమును పైరులేమిఁ –
జెందిలి మియ్యేట చినుకైనలేదు
కఱవన రెండేండ్లు కఱవయ్యె బ్రతుకు –
తెరువును ఏ దిక్కుఁ దెలియక నింట
పలుకుట్టు పుడుకైన పశువుకు లేక
కల పశువులు కొన్ని గాటను సమసె
ఆఁ కొన్న పశువుల నడివికిఁ దోలి
ఏకమై మేమెల్ల నేతెంచి నాము
ఆరయ మేమెల్ల నావలఁబోయి
ఊరూర కొందఱ ముండెద మమ్మ!
అని పల్కి బీదకు నా పురజనులు
మనమునఁజింతించి మఱి యిట్టులనిరి

## యాడికి గ్రామప్రజలు ఆ బీదలకు ఉయ్యాలవాడలోని బుడ్డా వేంగళరెడ్డి కడకు పొండని సలహానిచ్చుట – ఆతని దానగుణమును వర్ణించుట

వినరయ్య జనులార! విశదంబుగాను
ఘనముగా మా మదిఁగల దొక్కమాట
కలవార లెందఱో కలిని నున్నారు
కలిగిన బీద కన్నము బెట్టలేరు
మెఱమెచ్చు దాతలు మేదినిఁగలరు
కఱవున కడివేయు ఘనులుండు టరుదు

ఇలను దైవసహాయ మిసుమంత లేక
కల యత్నములు నేమికావండ్రు బుధులు
పంటకాపులు సేద్యపనులెల్లఁ జేసి
పంటచేయను భూమి పదును గోరుదురు
అరయ నేఁ జేయు కార్యంబున కిపుడు
ధరనెన్న దైవయత్నమ్మె కావలయు
కావున నామీఁద కరుణయుఁ గలిగి
దైవమా ! యీ బీదతతి నేలుమనుచు
దైవత స్మరణ తాఁదప్పక చేసి
భావంబులో ధర్మబద్ధతన్ విడక
హితవొప్ప పుణ్యంబు లెన్ని చేసినను
అతిథి కన్నము లిచ్చు టది లెస్స కాదె
మనకు నెద్దులు భూము లెన్నియునున్న
మన కన్న మిదె యని మది నిశ్చయించి
తమయింటి కార్యముల్ తగ నెఱవేర్చి
ఘనమతి తిమ్మమగారి కిట్లనియె

చెల్లెలు తిమ్మమ్మగారిచే బీదలందఱికిని అన్నదానము చేయించ
అన్న సత్రములు కట్టించుట –
ఊరి ప్రజలందఱును వేంగళరెడ్డి గారికి సహకరించుట:

వినవమ్మ! ఈ బీద వితతికి నెల్ల
అనువుగా నన్నంబు లమరించుటకును
ఘనురాల నీవని కడవెళ్ళు వఱకు
పనివాండ్ర నిచ్చెద పదవమ్మ! యనిన
మనమున తిమ్మమ మహదేవ నీదె
ఘన పుణ్యకార్యంబు కడతేర్చు మనుచు
బీదల కంబలుల్ ప్రేమఁ బోయించి
ఆదరంబున వారి యాఁకలుల్ మాన్పి

గలఁడుపో మీకు నాఁకలి కాపగలఁడు
తెలనైన తూర్పు నా తెలుఁగునఁజనుఁడు
మాకుఁ దోఁచిన రీతి మాటఁ జెప్పితిమి
మీ కెల్లఁదెలియు నామీఁద నటంచు

## వారి మాటలు విని పేదప్రజలు
## దు ఖ శాంతిని పొంది నిద్రించుట

ఆ పురవాసులు నా రీతిఁబలుక
ప్రాఎంప విని చాల పండువై తోఁచి
వారాశి నీది నవ్వల నిల్చునటుల
క్షీరమ్ము చక్కెరల్ జేరిన యటుల
వాడిన పైరుపై వర్షించు నటుల
వాడవాడను జనుల్ వరుసను బలుక
వార్తలు చెవిసోకి వగపులు మాని
ఆర్తారవంబుల నప్పుడుడింగి
పన్నుగా నడచిన బడలికల్ దీర
అన్నముల్ గుడిచిన యానందమునను
కన్నుల నిద్దురల్ గప్పుగాఁ దోఁప
పన్నెండి గంటలోపల నిద్రవోవ

## చంద్రోదయ వర్ణనము –
## చంద్రుని మన్మధునితో పోల్చి వర్ణించుట

కుముదావనీప్రేమ కుసుమేషుమామ
అమిత సత్కాళ ధాముఁడగు చందమామ
కొమరు చకోరక గుమి సంతసింప
తమము వారించు పేదల దీపకలిక –
అనఁగ చుక్కలదొర అటు తూర్పుదెసను
కనుపట్టె చంద్రికల్ కప్పెను దెసల

మదనుండు చంద్రుండు మఱి రాత్రివేళ
అదనని విరహుల నదలింపఁబూని
మొగలిరేకు షరాయి ముదమొప్పఁదొడిగి
తొగపూల నిలువంగి దొడిగి యా మీఁద
చెంగల్వ పువ్వుల శాలువ మొలను
చుంగులు జాఱఁగాఁజుట్టి బిగించి
నిండు వేడుక మీఱ నీటుగా తలను
బొండు మల్లెల పాగ పొందిక పఱచి
హొయలుగా శిరమున నుట్టిపాటమర
రయమున కల్కితురాయినిఁ జెక్కి
మీనకేతన మెత్తి మీసమ్ము దిద్ది
మానన విరహుల మానసం బడర
విరి శరంబులు చెఱకువింటను బూని
వరుసతోఁదన పరివారంబు గొలువ
కీరంబుమీఁద నెక్కియు నవ్వుకొనుచు
కేరి పరిల్లున కేకలు వైవ
ఆలుమగళ్ళు సం దలగిన నాఁటి
తాలుము లూడి చిత్తములు గరంగి
సతులును పతులును సాహసంబడర
రతులను మెప్పించి రాత్రియుఁగడువ

## సూర్యోదయ వర్ణన

పొలుపొంద తూర్పుది క్కొలఁతి ముక్కునను
మరువంపు ముక్కఱ మణి వెల్తురనఁగ
వేకువచుక్క వే వేగఁగన్పట్టె
వాకిట కుక్కుటాల్ వడిఁగూయసాగె
గోర్వంక చిలుకలు కోవెలల్ గూసె
జార చోరుల మది చలన లుడింగె
భువి పన్నగంబులు పుట్టలఁదూఱె
అవని తామరమొగ్గ లల్లన విరిసె

అల చకోరక పంక్తు లటు గుహల్ దూఱె
వెలయ తామర దీప్తి వెల్లనై తోఁచె
వేమారు రతులను విడువక పెనఁగు
భామల కౌగిళ్ళఁ బాసిరి మగలు
తిన్నగా చీఁకటుల్ తెగి తెల్లనయ్యె
వెన్నుని వలకన్ను వేంచేసి తూర్పు –
కొండపై కెంపుల కుప్పన లేఁత –
యెండ లింతింతలై యిలమీఁదఁ బర్వె

## కఱవు బాధితులైన బళ్ళారిజిల్లా పేదలు ఉయ్యాలవాడ గ్రామమును చేరుట

పడమర జనులు సంభ్రమమున లేచి
తడవేటికని అన్నదాత పట్టణపు
మార్గంబు లడుగుచు మక్కువ బీద –
వర్గంబు మితిలేక వచ్చి యాయూర
నార్తారవంబుల నన్నంబు లడుగ
కీర్తి వహించి మిక్కిలి వన్నెగన్న
ధరణి నుయ్యెలవాడ ధర్మసంస్థాన –
పురము వీధుల వనముల చెట్లనీడ
మఱియు మామిడి నింబ మ్రాకుల క్రింద
తురగశాలల చింతతోపుల నీడ
భావింపఁదగినట్టి ప్రాకారములను
చావిళ్ళయందు రచ్చల వీధులందు
పువ్వుతోటలనీడ పొదరిండ్లయందు
మవ్వపు గుడులందు మఱి నిండియుండ

## తండోపతండములుగా వచ్చిన ఆ పేదలను జూచి ఉయ్యాలవాడ పురజనులు ఆశ్చర్యపడుట

ఆ పురవాసులు నచ్చెరువంది
కాపులాదిగ జనుల్ గని దిగ్భ్రమించి

దొంగలో యే దేశ దొరల సైన్యంబొ
అంగన! తిరిపెంబులను రీతిలేరు
మునుపు పల్నాట కాపులు కర్వు కోడి
యెనయఁగా తిరిపెంబు లెత్తిన యటుల
కాపులెల్లను ఏమి కారణంబుననొ
కాపురంబులఁ బాసి కళవలపడుచు
పడమర సీమంచుఁ బల్కుచున్నారు
చెడివచ్చి మనపురిఁ జేరియున్నారు
తేరుఁదీసిన మూఁక తెలుగున్నదమ్మ
వీరు ఊళ్ళను దోఁచ నేతెంచి నటుల
చీమల పుట్టలు చెదరిన భాతి
భామినీ మణులును పతులును సతులు
పళ్ళెరాల్ చెంబులు పడక కంబళ్ళు
కల్లకాదమ్మ! చంకను చేట తెడ్లు
పిల్లల కావిళ్ళు పిల్ల తల్లులును
పల్లవోష్ఠిరో! నిండు పడతులున్నారె
వెలఁది యీ జనసంఖ్య హెచ్చుగాఁ గలదు
పలువిధ భాషలఁ బలుకుచున్నారు
చెలి! వీరలకు నల్లచీరలే కాని
తెలిచీర రవికె ఏ తెఱవకు లేదు
గొల్లవారికి వలె కుడి పైటలున్న
మల్లు త్రిప్పుడు చెఱఁగు మనవలె లేదు
పరికింపగా జాఱుపైటలే గాని
పిరిచంటు వేయుట పేరుకు లేదు
తలప నల్లని కప్పుదంతముల్, తలను -
మెలపుగాఁ ద్రిప్పిన మేటి క్రొమ్ముడులు
వలపలి కౌను మవ్వపు నడపంబు
కలికి ముక్కున నొక్క కాసుకు పోని
ముద్దులఁ గులికేటి ముత్తెంపు ముల్లి
కద్దు లేదను తాళి గళమునఁగలదు

కటకటా! వీరెంత కఱవున నొచ్చి
ఇటువంటి యిడుముల కిరవుగానైరి
అస్థి మాంసంబులు నవయవంబులును
మస్తిష్కమాదిగా మాంసముల్ తగ్గి
ఒడలెల్ల స్రుక్కి బల్ యొఱవులు మాని
బడలి వెన్నెముకలు బట్టియెమ్ములును
పిఱుదుల తొడలను పిక్కలయందు
నరములు చర్మముల్ నాతి చూపట్టె
అల్లదె మగవార లంద అదేమొ
జల్లి చల్లడములు జత కాసె దట్లు
నల్లని మేనులు నాచు వెంట్రుకలు
పుల్ల మీసములు బెబ్బులి సటల్ గనరె
కన్నడ భాషయే కలదు కొందఱకు
ఎన్నంగ తెలుగు భా షించుకఁ గలదు
ఆమడ కొక బాస యన్నది నిజము
ఈ మహాజన మూఁక నెవరు ఆపెదరు ?
దినమొక్కటాయిగాఁ దీనగాని
ఘనమైన కొండ లగ్గలముగాఁ దఱుఁగు
తండంబులై భిక్షతతు లన్న మడుగ
దండుకు మంచముల్ తగ నొంచఁ గలరె ?

## ఆ పేదల ఆకలిమొరవిని వేంగళరెడ్డిగారి తమ్ముడు ఈశ్వరరెడ్డి వారికడకు వచ్చుట

అనియిట్లు పురజను లనుకొనుచుండ
మునుకొని చేతులు ముగిచియు బీద –
జనులెల్ల బిడ్డల చంకల నిడియు
అనువంద వేంగళాహ్వాయరెడ్డిఁ దలఁచి
ప్రేమ రంజిల పిన్నపెద్దల తోడ
ఆ మహాబీదలు అన్నమో యనుచు

కుయ్యిడ నాశ్రిత కుముద చంద్రుండు
చయ్యన బుడ్డ ఈశ్వరరెడ్డిగారు
సురరాజ యశుఁడు భాసుర గుణోజ్జ్వలుఁడు
సిరులొల్కు కాంచనచేల ధరుండు
అరి భీకరుండును ఆర్తరక్షణుఁడు
మఱి సమస్తైశ్వర్య మహిముఁడౌ దాన -
ధౌరేయుఁడతుల విద్యాధురంధరుఁడు
ధారాళ వాక్సుధాధార గీర్వాణ -
సార సంగ్రహ కళాసార సంగ్రహుఁడు
సూరి జనాఢ్యుండు సువ్రతాచారుఁ
డీ బీదలను గని ఈశ్వరరెడ్డి
శాభాసు భళియని సజ్జనుల్ మెచ్చ
న్యాయ మెఱింగి విన్నప మాలకించి
పాయకఁదమ యన్నపజ్జను జేరి
తమ యన్న యనుమతిఁ దాను గూర్చుండి
సుమహిత వాక్యవిస్ఫురణలు వినుచు
అన్న ధర్మమునకు నానందమొంది
మన్నింప వన్న! నా మనవి నీ విపుడు
కుందనంబున రత్న గుమిగూడి నటుల
పొందుగా విరుల తావులు గల్గు నటుల
చెఱకున ఫలములు చేకూరినటుల
కరుణార్ద్ర దృష్టియుఁ గల్గ నిట్లనియె

ఆ పేదల ఆకలిబాధలను మాన్పుమని ఈశ్వరరెడ్డి
తన అన్న వేంగళరెడ్డికి విన్నవించుట

అన్నయ్య! బీదలు అరుదెంచి నేఁడు
అన్నమో! యనుచును ఆర్తి నొందెదరు
మీ పేరుఁ గొనియాడి మిక్కిలి వారు
దాపునఁ జేరిరి దయనేలు మనుచు

తడబడి రాకలి దప్పుల చేత
పుడమి వారలఁ బ్రోవ పుణ్యంబుఁగలదు
మన తండ్రి సంపద మహిమీద ధాన్య -
కణజాల పుట్లను గణుతింప నేల?
మన భూము లెద్దులు మనకున్నఁ జాలు
మన కన్నవస్త్రముల్ మఱి లేక పోనె?
సరియైన బోసి దాసరి నేలవలయు
తరియైనవేళ విత్తన మేయవలయు
ముదమొప్ప ధనధాన్యములు గలనాఁడె
అదనుగా సత్కీర్తు లందగావలయు
కలిమి పేదఱికముల్ కావడి విధము
తలఁప వచ్చును పోవు ధనగతులనఁగ
చీమపుట్టను పాము చేరినయటుల
పామరుల్ గూర్చిన బంగారమెల్ల
పరులఁజేరును మఱి పరికించి చూడ
మఱియు మీ రెఱుఁగని మర్మముల్ గలవె?
కానల నీగలు ఘనముగాఁ గూర్చు -
తేనియల్ పరజను ల్దినిపోవలేదె?
మఱియును షోడశ మహారాజులెల్ల
వరుస నార్గురు చక్రవర్తు లాదిగను
వర దానధర్మ సద్వర్తనల్ గలిగి
పరమ సాయుజ్యముల్ బడయరే తొల్లి?
దాఁచిన ధనము లిద్ధరణి నేమైన
గోఁచి మాత్రంబును గొంపోవ లేదు
తెలిసిన మీకునేఁదెలుపంగఁగలనె
తలదాల్తు మీ యాజ్ఞ తప్పక యేను
ఇటుమీఁద మీ యాజ్ఞ ఎటువలెనున్న
అటువలె వర్తింతు అన్నయ్య! యనుచు
అనుపమ ధర్మంబులని యూరకున్న
మనమున సంతసంబంది యా రెడ్డి

## తమ్ముని మాటలకు వేంగళరెడ్డి సంతసించుట

తమ్ముని మాటలు తనయాత్మ మెచ్చి
సమ్మతి సెలవిచ్చి సంతసం బలర –
నున్నంత బీదలు నోపిక లొదలి
అన్నంబులేకను ఆఁకటి కడలి
తెలెలు చెంబులు తెడ్లు చేతులఁబూని
పలుమాఱు వాకిట పంచ లేమఱక
కలిమి తొయ్యలి యింట కడు సంభ్రమింప
పొలుపొంద రెడ్డిని పొగడి రిట్లనుచు

## పేదలు వేంగళరెడ్డిని స్తుతించుట

బుడ్డ వేంగళరెడ్డి! భూరికలాప !
రెడ్డి దిలీప ! స్వర్రేఖ ప్రతాప !
సద్గుణాలంకార ! సద్ధర్మనిరత !
భర్గు పంచాక్షరీ పఠన ప్రవీణ !
దాన ధురీణ! సత్కారుణా కటాక్ష
దీన రక్షక ! ధర్మదేవత నిఁయ !
మిముఁగొనియాడ నేమియు నేరమయ్య !
మము నుపేక్షింపక మఱి యేలవయ్య !
అన్నమో! యనుచును నాఁకటి కడలి
మిన్ను మ్రోతల రీతి మిగులంగ నార్వ

## చెల్లెలు తిమ్మమాంబ పేదలబాధలను అన్నకు విన్నవించుట

విని సత్వరమున సాధ్వియు తిమ్మమాంబ
తన యన్నకడకేగి తగ నిట్టులనియె
వినవన్న! మీ కీర్తి వెలసి లోకమున
ఘనత వహించె నిక్కము బీదజనులు
పడమర దేశంబు పైరులులేక
కుడువ నన్నములేక కొనప్రాణములను

చెడివచ్చి మన దాఁపు చేరియున్నారు
పుడమి వారలఁబ్రోవ పుణ్యంబు గలదు
పుట్ట లెక్కిన వాని పూరియు నోటఁ
బట్టిన వానిని భయపడ్డ వాని
ఘన విపద్దశ వచ్చి కావు మటంచు
వినయమ్ముననుు తన్ను వేఁడిన వాని
అని బలముడిగి నిరాయుధుండగుచు
తనుతానె పరువెత్తి దాఁగినవాని
అన్నంబులేకను అడరెడువాని
మన్ననతోఁ బ్రోవ మఱి కీర్తి గలదు
ఎన్నంగ దానంబు లెన్ని చేసినను
అన్నదానము సేయు టధిక ఫలమ్ము

## వేంగళరెడ్డి ఆ పేదలను జూచి అన్నదానము చేయుటకు నిశ్చయించుకొని దేవుని ప్రార్థించుట

అని పల్కుతిమ్మమ నాత్మఁ దా మెచ్చి
తన చెల్లెలితో బీద తండంబుఁ గనగ
సోపాన మార్గముల్ సరగున నెక్కి
ఆపైని శృంగారమౌ కుర్చీపీట
మీఁదఁ గూర్చుండి నమ్మిన బీదజనుల
నాదరించుట మంచిదని నిశ్చయించి
అపుడు వేంగళరెడ్డి ఆత్మలోపలను
కృపగల్ల దేవుని కీర్తింపఁ దొడఁగె
త్రిపురారి! ఓ మహాదేవ! మహేశ!
ఉపవాసులై జీవు లున్నారు పెక్కు
పరమాత్మ! నీవు నా పాలిటఁ గలుగ
ధరమీద బీదల తగఁబ్రోవఁ గలను
ధన మాదిగా గల ధాన్య సంపదయు
ఘనమైన భూములు గలిగి యుండినను

ఇలను దైవసహాయ మిసుమంత లేక
కల యత్నములు నేమికావంద్రు బుధులు
పంటకాపులు సేద్యపనులెల్లఁ జేసి
పంటచేయను భూమి పదును గోరుదురు
అరయ నేఁ జేయు కార్యంబున కిపుడు
ధరనెన్న దైవయత్నమ్మె కావలయు
కావున నామీఁద కరుణయుఁ గలిగి
దైవమా ! యీ బీదతతి నేలుమనుచు
దైవత స్మరణ తాఁదప్పక చేసి
భావంబులో ధర్మబద్ధతన్ విడక
వాతవొప్పు పుణ్యంబు లెన్ని చేసినను
అతిథి కన్నము లిచ్చు టది లెస్స కాదె
మనకు నెద్దులు భూము లెన్నియునున్న
మన కన్న మిదె యని మది నిశ్చయించి
తమయింటి కార్యముల్ తగ నెఱవేర్చి
ఘనమతి తిమ్మమగారి కిట్లనియె

## చెల్లెలు తిమ్మమ్మగారిచే బీదలందఱికిని అన్నదానము చేయించుట– అన్న సత్రములు కట్టించుట – ఊరి ప్రజలందఱును వేంగళరెడ్డి గారికి సహకరించుట

వినవమ్మ! ఈ బీద వితతికి నెల్ల
అనువుగా నన్నంబు లమరించుటకును
ఘనురాల నీవని కడవెళ్ళు వఱకు
పనివాంద్ర నిచ్చెద పదవమ్మ! యనిన
మనమున తిమ్మమ మహదేవ నీదె
ఘన పుణ్యకార్యంబు కడతేర్చు మనుచు
బీదల కంబలుల్ ప్రేమఁ బోయించి
ఆదరంబున వారి యాఁకలుల్ మాన్పి

మఱుసటి దినము క్రమ్మఱ తిమ్మమాంబ
మఱువక తమ యన్న మాట నీడేర్తు -
నని ధాన్య కణజము లపుడుఁ దీయించి
పనివాండ్ర రప్పించి పందిళ్ళమర్చి
కొట్టముల్ శిబిరముల్ కొదువ లేకుండ
కట్టించి తడికల కప్పు లెత్తించి
అందు కుంటి కురూపు లంధుల నునిచి
కొందఱు నవమాసకులకు వేర్వేఱ
ఇంతుల నొకపాటి యిండ్లలోనునిచి
యింతయె గాదు బాలింతల కెల్ల
పొసఁగ శాల్యన్న మింపుగఁబెట్టి వారి -
పసిబాలురకు గోవుపాలాదిగాను
అగ్గించి ఖరము పాలనుద్రాగఁ బనిచి
ఉగ్గ గిజడు బువ్వ లొసరఁ బెట్టించి
ఇతర బీదలకెల్ల నిష్టంబుఁదీర
వాతవొప్ప భోజనం బిడుటకు నపుడు
పన్నుగా సద్ధర్మ పాలనఁ జేయ
అన్నసత్రంబుల నపుడు పెట్టించి
వివిధ ధాన్యంబులు వేర్వేఱుగాను
అవలీల సత్రంబులందుండఁ జేర్చి
వంటఁజేయను నేర్పువారి రప్పించి
వంట పాత్రంబుల వారి కిప్పించి
యింటింట కూళ్ళకు నెవరిఁ బోనీక
వెంటనె అన్నంబు వేగఁ జేయించి
భక్షణల్ నలభీమపాకమై యుండ
భక్షింప బీదల పంక్తుల నునిచి
విరివిగా పాత్రలు వేయించి యందు
అరమర లేకుండ అన్నంబు పెట్టి
సంతసంబున రైతు సంఘు మేతెంచి
రంతులు గానీక రమణీయమైన

చేట లన్నంబును చేఁబూని యున్న
నూటికి వడ్డింత్రు నూర్లాది ప్రజకు
కొందఱు జలములఁగొని పంక్తులందు
పొందుగా దాహ మింపుగఁ దీర్చువారు
బీద కల్పలగమి ప్రియచంద్రుఁడైన
సాధు ధర్మప్రభు సతులు నిద్దఱును
చెల్లెంద్రు ఎనతల్లి శేషమ్మగారు
చల్లని వాక్కుల శంతసం బడర
కూరలు చారులు గొజ్జారబిండ్లు
మాఱున్నమాదియౌ మజ్జిగ లొసఁగి
మామిడి నిమ్మప్పు మఱి యూరబిండ్లు
ప్రేమను నీ రీతిఁ బెట్టించి పిదప
బందువుల్ సుజనులు పరమ సంప్రీతి
బంధురముగ నీటిబండ్లఁ గట్టించి
చలివేంద్రలుంచి విస్తార బీదలకు
జలములు బోయు సజ్జనులను గాంచి
వేడుకలూర నా వేంగళరెడ్డి
పోడిమి మీఱ నేర్పున నిట్టులనియె

## చలివేంద్రలు పెట్టిన తన ఊరి ప్రజలను వేంగళరెడ్డి ప్రశంసించుట

ఓ పురజనులార! ఓ పుణ్యులార!
మీ పుణ్య ఫలముల మెచ్చంగ వలయు
జీవనంబులకెల్ల జీవమాసరము
జీవంబులకునెల్ల జీవనం బొలయు
అరయంగ నీరు ప్రాణాధార మనుచు
ధర నీతివాక్యముల్ తప్పక పల్కు
కావున మీరెల్ల కరుణ రంజిల్ల
భావంబులను నీతి పద్ధతు లెఱిఁగి

పానీయశాల లేర్పఱచి బీదలకు
పానీయముల నిచ్చు ఫలము మీదౌను
ఈ పట్ల కరుణించి యిటమీఁద మీరు
తాపత్రయంబు లింతట కొంత మాని
ఉదయ సాయంత్రమ్ము లోపికతోడ
కొదవ లేకనె వీరి కోగిరా లొసఁగి
పానీయముల నిచ్చు పనులు మీ వనుచు
దానధురీణు డంతట వారిఁబనిచె

## పేదలకు రెడ్డి సకల సౌకర్యములను ఏర్పాటు చేయుట - వారి యోగక్షేమములను స్వయముగా చూచుట

బిరబిర తాఁబోయి బీదల నపుడు
కరుణా కటాక్ష వీక్షణములఁ జూచి
కట్ట వల్వలు లేని కాంతలకెల్ల
దిట్టమౌ చీరలుఁ తెప్పించి యిచ్చి
చాకల మంగల సమితి రప్పించి
చాకిరీ పనులు లెస్సగఁ జేయుఁడనుచు
పలుమాఱు నౌకర్లఁబనిచి వే వేగ
సెలవిచ్చి బీదల సౌఖ్యంబు లరయు
జ్వరబాధలును పుండ్లు జాడ్యంబు లున్న
వర వైద్యులను బంప వాసిఁజేయించు
కిసురులు పీడలు కింకలున్నట్టి
పసి బాలురకు నెల్ల పథ్యంబు లరయు
మంత్ర మౌషధ యంత్ర మహిమలుఁగలుగ
మాంత్రికులను బంపి మఱి మఱిఁ బ్రోచు
భూజనుల్ నుతియింప పుణ్యావధుతుండు
ఆ జనాళికి వారమైనను ఒక్క -
తూరి తలంట్లు స్నానతులుఁగాగఁ జెప్పు
వారల పండుగ ల్వచ్చిన వేళ

విరివిగా నాహార విధులఁ బెట్టించు
సరిగ విచారించి సంతస పఱచు

## కొందఱు బీదల ముదితలకు తాళిబొట్లు ఏల లేవని రామన్న అను కాపును వేంగళరెడ్డి ప్రశ్నించుట:

చూడఁగా నొక్కనాఁడుత్సాహముఁనను
పండితుల్ సుకవులు ప్రాపున నిండు –
సభఁజేరి కూర్చున్న సమయంబునందు
సభఁగని మూహూర్త సమయంబు లరసి
మదిలోన నానంద మహిమ శోభిల్ల
ముదమొప్ప బీదల ముదితలఁజూచి
గాజు లుండియు తాళి గల్గనందులకు
ఆ జనాళికి రెడ్డి అపుడిట్టులనియె
వినవన్న! రామన్న! విశదంబుగాను
ఘనమగు నీ బీదగమి యాదిగాను
మీ వారి లోపల మెలఁతలకెల్ల
కావిరి కుంకుమ గాజులుఁగలిగి
తాళి ముక్కఱ లేని ధర్మమా? కఱవు –
కాలంబు వచ్చిన క్రయముఁ జేసితిరొ?
అంగనలును బయలందు నిద్రింప
దొంగలు వచ్చియు దోచియున్నారొ?
తాళుల సూత్రపు దారము లూడి
నేలనుబడఁ గాననేరకున్నారొ?
పేదరికమ్ముల పెండ్లిండ్లుగాక
మోదంబుఁ దప్పిన ముద్దు కన్నియలొ?
యిటుగాక తాళిబొట్లేల లేవాయె?
కటకటా! యెటువంటి కర్మముల్వాడ
పటుతర మగునట్టి పాపము ల్గలిగె
చిడిముడి బడకను జెప్పుమా? యనిన

## పేదరికము కఱవుకాలము కారణములుగా పడతులకు పెండ్లిండ్లు చేయలేకపోతిమని రామన్న, రెడ్డికి సమాధానము చెప్పుట

రామనయను కాపు లలిత వాక్యముల
నా మహాధర్మున కనువంచఁ బలికె
సామి ! మా యిండ్లను సతులకునెల్ల
ప్రేమను జేసిన పెండ్లిండ్లనాఁడు
తాళి ముక్కఱలుంచు ధర్మమేగాని
కాల వశంబున క్రయమున కిచ్చి -
యుందు రనేకులు ఓ ధర్మనిరత!
యిందుముఖులు కొంద ఱీడులు మీఱి
మేనమామ కుమాళ్ళు మేనత్త బిడలు
దానధురీణ! యిత్తరి నుందురయ్య
పెండ్లి యిప్పటికిని బిడలకు లేదు
పెండ్లిండ్లుఁ జేసిన పెద్ద పుణ్యంబు -
గలుగును సత్కీర్తి గలుగును మిమ్ము -
దలఁతుము ఇల నభస్థలి సాక్షిగాను
వరుస మాకును బుట్టు వంగిసంబులకు
మఱువక మీ పేరు మఱి పెట్టఁగలము

## దయార్ద్ర హృదయుఁడైన వేంగళరెడ్డి పేదలకు ఈడుజోడులు చూచి పెండ్లిండ్లు చేయించుట - వారికి తాళిబొట్టులు, ముక్కఱలు, వస్త్రములు దానము చేయుట

అని సన్నుతించు రామనఁజూచి రెడ్డి
ఘన దయారస మొల్కఁగా మదిలోన
పెండ్లి ప్రయత్నము ప్రేమను జేసి
యేండ్లు సరిపడువారి నెల్ల రప్పించి
తగినవారల చూపుదల కోర్కెలెఱిఁగి
తగునీకు నీకును తగు జోడులంచు
నవ్వి వారల చిఱునవ్వు నవ్వించి
అవ్వారికిని తగు వరుసలు తెలిపి

యే జాతివారల కా జాతులందు
ఆ జాతి మఱియాద లరసి పాలించి
మెట్టియల్ తాళులు మేటి ముక్కఱలు
కట్ట వస్త్రములు తక్కువ పడనీక
పెట్టెలాదిగను సంప్రీతితో నిచ్చి
పెట్టించె తగిన విప్రుల వల్ల లగ్న -
పత్రికల్ పుట్టించి పతులకు సతుల
మిత్రలగ్నపు పెండ్లిమేర లేర్పఱచి
మఱియును వారిండ్ల మరియాద కొలది
ధరనెన్న ఖర్చుల దయతోడ నిచ్చి
శాశ్వత కీర్తులిచ్చుట ప్రకాశింప
నీశ్వరాలయమున న్విందులొనర్చి
పేదల పెండ్లిండ్లు పేరంటములును
ఆదరంబుగఁ జేసి అటకీర్తి వెలసె
ధారుణి నిటువంటి దాత లేడనుచు
సారెకు సజ్జను ల్సన్నుతి సేయ
గాజెల పాతళ్ళగల ధాన్యములను
ఓజగా గూర్చియు నొక్కవత్సరము
భుజియింప నౌనని బుద్దినూహించి
తేజంబు మీఱ నా దీనులఁ బ్రోవ
ఇచ్చుటి కధలెల్ల నిట్టుల నుండ
పశ్చిమ కధ మీరు బాగుగా వినుఁడు

## పడమటి సీమయగు బళ్ళారిజిల్లాలో వ్యాపించిన క్షామమును గుఱించి కలెక్టరు బహదూరు గవర్నరుకు విన్నవించుట - చెన్నపురి నుండి కమీషనరు యెల్లీసుదొర, ఇంజనీరు మోపరల్లిదొర వచ్చుట

అంతకు ముందుగా నా పశ్చిమమున
వింతయౌ కఱవుకు వెఱఁగొంది జనులు

కట్టవస్త్రము దినకడియైన లేక
పట్టణాలునికి తా పల్లెలుఁ బాసి
దీనత్వమునఁ బలు దెసలకుఁ బాఱు
మానవులను గావ మఱి కరుణించి
బళ్ళారి కలకటర్ బహదూరుగారు
మెల్లనె గౌనరమేంటుకుఁ దెలుప
గౌనరాజ్ఞను తురంగమ్ముల నెక్కి
దాన ధురీణులు ధర్మ వర్తనులు
కఱవను చీఁకటుల్ కడకుఁ బోఁద్రోచు
అరుణ బింబంబులు అరుదెంచు నటుల
సరసుఁడు నా కమీషనరు యెల్లీసు –
దొరయును ఇంజినీర్దొర మోపరల్లి
దొరలు చెన్నపురంబు తోడనె వెడలి
తురగంబులను వెసదుమికించు నపుడు
పటపటయని నాల్గు పదము లల్లార్చి
చెటుల రింఖధ్వనుల్జేసి యశ్వములు
పరువెత్త పదహతి పగిలి భూరజము
పఱతెంచి యాకాశ పదమును గప్పె
వాయువేగంబున వడిగ పరువెత్తి
కోయెముబుత్తూరు కొండలు దాఁటి
యిరువురు దొరలును ఇల బెంగుళూరు
పరగణాలను రోడ్డు పను లేరుపఱచి

## దొరలిరువురును బళ్ళారి జిల్లాలోని దుర్భర క్షామపరిస్థితులను పరిశీలించుట

ఆదవోను పురంబు కావల నివల
మీఁదటి దేశంబు మిట్ట భూములును
వానలు కురవని వసుమతిఁ జూడ
కాననంబున నీరు గంటెడు లేక

చెఱువులు కుంటలు చేఁద బావులును
అరయ నీరును తక్కువై రాష్ట్రమెల్ల
మేటి రేగడుల భూమిని పైరులేక
తోటలు వరిమళ్లు ధూళి గన్పట్టి
యెక్కడఁ జూచిన నెచ్చైన వేఁడి –
నెక్కడి బలు రౌతు నేఁచి వనాళి
చీకాకు పఱచియు చిద్రుపల్ జేసి
యేకార్ణవంబుగా నెఱగాలి యుండ
అట్టి యెండలకాల మా మహీధవులు
పట్టణంబులనెల్ల పరికించి చూడ
చిన్న పల్లెల జనబృందంబులెల్ల –
చన్న చతుష్పాద జంతు మాంసంబు
శునకముల్ భక్షించి శూరత మెఱసి
పెనఁగివీథులయందు పేరముల్వ్రాఁల
కనుఁగొని దొరలు ఆ గ్రామము ల్జొరక
మనములఁ జింతించి మానవ పతులు
దీనుల వలెను ఏ దిక్కుఁదోఁచకను
పూని యే యూరికి పోవుద మనుచు
అనువంద త్రోవను అటుఁబోవుచుండ
వనములఁ గనుగొన్న వైఖరు ల్దప్పి
తరువులఁ జిగురు లెత్తక నీడలేక
పరికించి చూచిన పక్షులు లేక
ఇరవొంద నెక్కడ వెదకినఁగాని
యెరదొరకదు మఱి యే ప్రాణికైన
తఱచగు నెండల తాకున కడరి
పరితాప మొందుచు పాంథజనంబు
దారుల నడువ భీతాహంబుఁదోఁచె
సౌరి యీ గతి పగ సాధించె ననఁగ
నెలల వర్షము లేక నిలయెల్లఁజూడ
ఫలమేమి లేక నిష్ఫలముగా నుండె

పలుకుట్టు పుడకైన పసులకు లేక
పొలముల కొండల పోఁద్రోలబడియు
డస్సి పోఁజాల కెండల దారులందు
కసవేమి కానక కన్నీరు నించి
అంబారవంబులు నటు చేసి చేసి
కుంభినిఁ బడియుండు గోలేఁగలాది
కనుగొని యాశ్చర్యకరముగాఁ దోఁచి
మనమునఁ జింతించి మఱియు నిట్లనియె

## ప్రజల దుస్స్థితికి దొరలు వాపోవుట

కటకటా! యిటువంటి కఱవున కోడి
యెటుబోయిరో జను లేమయ్యిరొక్కొ
ప్రాణప్రదంబగు పశుగణంబులను
నాశమైనటువంటి నగరముల్బాసి
పోవునప్పుడు దు ఖములఁ జెందికుంది
బావుల చెఱువులఁ బడిపోయిరొక్కొ
తమచుట్టముల యిండ్ల తామును జేరి
క్రమమున నీ కర్వుఁ గడపిరాగలరొ
అని తమ మనముల నత్యంత చింత
మునిఁగి బీదలిటుల పోనేల మున్నె
కఱవు సూచనలిందుఁ గలిగె నటంచు
మఱువక ముందుగా మాకుఁ దెల్పినను
రోడ్డు లేర్పఱచియు రొక్కంబు లిచ్చి
పోడిమిగాఁ బ్రోవ పోదురే జనులు ?

## క్షామసీమను కాపాడుటకు దొరలు ఆదవోనిపురములో రోడ్డుపనులు కల్పించి, ప్యాపలిగ్రామమును చేరుట

అని వితర్కించుచు నా భూమిపతులు
ఘనమగు నా సీమ కాపాడుటకును

చల్లని కరుణలు సకలదేశముల
కొల్లగా వెదచల్లి కోర్కెలుఁ దనుప
నాఁటి 'మంద్రోలు' ఈనాఁటికి మనల
పాటించి కరుణ కాపాడె నన్మాడ్కి
బాటలాది పనుల ప్రజలఁ బాలింపఁ
బోటరి యాదవోన్పురమునుఁ జేరి
రోడ్లపనుల్పెట్టి రొక్కంబులిచ్చి
పోడిమిగా బీద పుంజంబులకును
అన్న వస్త్రము లుంచి ఆపద ల్బాపి
మన్నించి యా బీద మనుజులకెల్ల
పనులను నిచ్చి యా ప్రభువు నావేళ
ఘనమైన ప్యాపలి గ్రామంబుఁ జేరె
వచ్చు మార్గములందు వర్షముల్లేక
పచ్చికలేమి నిష్ఫలమైన భూమిఁ
గలయఁజూచుచు నొక్క గ్రామంబు నందు
కలకటర్ తిమ్మప్పగారినిఁ జూచి
చెలువంద చేతుల చేతులుఁ గలిపి
పొలుపొంద మిముఁజూడ పుణ్యంబు మాకుఁ
గలిగె నటంచును ఘన గుడారమున
పలువిధముల రాచపనులను దీర్చి -
యుండ నా రాతిరి యురుము లాకాశ -
మండలికిని చంద్రమండలిఁ దోఁచె

## పడమటి సీమలో వర్షఋతువు ప్రారంభమగుట:

అంత వర్షాకాల మరుదెంచె నపుడు
వింతగా మేఘము ల్వినువీథిఁగప్పె
వడిగ వీచెను పూర్వవాయు వందంద
పడమర నింద్ర చాపంబునుఁ దోఁచె
మెఱపు లుత్తర దెస మెఱయఁ దొడఁగె
ఉఱుముల ధ్వనులకు నుర్వి కంపించె

ప్రతిరోజులను తూర్పు పడమర సీమ
మితిమీఱి వర్షము ల్మేదినిఁ గురియ
మెండొడ్డి నదులెల్ల మేదినిఁ బాఱె
దండిగా చెఱువు లుద్దండత నిండె
దొరువులు కుంటలు దొడ్డ మడుంగు -
లిరవంద నిండియు నిల పదునయ్యె
పదునైన విడువక పదునైదు దినము -
లదనుగాఁ గురిసియు నంతటఁజూడ
నడయాడు కెంపులునా నొప్పుకరణి
పుడమిపై నారుద్ర పురువులు బడియె
జలముల రొంపులు జగతిని గల్గి
కొలకుల భేకముల్గొయగాఁ దొడఁగె
మెప్పైన పొలముల మేటి కొండలను
తిప్పల పూరి జొత్తిలి పచ్చనయ్యె
కాంతిచే భూముల కలిమి చూపట్టె
శాంతి వహించె విశ్వము సంతసిల్లె

## ఈ వార్త ఉయ్యాలవాడలోని బళ్ళారి కాపులకు తెలియుట:

పడమర సీమయు పదునైన వార్త
లెడపక చారులు ఏతెంచి తెలుప
తమ దేశములకును తారునుఁ బోవ
క్రమముగా బీదలు గములుగాఁ గూడి
ధర్మాత్మునకు మ్రొక్కి దయలఁదాఁ గోర
నిర్మలమతి తోడ నిజదేశములకు
చెలువంద నావేళ సెలవుల వేడ
ఫలపర్చు కాపులు పంక్తిగానిలిచి
కరకమలంబులు కడుభక్తి మోడ్చి
పరమ సంతోషులై పలికి రిట్లనుచు

బళ్ళారి కాపులు తమ ప్రాంతములకు పోవుటకై వేంగళరెడ్డి అనుమతిని గోరుట:

ఓ దయాసాగర! ఓ సత్యభాష!
ఓ ధర్మవ్రత శీల! ఓ సాధు పోష!
సామి పశ్చిమసీమ సమితి నెల్లెడల
భూములు పదునాయె భూరి వర్షముల –
నను వార్త విననయ్యె నటుఁ జేర మాకు
అన విని రెడ్డి మర్యాదచే వారిఁ
గనుగొని యేమేమి కాఁగోరి యిటకుఁ
జనుదెంచి రన్న నిజమ్ముగా ననిరి
ఓ సామి! మా సీమకును మేముఁ జేరఁ
జేసితిమిదె మన్వి చిత్తగించంగ
ప్రార్థనలివె ధర్మప్రభురాయ పుణ్య
సార్థకార్థిచకోరచంద్ర! సెల్విండు

వేంగళరెడ్డి వారికి పశువులను విత్తనములను వ్యవసాయపు పనిముట్లనుం, పదునైదు దినములకు సరిపడు దారిబత్తెములను ఇచ్చి దీవించి సాగనంపుట:

అని పల్క నా కాపు కా ధర్మపరుఁడు
ఘన దయారస మొల్కగా నిట్టులనియె
వినరయ్య! నామాట విశదంబుగాను
పనివిన వ్యవసాయ పనివాండ్రు మీరు
కాల మెవ్వరికైనఁ గడతేర్చుటరుదు
ఫాల లోచనుఁడైన బన్నంబె పడును
ఇటువంటి సామెత లెన్నైనఁ గలవు
ఇటునుండి మీ సీమ కేగితిరేని
శక్తి గల్గిన పనుల్ చేకూరు నండ్రు
రిక్తుల కోరికల్ రెకెత్త వండ్రు

పశువులు లేవని ప్రార్థింప మీకు
పశువులు మఱికొన్ని పనిముట్లు కొండు
ఫలపర్చుటకు మంచి ఫలమిచ్చుటకును
వలయు విత్తనము లవ్వారిగా నిచ్చి
పదియైదు దినముల భత్యమ్ము లివ్వ
ముదమంది బీదలు ముచ్చట లలర
చంటి బిడ్డలఁ దమ చంకల నిడియు
ఇంటి వారల కెల్ల నిలసాగి మ్రొక్కి
ప్రభువు సన్నిధిఁజేరి ప్రణతులు చేయ
అభయంబు లిచ్చియు నాశీర్వదించి
మఱియును కొంద ఱా మహనీయుఁ జేరి
కర కమలంబులు కడుభక్తి మోడ్చి
దండము ల్బెట్టియు దయను ప్రార్థింప
దండి దీవన లిచ్చి తగఁబంపె నంత

## బీదలు గుంపులు గుంపులుగా బళ్ళారికి అడవిమార్గమున పోవుచు దారిలో తాము ఇదివరలో పడిన కఱవుబాధలను తలపోసికొనుట

ఆ రీతి బీదలు నటు బయల్దేరి
ధారుణి వణక మందలు గుంపులయ్యు
నూఱును వేయి వినోదంపు తెగలు
బారులు తీరియు బళ్ళారి దనుక
త్రోవలు గ్రామ సంధులు ఎక్కటిల్లఁ
బోవుచు, కఱవున పాసఁగిన వ్యథలు -
పడి, తల్లికిని పిల్ల పాసిన చోటు -
లడవిని దు ఖంబు లందిన తావు -
లన్నంబు లేకను ఆకులల్మలును
తిన్నచోట్లివియని తిరిగి చూచుచును

వకరికొకరుఁ జెప్పి వడి నవ్వుకొనుచు
కికురులు పెట్టుచు కేడించుకొనుచు
సాలుగాఁ బెరిగిన సాల్చెట్ల నీడ
బాలురు గునగున పరువెత్తుచుండ
తల్లి పిల్లలకు నే తగవులు లేక
అల్లిబిల్లిగ మాటలాడెడి వారు
మఱికొంద ఱాకర్వు మహిమల నెంచి
దరిలేని దుఃఖముల్ తలపోయువారు
ఇలమీద నీ కర్వు నెన్నటికైన
కలలోనఁ దోఁచినఁగాని భయంబె
అని పండ్లు గీటుచు హస్తము ల్సాచి
వనితలు కఱవును వడిఁ దిట్టువారు
పడతిరో! యెంతటి పగవారికైన
పుడమిని నీ కర్వు పొడచూపరాదు
ఈ కర్వుచేఁ గాదె యిండ్లెడఁబాయు -
టీ కర్వుచేఁ గాదె హింసలు బడుట
యీ కర్వుచేఁ గాదె యిల జను ల్కొంద -
ఱాఁకటి కోర్వక నడు నీళ్ళఁ బడిరి
కామధేనువులని గణుతింపఁదగిన
గోవృషభంబులు కొల్లలైపోయె
కన్నెల ముఖపద్మ కాంతి క్షీణించి
వన్నెవాసి యనేటి వైఖరు ల్పాయె
సతిపతు లనియేటి జతలను దప్పి
పతివ్రత ధర్మము ల్భగ్నంబు లయ్యె
చుట్టఱికంబులు చూరునఁ బెట్టి
కట్టడితనములఁ గలహించు టాయె
తల్లి పిల్లలకును తగవులు గల్గు
ఎల్ల దోసము కాది ఈ కర్వుకాదె!
కారణం బైనది కవణంబు లేక
దూరదేశంబులఁ దొలఁగి పోనాయె

ఇలమీద నీ కర్వు నిట్లుఁ బుట్టింపఁ
గలదె శంకరునకు కాసంత ఫలము
అని మూఢ వనితలు నటు లాడుకొనుచు
మన పూర్వకృతమని మది నెంచరైరి

## మఱికొందఱు వేంగళరెడ్డి దాతృత్వమును ప్రశంసించుట

మఱికొందఱును రెడ్డి మన్నన లెల్ల
మఱవక తలఁచుచు మన మెల్లఁ బోయి
ధరణి నుయ్యాలవాడ ధర్మసంస్థాన –
పరుఁడు వేంగళరెడ్డి ప్రభువు సన్నిధిని
బ్రతికితి మాయన భాగ్యంబు లనుచు
అతి మోదమున జను లాడుచుఁ బోవ
అంత సూర్యుండును అస్తాద్రి కేగె
చెంతనె గల యూడ్కిఁ జేరి రా రాత్రి
మఱియు నీ సత్కధ మమత రెట్టింప
కరమొప్పఁ జెప్పితిఁ గనివిని నంత
పరఁగ నీ యెఱగాలి ప్రకరణం బిలను
చిరకాలమును జనసేవ్యమౌగాత!

(ఎఱగాలి ప్రకరణము సంపూర్ణము)

✿ ✿ ✿

## మూడవ ప్రకరణము - భుజభూషణ ప్రకరణవ

శ్రీకర చారిత్ర! శృంగార గాత్ర!
ప్రాకట మునినుత! పరమ పవిత్ర!
అని దేవు నుతియించి యటనుండు నంత
ననుఁ గనుకొని కరణము నిట్లులనియె
ఎఱగాలి ప్రకరణ మెల్లనుఁ దెలిసె
తరువాత జరుగు వృత్తాంత మేమనిన
కరణము కొండయాఖ్యాన్వయ! వినుము
నరనుత! భుజభూషణ ప్రకరణము
వినవయ్య! చెప్పెద విమల వాక్యముల
ఘనమగు పశ్చిమ కఱవుకు వెఱచి
యిరవంద త న్నాశ్రయించిన జనుల
వెఱపెల్లఁబాపి కర్వెళ్ళగా సాఁకి
మఱి వారు వారి సీమలఁ జేరనెంచి
తెరువెళ్ళ తన్ను ప్రార్థించిన వారిఁ
జేరి శుభంబని సెలవిచ్చె నంత
తేరుఁదీసినవిధి తెగలుగాఁ బోవు -
చుండెడి జనములు సొబగుఁగన్పట్ట
దండి తండంబులై తగఁ బోవుచుండె

### ప్యాపలి మార్గములో బళ్ళారిసీమకుపోవు బీదలను ఆంగ్లదొరలు ప్రశ్నించుట:

అటుమీఁద కలకట ర్లాదొర ల్గలసి
పటుతర తేజీలపై నెక్కివారు
కఱవున పనులిచ్చి కాపాడుటకును
మఱవక ప్యాపలి మార్గంబు నందు
సొంపుగా నేతెంచు సురరాజు వలెను
పెంపుగా నెదురేగు బీదల కెల్ల

సరసుఁడు నా కమీషనరు యెల్లీసు
దొరలు ఎదుర్పడి త్రోవను నిలచి
బిరబిరఁ జనుచున్న బీదల నిలిపి
కరమెత్తి భయపడగానేల యనుచు
గ్రద్దనఁ జనుచున్న గమిలోన నొక్క
పెద్దగా నుండిన బీద కిట్లనియె
''తిరిపెంబులా మీరు? దేశద్రిమ్మరులా?
ధరను మీ యుద్యోగ ధర్మంబులెవ్వి?
మీ కులం బెయ్యది? మీ నామ మెద్ది?
మూఁకలై యీ దేశమునకు రానేల?
వినుఁడు ఈ కర్వుకు వెఱచి మీరెల్లఁ
జని విదేశపుయాత్ర సల్పి వచ్చితిరొ?
యెక్కడ బోవుచు నిటకు వచ్చితిరి?
తక్కక మీ రాకఁ దగ దెల్పు 'మనుచు
ప్రియ వాక్యములను సంప్రీతి సంధిల్ల
దయమీఱ బీదల దగ్గఱఁ జేర
బీద లందఱు తమ పిల్లల దించి
మోదంబుచే హస్తములు ముకుళించి
మెల్లన నొక కాపు మిత భాషణముల
యెల్లీసు ప్రభువున కిట్లని పలికె

## పేదలలో ఒక కాపు ఉయ్యాలవాడలోని వేంగళరెడ్డిగారి దాతృత్వమును గూర్చి కమీషనరు యెల్లీసుదొరకు వివరించుట

'ఓ రాజదేవేంద్ర! ఓ దయాసాంద్ర!
మా రాక లెఱిఁగింతు మహాత విచార!
తిరిపెము ల్మాటి దేశద్రిమ్మరు ల్గాము
ధరను దున్ను బ్రదుకు ధర్మంబు మాకు
నా కులంబును పాకనాటి కులంబు
రాకపోకల పేరు రామన యండ్రు

సామి వినుండు ఇచ్చట కర్వు తోఁచి
భూమి పంటలు లేక భుక్తికి లేక
బలు విలుకాని దెబ్బన లేడితుటుము –
వలెఁ బరువారి నెవ్వగఁ జెంది కుంది
రేపు మాపనకను రేనాటి సీమ –
కోపికతోఁ బోవ నుయ్యేలవాడ
ధర్మ సంస్థానంబుఁ దప్పక చేర
కర్మము ల్బాసె వేంగళరెడ్డిఁ జూడ
నిరతాన్నముల నిచ్చి నేర్పు మీఱంగ
కరుణతో నేలె మా కష్టము ల్దీఱ''

ఆ మార్గమునఁ బోవుచున్న ఇతర గుంపులను గూడ దొరలు ప్రశ్నించుట – వారును అదే విధముగా వేంగళరెడ్డిగారి దాతృత్వమును గూర్చి చెప్పుట:

అని చెప్పుచుండిన అంతలోపలను
మునుమున్ను బీదల మూఁక లేతేర
మఱిమఱి నడుగ నెమ్మదిఁ జెప్పుచుండ
విరివియౌ నొక గుంపు వేగంబె నిలువ
వారిని ముందటవలె విచారింప
వారెల్ల ముందటవలెఁ జెప్పుచుండ –
నంతలోపదిగుంపు లరుదెంచి నిలువ
సంతసంబంది విస్మయము తాఁజెంది
ఊరక తేజిపై నూది కూర్చుండి
తూరుపు దెస వచ్చు తుటుములఁ జూచి
వారికి నడ్డమై వసుధేశ్వరుండు
వారల నడుగగా వారును రెడ్డి –
పేరు నుయ్యేలవాడ పేరునుఁ జెప్పి
దారిని బీదలు తగ నిల్చియుండ –
గాఁజూచిఁ బీదలఁగని సంతసించి
రాజ కందర్ప పరాక్ర విక్రముఁడు

## కమీషనరు యెల్లీసుదొర ఆశ్చర్యపడి, వేంగళరెడ్డిగారి కిట్టి గొప్ప దానశక్తి ఎట్లు కలిగెనని కలెక్టరు దొడ్డి తిమ్మప్పగారిని ప్రశ్నించుట

తన మది నటువంటి దాత నెచ్చటను
కని విన లేదని ఘనమైన దృష్టి
కలకటర్ తిమ్మప్పగారినిఁ జూచి
పలికెను యెల్లీసుప్రభు విట్టులనుచు
ఏమి తిమ్మనృపాల! యీయుగమందు
ఈ మహా నాశ్చర్య మిది వింటిమయ్య
ఒక సీమకును క్షామ మొదవిన వేళ
ఒక సీమవా రన్న మొసఁగలే రకట!
ఒక సీమ బీదల కొక రెడ్డిగారు
అకలంకముగ నన్న మతఁడెట్లు పెట్టె?
నమ్ముటకును నొక్కన్యాయంబు గలదు
సమ్మతిగా పెక్కు జనముల నడుగ
తప్పక చెప్ప రందఱు నొక్కరీతి
చెప్పిన మది సంతసం బయ్యె నయ్య
సంసారు లిటువంటి క్షామంబునందు
హింసఁ జూడగలేక నిందఱఁ బ్రోవ -
నలవియే యారెడ్డి కది యెట్టు'' లనుచుఁ
బలికిన యెల్లీసు ప్రభువును జూచి

## కలెక్టరు దొడ్డి తిమ్మప్ప బుడ్డా వేంగళరెడ్డిగారి దాతృత్వమును గుఱించి, ఆయన తమ్ముఁడు ఈశ్వరరెడ్డిగారి గుణగణములను గుఱించి కమీషనరుకు తెలియఁజేయుట

దొడ్డి తిమ్మావనీదొర యిట్టు లనియె
''బుడ్డ వంశాబ్ధి సంపూర్ణ చంద్రుండు
వేంగళరెడ్డి ప్రవీణుఁడౌ నాఁడు
సంగడి మెలఁగెడు సత్య శీలుండు

ఎఱుఁగుదు నాయన నెల్లకాలంబు
సరిమీరు ధనధాన్య సంపదల్గలవు
కలిమి దాన గుణంబుఁగలుగ దెవ్వరికి
కలిమి దాన గుణంబుఁ గలుగు నాతనికి
కలియుగంబున దానకర్ణుఁ డతండు
పొలుపొందె నాయన భూరి సత్కీర్తి
అల చతుర్దశ భువనాది లోకముల
వెలసె పున్నమనాఁటి వెన్నెలసాటి
ధర్మాత్ముఁ డతని నే తగ నెఱుంగుదును
నిర్మల హృదయుండు నీతికోవిదుఁడు
ఇతని సహోదరుం డీశ్వరరెడ్డి
అతి దయాపరమూర్తి ఆర్తరక్షకుఁడు
సంద్ర గంభీరుండు, సౌశీల్య యశుఁడు
ఆంధ్ర హూణాది విద్యాధురంధరుఁడు
ఉభయ భాషల మహోద్యోగ సమ్మిళిత
సభ చర్చనల సమస్యల సాధుయోధ
వినయ విధేయుండు విశద మీ మాట''
అనిపల్కు కల్కట ర్నటు విలోకించి

కమీషనరు యెల్లీసుదొర వేంగళరెడ్డిగారిని చూడఁగోరుట – రెడ్డిగారి వయసు, కులగోత్రములు తెలుపవలసినదిగా కల్లెక్టరును అడుగుట:

చల్లని మాటల సంతసం బలర
యెల్లీసుప్రభు వప్పు డతని కిట్లనియె:
''సుజన! మహాత్మ! ఓ సూరిజనాఢ్య!
నిజముగా నా మది నెంజిలి తీరె
ఆ మహనీయుని ఆ పుణ్యశాలి
నా మహాధర్మాత్ము నా ధనవంతు
నా మహోదయశాలి నార్యసమ్మతుని
ఏమాడ్కి నతని నే నెప్పుడు చూతు''

నని తన మదిలోన నత్యంత ప్రేమ –
జనియించి ఆ కమీషనరు యెల్లీసు –
దొరవారు కలకటర్దొర మోముఁ జూచి
పరమ దయాళుడై పలికె నిట్లనుచు
''తిమ్మ భూవర! మీకు తెలియనిదేమి?
యిమ్ముగా నారెడ్డి కెన్నేండ్ల వయసు?
కులము వంగిసమును గోత్ర సూత్రంబు
వెలయంగ వారింటి విధమెల్ల నాకు
వినగఁ జెప్పు'' మటన్న వీరశేఖరునిఁ
గనుఁగొని తిమ్మభూకాంతుఁడిట్లనియె

## కలెక్టరు, వేంగళరెడ్డిగారి వయసు, కులగోత్రములు కమీషనరుతో చెప్పుట

''వినవయ్య భూనాథ! విశ్వంబునందు
ఘన కాపుకులములు గల వనేకములు
మోటాటి కులము నమోఘ తుల్యుండు
కూటస్థమును 'చెరుకోళ్ళ' గోత్రంబు
వరుస 'మజ్జరి' యింటి వంశంబువారు
దొరలని మోటాటి దొరల బంధుగులు
ముజ్జగంబుల విన మోటాటి యిండ్ల
మజ్జరివారిండ్ల మఱి వన్నెఁదెచ్చె
చెప్పెద నా రెడ్డిశేఖరు వయసు
ఇప్పుడు నలువదేనేండ్ల ప్రాయంబుఁ
గలిగియు సత్యలోక ముదాత్తలీల
నెలమి నుయ్యెలవాడ నేలుచునుండు'' –

## దొరలు వేంగళరెడ్డి గారి విలాసమును, దానగుణము యొక్క గొప్పతనమును గూర్చి పేదలను ప్రశ్నించుట

అన విని యా దొర లానందమునను
ఘన బీదజన మూకఁగని యిట్లనిరి

''ఇటకు నుయ్యేలవాడ యెంత దూరమ్ము?
పటుకీర్తి వెలయు నిప్పటికి తాలూక -
పేరు డిష్ట్రీకటు పేరును నాకు
తోరంపు వేడుకతోఁ జెప్పవలయు
ఆయన ధర్మాత్ముడనుచును దెలిసి -
పోయితిరో? పిలుపొంది పోయితిరొ?
కాకున్న నా సీమగల పంటలెఱిగి
యేకమై తూర్పున కే తెంచినారొ?
యెన్నడైనను కోపమింతైన లేక
అన్నంబు లొసఁగునే అతఁడు నిందాక?
అతఁడె పొమ్మని మిమ్ము నంపెనా? లేక
హిత వొప్ప మీరలే ఏగుదెంచితిరొ?
యెలమి మీరలుపోయి యెన్ని మాసములు
గలరచట? మీరలేగాక మీ సమితి
ఆఁకొన్న వేళల నన్నంబు వేసి
చేకూర పనులేమి చెప్పి చేయించు?
దుర్భిక్ష మొదవియుఁ దొలఁగిపోనపుడు
అర్భకాది జనంబు లాప్తులతోడ
సకుటుంబ పరివార సహితంబుగాను
అకలంకముగ మీర లంద యున్నారె?
మీ దేశములుఁజేర మీకు భత్యమ్ము
లాదిగా దయచేసి యంపెనా? లేక
దేశద్రిమ్మరులయి తిరిపెంబులెత్తి
మీ సీమలనుఁ జేర మీర లొచ్చితిరొ? (మీరు వచ్చితిరొ)
గూని కుంటి కురూపి గ్రుడ్డి యనాథ -
లైనవారికి నెల్ల నన్నంబు లిడునె?
అతని సహోదరుం డా యింటివారు
అతి మోదమున మిమ్ము నాదరించెదరె?
ఇంక విశేషమ్ము లేమియుండినను
కొంకక చెప్పుడీ కుశలంబులెల్ల!''

అనుచుఁ బల్కిన దొర లాబీదలందు
ఘనమగుకాపు నిక్కముగాగఁ బలికె

పేదలలోని ఒక కాపు వేంగళరెడ్డిగారి విలాసమును చెప్పి, ఆయన పశువులను, విత్తనములను, వ్యవసాయపు పనిముట్లను తమకు ఇచ్చి ఆదరించిన రీతిని దొరలకు వివరించుట – తమ తమ ఊళ్ళకుపోయి, తమ సంతానమునకు ఆ పేదలు 'వెంగయ్య' 'వెంగమ్మ' అని పేర్లు పెట్టుకొనుట

జననాథ! వినవయ్య! సత్యమ్ముగాను
మనవిగా వినిఎంతు మఱి విశేషమ్ము
కలిమికి నెలవగు కర్నూలు జిల్ల
కులిశాయుధుని పేట కోవెలకుంట్ల
తాలూకలందు నంతర్భాగమందు
పోలింప ధననాథుపురమనఁ దనరు
పొసఁగ నుయ్యాలవాడ పురముకు మాకు
అసమ త్రోవలు గల్గి ఆమడ ల్పదియు
అచటికి మేమెల్ల నరుదెంచు విధము
సుచరిత్ర! వినిఎంతు సూచనగాను
పరికింప తూరుపు పంటలెఱింగి
విరివిగా కొందఱు వెళ్ళియుండెదరు
ఆయన ధర్మాత్ముఁడని మున్నె మేము
వేయి ముఖంబుల వినియుందుమయ్య!
అన్నదాన వ్రతం బాయన పూని –
యున్న వృత్తాంతంబు నొక యూరఁ దెలిసి
పాయక మేమెల్లఁ బఱతెంచినాము
ఆయన సద్గుణం బాయన కూర్మి
ఆయన ధర్మంబు లాయన నీతు
లాయన యౌదార్య మాయన తాల్మి

యీాపట్ల నుతియింప నెంతటివాఁడ?
కోపంబులేక మక్కువ నన్ను మొసఁగె
జన సమూహము వ్యవసాయ కాపులము
ఘనవర్షములు సీమగల భూములెల్ల
పదునయ్యు మేమెల్ల పరభూములందు
వదలక నిలిచిన వచ్చునే ఫలము ?
అని సెల వడిగిన నా రెడ్డిగారు
ఘన దయారస మొల్కగా మమ్ముఁబంపె
ఇలుబాసి నేఁటికి ఏను మాసములు
కలరింక నచట నిక్కము పెక్కుమంది
ఆ దీనజనమిత్రుఁ డార్తరక్షకుఁడు
బాధించి మాకేమి పనిఁ జెప్పఁడెపుడు
అన్నసత్రంబున కనుకూలమైన
చెన్నుమీఱిన పను ల్సేయుచుండుదుము
ఆ దయశాలి మమ్మందఱఁ బ్రోవ
బాధ లేమియు లేక బ్రతికి వచ్చితిమి
మా దేశములఁ జేర మాకు భత్యమ్ము -
లాదిగా వస్తువు లన్నియు నిచ్చె
గూని కుంటి కురూపి గుంపులనెల్ల
మానక మఱియు నేమఱక తాఁబ్రోఁచు
ఫలపర్చుటకు మంచి ఫలములౌననుచు
వలయు విత్తనము లవ్వారిగా నిచ్చె
పశువులు లేవని ప్రార్థింప మాకు
పశువుల మఱికొన్ని పనిముట్లనిచ్చె
నిక్కంబుగా బీద నివహంబులందు
పెక్కండ్రు జనులకు పెండ్లిండ్లు చేసి
తాళి ముక్కఱలేని తరుణులకెల్ల
తాళిబొట్లాదిగా దయతోడ నొసంగె
కట్ట వస్త్రములేని కాంతల కెల్ల
దిట్టమౌ చీరలఁ దెప్పించి యిచ్చె

జ్వరబాధలున్న తత్క్షణమె వారించు
వర వైద్యులనుఁ బంపి వానిఁ జేయించె
చాకల మంగల సమితి మాకెల్ల
చాకిరి చేయ లెస్సగఁ బంపునయ్య!
కలవు విశేష సంగతు లవి యెంచ
నిల నేర్చకైనను నెన్నంగఁదరమె ''?
అని చెప్పి బీదలు నటు సెలవంది
అనుపమమ్మైన గమ్య స్థానములకుఁ
బోయి సుఖాన కాపురముల నుండ
ఆ యెడ బీదల కటు సంతుగలుగ
'వెంగయ్య' యనుచును 'వెంగమ్మ' యనుచు
పొంగుచు పేళ్ళు పెంపుగఁ బెట్టి వారి
ధర్మాత్ము పేరను తనయులఁ బిలిచి
ధర్మము ల్దప్పక తగనుండిరంత

## వేంగళరెడ్డిగారి గొప్ప దాతృత్వము కలెక్టరుద్వారా గవర్నరుకు, గవర్నరు ద్వారా విక్టోరియా మహారాణికి తెలియుట – రాణి సంతసించి రెడ్డిగారికి బంగారు పతకమును పంపుట

అంత కమీషనర్ అను మహారాజు
స్వాంత పూర్ణానంద సంతోషమునను
బీదల మాటల ప్రేమల వినుచు
నాదరంబుగ సెల వందఱ కొసఁగి
జనులు వేంగళరెడ్డి సముఖంబునందు
ఘనముగా బ్రతికిన కారణంబెల్ల
ప్యాపలి దొడ్డితిమ్మావనీనాథుఁ
డాఫీసునకుఁ బోయి యా చరిత్రమ్ము
బంగారు వన్నియ పత్రిక మీఁద
శృంగారముగ నోటు శీఘ్రంబె వ్రాసి

గౌనరుమెంటుకు క్రమముగాఁదెలుప
గౌనర్లు నది చూచి కడు సంతసించి
వర యిండియాచక్రవర్తి విక్టోర్యా
స్థిరనామ మహారాణి దేవిగారికిని
కరమర్థిఁబనుప నా కంజదళాక్షి
పరమ సంతోషియై పరికించి నోటు
చారుతరంబుగా సభయెల్ల వినఁగ
ధారుణి నతని యౌదార్యంబు నెంచఁ
దరమా? యటంచును దనమది మెచ్చి
మఱియును సంతోషమంది యిట్లనియె:
''హిందురాష్ట్రంబున నింతటి దాత –
లెందైనఁ గలరని యెఱిఁగియున్నారె? –
ఒక సీమకును క్షామ మొదవిన జనుల –
కొకసీమవా రన్న మొసఁగలే రకట!
ఒక సీమ బీదల కొక రెడ్డిగారు
అకలంకముగ నన్న మతఁ డెట్లు పెట్టె ?
పేదల పాలిటి పెన్నిధానంబు
సాధురక్షిత ధర్మసంస్థానమునకు
మోదించి ఆయన ముచ్చట మీఱ
మా దొరతనమున మరియాద కలుగ
సృష్టి నీతని ధర్మశీలత్వమునకు
శ్రేష్ఠమౌబహుమతి సేయదలంచి
అచ్చటి గౌనర్లు అచ్చటి దొరలు
అచ్చటి సభవార లందఱుఁ గలసి
పదియెన్మనూట నర్వదియాఱు వర్ష –
మొదవిన క్షామంబు కొక సీమ జనుల
నరయ నిరాధారులైన బీదలకు
ధరణి నుత్కృష్ట మౌదార్య మొనర్చు
దొడ్డ ధనేశు డర్థులపాలి దాత
బుడ్డ వేంగళరెడ్డి భూరి కీర్తికిని

లలిత హర్మెజ స్త్రీ రాణి సర్కారు
ఇల శ్రేష్ఠగణ్యత కీ యానవాలు'
తేటయౌ ఇంగ్లీషు, తెలుగు వర్ణముల
పాటించి చెక్కడ పనుల లిఖించి
బహుమతిఁ బనుప నా బంగారు బిరుదు
సహజంబు నిది భుజస్థాన భూషణము
వరపు పంద్రెండవ వన్నియమించి
పరగి మధ్యందిన భాస్కరు పగిది
వెలుగొందు బిరుదుడాల్వెలయు కిన్వాణి –
గల మెత్తలోనుంచి కమ్మ వాసనల
తారుపులో బిళ్ళ తగ నిమిడించి
తారుపు వెంటను తగిన పేపర్లు
బిళ్ళపై యంశము ల్పెట్టి లిఖించి
బిళ్ళయు పేపర్లు పెట్టియ నునిచి
తగు చెన్నపురి రాజధానికిఁ బనుప
సొగసగు బిరుదును జూచి గౌర్నర్లు
ప్యాపలి దొడ్డ తిమ్మావనీనాధు
ఆఫీసునకుఁ బన్ప నాయధికారి
బహుమతిఁ గన్నుల బాగుగానొత్తి
బహుగ సంతోషించి భళిభళీ యనుచు
వర్తమానము రెడ్డివారికి వ్రాయ

## వేంగళరెడ్డిగారు కల్లెక్టరు ఆఫీసుకు వచ్చి, బహుమానమును గ్రహించుట

కీర్తులు ముఖచంద్రు కిరణము ల్వెలయఁ
జదివి యానందించి సత్యశీలుండు
ముదమంది ప్యాపలిప్రోలును జేర
కరమర్ధి రధము శృంగారంబుఁ జేసి
తురగము లూన్చి సూతుఁడు తెచ్చి నిలుప

వర వస్త్ర శృంగారవంతుఁడై వచ్చి
దరహాస చంద్రిక ల్దవ్వుల వెలుఁగ
రథమెక్కి నలుగడ రౌతులు గొలువ
పథితులై కొందఱు పరువెత్తుచుండ
చెలువంద భటపంక్తి చేరి నుతింప
పొలుపొంద ప్యాపలిపురముఁ దాఁజేరె.
అంత కల్లక్టర్లు అఖిలాధిపతులు
వింతగా సభగూడి విస్తార దయను
రసికత్వముగ సర్వ లక్షణములను
పొసఁగ వేంగళరెడ్డి భూరి ధర్మునకు
మరియాదలను బహుమతినివ్వ రెడ్డి
ధరియింప నధికార్ల దయలను వేడి
నిజ కుడిభుజమున నీతిగా రెడ్డి
భుజకీర్తినుంచ నేర్పున సెలవంది
అచటఁ దోఁచినయట్టి అతిథులకెల్ల
అచలుఁడై ధర్మంబులను నందఁజేసి
హయములఁ బూంచిన యరదంబునెక్కి
రయమునఁ గదలేటి రథము వెన్వెంట
పరువెత్తి వచ్చెడి బహుబీదజనుల –
కిరుహస్తములను సాగిలి దానమిచ్చి
నిలునిలుండిక మీర లిచ్చట ననుచు
చెలువంపు దయను దాఁ జేయెత్తి చెప్పి
ధరణి నుయ్యాలవాడ ధర్మసంస్థాన –
పురమును జేరి నేర్పుననుండి తారు

వేంగళరెడ్డిగారి గౌరవము ఇనుమడించుట – ఆయనను చూచుటకై కమీషనరు యెల్లీసుదొర, ఇంజనీరు మోపరల్లి, కల్లెక్టరు తిమ్మప్ప వచ్చుట:

సలిలి తాలోచన సభఁ జేరునపుడు
తలఁపగా ధర్మకర్తగఁ బోవునపుడు

గొనరు మెంటులోగల దొరల్మెచ్చి
మానితంబగు దొడ్డ మర్యాదలంది
కలస కుర్చీలపై గౌరవం బలర
కొలువయ్యె దొరల బల్మోరిమి కలిగి
రాచకార్యము లనురక్తి యోచించి
వాచవులూరగా వలయు మాతాడి
గంటయు నరగంట కాలంబునందు
ఇంటికి నేతెంచు నిట్టి మర్యాద -
లనుపమ కీర్తి మండలు డయ్యె యున్న
ఘనత వేంగళరెడ్డిగారిని జూడ
సరవిశాంత్రి కమీషనరు యెల్లీసు -
దొరయును ఇంజనీర్దొర మోపరల్లి
కలకటర్ తిమ్మప్పగారిని గలస
చెలువంద నపుడు తేజీలపై నెక్కి
ప్యాపలిప్రోలు రేపటివేళ వెడలి
యేపార తురగము ల్వెస నడిపింప
వాయువేగంబుల వడిగ బర్వెత్తఁ
బాయక చిరువెళ్ళపట్నంబుఁ జేరి
అపుడు పథశ్రమం బల్లనఁ బాయ
కాఫీ జలంబులఁ గ్రమ్మరఁ ద్రావి
రయ్యమౌ తమ గుడారంబులఁ దాము
సౌమ్య మనస్కులై సంతుష్టు లగుచు
రెడ్డిగారికి శుభలేఖను బనుప
రెడ్డి యా లేఖను రెక్కొనఁ జదివి
సంతోష చిత్తుఁడై సరగున లేచి
అంత పురముఁ జేరి ఆర్యారు నిష్క -
ముల సంచి చేపట్టి మోదంబు తోడ
వలనొప్ప శృంగారవనమును జేరి
పాల సున్నపు గచ్చు బంగ్లాల యందు
మేలైన పరుపులు మేటి కుర్చీలు

ప్రాబల్య గ్రంథము ల్బహుపురాణములు
బైబిలు వేదంబు బాగుగా నుంచి
పాలును చక్కెర ల్పసిడి గిండియలఁ
గ్రోలెడి కాఫీయు గొనబు తేయాకు
భుజియించు వస్తువు ల్పొందిక పఱచి
సుజనుండు దొర రాకఁ జూపెట్టియుండ
దొరలు ప్రయాణమై తురగంబులెక్కి
చిరువెళ్ళ ప్రోలును శీఘ్రంబె వెడలి
ధరణి నుయ్యాలవాడ ధర్మసంస్థాన
పురవనీ బంగ్లాను పొందుగాఁ జేరు -

## వేంగళరెడ్డిగారు దొరలకు విందొనరించుట - వారు రెడ్డిని దీవించి వెడలుట:

నంత వేంగళరెడ్డి యా దొరలకును
సంతసంబున నెదుర్జని తోడితెచ్చి
శృంగారమగు మందిరముజేర్చినంత
పొంగుచు స్నాన మింపుగఁ దీర్చివారు
వలయు పదార్థము ల్వాచవు లూర
పలువిధ రుచులను భక్షణల్జేసి
పలువిధమగు వన్నెపాన్పుల పైని
చెలువందఁ గూర్చుండ శ్రీలునుపొంగ
విరిహారములు మెడవేసి కస్తూరి
పరిమళ ద్రవ్యము ల్పాన్పుపై నుంచి
యిరువుర దొరలతో నిష్టముల్దీర
సరవితో సద్గోష్ఠి సల్పి కొన్నాళ్ళు
జరిగిన పిదప నా జననాయకులును
కరమొప్పగా రెడ్డిగారి కిట్లనిరి:
''ఓ రెడ్డికులభోజ! ఓ రవితేజ!
ధారుణిపై మీరు ధర్మాత్ములనుచు

మిముఁ గోరి చూడ మేము వచ్చితిమి
మము నుపేక్షింపక మఱి సెలవిండు
నెనరుంచి మా మీఁద నెల కొక్కసారి
అనువంద శుభలేఖలంపి క్షేమంబు
లరసకొనుం డని యా దొర ల్బలుక
కరముల కరములు కడువడిఁజేర్చి
దయయుంచుడని రెడ్డిదండముల్పెట్టి
జయము మీ కగు శుభోజ్జయము మీ కనుచు
మండలాధీశులు మఱి ప్రేమమీఱ
దండి దీవనలిచ్చి తగబోయిరంత
మఱియు నీ సత్కథ మమత రెట్టింప
కరమొప్పఁ జెప్పితిఁ గనివిని నంత
పరగ నీ భుజబంధ ప్రకరణ మిలను
చిరకాలమును జనసేవ్యమౌగాత!

(భుజభూషణ ప్రకరణము సంపూర్ణము)

✿ ✿ ✿

వింటిమి కర్ణుపేరు మును వీనుల విందుగ, వాని దానముల్
వింటిమి భారతంబు వినిపింపగఁ బండితులెన్ని మాఱులో,
కంటిమి నిన్ను నేఁడిచట కన్నుల పండువుగాగ, ధన్యతన్
గంటిమి ధర్మరూప! నవకర్ణుడ! వేంగళరెడ్డి నాయకా!

క్షామమునం దితండు తన జాతికిఁ జూపిన యాదరంబునున్
ప్రేమను మెచ్చి రాణి కడుఁప్రీతిని బంపెను శేరు తూకమై
హేమమయంబునౌ పతక, మింకను రూప్యము లేదువేలు, నీ
కోమల సుస్వభావునకు కొంచెపు కాన్కగ నానవాలుగన్

- శ్రీ అందలం కృష్ణమూర్తి ('మహాదాత' కావ్యము నుండి)

## నాలుగవ ప్రకరణము - ధాత ప్రకరణము

శ్రీ జగత్కల్యాణ! చిర కృపాభరణ!
రాజీవచరణ! బలాహక స్ఫురణ!
అని దేవ ప్రణతుండనై యుండునంత
నను గనుగొని కరణము నిట్టులనియె
వాసికెక్కిన బుడ్డ వంశ పావనుని
భాసుర సత్కథ ప్రకటనగాను
పటుతర సత్యసంపన్న భూషితుడు
చెటుల పరాక్రమ సంపూడౌ ధైర్య -
శాలి వేంగళరెడ్డి సత్కథయందు
లీలతో భుజబంధ రీతులు విన్న
తరువాత నవలి వృత్తాంత మే మనిన
పరమ మిత్రమ! విను పై కథ నిటను
అమల మనీషుడౌ ఆ పుణ్యవ్రతుడు
సమబుద్ధి ధర్మశాస్త్రంబులు వినుచు
లలిత సుభిక్ష కాలంబుల యందు
ఫలిపర్చు ధాన్యంబు పాతఱ ల్చేర్చి
భత్యము ల్లేనట్టి బహు బీదలకును
నిత్య సదావృత్తి నేర్పుతో నిచ్చు -
చుండ, పండ్రెండేండ్ల కుత్కృష్ట కఱవు
దండిగా నేతెంచె ధాతవత్సరము

## పండ్రెండేండ్ల తరువాత ధాత కఱవు వచ్చుట

శని మీనరాశికి జాటి అందఱను
కనికరమ్మును లేక గాసి యొనర్పు -
బూని, కార్తుల చిన్కు భూమిని బడక
మానితంబగు యోగ మార్గము ల్దప్పె

మింట నెప్పుడు చూడ మేఘము ల్గప్పి
పంట వెలందులు పదును కావాయె
అదను తప్పియు విశాఖాంతంబుఁ జొచ్చి
తుదకు పాత్రల్గ మెత్తులు తీయరైరి
గో వృషభంబులకును మేతలేక
ఆవృతమై పడి అల్లాడుచుండె
మానక రూపాయ మఱి కొనిపోవ
మానెడు ధాన్యంబు మహిఁజూపరైరి
తల్లికి నన్న మింతయు లేక కన్న
పిల్లలఁ ద్రోవలఁ బెట్టి పోనాయె
మునుపె గోర్చుట్టు పై ముసలంబు పోటు -
లనునట్లు మారికావ్యాధులు కలిగె
ఎంచనేటికి కర్వు ఏతెంచి నపుడె
పంచబాణుని బాధ పడుపాటులాయె
దిక్కులునెల్ల విదిక్కులై నటుల
నెక్కడఁ బోజాల కేమి తోఁచకను
పట్టణాలాదిగా పల్లెల జనులు
పట్టెడన్నముఁ బెట్టి పాలింపుమనుచు
కష్టము ల్బడుచు నాఁకలి కోర్వలేక
శ్రేష్ఠంబుగా నుతుల్సేయ నా రెడ్డి

## పేదలను ఆదరించుటకు వేంగళరెడ్డి తనకడ ధాన్యము తక్కువగా నుండుటచే ఇంటిలోని వెండి పాత్రలను బంగారు పాత్రలను అమ్మివేయుట

పెక్కండ్రు జనులకు ప్రేమ నన్నంబు
తక్కువ కానీక ధర్మంబొనర్ప
తనయింట ధాన్యంబు తక్కువైయుండ
ఘనధైర్యశాలి వేంగళరెడ్డి మదిని -

తలపోసి జనుల నందఱం దిలకించి
పలికెను నెనరుంచి పరమ పావనుఁడు
క్షామ కాలమ్ము నిశ్చయముగా వచ్చె
ఏమిసేయుదు నింక ఈశ్వరాజ్ఞకును
పశువులకును మేఁత బంగార మాయె
డసి లేవలేక ఏడకుఁ బోవలేవు
వానకాలముఁ బోయె వడి చలి వీచె
గొనరులకు దయ కల్గు నందాక
వాకిటి పంచల వదలక నిలిచి
ఆఁకలిగొను వార లందఱువిడిచి
యీరేడు జగముల నైనందైనఁ గాని
కోరి భుజించు మూర్ఖుండును లేడు
ఏను భుజించుట ఇది నీతికాదు
దీనుల పాలిటి దిక్కైన వాఁడు
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడు
నిఖిలంబు పాలించు నేర్పరి యుండ
దిగులేల యని మదిఁ దెలియంగఁజూచి
తెగువతో తన యాస్తి తృణమని యెంచి
చిత్రపు పనులను జేసిన వెండి –
పాత్రలు బంగరుపాత్రలాదిగను
కలిగిన వెల్లను క్రయమున కిచ్చి
వెలయు బీదలఁ బ్రోవ విహితమటంచు
గ్రక్కున నపుడు విక్రయమున కివ్వ
రొక్కమార్వేలపై రూపాయ లయ్యె
అవిగొనె ధాన్యంబు లవలీలఁ దెచ్చి
సువిచారుడై జనస్తోమంబునకును
భువి నెన్న వంటకములను జేయించి
ఆవిరళముగఁ బ్రోచు నన్నను జూచి
యెలమి నింటను బనులెల్లఁ జేయించి
చెలియలు తిమ్మమ చేరి యిట్లనియె

## రెడ్డి చెల్లెలు తిమ్మమ్మ తన ఆభరణముల నిచ్చుట – అది చూచి రెడ్డి భార్యలిద్దఱును తమతమ ఆభరణములు అనేకములు ఇచ్చివేయుట

అన్నయ్య నెలనాళ్ళ కా చక్రవర్తు
లన్నవస్త్రములుంచి యాదరించెదరు
ఇలమీద బీదలనిన్నాళ్ళు బ్రోచి
నెలనాళ్ళ కన్నంబు నెఱవేర్చుటకును
మఱి పరవుపకార మహా ధర్మమునకు
కొఱంతేల? ధాన్యంబుఁ గొనుము నీ వనుచు
తొలఁగక బంగారు తొడవులుఁ దీసి
పలుమాఱు నివి శివార్పణమని యిచ్చె
ఇచ్చినఁ గని రెడ్డి యిరువురు సతులు
అచ్చెరు వందియు నాత్మల నలరి
సవతు లిద్దఱు నొక్క చక్కట నిలిచి
సువినీతిఁ దలపోసి సుదతులిట్లనిరి
'తిమ్మమగారు సత్కీర్తి వెలుంగ
సొమ్ములన్నియుఁ దీసి సుమతియై మంచి –
ధాన్యంబుఁ దెచ్చి బీదల కన్నమిచ్చి
మాన్యుఁడ వగుమని మఱిఁ సొమ్ములెల్ల
తమ యన్నచేతికి దయమీఱ నిచ్చి
సుమహిత ధర్మము ల్సొంపుగాఁ దెల్పె
ఆయమ ధర్మంబు లాయమఁనీతు –
లాయమ పుణ్యంబు లామెకుఁ గాక
మన కేల గలుగు మహికీర్తు'' లంచు
మనమున పుణ్యము ల్మఱి తలపోసి
ఆర్య పోషణుడగు నా రెడ్డి కడకు
భార్యలిద్దఱు వచ్చి భక్తిచే నిలిచి
పతిని మానసమున పరమాత్ముఁడనుచు
వ్రతములు సల్పు సువ్రత లిట్టులనిరి

''మా పాలిదైవంబ! మా నోముపంట!
మా పెన్నిధానంబ! మా భాగ్యరాశి!
మా పున్నెముల మూట! మా పట్టఁగొమ్మ!
మా ప్రాణవల్లభ! మా హృదయేశ!
మాకుఁ దోఁచిన యట్టి మనవిఁ జేసెదము
మీకును దెలియు నా మీఁదను ఇపుడు
జోడు భార్యల మీఁది సొమ్ముఁగైకొనక
తోడఁబుట్టిన వారి తొడవులఁ గొనుట
చూడ నెప్పటికైన చుల్కనఁజూతు -
రాఁడు బిడ్డల సొమ్ము లంటగారాదు
తిమ్మమ సొమ్ములా తిమ్మమ కొసఁగి
ఇమ్మహి సత్కీర్తు లివిగాక వినుఁడు
పతిమానసమ్ము నేర్పడఁ గాననట్టి
సతులున్నఁ గలదేమి సౌఖ్యమ్ము పతికి?
మగవారలకునెల్ల మాత దైవంబు
తగ పతివ్రతలకు ధవుఁడె దైవంబు
పతియె దైవంబని భావించునట్టి
సతులకు గల్గును స్వర్గఫలంబు
సతి పతివ్రతయునై సద్గుణియైన
పతికి భూలోక స్వర్పతినామ మలరు
అనుచు మా తలిదండ్రు లాజ్ఞలు గలవు
ఘనముగా మా మాటఁ గైకొంటిరేని
తలఁపగా షోడశ దానంబులందు
ఇల నన్న దానంబు లెక్కువటండ్రు
మా మనంబులఁగల మక్కువ లివియె
మా మీఁది తొడవులు మఱి కొనుఁ'' డనుచు
కార్యముల్నెఱ వేఱ ఘనత రంజిల్ల
ధైర్యముల్ ప్రకటించి ధర్మ మార్గమున
సంతోషమున పతి సాన్నిధ్యమునకు
వింతయౌ మఱి గొప్ప వెలగలయట్టి

ముత్యాల కమ్మలు ముద్దు నత్తులును
అత్యంతమగు గళహార పట్టెడలు
జోమాల బుగడలు సొగసు బయ్యండ్లు
ప్రేమించు సరిపెణల్ పెద్దకంటియలు
పౌజుల కమ్మలు పసిఁడి యడిగెలు
బాజుబందులు కానుబావిరీల్ జడలు
కత్తెర బావిరీ ల్కంకణంబులును
మెత్తని బంగారు మేటి ముర్వులును
చిలుకల కమ్మలు చిఱుత కంటియలు
పొలుపొంద గోధుమపూసల సరులు
చామపూ ల్కడియాలు చౌకడీ ల్జతలు
ప్రేమ పల్లెరపూలు బిల్లలడాబు
జడసౌరు మఱి సూర్య చంద్ర వంకలును
మెడల తీగెల జోళ్ళు మేటి బుగండ్లు
ఊకెణు ల్గెదఁగి ఊకుపాపెటలు
గాకక పాణులు గఱిమ కుతుకంట్లు
తగు చిల్కతాళు లుత్తండాల జోళ్ళు
సొగసు బన్నసరాలు సొక్కమౌ పసిఁడి
సంది బొందియలును సరస తాయెతులు
అందమౌ చిఱుగజ్జె లందియ ల్మఱియు
కాళ్ళ కడియాలు బంగారుంగరములు
తాళి ముక్కఱ మెట్టెఁ దప్పఁదక్కినవి
మనసు త్రికరణ సమ్మతిగాను పతికి
వినయమ్ములను మది వేడ్కలింపార
పతి మానసముఁ గని పణతు లిద్దఱును
కొంతు కేమిలేక మక్కువ తోడ నపుడు
తొడవులుఁ దీసి సంతోషులై యివ్వ
కడు సంతసించి వేంగళరెడ్డిగారు
సతులు జేసినయట్టి సాహాయ్యమునకు
మతిమంతులని తన మదియందు మెచ్చి

తన ముద్దు భార్య లంతట నిల్వఁజూచి
మనసు నెంజిలి తీర మఱి యిట్టులనియె:

## వేంగళరెడ్డి తన భార్యల ఔదార్యమును ప్రశంసించుట – భార్యల ఆభరణముల నమ్మి ధాన్యమునుకొని పేదలను పోషించుట:

''ఓ పుణ్యవతులార! ఓ సాధ్వులార!
పాపపుణ్యంబులు పరికించి మీరు
కోపంబు లేక మక్కువ నిచ్చు కాసు
ప్రాపింప నది కోటి పసిఁడి నిష్కములు
అలుకచే నిచ్చిన అర్థ మెంతైన
పొలుపొంద నొకకాసుఁ బోలదు సుమ్మి!''
అని పల్కు విభుపల్కు లమృతంబులొల్క
విని చిఱునవ్వు నవ్విన భార్య లరుగు –
డని పల్కి సతులకు నటు సెలవిచ్చి
అనుపంద రవణంబు లటుఁ గొనిపోయి
క్రయమునకివ్వ పైకంబెల్ల యుతము
అయినట్టి గాడి రూప్యములకుఁ దగిన
ధాన్యము ల్సంబార తతులఁ దెప్పింప
ధన్యుఁడౌ ఆ యన్నదాత తా బండ్లు –
గట్టించి పంప సక్రమత రావించి
నెట్టుగా తా నేర్పరించిన యట్టి
వంటశాలలయందు వైపుగా నించి
వంటకంబులు బీదవారికి నెల్ల
సువిచారముగఁ బెట్టుచో నంతనెలకు
భువియందు పేదలపుణ్యంబు కతన

## విక్టోరియామహారాణి దక్షిణ హిందూస్థానమంతటను కఱవును నివారించు చర్యలఁ గైకొనుట:

సకలధర్మచరిత్ర సజ్జనమిత్ర
(అకలంక మానస ఆర్తశరణ్య)

వర యిండియా చక్రవర్తి విక్టోర్య
స్థిరనామ మహరాణిదేవి సర్కారు
దివ్యకారుణ్యార్ద్ర దృష్టియుఁగల్గి
ద్రవ్యముల్బంచి యందఱనుఁ బాలింపఁ
దలఁచి దక్షిణ హిందుతాన మెల్లెడల
ఫలమేమిలేక నిష్ఫలమయ్యె నింత –
కఱవు లే భూములఁగలవె యెందైన
కఱవు గల్గెను నవగ్రహగతి నెంచి
వెలయ నా విష్ణు పృథ్విపతి యనెడు –
పలుకు ధర్మంబు నే పాలింతు ననుచు
అక్షౌహిణుల నిష్క మాయెడఁ బనుప
దక్షిణ హైందవ స్థానమండలిని
కనకవర్షము ధాత్రిఁ గప్పెనోయనఁగ
ధనధాన్యరాసుల దండిగాఁబనిచి
అక్షరాభ్యాసంబు లనువంద నేర్పి
పక్షపాతములేని ప్రౌఢలకెల్ల
పనులను ఇచ్చి అపారమౌ బీద –
జనుల కన్న మొసంగె సంతృప్తిగాను
బాలవృద్ధాంధులు పరువెత్తి చేతి –
కోలలూదను మిట్ట గుంట లేకుండ
కోరిన చోటులకును రానుపోను
ధారుణీతలము నంతయుఁ దప్పకుండ
రోడ్డు లేర్పఱచె నీ లోకపావనికి
ఈడైన సర్కారు లిహమందుఁగలరె?
వేడుకలై తోఁచె వ్యధలెల్లఁబాసె
పోడిమి సర్కారు పుణ్యంబు కతన
ఇలజను లీకర్వు లీడేరు టెల్ల
పులియు లేడిని నాకి పోయి నట్లాయె
అని కొందఱీమాట లాడుచునుండ
జనులలో కొందఱప్పుట నిట్లులనిరి

## ప్రజలు విక్టోరియామహారాణిని ప్రశంసించుట

''వెలయంగ కృష్ణ కావేరుల జలము -
లిలమీఁద కాల్వలై యిష్టమైనట్లు
వరిపైరులాదిగా వలయు పంటలకు
ఇరవుగాఁ జేయించె నీ మహామాత
యెద్దులు గుఱ్ఱము లేమి కట్టకను
పద్దుగా పొగబండి పరువెత్త భూమి
నొకనెల పైనంబు లొక గంట లోను
సకలదేశపు యాత్ర సలుపఁజూచితిమి
మఱియును తంతి సమాచార మహిమ
అరయ మనోవేగ మందు రీ జగతి
ఇదియునుగాకను ఇలమీఁద మనకు
సదమలమగు నన్నశాల లేర్పఱచి
గూని కుంటి కురూపి గ్రుడ్డి యనాధ
దీనుల కన్నంబు తిరకాల మిచ్చె
సలలితమగు వైద్యశాలలు పార -
శాల లేర్పఱిచియుఁ జదువు లబ్బించె''
అని యిట్లు వేనోళ్ళ నఖిల జనాళి
కొనియాడి వాన రాగోరుచు నుండి
తరువాత వర్ష సుధారసంబులను
సర్వ భూమండలి స్థలి పదునయ్యె
పెను పైరులయ్యె దుర్భిక్షంబు లణఁగె
దినముల నేటేట స్థితు లేరుపడియె

## హేవిళంబి కఱవు వచ్చుట -
## విక్టోరియామహారాణి మఱల పేదలను ఆదరించుట

ఇటులుండ నిరువది యేండ్లకు నొక్క
కటువును దోఁచె సంకటముల నెంచ

ధాతవత్సరముకుఁ దమ్ముఁడన్మాడ్కి
ఆ తీరు హేవిళంబను కర్వుఁదోఁచె
శ్రీ మహారాణి యాశ్రితకల్పకంబు
సోమసన్నిభముఖి సువ్రత చరిత
ఆ వీరపత్నియు నా లోకమాత
భావించి మునుపటి పద్ధతిగాను
అన్నసత్రములుంచి యాపదల్దీర్చి
ఎన్నంగ ద్రవ్యంబు లిచ్చి పాలించె
మఱి వస్త్రహీనుల మమత రప్పించి
వర వస్త్రభూషణ వాంఛలుఁదీర్చు
సరవితోడుత రాణి సర్కారుగారి
చెరితమ్ము జనులిట్లుఁ జెప్పుచునుండ
పనుపడి నూఱేండ్లు బ్రతికిన జనులు
మునుపటి రాజుల ముచ్చటలెల్ల
తలపోసి మది నొచ్చి తగ నుస్సు రనుచు
పలుమాఱు నీరీతిఁ బలికి రెల్లెడల

## దేశప్రజలు విక్టోరియామహారాణి పాలనను పూర్వరాజుల పాలనతో పోల్చుకొనుట

మహారాష్ట్ర పతులు శ్రీమంతులై వెలసి
బహు పరాక్రమములఁ బ్రబలి యనేక
పరగణాలను దోఁచి పతివ్రతాంగనల –
చెఱగొనిరని మున్ను చెప్పగా వినమె
తమ జాతి వారికి తగు పను లిచ్చి
తమ దేశముల వారి తామె పాలించి
కుటిలురై జనులను క్రూరకృత్యముల
కటకటపఱచిరి కరుణయు లేక
చెలువంద ధర్మముల్ చేసి రాలేదొ
యిలను వారి చరిత్ర మిటువలె నుండె

మైసూరు రాష్ట్రపు మహారాజుగారు
భూసురావళికెల్ల భూరిదానంబుఁ
జేసి ప్రతిష్ఠలఁ జెందిరే కాని
వాసిగా చరితము వ్రాయంగలేదు
దక్కను కెల్లను దలకట్టు నాగ
ఎక్కువ భూముల నేలు నిజాము -
ప్రభువులు ధర్మము ల్పాలించి నటుల
సభల ప్రఖ్యాతిగాఁ జదువుచున్నారు
మునుపటివారిలో మొగలాయివారు
ఘన కీర్తిశాలి యగ్బరు చక్రవర్తి
చెఱువులు కుంటలు క్షేత్రదానములు
కరుణచేఁ జేయించి కాపాడెనంద్రు
కఱవాదిగాఁగల కాలంబులందు
తఱచుగా నన్నసత్రమ్ముల నుఱిచి
మతభేదములు లేక మమతచే జనులఁ
జతురత నేలఁ డా చక్రవర్తియును
సరవిని తా మేలు సకల రాష్ట్రముల
ధర నెన్నొ చదువులు తామె నేర్పించి
కొలువుల నిచ్చియు కోరిన యటుల
వలయు జీతమ్ము లవ్వారిగా నిచ్చి -
రని చరిత్రముఁ జెప్ప రా రాజు కీర్తి
వినుతింపఁబడె నది విస్తార సభల

## మైసూరు నేలిన హైదరాలీని కవి ప్రశంసించుట

మఱియును కోలారు మానిత వీటి
ధరయందు నూతన దౌలతుఁజేయ
నరయ తురుష్క కులాగ్ర గణ్యుండు
పరమాత్ము నంశను ప్రబలియు 'హైద -
రలి యను నూతన రాజ్యాధిపతియు
అల మహారాష్ట్ర రాయల కంటి నెరసు

ఖలు క్రూర జారుల కంఠ రజ్జువును
పలుమాఱు రాచతిప్పలపాలి పిడుగు
పగరకు గాలమై ప్రబలి యనేక –
తెగల రాజులఁ బట్టి తెచ్చి బంధించిఁ
మైసూరు రాజుకు మదిసంతసింప
వాసికెక్కు మరాటి వారిని దరిమి
వేంకట రమణ కావేరికి నడుమ
పొంకమౌ లంకను పురము నిర్మించి
వినుము త్రిమూర్తు లవ్వీడు జయింపఁ
గనలేరు కోటనగా నశక్యంబు
శ్రీరంగ దేవుండుఁ జేరి యా కోట
శ్రీ రంగపట్నంబుచే నామ మలరె
అతఁడు కేవల మనుజుఁడనరాదు మఱియు
నతఁ డాది విష్ణువు నంశోద్భవుండు
కోట లేబదిరెండు కొట్టి జయించి
పాటించి యందులో బలములఁజేర్చి
పొలుపొంద జనుల తప్పులు రాజకనుల –
కలవడు దైవయోగంబున మఱియుఁ
గావున నారాజు కరిన మానసుఁడు
నే వినుపించెద నిజముగా వినుఁడు
బలిమి చలమ్ముల పణతులఁగవయు –
ఖలులను శిరముల ఖండింపఁజేయు
కలుఁ ద్రావు వాని దొంగను కాలుచేయి
చెలువంద కత్తుల ఛేదింపఁజేయు
నా రాజు పాలించు నవనిపై కొండె –
మారూఢిఁ బలుక ముక్కణచి కోయుదురు
జారిణి వనితల చలమునఁదలయు
వారక కనుబొమ ల్వడి గొరిగించి
పరల చల్లడము కంబడి చింపి పైఁట –
నిరికింపఁజేతురు నిల మనుగడకు

నరయ కుంటి కురూపి యంధుల కెల్ల
మఱువక పనులిచ్చి మఱియు నేలుదురు
పగఁబట్టి చంపిన బలవంతునైన
దిగులొందగాఁ దలఁద్రుంపగాఁజేయు
ధరనెన్న బాకి పత్రమ్ముల మీఁద
హరిహరాదులు సాక్షియని వ్రాతు రవని
బహదర్దురాయికి పాఱెడి పాము
బహదరాజ్ఞను విన్న పాఱెడి జలము
నిలచి పారవటంచు నిజముగా మేము
అలనాఁటి వార లిట్లాడగాఁ బడిరి
కూరిమి నౌకర్లకును ఇచ్చుమీఱఁ
దొరపు వేడుకతో జీత మొసఁగు
వెలయంగ కృష్ణ కావేరుల నడుమఁ
గల భూములను దామె కైకొని యేలుఁ
గావున కఱవు లేకాలమందైన –
రావు, వచ్చిన మఱి రాజు పాలించు

హైదరాలీ కొడుకు టిప్పుసుల్తానును కవి ప్రశంసించుట:

అట్టి హైదరుపట్టియగు జగఝట్టి
పుట్టి రాజులఁజంపు పులివలెఁ బొదలి
పట్టుపగ ల్బారుృ పగిదియు మెఱసి
గట్టిగా పెడబొబ్బ గావించి టీపు –
సుల్తానుబాదషా శూరనరుండు
కల్తాంధులకు దివాకరుఁడు భీకరుఁడు
కోరి యేబదిరెండు కోటల రాజు
వీరులఁ జెఱఁబట్టి విపినము ల్చేర్చె
మఱియు నాంగ్లేయుల మర్దింపఁగోరి
గరిమ త్రోవలయందుఁ గాచుక యుండె
తుదకు మగ్లాయి ఫితూరీల దండు
వదలి పెక్కంద్రతో నొక్కఁడె కదిసి

వీర పరాక్రమ విక్రమోన్నతుల
పోరులcజని స్వర్గభోగంబులంద
జేరిరి ధర్మముల్బేసి యున్నారు
వీరు దాతలుగారు విశ్వాధిపతులు
ఒకపరిc బ్రోతురు నొకట దండింతు -
రకట రాజుల దయ లవి ప్రమానినీడ -
లని జను లాడెద రవని నో మిత్ర!
అని యీావు వినcగోరి అంతcజెప్పితిని
సరవిని ధాత వత్సర ప్రకరణము
చిరకాలమును జనసేవ్యమౌగాత!

(ధాత ప్రకరణము సంపూర్ణము)

✿ ✿ ✿

ఎండు దుంపలcదెచ్చి యింపారc బొడిచేసి
తగ గంజిగాc గాcచి త్రాగువారు
బలుసాకు నరవండి పసరంతయున్ బిండి
భక్షించి యెట్టెటో బ్రతుకువారు
దేవదారాకుతో దేహముల్ చెడకుండ
ప్రాణాలు బిగబట్టి బ్రతుకువారు
నక్కల కుక్కల నంజుడు మెక్కుచు
భారమౌ బ్రతుకుల బ్రతుకువారు
అన్నమో రామచంద్రా! యటంచు గొంతు -
తూట్లు పడునట్లు లటచుచు తూలిపడుచు
కానిపించిన చెత్తతోc గడుపునింపి
ప్రాణములనిల్పి బ్రతికెడు వారునైరి

- శ్రీ అందలం కృష్ణమూర్తి ('మహాదాత' కావ్యము నుండి)

## ఐదవ ప్రకరణము – ఈశ్వర సాన్నిధ్య ప్రకరణము

శ్రీకరాబ్జాత రాజీవ సారంగ
యేక మనంత నానామేశ నమోస్తు
నను ధన్యుజేయు మద్దైవ నమోస్తు
అని యేను కొనియాడ నాసభవారు
ధాతవత్సరము తత్కధకు తర్వాత
ఏ తెలుంగున దాన నిపుణత లలరె?
మఱియు నేమి యొనర్చె మహిమీద? రెడ్డి –
చరితమ్ము వినఁగ లెస్సగఁ జెప్పుమనఁగ
చెప్పెద వినరయ్య? చెవియొగ్గి మీర
లిప్పుడు రెడ్డి జీవితచిత్ర మరయ

## వేంగళరెడ్డి తనకున్న దానిలో దానములు చేయుచు మోక్షమును ప్రసాదింపుమని దైవమును ప్రార్థించుట

ధర మజ్జరిండ్ల సుధాకరమూర్తి
సరిమించు నెఱదాత సమశాంతవర్తి
ధరను ప్రసిద్ధపు ధౌరేయు కధను
సరసత వినుపింతు సరళ వాక్యముల
చెలువంద నా రెడ్డి సేద్యంబు కతన
కలపంట ధాన్యముల్ కణజాలఁజేర్చి
తన యింటఁ గలకొద్ది తాను లేదనక
జనుల కన్నమొసంగి సార్వకాలంబు
భత్యము ల్లేనట్టి బాటసారులకు
నిత్య భత్యము లిచ్చి నేర్పున నుదయ –
మధ్యాహ్న వేళల మాపుఁ గూర్చుండి
ఆద్యంతములు గన నలవియుఁగాని

బయలు నిర్భయలునై పరఁగి ప్రపంచ –
క్రియలను నంటి ఏ క్రియ నంటకునికి
పదునాల్గు లోకముల్ పాలించువాని
ముదమునఁ జేతులు మొగిచి భజించి
దైవమా! నన్ను నీ దయ నేలుమనుచు
కైవల్య పదవిని కాంక్ష సేయుచును
అత్యంత సంతోషుఁడై సుఖలీల
సత్యంబుఁ దప్పక సతతంబు నుండె

## వేంగళరెడ్డిగారు తన వృద్ధాప్యమును దలఁచి శాశ్వతముగా పేదలకు అన్నదానము చేయుటకై నియమమేర్పఱచుట

ఒకనాఁడు ఆరెడ్డి ఒగి శయ్యపైని
ఒకఁడుగాఁ గూర్చుండి యోచించెనిట్లుఁ
గడచినయేటఁబల్కారినమౌ కఱవు
తొడరి బాధించెను తూరుపు ప్రజల
వనమునఁ బడ్డ జీవనములు దక్కె –
ననుమాడ్కిపరమేశు నాజ్ఞచే బీద –
జనములు బ్రదికిరి చింతలు దక్కె –
నని మఱిసంతస మందుచు నుండ
ఈ యేట వర్షంబు లిల మీఁదఁ బడక
పోయెను పైరులు పుడమీశు పన్ను –
లడిగిరేనియు చేత నర్థంబు లరుదు
కడకు నర్థుల కివ్వగా కష్ట మరయ
భూమియు నిల్లు తమ్ముని పుత్రులకును
ఈ మహి నిల్పిన నిహపర కీర్తి –
కలుగును, లేకున్న కల దపకీర్తి
ఇలమీఁద నా కిఁక నెన్నికసేయ
ఏండ్లు డెబ్బదిమీఁద నెనిమిది వచ్చె
కండ్లఁ గానగ నేమి కానరావయ్యె

ఆఁకొన్న వారలు అన్నంబు లేక
చీకాకుపడి నన్నుఁజేరవచ్చెదరు
అర్థులకెల్లను అనుకూలముగను
సార్థకంబుగ నొక్క సమయ మేర్పఱతు
అర్థమిచ్చుట కంటె నన్నమిచ్చినను
వ్యర్థంబు గాదు నవ్యయమైన పదవి
అని సమయముఁజేసి యెల్లరకెల్ల
తనియ నన్నమొసంగి తగ నేలుచుండ
తెఱగొప్ప నాయుఫు దీరి నానాఁట
పరమేశుఁదన మది బత్తి నేమఱక

## ఒకనాఁడు వేంగళరెడ్డిగారు నేత్ర చికిత్సనిమిత్తమై జమ్మలమడుఁగునకు పోవ నిశ్చయించుకొనుట – ఊరిలోని పిల్లలకు పప్పు బెల్లములు పెట్టి టీకాలు వేయించుట:

ఒకనాఁడు శమియౌ నుత్తమ తిథిని
సకల ప్రయాణముల్ సమకూరు ననుచు
ఉదయంబె లేచి కాలోచిత కర్మ –
లొదవ నిర్వర్తించి యుండంగ మదినిఁ
దలఁప నేత్ర చికిత్స తనకుఁగావలసి
యిలను జమ్మలమడుఁగు కేతేరఁ బూని
కలధౌత వస్త్రముల్ కప్పి బిరాన
కలిగిన రథము శృంగారంబుఁజేయ
అంత సూర్యోదయంబయ్యె నావేళ
వంతుగా మదిఁబూని బాలురకెల్ల
అమ్మవారను జాడ్య మవని లేకుండ
సమ్మతిగా చికిత్సలుఁజేయనెంచి
పచ్చులు పోయను పనివాండ్రురాగ
పచ్చను మాటకే బాలురు బెదరి

పెనుగద్దఁగని కోడిపిల్లల భాతిఁ
గనుపడకుండి రాకలి దప్పిమాని
యిటువలె బాలురు ఇండ్లెడఁబాసి
పటు దైర్యములు వీడి పాము తేళ్లనక
కొందఱు నుగ్గుల కుచ్చెలఁ దాఁగి
కొందఱు గాజల కూర్చొని యణిఁగి
కొందఱు మచ్చులకును నెగఁబ్రాఁకి
కొందఱు సందుల గొందుల కుఱికి
బాగుగా కొందఱు భయముచేఁనిండ్ల –
దాగిరి గుండెయల్ తడబడుచుండ
పనివాండ్రకును నొక్క బాలుండు గాని
కనుపడకున్న వేంగళరెడ్డిగారి
సముఖంబునకు చికిత్సకు లరుదేరి
విమల వాక్యంబుల విన్నపం బనుచు
ధ్యానించి పిలువ నాదానపరుండు
మానక యిదిజేయ మా పని యనుచు
పప్పులుఁ దిన నొక్కపాటి నమ్మించి
పప్పులు బెల్లము ల్పట్టి హస్తముల
నొప్పులేదని వారి నూఱడింపుచును
తప్పక పిలువ నందఱు వచ్చి నిలచి
మాకు పప్పులటంచు మాకు ముందనుచు
మాకు బెల్లమటంచు మాకు నిమ్మనుచు
సందు గొందులను బజారుల వచ్చి
ముందు మాకిమ్మని ముఱియుచునుండ
పట్టణంబుల నుండు బాలురనెల్ల
పట్టి పచ్చలు వేసి పధ్యముల్ చెప్పి
ఆ పురవాసుల నందఱుఁ బిలిచి
ప్రాపుగా నా రెడ్డి పలికె నిట్లనుచు
''ఈ పచ్చలేకనే ఇలను బాలురకు
పాపపు స్ఫోటక బాధలు గలిగి

కాళ్ళు చేతులు మోదుగట్టి కుంటయ్యు
వ్రేళ్ళు వంకలుపోయి వెతలును గలుగు
కన్నుల పొరలొడ్డి కాయలు గాచు
ఇన్నియుఁగలుగుట లెఱుఁగరా మీరు?
మోములు గుంతలై ముచ్చట ల్డొలఁగి
చీమల ముఖమనఁజెప్పగా వినమె?
ఈ పచ్చఁబోయక ఇలను సర్కారు
ఏ పనులైనను ఇవ్వరెవ్వరికి
సుమతులై వినరయ్య సూటిగా మీరు
అమవారి గండంబు నది పెద్దదండ్రు
ఇది శుభం బిది కీర్తి యిది లెస్స!'' యనుచు
పదిలుఁడై జనులకు బాగుగఁ దెలిపి

## వేంగళరెడ్డిగారు తలంటు స్నానము చేయబోవుచు ఈశ్వర సానిధ్యమును చేరుట

తడయక నగరికిఁదాఁబ్రవేశించి
కడు వేడ్క స్నానంబు గావించుటకును
సెలవియ్యఁదనరాణి శీఘ్రంబుతోడ
జలము లుష్ణముఁజేసి సతి పతికపుడు
అతిరసా లాదిగా నగు వంటకములు
పతి యాజ్ఞ మీఱక బత్తి రంజిల్ల
నిమిషమ్ము లరువదిలోఁజేసి తాను
సుమతియై పతిరాక చూపెట్టి యుండె
వేంగళరెడ్డి వేవేగ నొకరిచె
మంగలవాని రమ్మని పిల్వనంపి
క్షౌరాది కృత్యముల్ సల్పిన పిదప
దారు సుగంధ గేదఁగి తైలములను
తలయంటి వలగొని తగు మేనునలఁది
సెలవంది మంగలి చెచ్చరఁబోవ

కోరి స్నానంబునకును బోవ రెడ్డి
వారిఁదెమ్మని తన వారికిఁజెప్పి
బిరబిరఁ దనరాణిఁ బిలిచి వే వేగ
అరగంటలో స్నాన మవసర మనియె
శుభమని తన పత్ని శుద్ధజలంబు –
లభిషేక మొనరింతునని యుండునంత
ఆయువు గడువొక్క అర నిమిషంబు
శ్రేయమైనది యేమి చేయకనుండ
అరనిమిషము మీఁద నంత నా రెడ్డి
కరములు ముకుళించి కడుభక్తి నొఅగి
సకలేశుఁడైన ఈశ్వరు మదిన్దలఁచి
అకలంక మతి తోడ హరహరా యనుచు

## ఒక పుణ్యపురుషుఁడు ప్రత్యక్షమై 1925లో మీ కుటుంబములో 'దస్తగిరి' మహాత్ముని పేరు పెట్టుకొనినచో శుభములు కలుగునని చెప్పి అదృశ్యుఁడగుట

స్మరియించి రెడ్డి భాస్కరు డస్తమించు –
తటిఁనొక్క జటిలుఁ డత్తిరిచే హుషారు –
పఱచి పయ్యరదొంగ పైఁ బడె చూడుఁ –
డరనిమిషమ్ములో నాయువు దొరలి
పుణ్యుండు పంచత్వమొందు నీ సుగుణ –
గణ్యుఁడీతని సముఁడు గలుగుట యరుదు
పంతొమ్మనూట నిర్వదియేను వత్స –
రాంత మీ యింట శ్రీ రంజిల దస్త
గిరి మహాత్ముని పేరు గృహకుటుంబమున
గరిమతోఁ గొనియాడఁ గలుగును శుభము
అని పల్కి గద్దియ నప్పుడు దిగియు
కనుగొనరాక నిక్కపు బయల్జేరె!

సాధువో ఆ పుణ్యసామి! యివ్వేళ
బోధించ వచ్చిన పుణ్యపురుషుండో!
కాదాకో రెడ్డిని గనవచ్చినాడో!
లేదాకో తా వార్తలిటుఁ దెల్పవచ్చి
పోవనెంచిన దివ్యపురుషుండుగాని
యెవ్వరుగారు మఱెవరు గారనుచు
పురజనుల్ పల్కి రప్పుడు రెడ్డి మరణ -
మరయంగ శుభదిన మదియెట్టులనిన

## క్రీ శ 1900 – శార్వరినామ సంవత్సర ఉత్తరాయణ పుణ్యకాలములో ముక్కోటి ఏకాదశినాఁడు వెంగళరెడ్డిగారు కైలాసమును చేరుట

ధర నెరుల్గాడి నీ ధాత్రి రంజించు -
టరయ పంతొమ్మనూటాబ్దంబులకును
వరుస శార్వరి నామ వత్సరంబునను
మఱివిన్న గా పౌష్య మాస శుక్లమున
అందు సూర్యుం డుత్తరాయణంబందు
ఇందు వాసరమునం దిరవైన భరణి
ఘనత ముక్కోటి యేకాదశి పగలు
గణుతింప ఎదియేను ఘడియల మీఁద
మఱియు ననాయాస మరణ ప్రాప్తంబు
దొరకదు ఎటువంటి దొడ్డవారలకు
దొరకదు ఎటువంటి దొడ్డ యోధులకు
దొరకదు ఎటువంటి దొడ్డ సాధులకు
దొరకను స్వర్గాది దొడ్డ భోగములు
దొరకె వేంగళరెడ్డి దొడ్డ దాతకును
అంకిలి లేకను హరుపురమునను
శంకరుఁజేరి నిశ్శంకత నుండె

## వేంగళరెడ్డిగారి భార్యలు శోకించుట

అరయ నాయన చనునంత లోపలను
పరువెత్తుచును వచ్చి భార్యలిద్దఱును
పతిని లేవగనెత్తి పరమపావనులు
అతి దు ఖములఁజెంది హో నాధయనుచు
పతి పాదముల మీఁదఁ బడియు మూర్ఛిల్లి
అతివ లంతటఁ దెలివంది యడలుచు
నెద మోదుకొనుచు పయ్యెదలును జాఱ
తుదకు హారమ్ములు తునిగి తూగాఁడ
ప్రాణేశ్వమాని తత్పదమందఁగోరి
ప్రాణేశ! నీ వెంటఁ బరతెంతు మనుచు
కరముల శిరములు కడు మోదుకొనుచు
కరపాదములఁదమ కన్నుల నొత్తు -
కొనుచు ప్రాణేశు పైకొని ఎల్చి పిలిచి
కనుదమ్ములను నీరుగార నిట్లనిరి
''తరువున నల్లు మెత్తని పువ్వుతీఁగె
తరువుఁ బాఎన నది తగ నిల్వగలదె?
జలముల నుండెడు జలజ సంఘంబు
నిలమీఁద బడవేయ నెచ్చంగి బ్రదుకు
సతిలేమి పతికిని సతులు పెక్కండ్రు
పతిలేని సతులుండ పాపంబుగాన
పుడమిని మేమెంత పుణ్య హీనులమొ!
అడవిఁగాసిన చంద్రికాయె మా బ్రతుకు
పడతిరో! తొల్లి సంభవమున నెవరి -
కెడలు వాపిన పుణ్యఁమీఁవేళఁగలిగె
పొదగు తొలిజన్మ ఫలమది విడక
వైధవ్య సంప్రాప్తి వగపు సిద్ధించె
పరమునుజెందె మా పతి మమ్ముఁబాఎ
తరియింప లేమమ్మ ధవళాక్షులార!''

అని విలపింప నయ్యాప్త బందుగులు
అనిరి దు ఖంబుల నటు నివారించి

## ఆప్తబంధువులు రెడ్డిగారి భార్యలను ఓదార్చుట

''పన్నీటఁ దడిసిన పణతి పయ్యెదలు
కన్నీటఁ దడిసెను గదవమ్మ! నేఁడు
సంపగి నూనె వాసన లిచ్చు కురుల –
జొంపముల్ భువి ధూళి చూపట్టె నమ్మ!
యేల దు ఖింప మీ రెలనాఁగలార !
కాలమ్ము దీర నిక్కడ నుండరెవరు
వరుస నార్గురు చక్రవర్తు లున్నారె?
మఱియును షోడశ మహారాజు లేరి?
వారు పుణ్యాత్ములు వార లుత్తములు
వారు పుణ్యాత్ములై వైకుంఠ పదవిఁ
జేకొనిరని జనుల్చెప్పగా వినమె?
మీకును దెలుప నేమియు నేరమమ్మ
సకల గ్రంథమ్ములు సకల శాస్త్రములు
ప్రకటనగా విన్న పణతులు మీరు
పరికింప మావంటి పామరులకును
వెరవకుఁడనుచును వినఁజెప్పవలయు
ఇతఁడు సదాచారుఁ డితఁడు నిర్మలుఁడు
ఇతఁడు షోడశదానుఁ డితఁ డన్నదాత
ఇతఁడు జీవసముండు ఇతఁడు సత్యుండు
ఇతఁడహింసాపరుం డితఁడు పుణ్యుండు
అతఁడాది విష్ణువు నంశసంభవుఁడు
అతడర్థికోటికి ననిమిష మూర్తి
పాపంబులేక నిష్పాపుఁడై ఈశు
ప్రాపునజేరె నో పడఁతుకలార!

చచ్చిన వారికేడ్వఁగనేల? చావు -
ఎచ్చట దాఁగిన నేలబోనిచ్చు?
ఎచ్చట జనియించు నెల్లజీవములు
అచ్చటి కేగుట అది సహజంబు
చెలువందఁబుట్టిన జీవకోటులకు
వలనొప్ప పరమేష్ఠి వ్రాయు నాయువుల
ఉరివిపైఁబుట్టిన ఒకనాఁడు మొదలు
మరుస నాఁటికి రెండు మఱి నెన్నబడును
ధరను సుయోగులఁదప్ప నందఱను
శమనుండు ఆయువు సరిగొని తీయు
తెలియని మాటలా? తెలియు నెల్లరకు!
పలుమాఱు మీకుఁజెప్పఁగనేలనమ్మ!
ఇవియెల్ల మాయలు ఎంచి చూడగను
భువి నీటిపైనుండు బుగ్గల తెఱఁగు
వసుధ నీ తనువు లెవ్వరు నమ్మినారు?
పొసఁగ ధర్మంబుల పొగడొందవలయు''
అని యూరడిలఁ బల్కునంతలో కొంద -
ఱనిరి కన్నుల నీరు లటు జాలువాఱ

## మరికొందఱు ప్రజలు వారిని ఓదార్చుట

''వినవమ్మ! మనరెడ్డి విమల మానసుఁడు
ఘనుఁడ నేనను మది గమనంబు లేదు
ధనవంతులైన నిర్ధనవంతులైన
తన సమానపుపంక్తిఁదా నన్ను మిడును
పెద్దయైనను చిన్నపిల్లలనైన
వద్దనె కూర్చుండి వలఽ మాటాడు
ప్రియబంధువైనను పెరవారలైన
దయలూరఁబిలిచి పెత్తనపు మాటాడు

గూని కుంటి యనాద గ్రుడ్డి కురూపి
దీనుల కా రెడ్డి దిక్కుగా నుండె
సామ్యంబు లేటికి సకల ధర్మముల
సౌమ్యుఁ డాయన కంటె సరసుండు లేడు''
అనుచున్న నొక లేమ అడలుచు వచ్చి
ఘన శోక బాష్పముల్ కన్నులఁదొరఁగ
తన పైఁటచే కండ్ల తడి నొత్తుకొనుచు –
అనియె గద్గద కంఠయై జనుల్వినఁగ

## ఒక పురస్త్రీ రెడ్డిగారి భార్యల పతి భక్తిని ప్రశంసించుట

''సుదతిరో! వినరె యీ సుందరీమణులు
ఉదయంబె లేచి కాలోచితకర్మ –
ములను నిర్వర్తించి ముందుగా సతులు
జలపూర్ణ కలశముల్ చయ్యన దెత్తు –
రంతలో పొగసుట్ట లాయన కొసఁగి
వింతయౌ స్నానంబు వేగఁజేయించి
లలిత దుకూల వస్త్రంబులు గట్టి
చెలువందనిచ్చి భాసిలు నొక్క క్రేవ
దేవతాంజలి పతి తీర్చిరా నంత
భువిమించు షడ్రస భోజనంబిడుదు –
రంతట పాన్పుపై ఆకులమడుపు –
లుంతు రా యింతులు ఉచిత మార్గముల
పతియాజ్ఞ మీఱని పడతులోయమ్మ!
పతిని శ్రీపతి సాటి భావింతురమ్మ!''
అనుచును కొందఱు ఆ రెడ్డి కడకు
వనితలు గుంపులై వచ్చి యిట్లనిరి

## కొందఱు వనితలు రెడ్డిగారి అన్నదానమును ప్రశంసించుట

''ఎవ్వరేనియు మఱి యెందఱుఁగాని
నివ్వటిల్లఁగ రెడ్డి యెదుటను నిలువ

బువ్వనకున్న తా బుద్ధి నూహించి
బువ్వ తినుండంచు బోధించునమ్మ!
బువ్వ కావలెనన్న బువ్వఁబెట్టించు
బువ్వ వల్దన్న తాంబూలంబు లిచ్చు
ఎవ్వరు మీరని యే వూరటంచు
మవ్వపు మాటల మఱి విచారించు
లక్షణ కవులును లలిత వాక్యముల
దక్షిణ లడిగిన దయతో నొసంగు''
అనుచుండ పురమువా రా చుట్టపట్ల
జనమెల్ల కన్నుల జలములు జాఱ
గతప్రాణుఁడైన వేంగళరెడ్డికైన
వాతులు బంధువులెల్ల యిట్లని రపుడు

## చుట్టుప్రక్కల గ్రామములలోని హితులు బంధువులు వచ్చి అంతకుముందు రాత్రి ఆకాశమునుండి ఒక నక్షత్రము జాఱిపడిన అద్భుతమును తెలుపుట

' మాకెల్ల చుట్టంబు మా తలిదండ్రి
మాకును చెలికా' డు మమ్మేలు దాత
మాకెల్ల సామియు మమ్మొడఁబాసి
నాకేశు పురమున నడుగిడె నయ్యొ!
కడచిన రాతిరి కాలంబునందు
పుడమి జను ల్నిద్రపోవక మున్నె
చక్షురింద్రియము లచ్చెరువందగాను
నక్షత్ర మొకటి మిన్నుక నేలకొఱగె
అది భూమి యాకసం బంతయు నిండి
తుదమొద లొక్క వెల్తురు దోఁచె తోఁచ -
నప్పుడు జనులెల్ల నాశ్చర్యమొంది
చెప్పరై రిటువంటి స్థితి రిక్క మహిమ -

బువ్వనకున్న తా బుద్ధి నూహించి
బువ్వ తినుండంచు బోధించునమ్మ!
బువ్వ కావలెనన్న బువ్వఁబెట్టించు
బువ్వ వల్దన్న తాంబూలంబు లిచ్చు
ఎవ్వరు మీరని యే వూరటంచు
మవ్వపు మాటల మఱి విచారించు
లక్షణ కవులును లలిత వాక్యముల
దక్షిణ లడిగిన దయతో నొసంగు''
అనుచుండ పురమువా రా చుట్టపట్ల
జనమెల్ల కన్నుల జలములు జాఱ
గతప్రాణుఁడైన వేంగళరెడ్డికైన
హితులు బంధువులెల్ల యిట్లని రపుడు

చుట్టుప్రక్కల గ్రామములలోని హితులు బంధువులు వచ్చి అంతకుముందు రాత్రి ఆకాశమునుండి ఒక నక్షత్రము జాఱిపడిన అద్భుతమును తెలుపుట:

''మాకెల్ల చుట్టంబు మా తలిదండ్రి
మాకును చెలికా''డు మమ్మేలు దాత
మాకెల్ల సామియు మమ్మెడఁబాసి
నాకేశు పురమున నడుగిడె నయ్యొ!
కడచిన రాతిరి కాలంబునందు
పుడమి జను ల్నిద్రపోవక మున్నె
చక్షురింద్రియము లచ్చెరువందగాను
నక్షత్ర మొకటి మిన్నక నేలకొఱగె
అది భూమి యాకసం బంతయు నిండి
తుదమొద లొక్క వెల్తురు దోఁచె, తోఁచ –
నప్పుడు జనులెల్ల నాశ్చర్యమొంది
చెప్పరై రిటువంటి స్థితి రిక్క మహిమ –

పేమించి యన్నంబు పెట్టువారెవరు?
నీవలె వస్త్రమ్ము లిచ్చువారెవరు?
దిక్కెవ్వరును లేక తిరిగెడు మాకు
దిక్కైన రెడ్డిని దీసె దైవంబు
అక్కటా! దైవమా! అంగహీనులము
ఎక్కడ బోజాల మేమి సేయుదుము?
ఏ జన్మమున దోస మేమి జేసితిమొ
ఆ జన్మఫల మిప్పు డనుభవం బాయె
ఎవరి కన్నులఁ బోవ నే మొనర్చితిమొ!
ఎవరి యన్నము దీసి యేటఁగల్పితిమొ''!
అని యెలుగెత్తి హా హా దాత! యనుచు
మనముల దు ఖము ల్మానక యుండ

## తమ్ముడును బంధువులును రెడ్డిగారి దేహమును సమాధిచేయుట

అంత నాయన తమ్ముఁ డాప్త బంధువులు
చింతలు మాని యాశ్రిత సహోదరులు
ఎలమి యాబ్దికసనులెల్లఁ జేయించి
చెలువంద కాయంబు శృంగార పఱచి
మానిత దివ్య విమానమం దుంచి
దానధర్మంబులఁ దగిన వాయిద్య -
ములను ఆ పట్టణములనుండు జనులు
పలుమాఱు రెడ్డిని ప్రస్తుతింపుచును
లీలతో రెడ్డి శరీరంబు దివ్య -
ఊాల నమర్చిన రమ్య సమాధి
వేగఁ జేర్చిన బుడ్డ వేంగళరెడ్డి
బాగొప్ప కైవల్య పదవినిఁ జేరె
సశరీర మవనిలో సామాధి నునుప
స్వశరీర కీర్తి తోడ్పడనున్న దనఘ!

అటుల రెడ్డి చరిత్ర మాంధ్ర శబ్దముల
నిటులఁ జెప్పితి విని యేఁజూచినంత
ఘను లెవ్వరైన నీ కథ సొంతముగను
పెనుపొంద నెవ్వరు ప్రేమను వ్రాసి
విమల వాక్యమ్ముల వినగఁ జెప్పినను
సుమతులై చదివిన సుజను లందఱును
ఆయురారోగ్య పుత్రార్థ సంపదలఁ
బాయక యుందురు భద్రాత్ములగుచు!

(ఈశ్వర సాన్నిధ్య ప్రకరణము సంపూర్ణము
శ్రీ బుడ్డా వేంగళరెడ్డి చరిత్ర సర్వము సంపూర్ణము)

✿ ✿ ✿

మునిగెను కాలగర్భమున మూర్తి వహించిన ధర్మతేజమే!
మునిగిరి శోక వార్ధినటు ముగ్గురు తల్లులు నొక్కసారిగా!
మునిగిరి లోకులందఱును పుట్టెడు దు ఖమునందు, సృష్టియే
మునిగెను ఖేదమందనఁగ మోడులుగాఁ గను పట్టె భూజముల్!

పరుల క్షుద్బాధ నడగించు వ్రతముఁ బూని
మనిన వృక్షమ్ము నిరతమ్ము మధురఫలము
లొసఁగి తటుకున నాకుల నూడ్చి వేసి
యెండిపోయను యాచకు లేడ్చునట్లు!

పసిమినిగుల్కు వృక్షములు బాధనువ్యక్తముఁ జేసె నాకులన్
వెసనటు రాల్చి మోడులయి, భీతివడంకెను బ్రాణులన్నియున్
రసికత వీడి తీవ్ర శిశిరంబునఁబోలె, నుదార తేజమే
మిసమిసలాడుచున్ వెలిగి మృత్యువునందగ నాక్షణంబునన్!

- శ్రీ అందలం కృష్ణమూర్తి ( మహాదాత' కావ్యము నుండి)



ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వేషంలో

కీ. శే. కర్నాటి అయ్యపురెడ్డిగారు (1925-1983)

రూపనగుడి మునసబు



నారసింహారెడ్డి నగరు - ఉయ్యాలవాడ



నొస్సం కోట



ఉయ్యాలవాడ నగరివాకిలి



ఉయ్యాలవాడ నగరివాకిలి - లోపలిభాగం



నారసింహారెడ్డి నగరు - లోపలిభాగం



నారసింహారెడ్డి 'ఖాండా' (కత్తి)
(పట్టుకున్నవారు శ్రీ జి.సి. రామలింగారెడ్డి, 'కళాకుముద్వతి' కార్యదర్శి)



రూపనగుడి నగరివాకిలి



రూపనగుడి కోటబురుజు



'నారసింహారెడ్డి గోడలు' లో ఉన్న దుర్గగుడి



నరవబోడుపై నారసింహారెడ్డి నిర్మించిన శ్రీ లక్ష్మి నరసింహస్వామి గుడి



నరవబోడు శ్రీలక్ష్మీనరసింహస్వామి



'గుజ్జాలకొండ'- జయరామపురం, గిద్దలూరు సమీపం



కోవెలకుంట్ల కోటగుమ్మం



పాండురంగని గుడి, కోవెలకుంట్ల



నారసింహారెడ్డి కొల్లగొట్టిన కోవెలకుంట్ల తాలూకా కచ్చేరీ
ఉండిన ప్రదేశం (1965లోని దృశ్యం)



'నారసింహారెడ్డి గోడలు' - 'దండుబాట'

## అనుబంధము - IV

# మఱికొన్ని క్రొత్త సంగతులు

– ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

### 1 నారసింహారెడ్డి విప్లవం ఆనాటి రాయలసీమ రైతుల తిరుగుబాటు

ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వం (కుంఫిణీ ప్రభుత్వం) భూమిశిస్తు విధానంలో ఒక కొత్త పద్ధతిని అనుసరించింది భూసారాన్ని బట్టి పంట భూముల్ని కొన్ని తరములు గా విభజించింది ఒక్కొక్క తరము లో ఎకరానికిచెల్లించవలసిన శిస్తును నిర్ణయించింది అది ఎకరానికి 12 అణాలు మొదలుకొని 4 రూపాయలు 5రూపాయలు 7 రూపాయల వరకూ కూడా ఉండేది ఈ పన్నును కుంఫిణీ ప్రభుత్వం మిక్కిలి కఠినంగా వసూలు చేసేది ఆ దినాల్లో ఒక బస్తా జొన్నలు ధర 12 అణాలు మొదలుకొని ఒక రూపాయి లోపుగా ఉండేది పుట్టి 10రూపాయల లోపు సకాల వర్షాలు కురిసినట్లయితే పండేపంట ఎకరానికి 7 బస్తాల నుండి 10 బస్తాల వరకూ ఉండేది ఇందులో శిస్తుపోను మిగిలే పంట అత్యల్పం ఈ పంట కూడా అస్తవ్యస్తంగా పండేది చవిటి భూముల్లో వర్షపాతం ఎక్కువగా ఉండటం వల్ల పంట బాగా పండేది సారవంతమైన భూముల్లో పంట తక్కువగా పండేది అందువల్ల సగటు పంటలు తక్కువగా పండటంవల్ల రైతులు శిస్తులు చెల్లించలేక కష్టాలపాలు కావడం సహజంగా జరిగేది ప్రభుత్వంవారు శిస్తు కట్టని రైతుల పొలాలు జప్తు చేసేవారు రైతుల్ని హింసలకు గురి చేసేవారు ఆనాడు ధనానికి ఎక్కువ చెలామణీ ఉండేదికాదు వ్యాపారమంతా వస్తువుల మార్పిడి పద్ధతిలో జరిగేది అందువల్ల కూడా రైతుల దగ్గర ధనముండేదికాదు ధనరూపంలో ఉండే అధిక శిస్తులు చెల్లించలేక పొలాలు బీడులుగా వదిలేసి రైతులు పారిపోయేవారు ఈ విధంగా శిస్తులు చెల్లించలేని పేదరైతుల బాధలు చూడలేక నారసింహారెడ్డి తిరుగుబాటు చేశాడు ట్రెజరీలో ఉన్న డబ్బును దోచి రైతులకు పంచిపెట్టాడు దీనికి తోడు తన సొంత విషయంలో (తవర్జీ విషయంలో) తాసిల్దారు అవమానకరంగా మాట్లాడటం నిద్రించే సింహాన్ని జూలుపట్టి లాగినట్లయింది రాయలసీమ పేదరైతుల పక్షాన నాయకత్వం వహించి పెద్ద తిరుగుబాటు లేవదీసేలా చేసింది ఇదీ నారసింహారెడ్డి విప్లవానికి మూల కారణం దీనిని తరతరాలుగా పెద్దలు చెప్పగా విని గ్రామవృద్ధులు నాకు తెలియజేశారు

*(శ్రీ బుడ్డా వెంకట్రామిరెడ్డి, శ్రీ బుడ్డా శ్రీరాములు రెడ్డి, ఉయ్యాలవాడ; శ్రీ భట్టు పుల్లయ్య, కోవెలకుంట్ల, 23-2-1999).* ఈ వాదాన్ని బలపరిచే ఒక గొప్ప అంశం ఉంది. హంగెరీ దేశానికి చెందిన శ్రీమతి కేథలీన్ గాగ్ ''నారసింహారెడ్డి విప్లవం రాయలసీమ రైతుల తిరుగుబాటే!'' అని నిరూపిస్తూ ఒక పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసింది.

## 2. నల్లమలలు – ఎఱ్ఱమలలు:

కర్నూలు జిల్లాలో తూర్పువైపు శ్రీశైలంనుండి తిరుమల వరకూ ఉత్తర దక్షిణంగా వ్యాపించి ఉండేవి నల్లమలలు.

కర్నూలు జిల్లాలో దక్షిణం వైపు ద్రోణాచలం నుండి నొస్సం వరకూ తూర్పు పడమరగా వ్యాపించి ఉండేవి ఎఱ్ఱమలలు.

నల్లమలలు ఎత్తైన పర్వతాలు. ఇవి దట్టమైన అరణ్యాలతో నిండి సకల ప్రాణి కోటికి నిలయాలుగా ఉంటాయి. చెంచుమల్ల జయరామిరెడ్డిగారి రహస్యదుర్గం ఈ నల్లమల అడవుల్లో గిద్దలూరు దగ్గరనున్న 'దిగువమెట్ట'కు 12 కి. మీ. దూరంలో ఉంది. ఈ అడవుల్లో నంద్యాలవైపు 'సర్వ నరసింహస్వామి' గుడి ఉంది.

ఎఱ్ఱమలలు బోడికొండలు. ఎత్తు తక్కువ. గుహలు ఏర్పడి ఉంటాయి. చెట్లు మిక్కిలి తక్కువ. ఖనిజాలు మాత్రం చాలా ఎక్కువ. బైరటీస్ (ముగ్గురాళ్ళు), ఇనుము, సిమెంటురాయి, కడపరాళ్ళు, వజ్రాల గనులు ఈ ఎఱ్ఱమలల్లో ఉన్నాయి. వీటిలో భూగర్భ జలాలు ఉంటాయి. నయనాలప్పకొండ, జగన్నాథునికొండ ఈ ఎఱ్ఱమలల్లో ఉన్నాయి.

*(-శ్రీ వంగాల శేషారెడ్డి, తలముడిపి, 27-2-1999)*

## 3. గిద్దలూరు ప్రాంతాల్లో నారసింహారెడ్డికి సంబంధించిన విషయాలు:

**3.1** గిద్దలూరులో **'కోట గడ్డ':** ఇక్కడ 1846 జూలై 23వ తేదీని నారసింహారెడ్డి 5వేలమంది బోయసైన్యంతో ఆంగ్లేయులతో మొట్టమొదటి యుద్ధం చేశాడు. కంభం నుంచి లెఫ్టినెంట్ వాట్సన్ నాయకత్వంలో నూరుమంది మిలిటరీ వాళ్ళు వచ్చారు. ఐదు గంటలసేపు హోరాహోరీ పోరాటం జరిగింది. ఒక పాడుబడ్డ కోటలో చేరి వాట్సన్ యుద్ధం చేసినట్లు తెలుస్తోంది.

గిద్దలూరులో కోట ఉన్న స్థలాన్ని ఈనాడు కోటగడ్డ అని పిలుస్తున్నారు ఆ ప్రదేశంలో ఉన్న వీధిని కోటగడ్డ వీధి అని అంటున్నారు నారసింహారెడ్డి సలహాదారు (మంత్రి) కుందుర్తి రామావధాన్లు ఈయనకు నారసింహారెడ్డి తన కోటగడ్డను దానం చేశాడు ఈ కోటగడ్డలో నరసింహస్వామి గుడి ఉండేది ఈ దేవుణ్ణే హిందువులే కాకుండా 20 కుటుంబాల ముస్లిములు కూడా పూజించేవారు వారు నరసింహస్వామి పేరు పెట్టుకునేవారు

*( శ్రీ చివుకుల భరద్వాజశాస్త్రి ప్రముఖ చిత్రకారుడు గిద్దలూరు)*

**3 2 ముండ్లపాడు** ఇక్కడ 1846 జూలై 24వ తేదీని నారసింహారెడ్డి కర్నూలు నుంచి వచ్చిన కెప్టెన్ నాట్ మరియు కెప్టెన్ రసెల్ సైన్యాలతో యుద్ధం చేశాడు ఇది రెడ్డి ఆంగ్లేయులతో చేసిన రెండవ యుద్ధం కంభం తాసిల్దారు జంగంరెడ్డి శ్రీనివాసరావును నారసింహారెడ్డి సైనికులు కాల్చి చంపారు ఈ ముండ్లపాడులో శ్రీ భవానీశంకరస్వామి దేవాలయం ఉంది ఈ గ్రామం గిద్దలూరుకు 5 కి మీ దూరంలో ఉంది

**3 3 కొత్తకోట – ఫిరంగి** ముండ్లపాడుకు 4 కి మీ దూరంలో (గిద్దలూరుకు 9 కి మీ దూరంలో) ఈ కొత్తకోట ఉంది ఇక్కడ శిధిలమైన కోట ఉంది ఒక బురుజుపైన ఒక ఫిరంగి ఉంది ఈ కోటలో మొత్తం 19 ఫిరంగులు ఉండేవట వీటిలో 18 ఫిరంగుల్ని ఆంగ్లేయులు పట్టుకొని పోయారు ఒకటి మాత్రం మిగిలింది ఇది చెడిపోయినందువల్ల వాళ్ళు పట్టుకొని వెళ్ళలేదట ఈ కొత్తకోటలో నారసింహారెడ్డి మామగారు ఉండేవారట ఈ కొత్తకోటకు పడమట దిక్కున నల్లమల కొండలు వాటిపైన దట్టమైన అడవులు ఉన్నాయి ఈ కొత్తకోట ప్రక్కన బురుజుపల్లె అనే గ్రామం ఉంది అక్కడ ఒక గుహ ఉంది ఆ గుహలో జయరామిరెడ్డి దండయాత్రలలో తాను కొల్లగొట్టిన ధనాన్ని దాచి ఉంచాడని జనశ్రుతి

**3 4 నల్లమల అడవుల్లో 'జయరామిరెడ్డి కోట'** కొత్తకోటకు పడమటి దిక్కున నల్లమల కొండలు ఉన్నాయి ఆ కొండలపైన దట్టమైన అడవులు ఉన్నాయి నల్లమల కొండల్లో ఉన్న కనుమ కొండ నుంచి 3 కి మీ పోతే దట్టమైన అడవుల మధ్య జయరామిరెడ్డి కోట ఉంది గిద్దలూరు నంద్యాల మార్గంలో పోతే దిగువ మెట్ట గ్రామం నుండి 12 కి మీ దూరంలో ఈ కోట ఉంది దట్టమైన అడవుల

మధ్య ఉన్నందువల్ల ఈ కోటను చేరడం అసాధ్యం విప్లవకాలంలో నారసింహారెడ్డి ఈ కోటలో దాక్కున్నాడని చెపుతారు

**3 5 'జయరామపురం' కోట బురుజు** గిద్దలూరునకు ఉత్తరంగా 6 కి మీ దూరంలో జయరామపురం అనే గ్రామం ఉంది ఇక్కడ ఒక కోట బురుజు ఉంది ఇక్కడ ఒక కోట ఉండిన గుర్తులు ఉన్నాయి నారసింహారెడ్డి తాతగారైన (మాతామహుడైన) జయరామిరెడ్డి పేరుతో ఈ గ్రామం వెలిసిందనీ ఈ కోటను జయరామిరెడ్డిగారే కట్టించి ఉంటారని ఊహించవచ్చును ఈ కోట బురుజుకు తూర్పుగా గుఱ్ఱాలకొండ ఉంది (దీనిని గురించి 50వ పుటలో వివరించాను)

**3 6 కొత్తకోట-జయరామిరెడ్డి కోట – జయరామపురం కోట బురుజు** ఈ మూడు కోటలూ ఒక దానికొకటి కనబడతాయి అయితే ఈ కనబడటంలో ఒక ప్రత్యేకత ఉంది నల్లమల యొక్క దట్టమైన అడవులలోని జయరామిరెడ్డి కోట ఎక్కి చూస్తే కొత్తకోట బురుజు కనిపిస్తుంది కాని కొత్తకోట బురుజు ఎక్కి చూస్తే జయరామిరెడ్డికోట కనబడదు అలాగే జయరామపురం కోట బురుజు ఎక్కి చూస్తే కొత్తకోట బురుజు కనిపిస్తుంది కాని కొత్తకోట బురుజు ఎక్కి చూస్తే జయరామపురం కోట బురుజు కనిపించదు అలాగే గిద్దలూరులోని కోట ఎక్కితే కొత్తకోట బురుజు కనిపిస్తుంది కాని జయరామపురం కోట బురుజు కనబడదు ఈ విధంగా కోటల్ని నిర్మించడంలో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి మంత్రి అయిన కుందుర్తి రామావధానులుగారి మేధాశక్తి ఇమిడి ఉంది ఈ మంత్రి పుంగవునకు నారసింహారెడ్డి నూరు ఎకరాల పొలం దానం చేశాడు ఇప్పటికీ ఆయన వంశస్థులు ఆ పొలాలు అనుభవిస్తున్నారు

*( శ్రీ సూరం నారాయణరెడ్డి గిద్దలూరు 2 3-1999)*

నారసింహారెడ్డి దగ్గర నరసప్ప రామయ్య అనే ఇద్దరు మంత్రులు (కార్యదర్సులు) ఉన్నట్టుగా కుంఫిణీ ప్రభుత్వ లేఖలు కూడా తెలియజేస్తున్నాయి (చూ Cochrane s letter dated 17th November 1846 Official Report Vol 114)

**3 7 నారసింహారెడ్డి పొలాలు** గిద్దలూరు తాలూకా (ఈనాటి గిద్దలూరు మండలం కొమరవోలు మండలం) లోని తాళ్ళపల్లి ఓబుళాపురం జయరామపురం ఎల్లుపల్లి గోసానిపల్లి పుల్లారెడ్డిపల్లి బెడుసుపల్లి కంభం చెరువు

సట్టిరెడ్డిపల్లి నిట్టమీదిపల్లి మొదలైన గ్రామాల్లో నారసింహారెడ్డిగారి పొలాలు ఉన్నాయి అల్లినగరం రాజుపాలెం కోటల అధిపతులు నారసింహారెడ్డికి సామంతులు

*( శ్రీ సూరం నారాయణరెడ్డి గిద్దలూరు 2 3 1999)*

**3 8 నారసింహారెడ్డి నిర్మించిన దేవాలయం** నరవ గ్రామాన్ని ఎరించి నరవబోడు ను గురించి 50 51 పుటల్లో వివరించాను ఈ నరవబోడు మీది లక్ష్మీనరసింహాస్వామి దేవాలయాన్ని ఉయ్యాలవాడ నారసింహారెడ్డి నిర్మించాడని చెపుతున్నారు కొండ కొనమీద చెంచులక్ష్మి గుడి ఉంది దానికి దిగువగా లక్ష్మీ నరసింహ స్వామివారి దేవాలయం ఉంది ఈ స్వామి నారసింహారెడ్డికి కలలో ప్రత్యక్షం కావడం వల్ల ఈ దేవాలయనిర్మాణం జరిగిందిట 1963 ప్రాంతాల్లో ఈ విగ్రహాన్ని దొంగలు ఎత్తుకుపోయారు తిరిగి లభించిన తరువాత 19 2 1973లో జీర్ణోద్ధరణ ప్రతిష్ఠ జరిగింది

**3 9 'సర్వనరసింహస్వామి'** గిద్దలూరు నంద్యాల మధ్యనున్న నల్లమల అడవుల్లో నంద్యాల వైపు గాజులపల్లె కు సమీపంలో సర్వనరసింహాస్వామి దేవాలయం ఉంది దట్టమైన నల్లమల అడవుల్లోని జయరామిరెడ్డికోట నుండి ఈ గుడిలో ఒక సొరంగం ఉందని చెపుతారు ముస్లిములు కూడా ఈ దేవుణ్ణి పూజిస్తారు నరసింహస్వామి పేర్లు పెట్టుకుంటారు

**3 10 'గడికోట' గ్రామం – 'పట్ర' కులంవారు** గిద్దలూరుకు దక్షిణంగా 15 కి మీ దూరంలో గడికోట అనే గ్రామం ఉంది ఈ గ్రామంలో పట్ర కులంవారు ఉన్నారు వీరికి గోత్రం లేదు వీరిది వీరకులం సైనిక జాతి ఆయుధోప జీవులు ఈ పట్ర కులంవారు దొంగతనాలు చేసేవారు బ్రిటీషు పోలీసులు వస్తే ఆ గ్రామ సమీపంలోని కొండలు దాటి పారిపోయేవారు వీరి దొంగతనాలను భరించలేక ఆ బ్రిటిషు వారి కాలంలోనే ఈ గ్రామంలో పోలీసుస్టేషన్‌ను స్థాపించారు ఈ పట్ర కులంవారు దొంగతనాలు చేసి తెచ్చిన ధనాన్ని ఇక్కడి వైశ్యులు తీసికొని వారికి ఆహార ధాన్యాలు ఇచ్చేవారట ఈ విధంగా ఇక్కడి వైశ్యులు మిక్కిలి ధనికులయ్యారని చెపుతారు ఈ పట్రకులం వారికి నారసింహారెడ్డి నాయకుడు వీరు నారసింహారెడ్డి సైన్యంలో చేరి కుంఫిణీ ప్రభుత్వంతో యుద్ధం చేశారు ఈ పట్రకులం వల్లనే నారసింహారెడ్డికి దోపిడిదొంగగా అపప్రధ వచ్చివుండాలి

*( శ్రీ డి వి కేశవరెడ్డి గడికోట గ్రామం)*

దీనికి అనుబంధంగా మరొక విషయం చెప్పాలి - నారసింహారెడ్డి సమీకరించిన 9 వేల మంది సైనికులలో అన్నికులాలవారూ ఉన్నప్పటికీ వారిలో ఎక్కువ భాగం బోయవారు. అందువల్లనే ఆయన సైన్యానికి ''ఎల్లాపుల రాణువ'' అనే పేరు వచ్చింది. ఈ బోయల కులవృత్తి దొంగతనం. దీనివల్ల కూడా నారసింహారెడ్డికి దోపిడిదొంగగా అపప్రథ వచ్చి ఉండవచ్చును. *(-తంగిరాల)*

## 4. కోవెలకుంట్లలోని రంగనాయకుల గుడి:

ఈ దేవాలయాన్ని శాలివాహన శకం ౧౪౯౩ లో (అంటే క్రీ.శ. 1571లో) నిర్మించినట్లుగా శాసనం ఉంది. దీనిని పెనుకొండను పాలించిన విజయనగరరాజు 'తిరుమలదేవ మహారాయలుంగారు' నిర్మించారు. 'కోయిల' అనే తన ప్రియురాలి కోరిక మేరకు ఈ దేవాలయ నిర్మాణం జరిగిందట. ఆమెకు ఈ స్వామి కలలో ప్రత్యక్షమైనాడట. ఒక 'కుంట'లో విగ్రహం ఉన్నట్టు ఆమెకు కలవచ్చిందని చెపుతారు. 'రంగ నాయకులు' అని పిలువబడే ఈ దేవుని అసలు పేరు 'శ్రీ పాండురంగ విఠలేశ్వర స్వామి'. ఈయన్నే 'పాండురంగ స్వామి', 'పాండురంగడు' అని కూడా పిలుస్తారు. నారసింహారెడ్డి కోవెలకుంట్ల ట్రెజరీని కొల్లగొట్టిన తరువాత ఈ పాండురంగని దర్శించి దోసిళ్ళతో రూపాయలు సమర్పించాడని చెపుతారు. కలవటాల జయరామారావుగారి 'రేనాటి వీరుడు' నవలలో కూడా ఈ విషయం ఉంది. ఈ దేవాలయంలో స్వామి కూర్మావతార రూపంలో ఉంటాడు. ఒక దోసెడు సాలగ్రామంతో నిర్మితమైన విగ్రహం ఇది. దీని క్రింద బిందెడునీళ్ళు పట్టే తగ్గు ఉంది. ఈ ఆలయంలోని ఉత్సవ విగ్రహాలు పంచలోహ నిర్మితాలయినా, ఆ పంచ లోహాలలో బంగారుపాలు ఎక్కువ. అందువల్ల ఈ విగ్రహాలను రెండుసార్లు దొంగలు దోచుకున్నారు. కాని రెండుసార్లూ కూడా తిరిగి లభించాయి. ఈ కూర్మావతార పాండురంగడికి పూలదండ వేస్తే అది వాడిపోదు. అందువల్ల ఈ దేవుణ్ణి 'పచ్చిపూల రంగడు' అని పిలుస్తారు.

*(-అర్చకుడు శ్రీ యస్. వేణుగోపాలాచార్యులు, కోవెలకుంట్ల, 27-2-1999)*

## 5. మోటాటి రాజవంశంలో గుంపుల భేదానికి కారణం:

'నగరివారు', 'దొరవారు' అని పిలువబడే మోటాటి రెడ్ల రాజవంశంలో 'నారసింహారెడ్డి గుంపు', 'కృష్టారెడ్డి గుంపు' అని రెండు శాఖలు ఏర్పడటానికిగల

కారణాన్ని బుడ్డా వెంగళరెడ్డిగారిని స్వయంగా చూచి ఆయన ఆతిథ్యాన్ని పొందిన పహిల్వాన్ నాగారెడ్డిగారి చిన్న సుబ్బారెడ్డిగారు తన దౌహిత్రుడైన శ్రీ వంగాల శేషారెడ్డిగారికి ఈ క్రిందివిధంగా తెలియజేశారట

నరసింహారెడ్డి కృష్ణారెడ్డి అన్నదమ్ములు తమ్ముడు కృష్ణారెడ్డి తన కూతురు పెండ్లికి అన్న నరసింహారెడ్డిని ఆహ్వానించాడు ఆయన రాజు చతురంగబలాలతో కదిలి వస్తున్నాడు ఏనుగులు ఒంటెలు గుఱ్ఱాలు సైనికులు ఆయన పరివారంలో ఉన్నారు దారిలో మజిలీలు వేసుకుంటూ వచ్చేసరికి చాలా ఆలస్యమయింది సుముహూర్తం దాటి పోతోందని బ్రాహ్మణులు తొందర చేశారు అందువల్ల కృష్ణారెడ్డి తన కూతురికి మంగళసూత్రం కట్టించి వేశాడు తరువాత నరసింహారెడ్డి వచ్చాడు తాను రాకుండా పెండ్లికుమార్తెకు మంగళసూత్రధారణ చేయించి వేయడం తనకు అవమానంగా భావించాడు ఆ రోజునుండి తమ్మునితో తెగతెంపులు చేసి వేసుకున్నాడు అప్పటినుండి నారసింహారెడ్డి గుంపు కృష్ణారెడ్డిగుంపు అనే పేర్లు వచ్చాయి ఈ కథలో వచ్చే నారసింహారెడ్డి ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కాడు ఆయనకు ఏడుతరాలు ముందున్న వీరనరసింహారెడ్డి కావచ్చును

*(-శ్రీ వంగాల శేషారెడ్డి తలముడిపి 28 2-1999)*

## 6 కట్టుబడులు

కట్టుబడులు అంటే పాళెగాండ్రు నియమించుకున్న గ్రామపోలీసులు వీరు గ్రామాలలో శాంతిభద్రతలను కాపాడటంతోపాటు భూమిశిస్తులు కూడా వసూలు చేసేవారు వీరికి ప్రభుత్వం ఈనాములు ఇచ్చింది ఈ యినాముల వంశ పారంపర్య హక్కును కుంఫిణీ ప్రభుత్వం రద్దు చేసింది అందువల్ల ఈ కట్టుబడులందరూ కోపంతో నారసింహారెడ్డి విప్లవంలో పాల్గొన్నారు

ఈ కట్టుబడులు రెండు రకాలుగా ఉండేవారు (i) గ్రామ కట్టుబడులు (ii) జంగి కట్టుబడులు సంవత్సరం పొడవునా సేవ చేసే గ్రామసేవకుల్ని లేదా బంట్రోతుల్ని గ్రామ కట్టుబడులు అనేవారు అత్యవసర పరిస్థితులలో మాత్రమే సేవచేయడానికి పిలువబడేవారిని జంగి కట్టుబడులు అనేవారు

**Kattubadis** Peons or militia employed by the palegars for military service performed police and revenue duties There are two types of Kattubadis

**(i) Grama Kattubadis** Village servants and peons performed service through out the year

**(ii) Jangi Kattubadis** Called for service on emergent occasion

In practice both the classes performed revenue and police duties indiscriminately as occasion required

*(Dr J C Dua Palegars of South India P 266)*

## 7 ఆ కాలంలో కడపజిల్లా కలెక్టర్లు–ఇతర బ్రిటిష్ అధికారులు

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి విప్లవకాలంలో (1846లో) కడపజిల్లా కలెక్టరుగా J H Cochrane ఉన్నాడు కర్నూలులో గవర్నరు ఏజెంటుగా S Scott ఉన్నాడు కాక్రేన్ 1845 నుండి 1850 వరకూ కడపజిల్లా కలెక్టరుగా ఉన్నాడు ఇతనికి ముందు W A D Inglis కడప కలెక్టరుగా 1844 1845లో పనిచేశాడు 1846 47లో నారసింహారెడ్డి విప్లవాన్ని గురించి విచారణ జరిపింది కూడా ఇతడే ఆ కాలంలో బళ్ళారిలోని దత్తమండలాల మిలిటరీ అధికారి (ఆఫీసర్ కమాండింగ్) పేరు Brig General J Anderson మద్రాసులోని గవర్నరు ఆఫీసు (Fort St George) లోని ప్రభుత్వ కార్యదర్శి పేరు E P Thompson (1846) Sir H C Montogomery (1847)

## 8 నారసింహారెడ్డి మాతామహుడు ''చెంచుమల్ల జయరామిరెడ్డి'', పితామహుడు ''మజ్జరి బుచ్చిమల్లారెడ్డి''

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి తండ్రిపరంగా ఉయ్యాలవాడ జమేదారీకి తల్లిపరంగా నొస్సం జమేదారికీ సంబంధించిన వాడు ఇతని పితామహుని పేరు మజ్జరి బుచ్చిమల్లారెడ్డి అని రూపనగుడి మునసబుగారైన శ్రీ కర్నాటి అయ్యపురెడ్డిగారి యింటిలో లభించిన ఒక దస్తావేజును బట్టి తెలుస్తోంది మాతామహుని పేరు చెంచుమల్ల జయరామిరెడ్డి ఈ జయరామిరెడ్డిగారి యిద్దరు కూతుళ్ళను ఉయ్యాలవాడ జాగీర్దారు పెండ్లి చేసుకున్నాడని తెలుస్తోంది ఈ పెండ్లి చేసుకున్నది నారసింహారెడ్డి తండ్రి పెద్దమల్లారెడ్డా? లేక పితామహుడు బుచ్చిమల్లారెడ్డా? స్పష్టంగా తెలియడం లేదు డా॥ జె సి దువాగారు ఒక పుస్తకంలో నారసింహారెడ్డి తండ్రి పెండ్లి చేసుకున్నాడని వ్రాశారు మరొక పుస్తకంలో తాత పెండ్లి చేసుకున్నాడని వ్రాశారు కాని తండ్రి పెండ్లి చేసుకున్నాడనటానికే ఎక్కువ

ఆధారాలున్నాయి పిచ్చుకుంట్లు పాడే పాటలో నారసింహారెడ్డి తం[డ్రి పెద్దిరెడ్డి అనీ తాత జయరామిరెడ్డి అని ఉంది ఇంటిపేరు మద్దెల అని ఉంది ఇది మజ్జరి యొక్క అప[భంశరూపం కావచ్చును పెద్దిరెడ్డి అంటే పెద్దమల్లారెడ్డి కావచ్చును జయరామిరెడ్డి అంటే మాతామహుడైన చెంచు మల్లజయరామిరెడ్డి కుంఫిణీ [ప్రభుత్వం వారు ఉయ్యాలవాడ జమేదారీని నొస్సం జమేదారినీ రద్దుచేసి ఆయా వంశీకులకు తవర్జీలను ఏర్పాటు చేశారు ఇలాగ అనేక జమేదారీలను రద్దు చేశారు ఈ జమేదారీలకుండే వంశపారంపర్యపు హక్కును కాలదన్నారు దత్తత చేసుకుంటే ఆ హక్కును పరిగణించలేదు నారసింహారెడ్డి విప్లవానికి ఈ జమేదారీలరద్దు కూడా ఒక ముఖ్యకారణం

## 9 నారసింహారెడ్డి మామగారైన పేరాఓబులరెడ్డి క్రీ శ 1838లో [వ్రాసిన దస్తావేజు (నారసింహారెడ్డి యింటి పేరు-గో[త్రం పేరు-తాతపేరు - భార్యల పేర్లు)

రూపనగుడ గ్రామమునివాసులైన కీ శే కర్నాటి ఒయ్యపురెడ్డిగారు (1925 1983) 1966లో తనయింటిలో ఉన్న ఒక పాత దస్తావేజును నాకు ఇచ్చారు దాంట్లో ఒక ముఖ్యవిషయం ఉంది ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పెద్దకుమారుడైన బుచ్చి మల్లారెడ్డి కి గుళ్లదుర్తిలోని అతని మాతామహుడైన (అంటే నారసింహారెడ్డి మామగారైన) చవులమ్మల పేరా ఓబులరెడ్డి గుళ్ళదుర్తిలోను వారివరంలోను కంరెరాయిలోను ఉన్న తన జమేదారీ ఆస్తిని గుళ్ళదుర్తి నగరును దానం చేసినట్లుగా ఉంది ఆ ఓబులరెడ్డిగారికి పుత్రసంతతిలేదట ఇద్దరు కుమార్తెలు నాగమ్మ పేరమ్మ ఈ యిద్దరినీ నారసింహారెడ్డి వివాహం చేసుకున్నాడు నిరిలో నాగమ్మ కుమారుడు బుచ్చిమల్లారెడ్డి ([బ్రిటిషువారి లేఖలలో ఇతని పేరు బుచ్చిమల్లయ్య గా పేర్కొనబడింది) పుత్రసంతానం లేని ఓబులరెడ్డిగారు ఇతనిని పెంచుకున్నారు ఈ దస్తావేజు శాలివాహన శకం 1760లో (అంటే క్రీ శ 1838లో) 8 అణాల స్టాంపుమీద వ్రాయబడింది దీని నకలు 1868 డిసెంబరు 10వ తేదీని తీసుకోబడింది దీనికి 1880 జూలై 7వ తేదీని మరియు 1920 మే 11వ తేదీని నకళ్ళు తీసుకున్నట్టుగా ఉంది

ఈ దస్తావేజును బట్టి నారసింహారెడ్డి యింటిపేరు గో[త్రం పేరు తాతగారి పేరు ఆయన మొదటి భార్యపేరు రెండవభార్యపేరు తెలుస్తున్నాయి మూడవ

భార్య ఓబలమ్మ అని బ్రిటిషువారి లేఖలను బట్టి తెలుస్తోంది నారసింహారెడ్డి యింటిపేరు మజ్జరి వారు వీరిది చెరుకునూళ్ళ గోత్రం (బుడ్డా వెంగళరెడ్డి గారి యింటిపేరు గోత్రము కూడా ఇవే) నారసింహారెడ్డి తాత (పితామహుని) పేరు మజ్జరి బుచ్చిమల్లారెడ్డి తండ్రిపేరు పెద్దమల్లారెడ్డి నారసింహారెడ్డి పెద్దభార్య నాగమ్మ కు బుచ్చిమల్లారెడ్డి పుట్టాడు రెండవభార్య పేరమ్మ కు ఒక కూతురు పుట్టింది (ఈమె పేరు తెలియడం లేదు) మూడవ భార్య ఓబలమ్మకు ఇద్దరు కొడుకులు మల్లయ్య సుబ్బయ్య (ఈ సుబ్బయ్యనే దొరసుబ్బయ్య అని పిలిచేవారు నేను ఈ దొరసుబ్బయ్య వంశాన్ని గుర్తించగలిగాను తక్కిన బుచ్చిమల్లారెడ్డి మల్లయ్యల వంశాలను గుర్తింపవలసి ఉంది)

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి లోని ఉయ్యాలవాడ ఆయన ఇంటిపేరు కాదు అది ఆయన నివసించిన ఊరుపేరు ఆయన జమేదారీ సంస్థానం పేరు ఆయన ఇంటిపేరు మజ్జరి వారు బ్రిటీషువారు ఆయనకు విధించిన ఉరిశిక్షలో కూడా ఆయన ఇంటిపేరు మజ్జరి అనే ఉంది

నేను నా వ్యాసాలన్నింటిలోనూ నారసింహారెడ్డి అని నా అనే దీర్ఘాక్షరం ఉపయోగిస్తున్నాను తక్కిన పరిశోధకులందరూ నరసింహారెడ్డి అని వ్రాస్తున్నారు ఇది సరికాదు ఆ మహావీరుని పేరు నారసింహారెడ్డి యే కాని నరసింహారెడ్డి కాదు ఎచ్చుకుంట్ల దగ్గర ఉన్న వంశవృక్షంలోని పేర్లలోనూ జానపద గీతాలలోను ఈ దస్తావేజులోను పేరులో మొదట దీర్ఘాక్షరమే ఉంది ఇంగ్లీషులో వ్రాసేటప్పుడు దీర్ఘమూ హ్రస్వమూ తెలియదు బ్రిటిషువారి లేఖలను బట్టి నా న ల భేదాన్ని నిర్ణయించలేము

అయ్యపురెడ్డిగారు నాకిచ్చిన దస్తావేజును కొంతవరకూ దిగువ ఇస్తున్నాను (యధాతధంగా మొత్తం దస్తావేజును ఇవ్వడానికి కొన్ని ఇబ్బందులు ఉన్నాయి 1838లో చెలామణిలో ఉన్న రూపాయి అర్ధరూపాయి ముప్పావలా పావలా మూడణాలు పరక లేక రెండణాలు అణా బొట్టు దమ్మిడీ అరబొట్టు టోలీ అనే నాణాలకు హళ్ళి (సున్న) కి ఈ దస్తావేజులో కొన్ని రకాల గుర్తులు ఉన్నాయి ఒక్కొక్క భూమికి తరం (శిస్తు) నిర్ణయించేటప్పుడు ఈ గుర్తుల్ని ఉపయోగించేవారు వీటిని డి టి పి లో ముద్రించడం కష్టం అందువల్ల ఆస్తి వివరాలున్న ఆ భాగాలను వదలివేస్తున్నాను)

స్వస్త్రశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౬౦ అగునేటి చాంద్రమానేనా విళంబి నామ సంవత్సర చైత్ర శుద్ధ ౧౫లు శఘునాల గోత్రోద్భవులైన రా॥ చలుచల్మల పేరామల్లారెడ్డిగారికి నప్త్రులయ్ను వోబుళ రెడ్డిగారికి పౌత్రులయిన విశ్వపతిరెడ్డిగారికి పుత్రులయిన రాజశ్రీ చలుచల్మల పేరా వోబులరెడ్డిగారు దంపతి సమేతులయి చెరుకునూళ్ళ గోత్రోద్భవులయిన రాజశ్రీ మజ్జరి బుచ్చిమల్లారెడ్డిగారికి నప్త్రులయిన పెద్దమల్లారెడ్డిగారికి పౌత్రులయిన నారశింహారెడ్డిగారికి పుత్రులయిన మజ్జరి బుచ్చిమల్లారెడ్డిగారికి వ్రాయించి యిచ్చిన సర్వస్వదాన ధర్మశాసన పత్రిక క్రమమెట్లన్నను మేము అపుత్రవంతులము అయి మా గర్భ సంభూతులయి కుంకుమ శోభితులగు నాగమ్మ పేరమ్మ అనె యిద్దరు అభ్రాతృకన్యకలను మీ తండ్రి అయిన రాజశ్రీ మజ్జరి నారశింహారెడ్డిగారికి యిచ్చి వివాహం చేశె ఆసన్న లగ్న కాలమపుడే ముందరి భవిష్యదర్థం యీ యొక్క అభ్రాతృకన్యకలయిన మా కుమార్తెలకు గర్భం ఫలించి పుత్రోదయం అయినట్టు అయితే మా యొక్క ధనరుణాదులు మొదలయిన పశువాది పంచలోహాల్కు వారే బాధ్యులుగాక యితరులు బాధ్యలు కారు అనే లాగున త్రికరణ త్రివాచక త్రిశుద్ధిగా మనస్సున సంకల్పించి వున్న ప్రకారానికి భగవదనుగ్రహం వల్ల మా కుమార్తె అయిన నాగమ్మ గర్భవాసం ఫలించి సదరు బుచ్చిమల్లారెడ్డి అనే నీవు జననం అయినందున్ను ఆ లగాయితీ చంద్ర చెకోరం న్యాయంగా నిన్ను సాకి సంతరించుకుంటు వున్నవారమై యిప్పటిలో నాకు రుగ్మత సంభవించి నేను పరం అపేక్షించే సమయంలో వున్నాను గనుక పూర్వం మీ తల్లిగారి వివాహకాలమపుడే వాగ్దత్తం చేశివున్న వచన ప్రకారానికి ధర్మశాస్త్రశ్లోకం ॥ అభ్రాతృకాం ప్రదాస్యామి। తుభ్యం కన్యామలంకృతాం । అస్యాం యో జ్యాయతే పుత్రో । సమోపుత్రో భవిష్యతి॥ అనే వచనం ప్రకారం అభ్రాతృ కన్యకకు జననం అయి నీవు మాకు ముఖ్యమయిన దౌహిత్రుడవు గనుక ॥ అపురసోధర్మపత్నీయా తత్సమో పుత్రికాసుతా ॥ అనే న్యాయం ప్రకారానికి మా యొక్క ద్రవ్యభాక్కువు నీవు అయినందున్కు వచనం ॥ పుత్ర పౌత్రశ్చ తజ్జశ్చా పుత్రికా పుత్రయేవచ । పత్నిభ్రాతాధతజ్జశ్చ పితామాతా స్నుషాతథా । భగినీ భాగినేయశ్చ సపిండో ధనహార్యపి । పూర్వ పూర్వ వినాసేస్సు వుత్తర్త్తోర పిండ దా॥ అనే ధర్మశాస్త్ర వచనం ప్రకారం మాయొక్క యావదాస్తికి నీవే బాధ్యుడవు గనుక యీ సోమోపరాగ కాలమందు మేము దంపతియుక్తముగా కూడి నీకు సహిరణ్యోదక దానధారాపూర్వకముగా యిష్టదేవతా ప్రీతిగా నీకు మేము దానము యిచ్చిన సొత్తులు క్రింద వ్రాయబడిన వివరము

(34 5 యకరాలు) మవుజే గుళ్ళదుర్తి గ్రామంలో మాకు నడిచే జమేదారీ సర్వ యినాం ఖుషికి జమీను

| నెం | యకర | తరం | ఆసామి |
|---|---|---|---|
| ౩౭౯ | | | దుయ్యా ఒంగవరస చేను |
| ౩౭౭ | | | సదరు చేను |
| ౬౦౦ | | | కానాల దోవ చేను |
| ౭౫౩ | | | అల్లూరు దోవ చేను |
| ౫౧౨ | | | చలుచల్మల దోవ చేను |
| ౫౧౦ | | | సదరు చేను |

సదరహి జమీను పైకి నెంబరు ౬౦౦ చేను అయివదు ౪ ॥ ౩౪ జమీను పూర్వం మా తంండ్రినాడే దేవకమ్మగారి వెంకట్రెడ్డిగారికి ధానమిచ్చినారు గనుక ఆ జమీను శివాయ కొదువా జమీను మీరు అనుభవించవలసినది

( 2 యకరాల 25 సెంట్లు 4 సెంట్లు) మవుజే హరివరం గ్రామంలో మాకు నడిచే జమేదారి సర్వయినాం ఖుషకి జమీను

| నెం | యకర | తరం | ఆసామి |
|---|---|---|---|
| ౨౬ | | | యిచ్చమ్మ చేను |
| ౨౫ | | | సదరు చేను |
| ౫౧ | | | చింతకుంట దోవ చేను |

మొబలగు కంఠెరాయి తొంభై ఆరు వరహాలు తొమ్మిది రూకల ముప్పాతికె పరకా ముఖాణి తరంగల జమీనున్నూ గుళదుర్తి గ్రామంలో నేను స్వంతం కట్టించిన నగరు అనగా కొల్లయ్యగారి యింటికి వుత్తరం పేరా నాగిరెడ్డిగా రి యింటికి పశ్చిమం ఖాసా గుర్రపు లాయానికి దక్షిణం యీ చతురావణానికి లోనయిన యిద్దుల మిద్దె నగరు రేఖీలు గుర్రపులాయం సమేతం యిల్లున్నూ పశువాది పంచలోహాలు నీకు సర్వస్వదానం సహిరణ్యోదక పూర్వకముగా మేము దానం యిచ్చినాము గనుక నీ పుత్రపౌత్ర పారంపర్యాయం ఆచంద్రార్కస్థాయిగా సుఖాన అనుభవించుకొని మా తదనంతరం మమ్ము సద్గతి చెందించేది యిట్టి మా మన పూర్వకముగా వొప్పి వ్రాయించి యిచ్చిన సర్వస్వ దానపత్రం సహా

శ్లోకం మద్వంశ జా పరమహీపతి వంశ జా వా
యేభూమి పాస్సతత ముజ్వల ధర్మచిత్తా ।
మాధర్మమేవ పరిపాలన మా చరంతీ
త్వ త్పాదుక ద్వయ మహం శిరసా వహామీ ॥

స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ।
స్వదత్తా పుత్రికా ధాత్రీ పిత్రుదత్తా సహోదరీ
అన్యదత్తా స్వయం మాతా విప్రదత్తా వసుంధరా ॥

శ్రీ అర్థోణవా సమ్మతిన వోబుళరెడ్డి స్వహస్తం శ్రీకారం గుర్తు అని వున్నది

**యిందుకు సాక్షులు –**

గుళ్ళదుర్తి గ్రామంలో వుండే వాండ్లు

౧ హరియపరాజు ఆదిశేషయ్య సాక్షి చెవ్రాలు అని వున్నది
౧ ఛప్పల్లి నాగిరెడ్డి సాక్షి చెవ్రాలు అని వున్నది
౧ ఛప్పల్లి నారాయణరెడ్డి సాక్షి నిశాని
౧ ఛప్పల్లి నరిసిరెడ్డి సాక్షి నిశాని
౧ ఛప్పల్లి బూశిరెడ్డి వెంకట సాక్షి నిశాని
౧ పౌరోహితం శ్రీమం నరసంభొట్లు సాక్షి చెవ్రాలు
౧ గుళ్ళదుర్తి కరణం చెన్నయ్య సాక్షి చెవ్రాలు
౧ గుళ్ళదుర్తి కరణం స్వామి సాక్షి చెవ్రాలు
౧ గుబ్బా శ్రీమన్ నరుసు సాక్షి చెవ్రాలు*
౧ దేవకమ్మగారి మల్లారెడ్డి సాక్షి నిశాని
౧ పేరా చిన్న నాగిరెడ్డి సాక్షి నిశాని
౧ కాత చెంచిరెడ్డి సాక్షి నిశాని

* ఈయనవైశ్యుడు ఇతని మనుమనినే నారసింహారెడ్డి దౌహాత్రులు పూలనూనకం కారణంగా చంపవేశారు వాళ్ళందరికీ బ్రిటీషు ప్రభుత్వం ఉరిశిక్ష విధించింది

∩ గుళ్ళదుర్తి సరాబుమూర్తి కొమారుడు పెద్ద బసప్ప సాక్షి చ్రెవాలు

∩ సరాబు సుబ్బన్న చెవ్రాలు

హరివరంలో వుండేవారు -

క్రిష్టిపాటి వెంకట సుబ్బయ్య సాక్షివ్రాలు అని వున్నది ★★

ముడియం క్రిష్టయ్య సాక్షి చెవ్రాలు అని వున్నది

ఆవుల యంగన్న నిశాని గుర్తు

దాదిరెడ్డి నాగిరెడ్డి చే నిశాని గుర్తు

కరణం వెంకయ్య చేవ్రాలు

బిక్కలం గుళ్ళదుర్తి కరణం చెన్నరాయుడు

(True Copy) (n......................)
Dy. Collector

## 10. ఉరితీసిన తరువాత శవాన్ని ఏమిచేశారు?:

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని కుంఫిణీ ప్రభుత్వం వారు 1847 ఫిబ్రవరి 22వ తేదీని సోమవారం ఉదయం 7గంటలకు 2000మంది ప్రజల సమక్షంలో కోవెలకుంట్లలో (జుర్రేటి ఒడ్డున) ఉరితీసినట్లుగా స్పష్టంగా తెలుస్తోంది. ఉరితీసిన తరువాత ఆయన శవాన్ని ఏం చేశారు? అనే ప్రశ్నకు రెండు మూడురకాల సమాధానాలు వస్తున్నాయి. నేను సేకరించిన వీరగాథ (సుద్దులకథ)లో శవాన్ని బంధువులకు అప్పగించినట్లుగాను, వారు రూపనగుడిలో దహన క్రియలు చేసినట్లుగాను ఉంది. ఇది సరికాదు. ఇది జానపదుల ఊహ మాత్రమే.

అనంతపురం జిల్లాలో ఆచార్య తూమాటి దొణప్పగారు సేకరించిన కోలాటం పాటలో ''నిలువునా నీ తలాకొట్టీ కోట బురుజుకు కట్టిరీ!'' అని ఉంది. ఇది Manual of the administration of the Madras Presidency, Volume III, P. 251 లోని వ్రాతకు సరిపోతుంది: "His head was kept hung in the fort on the gibbet till 1877". అయితే 'gibbet' అంటే 'కోట బురుజు' కాదు, 'ఉరికొయ్య'. శిరస్సును ఉరికొయ్యకు వ్రేలాడదీసి ఉంచారు అని తెలుస్తోంది.

★★ ఈయనగొప్ప కవి. నారసింహారెడ్డి ఆస్థాన కవియైన ఓబళాచార్యులకు మిత్రుడు. ఇద్దరూ నశ్యంపై పద్యాలు చెప్పారు.

